# విజయనగరసామ్రాజ్యమందలి

# ఆంధ్రవాఙ్మయచరిత్రము



## మొదటి అధ్యాయము

### విజయనగర సామ్రాజ్య చరిత్రము

విజయనగర సామ్రాజ్యమందలి యాంధ్రవాఙ్మయచరిత్రము తుళువ నరసరాయని కాలమువఱకు ననఁగా క్రీ. వె. 1500 వఱకుఁ బ్రథమభాగమం దభివర్ణింపఁబడినది. కొంచెము హెచ్చు తక్కువగఁ బదియేనవ శతాబ్దము పూర్తియగుసరికి నరసరాయలు దివంగతుఁ డయ్యెను. ఆయనతరువాత నతనిజ్యేష్ఠపుత్రుఁ డగు వీరనరసింహరాయలు సింహాసన మెక్కెను. ఈతఁడు నరసరాయల జ్యేష్ఠభార్య యగు తిప్పాంబ కుమారుఁడు. ఈ తఁడు క్రీ. వె. 1505—1509 వఱకు సామ్రాజ్యము గడు సమర్థతతోఁ బరిపాలించెను. ఈమహనీయుఁడు నిరంతరము శత్రురాజులతో సమరములు సలిపి రాజ్యము యద్విధమైనకార్శ్యము నొందకుండ సంరక్షింపఁగలిగియు, వాఙ్మయసేవఁగూడఁ గొంతవఱకు నొనరింపఁగలిగెను.

ఈతని రాజ్యకాలములో మైసూరురాజ్య మందలి తుళువదేశ ప్రాంతమున నల్లరులు జరుగుటయుఁ, దత్సమయముననే గోవాపురా

విజయనగర సామ్రాజ్య చరిత్రము

తురుష్క సేనాని తిరుగుబా టొనర్చుటయుఁ దటస్థించెను. వీరనృసింహుఁడాలస్య మినుమంతయుఁ జేయక పిఱుంద నున్న మైసూరు రాజ్యము నణఁచి వైచి గోవాపురసుల్తానునకుఁ దగునట్లు బుద్ధి చెప్పెను. విజయనగరరాజుల కెల్లప్పుడుఁ గంటకుఁడుగా నుండిన ఉమ్మత్తూరు సామంత రాజీతనికాలమునఁగూడ స్వాతంత్ర్యముఁ జూప యత్నింపఁగా భుజ [illegible]దము గల వీరనృసింహుఁ డాతని [illegible] బడి తలయెత్తకుండఁ జేసెను. ఇట్లు నిర్ణిరోధశౌర్యాట[illegible]పముఁ జూపుచు శత్రునికాయముల నెల్ల సమయానుకూలముగ నణఁచి [illegible] తా నాక్రమించినరాజ్యమును సంపూర్ణముగా సంరక్షించుకొనెను.

ఈమహాయోధునకు నిత్యవిధేయులై బాసటగా నుండిన సామంతులు గొందఱు స్మరణీయులు. బరకూరురాజ్యమందలి బసవరాజాడ యుఁడు; [illegible] న్న రామయ్యచోళుఁడు; మహామంత్రి యగు సాళువ తిమ్మరుసునకుఁ దమ్ముఁడైన సాళువ గోవిందరాజులు మున్నగువా రెనలేని సాహాయ్యము నొసంగి సామ్రాజ్యము నుపద్రవములనుండి రక్షింపఁగలిగిరి. మహాధీశాలి యగుసాళువతిమ్మరుసు మొదటి నుండియు సామ్రాజ్యనౌకను నిరపాయముగా నడుపుచుండిన కర్ణధారి.

వీరనృసింహుఁ డనేకదేవాలయములకు శివకేశవభేదము లేకుండ సువర్ణ భూదానములు చేసి తనపూర్వులవలెనే హిందూమతోద్ధారకుఁ డనిపించుకొనెను. రామేశ్వరము, శ్రీరంగము, కుంభకోణము, చిదంబరము, అరుణాచలము, కంచి, కాళహస్తి, శ్రీశైలము మున్నగు క్షేత్రములయందలి దేవతలకు భూరిదానములు జేసినట్లు శాసనములు గాన్పించుచున్నవి.

అయిన, నీభూమీశుఁడు తన పూర్వులవలెఁ గాని, తనకుఁ దరువాతివారివలెఁ గాని పేరొందిన విద్యాపోషకుఁడు గానట్లు తోఁచెడిని. కొన్ని సంస్కృతగ్రంథములును గొన్ని కన్నడగ్రంథములు నీతని కాలమున

వెలువడినట్లు క్షాన్పించుచున్నవి; కాని రాజపోషణము వాని ప్రకటన కెంతవఱకుఁ గారణ మయ్యెనో చెప్పవీలులేదు. మఱి యాంధ్రవాఙ్మయ మన్ననో! ఈతఁడు కృతినొందిన యాంధ్రగ్రంథము లెవ్వియు నిప్పటికిని వెలువడలేదు. మాడయ్య యను ఆంధ్రకవి తాను రచించిన 'మైరావణచరిత్రము'న నీభూమీశునివల్ల మెప్పుబొందె నని చెప్పుకొనెను. [illegible] కర్ణాటభాషలను బహుశః పోషించిన భూకాంతుఁడు తనమాతృభాషయైన యాంధ్రభాషను విసర్జించునా? అట్లు జరుగదు. కాన భావి పరిశోధనల వలన నీతని కాలమందలి మఱికొన్ని యాంధ్రగ్రంథములు లభింపఁగల వని విశ్వసింపవచ్చును.

వీరనృసింహరాయుల వెనుక నతని సవతితమ్ముఁ డగు శ్రీకృష్ణదేవ రాయలు సింహాసన మెక్కెను. ఈచక్రవర్తి క్రీ. శ. 1509—1530 వఱకు రాజ్య మేలెను. ఈతఁడు క్రీ. శ. 18-1-1471 నాఁడు జన్మించినట్లు రుజువు చేయఁబడినది (భారతి 1926 సెప్టెంబరు సంచిక జూడుఁడు). ఈయనయె విజయనగరసామ్రాజ్యముఁ బాలించిన వారిలో నత్యధిక రాజ్యనీతికో[illegible]పశాలియు, దేశైకసేవాపరాయణుఁడు నై యుండెను. ఛత్రపతిశివాజీమహారాజునకుఁ బూర్వము దక్షిణ హిందూదేశములో నీతనినిమించిన మహాయోధుఁడును, మహాసామ్రాజ్య ధురంధరుఁడును ఎంతమాత్రము గానరాఁడు. ఒకవంకఁ దురుష్కప్రభువులతోడను, వేఱొకతట్టు గజపతిరాజులతోడను, నిరంతరముఁ బోరాడుచు నెన్నఁడును మచ్చునకైన నపజయముఁ బొందక, తాను జయించిన శత్రురాజులకు సహితము తన యౌదార్యసౌశీల్యములచే బహువిధముల శ్లాఘాపాత్రుఁడై నిజామాత్యదండనాయకులయెడలఁ దండ్రివలెను, జెలికానివలెను మెలఁగుచు, సరస్వతీ సర్వతోముఖాదరణచే రెండవభోజుఁ డనిపించుకొని యాంధ్రసామ్రాజ్యము నత్యున్నతస్థితికిఁ దెచ్చెను. అతని

కాలమందు విజయనగరము నిక్కముగ విద్యానగర మయ్యెను. హిందూ కళలకు నాటపట్టుగను, గవితాకన్యకు విలాసవిహారక్షేత్రముగను, వేద శాస్త్రములకు విశాలపరిషత్ప్రదేశముగ నీ సామ్రాజ్య ముపకరించి శాశ్వతకీర్తి గడించినది.

ఈ నిరతిశయధీమంతుఁ డగు భూకాంతుఁడు స్వకీయప్రతిభాగౌరవము చేతను, దన యనుయాయు లగు నమాత్యసామంతాది వీరశిరోమణుల భక్తిపరాయణత్వము చేతను దదీయవిపులదక్షిణహిందూసామ్రాజ్యచక్రమును నిర్వక్రపరాక్రమముతో ననవరతము జయప్రదముగ నిర్వహింపఁగలిగెను. మహామాత్యశేఖరుఁ డగు సాళువ తిమ్మరుసుయొక్క నయవిద్యాచాతుర్యము, మహాదండనాయకుఁ డగు పెమ్మసాని రామలింగనాయని యుద్దండదండనీతియు, నాంధ్రకవితాపితామహుఁ డగు నల్లసాని పెద్దనార్యుని సులలితకవితాసుధారసము, నీచక్రవర్తియొక్క సహజోపజ్ఞానముపార్జితకీర్తి ననేకవిధముల భరతవర్షమునంతట వ్యాపింపఁ జేయఁగలిగినవి.

శ్రీకృష్ణదేవరాయల తల్లిపేరు నాగాంబ. ఈమె నరసరాయల రెండవభార్య. ఈమె భోగపత్నియని యొక ప్రతీతికలదు. కాని యది యెంతమాత్రము విశ్వసింపఁదగినది కాదు. ఈమె రాజవంశప్రసూతయె. కృష్ణదేవరాయలభార్యల సంఖ్యనుగూర్చియు వారిపేరులఁ గూర్చియుఁ గొంత భిన్నాభిప్రాయ మున్నది. "పాయస్" అను పోర్చుగీసురాయబారి కృష్ణదేవరాయలకుఁ బండ్రెండుగురు భార్య లుండి రనియు వారిలో నలువురు పట్టమహిషులై యుండి రనియు వ్రాసెను. "న్యూనిజ్"అను మఱియొక పోర్చుగీసు యాత్రికుఁడు కూడఁ గృష్ణదేవరాయలకు నల్వురు పట్టమహిషు లుండి రనిచెప్పి వారిలో నొకరిత కటకదేశపురా జగు గజపతికుమారిత యనియు,నిద్దఱు శ్రీరంగపట్టణపు రాజుకూఁతు లనియు,

మఱియొక యువతి కృష్ణరాయలు చిన్నతనమునఁ బ్రేమించిన భోగపు కన్య యనియుఁ జెప్పి, యాభోగపుకన్యపేరు చిన్నాదేవి యనికూడ నుదాహరించెను.

ఇట్లుండఁ బెద్దన్న మనుచరిత్రలో "తిరుమలదేవియుఁ జిన్నాదేవియు దేవేరులుగాన్" అని నుడివెను. ముక్కు తిమ్మన్నకూడ, పారిజాతాపహరణములో, తిరుమలదేవినిఁ జిన్నాదేవిని మాత్రమే పేర్కొనెను. తిరుపతిదేవాలయములో నున్న కృష్ణదేవరాయల యిత్తడి విగ్రహమునకు నిరుపక్షముల నున్న యిత్తడివిగ్రహములమీఁదఁ జిన్నాదేవి యొక్కయుఁ దిరుమలదేవియొక్కయుఁ బేరులు మాత్రమే లిఖింపఁబడి యున్నవి. సింహాచలములో క్రీ. శ. 1516 లోఁ జెక్కించిన శిలాశాసనములోఁగూడఁ జిన్నాదేవియుఁ దిరుమలదేవియు మాత్రమే యుదాహరింపఁబడిరి. ఇట్లే అమరావతి మొదలగు శాసనములలోఁ గూడ వీరిద్దఱి పేళ్లె యున్నవి.

ఇట్లుండ నాముక్తమాల్యదలోఁ గృష్ణదేవరాయలు తనభార్యల గుఱించి వ్రాయుచు "తిరుమలదేవియు నన్నపూర్ణాదేవియుఁ గమలాబ్జముఖులు దేవేరులుగన్" అని చెప్పికొనియుండుటచేఁ జరిత్రకారులీ మాటల ననేకవిధములుగ నర్థముచేసికొనవలసివచ్చినది. కొంతమంది యీ నాలుగు మాటలును నలుగురు పట్టపుదేవుల పేర్లని చెప్పిరి. అనఁగాఁ గృష్ణదేవరాయలభార్యలు తిరుమలదేవియు, నన్నపూర్ణాదేవియు, కమలాదేవియు, అబ్జముఖిదేవియు నని వారియభిప్రాయము. ఈసంఖ్య పాయజ్ న్యూనిజ్‌లు చెప్పిన సంఖ్యకు సరిపోవుచున్నదికదా? అయినను మఱియొకబాధకము కాన్పించుచున్నది. కుమారధూర్జటి తన కృష్ణరాయ విజయములో గజపతిరాజుకొమారిత పేరు 'తుక్కా' యని చెప్పెను. మఱియొకరు గజపతిరాజుకూఁతురిపేరు 'భద్ర' యని నుడివిరి.

రాయవాచకములో నీమెపేరు 'జగన్మోహిని'యని యున్నది. ఇట్లనేకు లనేకవిధములుగా నీతనిభార్యలపేర్లను గూర్చి వ్రాసిరి. వీని నన్నిటి ని సమన్వయించిచూడఁ నీ క్రింది యంశములు విస్పష్టముగఁ గాన్పించుచు న్నవి.

(1) తిరుమలదేవి యన్ని గ్రంథములలోను సమానముగా నున్న ది. కావున నీమెవిషయము నిర్వివాదాంశము. (2) చిన్నాదేవి ప్రశంస కొన్నింట మాత్రము కాన్పించి మఱికొన్నింట లేకపోవుట కొంత సంశ యమునకుఁ గారణభూత మగుచున్నది. క్రీ. శ. 1517 వఱకు వెలువ డిన కృష్ణదేవరాయల శాసనములలో నీమెపేరు గాన్పించి యటుతరు వాత లిఖింపఁబడిన శాసనములలో లేకపోవుటకుఁ దగిన సమాధాన మూహింపవలసియున్నది. ఇంతియగాక మనుచరిత్ర పారిజాతాపహ రణ గ్రంథములలో నీమె పేర్కొనఁబడి కృష్ణదేవరాయలచే నతని యా ముక్తమాల్యదలో సూచింపఁబడకపోవుటయుఁ బై సందేహమును బల పఱుచుచున్నది. దీనినిగూడ సమర్థింపవలసియున్నది. (3) గజపతికుమా రికపేరు తుక్కా, భద్ర, జగన్మోహిని యని వేఱువేఱుగ వచింపఁబడుటకుఁ దగినహేతువు నిర్ణయింపవలసియున్నది. (4) వీనిలో నెచ్చోటను గాన రాని 'యన్నపూర్ణాదేవి, కమలాబ్జముఖులు' అనునామ ప్రశంస కృష్ణ దేవరాయ లేల చేసెనో నిర్ణయింపవలసియున్నది.

ఈచిక్కు విషయములను విడదీయుటకుఁ గృష్ణదేవరాయల దం డయాత్రలకు సంబంధించిన చరిత్రాంశములను దదితరజీవితాంశములను జరిత్రకారు లిదమిత్థ మని నిర్ణయించినవఱకుఁ గ్రోడీకరించి చూచెదము. కృష్ణదేవరాయలు రాజ్యారంభములోనే యుమ్మత్తూరు గంగరాజును జయించినట్లుగఁ జరిత్రకారు లందఱేకగ్రీవముగా నొప్పుకొని యుండిరి. కావున పోర్చుగీసు రాయబారులు చెప్పినట్లు గంగరాజుకొమార్తెను

రాజ్యారంభములోనే కృష్ణదేవరాయలు పరిణయమాడి యుండును. అంతకుఁ బూర్వమే యౌవనప్రాదుర్భావమునఁ బరిగ్రహించిన విలాసవతి యొకతె యాతనికి నుంపుడుకత్తెగ నుండనోపు. కావునఁ గళింగదేశముమీఁది దండయాత్రకుఁ బూర్వ మాతనికి నొక యుంపుడుకత్తెయు, గంగరాజు కొమారితయు భార్యలుగ నుండవలసి యున్నది. కళింగరాజ్య దండయాత్ర క్రీ. శ, 1515 మొదలు 1520 లోపుగా నాలుగు సారులు జరిగినట్టులుగా శాసనాదికములవలన నిర్ణయింపఁబడుచున్నది రెండవ సారి దండయాత్రలోఁ బ్రతాపరుద్రగజపతిని జయించి, యాతనికొమార్తెను రాయలు వివాహము చేసికొనియెను. కాఁబట్టి క్రీ. శ. 1516-17 సం॥నకుఁ బూర్వమే కృష్ణరాయలు కృతినొందిన గ్రంథములలో వీరి యిద్దఱిపేరులు మాత్రమే గోచరమగుట న్యాయమేకదా? వీరియిద్దఱిలోఁ జిన్నాదేవిపేరు విస్పష్టముగఁ గృష్ణదేవరాయలు ప్రేమించిన భోగపుకత్తెదై యుండు నని న్యూనిజ్ చెప్పియే యున్నాఁడు. కావున రెండవమహిషి పేరెద్దియో నిర్ణయింపవలసి యున్నది.

కృష్ణదేవరాయలు కృతినొందిన మనుచరిత్రయుఁ బారిజాతాపహరణమునుఁ, దాను రచించిన యాముక్తమాల్యదయు నీగ్రంథముల రచనాపౌర్వాపర్యమువిషయమై యిటీవల మన సుప్రసిద్ధచరిత్రపరిశోధకులగు డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారును, కుందుర్తి ఈశ్వరదత్తుగారును మున్నగువారు భారతిలోఁ గొంత చర్చ సలిపి యున్నారు. వారి వాదప్రతివాదములు జాగ్రత్తగఁ బరిశీలించితిని. కాని నాయభిప్రాయమే మనఁగా మనుచరిత్ర పారిజాతాపహరణములలో నేది ముందున నేది వెనుకను వ్రాయఁబడినదో నిర్ణయింపఁ గడంగుట వృథాప్రయాసము. అది యెప్పటికిని దేగునది కాదు. ఈరెండు నాముక్తమాల్యదకుఁ బూర్వమే రచియింపఁబడిన వని నిర్ణయించుట యథార్థమునకు నెక్కువ

జంద్రునకునున్న యన్యోన్యధర్మమే వీరిద్దఱియందును గాన్పించుచున్న దని శ్లేషరూపమున నర్మగర్భముగ సూచించినాఁడు.

'కమలాబ్జముఖులు' అనుపదము స్త్రీనామకవిశేషణమని పైనఁ జెప్పినరీతిగ నిర్ణయించినయెడలఁ గృష్ణరాయలు పెండ్లియాడిన గజపతి కుమారిక యన్నపూర్ణాదేవి యనియే నిశ్చయింపవచ్చును. అయినను, ఆమెకు 'తుక్కా' యనియు 'భద్ర' యనియు 'జగన్మోహిని' యనియు, నిత్యాది నామంబులెట్లు గలిగినవో యాలోచింపవలసియున్నది. 'భద్ర' 'జగన్మోహిని' యిత్యాది నామములు సార్థకబిరుదనామములని సామాన్యముగ గ్రహింపవచ్చును. కావున వానిని గుఱించి మనమంత ప్రయాసము పొందనవసరములేదు. కాని 'తుక్కా' యనునామమట్లు కాదు. దీని నిర్వచనముంగూర్చి నాకిట్లు స్ఫురించినది. 'తుక్కా' యనుశబ్దము 'దుర్గా' 'దుగ్గ' యనుశబ్దములకు రూపాంతరము. శాక్తేయమత సంప్రదాయుఁడగు ప్రతాపరుద్ర గజపతిపుత్రి 'దుర్గ' యని పిలువంబడుటయం దాశ్చర్యమేమియు నుండఁగూడదు. ఈ ప్రతాపరుద్రగజపతికి శ్రీదుర్గావీరపుత్రయను బిరుదనామము గలదు. కాఁబట్టి యామెకుఁ బుట్టినింటిపేరు దుర్గయై యుండవలెను. శాక్తేయమతమునందుఁ బుట్టిన యాకన్యను వైష్ణవమతము స్వీకరించిన కృష్ణరాయలు వివాహమాడెను. కావున నామెపేరు వైష్ణవసంప్రదాయమున కానుగుణ్యముగ మార్పవలసియున్నది. కేవలము వైష్ణవనామ మిడుటకుఁ గృష్ణదేవరాయలకుఁ గాని తనశైవసంబంధిక నామము వీడుటకు నామెకుఁ గాని యిష్టముండక నిర్విశిష్టనామమగు 'నన్నపూర్ణ'యను పేరున వ్యవహరింపఁబడినదని తలంచుట యుక్తియుక్తముగ నున్నది.

కావున నీయావద్విషయములను యోజించినచో మనము చేయఁగలిగిన నిర్ధారణ మే మనఁగా శాసనాదికములలోను గ్రంథములలోను

ప్రత్యేకముగా, బేర్కొనఁబడిన కృష్ణదేవరాయల భార్యలు ముగ్గురని తెలియుచున్నది.

(1) చిన్నాదేవి:-భోగస్త్రీ

(2) తిరుమలదేవి:-ఉమ్మత్తూరి గంగరాజు కుమారి

(3) అన్నపూర్ణాదేవి:-ప్రతాపరుద్రగజపతి కూఁతురు

కృష్ణదేవరాయల కిద్దఱు కుమార్తె లుండిన ట్లగపడుచున్నది. ఒక కుమారికను 'అర్వీటి రామరాజునకును, (అళియ రామరాజునకును) రెండవ కుమారికను మట్ల వరదరాజునకును నిచ్చి వివాహము చేసెను. కృష్ణరాయలకుఁ బుత్రులు గలిగినను వారు చిన్నతనమునందే మృతి నొందియుండవలెను. కావుననే యితని తరువాత నితని సవతిసోదరుఁడు ను నరసరాయని మూఁడవభార్య పుత్రుఁడునైన యచ్యుతదేవరాయలు సింహాసనమునకు వచ్చెను.

శ్రీకృష్ణదేవరాయల జీవితచరిత్రముఁ గూర్చియు నాతని సా మ్రాజ్య పరిపాలనా విధానముఁగూర్చియు నెంత విస్తరించి వ్రాసిన నాంధ్రులకుఁ దనివితీఱని కౌతూహలము గలుగుచునే యుండునని తెలిసి యున్నను నావిషయ మంతయుఁ బ్రస్తుతాంశముగాదు కావునఁ గొన్ని ముఖ్యాంశములను మాత్రము గ్రోడీకరించెదను.

వీరనృసింహరాయలు రాజ్యమునకు వచ్చినవెంటనే యెట్లు సా మ్రాజ్యమునం దన్నివైపుల నల్లరులుచెలరేగినవో యట్లే శ్రీకృష్ణదేవ రాయలు సింహాసనారూఢుఁడైన కొలదికాలములోనే కొందఱు సామం తరాజుల నుండియుఁ, బరిసరరాజ్యముల పరిపంథిరాజుల నుండియు నెదురు పాటులు తలయెత్తసాగినవి. కృష్ణదేవరాయలు యువకుఁడనియు రా జ్యానుభవమున లేఁబ్రాయముఁడనియుఁ, గావున స్వాతంత్ర్యసంపాదన కిది తరుణమనియు ననేకులు సమరసంక్షోభములకు దిగిరి. కాని కృష్ణరా

య లితర సామాన్యరాజపురుషులవంటివాఁడు కాఁడు. ధైర్యము, స్థైర్యము, పరాక్రమము, సమయానుకూలత, రాజనీతినైపుణ్యము, నిస్తంద్రత మున్నగు శుభలక్షణములన్నియు నగ్గుఁణాలతో నీతనియం దుద్భవించినవి. కాన రాజనీతివిశారదుఁడును, చిరకాలానుభవముగల వృద్ధమంత్రియునైన సాళువతిమ్మరుసు సహాయమున వైరివీరుల నంద ఱకును శీఘ్రకాలములోఁ దన లావునుఁ, దన చేవయును రుచిచూపింపఁ గలిగెను.

విజయనగరరాజులయెడ నిర్నిద్రద్వేషభరితుఁడుగానుండిన నుమ్మత్తూరి రాజగు వీరశ్యామలరాయఁడు యథాపూర్వముగా స్వాతంత్ర్యపతాకము నెగురవైచెను. రాజ్యమునకు వెనుపోటులేకుండ చేయుట రాజనీతిమార్గ మున ముందుచేయవలసినపని గాన బిచ్చుకపైన డేగ వ్రాలినట్లాకస్మ్కడి చతురంగబలసమేతుఁడై కృష్ణరాయ లతనిమీఁద నుఱికెను. వీర శ్యామలరాయఁడు నివ్వెరపడి యెద్దియుఁజేయనేరక సార్వభౌమునితో సంధిఁజేసికొని తనకునూర్తె యగు తిరుమలదేవినిఁ బరిణయముగావించి రాజసేవాపరాయణుఁడయ్యెను.

దక్షిణమునందలి యుపద్రవ మిట్లు నివారించుకొని కృష్ణదేవ రాయలు తూర్పుదిశనున్న గజపతులవైపును, నుత్తరదిశనున్న సుల్తా నులవైపును దృష్టి నిగుడ్చెను. వీరిద్దఱిలోఁ బ్రథమమున గజప తులఁ జెండుట మున్ముం దెక్కువ శ్రేయోదాయక మని సచివోత్తముఁ డగు తిమ్మరుసుచేఁ బ్రేరేపితుఁడై, యగణ్యసైన్యములతో గజపతులకుఁ గైవశమైయున్న యుదయగిరిదుర్గముపై దాడివెడలెను. ఆ దుర్గము నుఁ జాలకాలము ముట్టడివేసి లగ్గలికెత్తెను. గజపతిసైన్యము కృష్ణరా యుల నెదుర్కొనక కొండవీటికి మరలినది. పరిష్కారయుద్ధ మింకను

బాకీగానే యున్నది. అయ్యది యుభయసేనలకును గృష్ణవేణీనదీతీరమునఁ జరుగక తప్పదని యుభయపక్షములును నిర్ణయించుకొని కాచుకొని యుండిరి. దుస్సాధ్యమగు కొండవీటిదుర్గమును సామదానదండోపాయముల సాధించి, పదంపడి బెల్లముకొండ, వినుకొండ, నాగార్జునకొండ మున్నగు తూర్పుసీమదుర్గముల నన్నిటిని వశపరచుకొని, గజపతులయొక్క సకలసైన్యానీకములతోను సంగ్రామమునలుపుటకు సిద్ధమయ్యెను. కృష్ణానదీతీరమున ఘోరయుద్ధముజరిగినది. గజపతిసైన్యములు పటాపంచలైనవి. గజపతిరాజుకొడుకఁగు వీరభద్రగజపతియుఁ, గొందఱు ముఖ్యసేనానాయకులునుఁ గృష్ణరాయలచే జీవగ్రాహులుఁగాఁ జిక్కుపడిరి. కటకరాజ్యమందలి దక్షిణదిశయంతయుఁ గృష్ణరాయుని పాదాక్రాంతమైనది. కృష్ణరాయఁడు తన సహజౌదార్యగాంభీర్యములు శాత్రవులకుఁజూపి గజపతిరాజగు ప్రతాపరుద్రుని కభయమొసంగి, యాతని పుత్రికయు సౌందర్యవతియు, సాహిత్యవేత్త్రియు నగు నన్నపూర్ణాదేవీ నామాంతరమునఁ బ్రసిద్ధినొందిన తుక్కాదేవిని వివాహము చేసికొని సహజశత్రువగు గజపతిరాజును దనయందభిమానముఁగల వానిగా మార్చుకొనెను.

ఇట్లు తూర్పుదేశసమస్య సానుకూలముగాఁ బరిష్కరించి యమరావతీక్షేత్రమున నమరేశ్వరునిమ్రోలఁ దులాపూరుషదానముఁ జేసి దేవబ్రాహ్మణుల కసారముగ భూదానములొసంగి, తన ప్రథమ దేవేరులగు చిన్నాదేవీతిరుమలదేవులచే ననేకధర్మములనుఁ జేయించి యాయురారోగ్యైశ్వర్యప్రదాతయగు భగవంతుని సేవాపరాయణుఁడై యహోబల, తిరుమల, కాంచీ, శ్రీరంగాది పుణ్యదేవతలఁ బూజించి, యనన్యసామాన్యదిగ్విజయయాత్ర తేజరిల్ల జయజయధ్వానములతో విజయనగరమునఁ దిరిగిప్రవేశించెను. కవిపురోహితమంత్రిసామంతదండనాయకాది

ప్రముఖులతోఁ గూడిన నిండుపేరోలగంబున నుచితవిధమున నందఱను సంతృప్తి పరచి కవీశ్వరులకుఁ గానుకలఁ బ్రసాదించి, కొండొకకాలము విశ్రమించి శత్రుశేషము నిశ్శేషమొనర్చుట నీతియని యెంచి, తురుష్కులపై దండువెడలుటకు సర్వజనాంగీకారముఁ బడసెను.

సాళువ నృసింహారాయలు చనిపోవునపుడు రెండుకార్యములనుఁ దాను చేయలేకపోతినని మరణవేదనతోఁ బాటు మనోవేదనఁగూడఁ బొందెను. ఆరెంటిలో నొకటియగు నుదయగిరి దుర్గాక్రమణము కృష్ణరాయలచే సంతృప్తికరముగ నెరవేర్పఁబడెను. ఇఁక రెండవదగు రాచూరుదుర్గ వశీకరణము మాత్రము కావలసియున్నది. అక్కార్యముఁ బూర్తిచేసినఁగాని పితృపితామహంబగు రాజ్యంబు నిశ్శేషముగాఁ గృష్ణరాయలు పునస్స్వాధీనముఁ గావించికొనిన ట్లుండదు. కావునఁ దురుష్కులకునుఁ దమకును చిరకాలమునుండియు వివాదభూమిగా నుండిన రాయచూరుదుర్గప్రదేశమును జయించుటకు నసంఖ్యాకసైన్యములతోఁ దండువెడలెను. బిజాపురముసుల్తానగు నడిల్షా మున్నగువార లీవీరాధివీరుని నెదుర్కొనఁదగిన ప్రయత్నములు గావించిరి కాని నైరామను గ్రామమునొద్ద నుభయసేనలకును జరిగిన ఘోరసంగ్రామమునఁ గృష్ణరాయలకే విజయము గలిగినది. అంతటితోఁ దురుష్కులు సంధిఁజేసికొని రాయచూరుప్రాంతము నంతటిని విజయనగరరాజులకు వదలిపెట్టిరి.

ఇట్లు దక్షిణహిందూదేశమంతయు నేకచ్ఛత్రాధిపత్యముక్రిందకుఁ దీసికొనివచ్చి నయవిద్యాచాతుర్యమున సమస్తదేశములనుఁ బరిపాలించిన యీచక్రవర్తి శత్రుభయమన్నదిసుమంతయులేక ప్రజాక్షేమము నొనగూర్చెడి కార్యములయందును, ననవరతసారస్వతగోష్ఠియందును మిగిలినకాలమునంతటినిఁగడిపి 1530 వ సం౞న దివంగతుఁడయ్యెను. ఈ మహాచక్రవర్తి యాంధ్రదేశమునకు నాయకమణియై విరాజిల్లుటయే

గాక యీ విశాలప్రపంచమున నద్వితీయఖ్యాతిగాంచి నెగడొందిన మహా పురుషాగ్రగణ్యులలో నొకఁడని చెప్పుట యతిశయోక్తి కాఁజాలదు.

శ్రీకృష్ణదేవరాయలవారి యవసానకాలమున నాతనికి సుమారు రెండుసంవత్సరముల వయసుగల మగశిశువుండుటచేఁ దనవెనుక రాజ్యాధికారము సమర్థతతో వహింపఁగల పాలకుని నియమించుట వివాదవిషయమయ్యెను. తన సవతితమ్ముఁడనఁగా నరసరాయల మూఁడవభార్య యగు నోబాంబిక యొక్క కుమారుఁడగు నచ్యుతదేవరాయలను దన పుత్రునకు సంరక్షకునిగా నేర్పరచి సింహాసనాసీనునిఁ జేయుట కృష్ణరాయని యుద్దేశమైనట్లు కాన్పించుచున్నది. ఆకారణమున నచ్యుతదేవరాయలు కొందఱిమంత్రుల సహాయముఁ జేర్చుకొని విజయనగరసింహాసనము నాక్రమించెను. ఇది యెంతమాత్రముఁ గృష్ణరాయని యల్లుఁడగు నార్వీటిరామరాజున కిష్టములేకపోయెను. ఆతఁడునుఁ గృష్ణరాయని రాణులు నేకీభవించి ప్రథమమునఁ గృష్ణరాయనిపుత్రుని పక్షముననుఁ బిమ్మట నాపిల్లవాఁడు చనిపోయినకారణమున నోబాంబిక పెద్దకుమారుఁడు రంగరాజుకొడుకగు సదాశివరాయలపక్షమునను నిల్చి యచ్యుతదేవరాయలకుఁ బ్రతికక్షులైరి. అర్వీటిరామరాజు విజయనగర సామ్రాజ్యమున గొప్పపలుకుబడిగల మహావీరుఁడై యుండుటచే నచ్యుతదేవరాయ లాతనితో సంధిగావించుకొని రాజ్యపాలనవిషయమున సమానాధికారిగ నంగీకరించెను. ఇట్లిరువురు నేకదృష్టినిఁ గొంతకాలము రాజ్యమును నడిపించిరి. పాలకులు మాఱునపుడెల్ల నల్లరులు చెలరేగుట స్వాభావికము గావున నీసమయమందుగూడఁ గొందఱుసామంతరాజులును, గొందఱు శత్రురాజులును గూడి స్వాతంత్ర్యముకొఱకును, దేశాక్రమణము కొఱకునుఁ దిరుగుబాటులు చేయుమొదలిడిరి.

ఉమ్మత్తూరురాజు యథాపూర్వముగ స్వాతంత్ర్యముకొఱకుఁ బ్రతిష్టంభనముఁ జేయయత్నించెను. కాని యతిశీఘ్రముగా నచ్యుతదేవరాయలాతని నణఁచివైచెను. రాయచూరుదుర్గముకొఱకుఁ గాచుకొనియుండిన బిజాపూరుసుల్తానుతో దీర్ఘకాలముపోరాడి సామ్రాజ్యమునందొక జీవగ్రంథిగానున్న యాదుర్గమునుఁ గాపాడుకొనెను. గజపతులును కలబరిగెసుల్తానును సులభముగానే పారఁదోలఁబడిరి. చోళరాజ్యమునందుఁ దిరుగుబాటుఁజేసిన సాళువ నరసింగరాయని నోడించి దక్షిణమున నల్లరులు వ్యాపింపకుండఁజేసికొనెను. ఇట్లచ్యుతదేవరాయలును, రామరాయలును భుజద్వయమువలె సామ్రాజ్యభారమునువహించి యేతద్రాజ్యము నహీనమై భవమునఁ దేజరిల్లున ట్లొంచఁగలిగిరి.

ఇట్లు గొంతకాలము గడచిన తరువాత నుభయులకు నభిప్రాయభేదములు పొడసూపెను. అచ్యుతదేవరాయల బావమఱఁదులగు సలకము పెద, చిన్న తిమ్మరాజులు రామరాజుతో ద్వేషించి ప్రతిస్పర్థులై నిల్చిరి. అచ్యుతదేవరాయనిభార్యయుఁ దమసోదరియు నగు వరదాంబికా సాహాయ్యమున నచ్యుతదేవరాయలనుఁ దమప్రక్కకుఁ ద్రిప్పికొనగల్గిరి. మఱియు శత్రురాజులతోఁ బోరుసల్పి విజయశీలురై రాజ్యమును భద్రస్థితికిఁదెచ్చుటచే నచ్యుతదేవరాయలు స్వతంత్రముగాఁ బరిపాలించుట కుద్రిక్తుఁడయ్యెను. కావున నళియరామరాజునకు వేఱొండు విధానములేక జ్యేష్ఠానుక్రమణమగు వారసత్వముగల సదాశివరాయని పక్షముఁ బూని యచ్యుతదేవరాయలనుండి వీడిపోయెను. ఇట్లు సలకము సోదరులకును అర్వీటిరామరాజునకును వివాదములు పెచ్చుపెరిఁగి సామ్రాజ్యమును రెండుభాగములుగఁ జీల్చినవి. ఈవివాదములవలన నాంధ్రకర్ణాటకసమ్మేళన మంతరించి యాంధ్రులొకవైపునను కర్ణాటకులు వేఱొకవైపునను రాజ్యరథమును లాగుచు దమ బలాబలములఁ జూప

మొదలిడిరి. తిమ్మరాజులపక్షమువారు తురుష్కులతో సంధిచేసికొని, కొంతద్రవ్యమును వారికిచ్చి వారిసహాయమునుం బొందగలిగిరి.

విజయనగర రాజ్యోద్ధరణమే గాని విధ్వంసన మెంతమాత్రము సహింపజాలని రామరాజు వేఱొండుమార్గముం గానమి దన స్వతంత్ర జాగీరగు కందనవోలునకుంబోయి, యటనుండియే రాజకీయపరివర్తన పరిణామములను జాగరూకతతోఁ గమనించుచు వేచియుండెను. ఇట్లుండ 1542 లో నచ్యుతదేవరాయలు పరమపదించెను. అంతట మేనల్లుఁడగు వేంకటాద్రిని సింహాసనముననుంచి పెదతిమ్మరాజు సంరక్షకునిగా రాజ్యపాలన సాగింపఁజూచెను. కాని కొలదికాలములోఁ పెదతిమ్మరాజుకూడ మరణించెను. అతనివెనుక నాతనితమ్ముఁడు, చినతిమ్మరాజు అన్నగారి మార్గమునే త్రొక్కి రాజ్యరక్షకుఁడుగా నుండెను. ఈతఁడు చాలక్రూరుఁడు గావునఁ బ్రజల కితనియందు ద్వేషబుద్ధి యెక్కువగుటయు, వరదాంబికకుఁ దనకుమారునిఁ జంపించునేమో యను ననుమానమొదవుటయు సమకూరినవి. ఆమె యనుమానించినట్లుగనే మేనల్లునిఁ జంపించియు, మఱికొందరు దగ్గరవారసులగు రాజబంధువుల నంతమొనరించియు స్వతంత్రముగా సింహాసనమెక్కెను. ఇట్టి దుష్కార్యములు సామంతరాజులును, తదితరనాయకులును జూచి సహింపలేకపోయిరి. రామరాజిదియే తరుణమని తన మంత్రులను జేర్చుకొని సైన్యములను సేకరించి చినతిమ్మరాజుపై దాడివెడలెను. ఉభయసేనలును తుంగభద్రానదీతీరమున మార్కొనినవి. చినతిమ్మరాజోడిపోయి రామరాజుచేతఁ జిక్కువడెను. వెంటనే రామరాజాతని శిరస్సును ఖండించి పతాకమునకుఁ గ్రుచ్చి చూప, నుభయపక్షసేనలును హర్షధ్వానములతో రామరాజునెడ విశ్వాసముఁ గనఁబరచినవి. రామరాజు సదాశివరాయుని గుత్తిదుర్గమందలి బం

దిఖానానుండి విడిపించి సింహాసనమునఁ గూర్చుండఁబెట్టెను. అటుతర్వాత రామరాజు అరిభీకరుఁడై సామ్రాజ్యమునంతయు రామరాజ్యమువలె సకల జనామోదకరముగఁ బరిపాలించుచుండెను.

# రెండవ అధ్యాయము

## మాడయ్యాకవి: మైరావణ చరిత్రము

తుళువ నరసనాయకుని ప్రథమపుత్త్రుఁడగు వీరనృసింహరాయని రాజ్యకాలములో మాడయ్య యను కవి 'మైరావణచరిత్ర'మను మూఁడాశ్వాసములు గల యొకయాంధ్రప్రబంధమును రచించెనని వెనుకటి యధ్యాయములోఁ దెల్పితిని. ఈగ్రంథమును * వేజెర్ల గోపమంత్రికి నంకితముఁజేసెను. ఈ గోపమంత్రి యొక్క వంశచరిత్రమున్న భాగము ముద్రితగ్రంథములోఁగాని, యముద్రితప్రతులలోఁగాని లేకపోవుటచే నాతఁ డేయాస్థానమున మంత్రియైయుండెనో యిదిమిద్ధమని చెప్పుట కవకాశము గలుగలేదు. కాని గ్రంథమందలి కొన్ని సందర్భములనుబట్టి బహుశః కర్ణాటరాజగు వీరనృసింహరాయల రాజ్యములో నెచ్చటనో పాలనాధికారిగా నుండవచ్చు నని యూహించుట సత్యమునకుఁ జాల చేరువుగా నుండును.

కృతిపతియగు వేజెర్ల గోపనమంత్రి వంశచరిత్రము దొరకమిచే నాతనిపూర్వు లెవ్వరో, యెచ్చటివారో తెలియదు. గోపన్న విప్రకుల సంజాతుఁడు. అతనిది యజుర్వేదశాఖ. శుక్లయజుస్సో లేక కృష్ణయజు

* వేజెర్ల ఘునిగూర్చ పాఠాంతరము గలదు

సోఁ స్పష్టముగాఁ దెలియదు. గోత్రము శ్రీవత్సనము. అతని తండ్రి పేరు అబ్బయ్య; తల్లిపేరు అబ్బమ్మ. వారిది కాండవవంశము. గోపన మంత్రిభార్య రామాంబిక. ఈతనిది వైష్ణవసంప్రదాయమునకుఁ జేరిన రామానుజమతము. వేజెర్ల (వేజెర్ల) గ్రామము గుంటూరుతాలూకాలో నున్నది. ఆగ్రామకరిణీకము వేజెండ్లవారిదే. వారు శ్రీవత్సస గోత్రమునకుఁ జేరిన ప్రథమశాఖవారుగా నుండిరని కొండవీఁటిదండకవిలెను బట్టి తెలియుచున్నది. వీరందఱు రామానుజమతస్థులుగా నుండిరని 'విప్రకులదర్పణ'మను మాసపత్రికకు సంపాదకుఁడుగానుండి యనేక వేల యాంధ్రవిప్రవంశచరిత్రములను సేకరించిన శ్రీయుత సత్తిరాజు సీతారామయ్యగారి యభిప్రాయము. గోపమంత్రి రఘురామునిభక్తుఁడు. కావుననే రాఘవులపుణ్యచరిత్రమును, శ్రీరామభక్తాగ్రేసరుఁడగు నాంజనేయుని పవిత్రకార్యమును వెలయింపఁజేయుచున్న యీమైరావణచరిత్రమునుఁ గృతినొందుట సంభవించెను. ఈమంత్రిపుంగవుఁడు విజయనగర రాజ్యములో నెచ్చోటనో పరిపాలకుఁడుగా నుండెనని చెప్పుటకొక ప్రబలమగునాధార మీగ్రంథమందుఁ గాన్పించుచున్నది. అదియేదన ప్రథమాశ్వాసాంతమున కృతిపతిని వర్ణించుచు వ్రాయఁబడిన యీపద్యమునుఁ దిలకింపుఁడు.

చ. యవన కళింగ వంగ మగ ధాంధ్ర పుళింద దశార్ణ కోసల
ద్రవిడ విదేహ కుంతల విదర్భ యుగంధర భోజ మేదినీ
ధవ వరమంత్రివర్గ నిరతస్తుత చారుకవిత్వకార స
త్త్వవిమలవాగ్విలాసఘనబంధుర కాండవవంశవర్ధనా!

ఈ పద్యమందుఁ గర్ణాటరాజ్యమును జేర్కొనక తక్కిన పరిసర రాజ్యముల నన్నిటిని సూచించి యారాజ్యములందలిమంత్రులు గోపమంత్రిని సతతముఁ గీర్తించుచుండిరని చెప్పుటచే నీగోపమంత్రి కర్ణాటరాజ్య

మఱు విజయనగరరాజ్యములో వీరనృసింహరాయలకాలములో సార్వభౌముని ప్రత్యక్షమునఁగాని లేక యెచ్చటనో దుర్గాధిపత్యమునఁగాని యుద్యోగిగా గాని యుండెనని నిర్ణయింపవలసియున్నది. "చారుకవిత్వకారసత్త్వవిమలవాగ్విలాసఘనబంధుర"యని యుండుటచేఁ గవీశ్వరులగోష్ఠి యాతని కెక్కువప్రీతికరముగా నుండెనని విదితము.

ఒకానొక రానమంత్రికొడుకగు నెఱ్ఱమంత్రి యీగోపమంత్రి వియ్యంకుఁడట. ఆ యెఱ్ఱమంత్రికిమాడయ్యకవి 'దేవేంద్రవిజయ'మను నొక ద్విపదప్రబంధము రచించి కృతియిచ్చెనట. ఆప్రబంధమిపుడు గానరాదు. రాన, ఎఱ్ఱమంత్రుల విషయములుగూడ నన్వేషణీయములే. బహుశః వేజెర్ల గోపమంత్రియు, వియ్యంకుఁ డెఱ్ఱమంత్రియు కృష్ణానదికిరుపార్శ్వములలోనున్న విజయనగరరాజ్యసంబంధములగు దుర్గములను వేనినో పరిపాలించుచుండిరి కాబోలు.

ఏలయన, మాడయ్యకవి కృష్ణాజిల్లాలోనున్న గుడివాడపట్టణమందలి భీమలింగస్వామివారి భక్తుఁడ ననియుఁ, దా నాస్వామివారి సత్కృపాప్రసాదమునఁ గవితాప్రతిభ గడించెననియు నాశ్వాసాంతగద్యలలోఁ జెప్పుకొనుటచే నాకవీశ్వరుఁడు కృష్ణాజిల్లావాఁడని స్పష్టమగుచున్నది. కావునఁ దనకుఁ బ్రథమమున నాశ్రయమొసంగినవారును, తాను వారికిఁదగిన *బంధుసమానుఁడని ప్రకటించుకొనినవారునగు నీయుభయమంత్రులు మాడయ్యకవివలెనే కృష్ణానదీప్రాంతములలోఁ జిన్నప్రభువులుగా నుండిరని యూహించుట సమంజసముగాఁ దోఁచుచున్నది.

---

* గీ. ధాత్రిలోన మనకు గోత్రంబు కాశ్యప
నొక్కటగుట మంచిభాగ్యమయ్యె
గానఁ జెప్పఁ దంత్రికవిత మైరావణ
చరిత మొప్పనాకు జయకరముగ.

(మైరా : ఆశ్వా ౧.)

మాడయ్యకవి యొక్క చరిత్రము చాల యద్భుతమైనదిగాఁ దోచుచున్నది. ఈతని జీవితచరిత్రాంశము లెక్కువగా మనకుఁ దెలియక పోయినను నీగ్రంథమందున్న వానిని మాత్రమె చూచినప్పటి కీతఁడు చాల ప్రతిభాశాలియనియు శ్రీనాథునివలె నాంధ్రావనియందు దూర దేశ పర్యటనములఁ గావించి రాజసభలలో దిగ్విజయములుచేసి బహుళ ప్రఖ్యాతిఁ బొందినవాఁడనియు, రాజాదరణము సేకూర్చుకొనుటకుఁ జక్కని యుక్తిసాధనముల నుపయోగింపఁగల దిట్టయనియు, లౌకికప్రమేయమును లెస్సగ నెఱిఁగిన చతురుఁడనియుఁ జెప్పవచ్చును.

మాడయ్యకవి తండ్రి సర్వయ్య; తల్లి రాచమ్మ; అన్న మల్లయ్య. మాడయ్య కుటుంబమును, గోపమంత్రి కుటుంబమును యొక్కటే వైదిక శాఖాగోత్రములకుఁ జేరినవగుటచే వారికిఁ బరస్పరసంబంధమును, జేరికయుఁ గలిగియుండెను. కావున మాడయ్యకవియు శ్రీవత్సస గోత్రియుఁ డును, యజుశ్శాఖకుఁజేరిన బ్రాహ్మణోత్తముఁడును. మాడయ్య యన్నగారగు మల్లన్నమనీషి "దక్షిణరాయనృప ప్రవిమలాబ్ధి రమణీయుఁ"డట; అనగా దక్షిణాధీశుఁడైన విజయనగరరాజుకొలువులో విమలసత్కీర్తిఁగన్నవాఁడు. ఈతఁడు నిత్యమును శ్రీమద్రామాయణ పఠనమునం దాసక్తిఁగలిగినవాఁడట. కావున మాడయ్య పండితవంశపు వాఁడని విశదమగుచున్నది:

క. నీ యగ్రజుండు దక్షిణ
రాయనృప ప్రవిమలాబ్ధిరమణీయుఁడుఁ రా
మాయణ పఠనవ్రత ని
త్యాయత ఘనయశుఁడు, మల్లనార్యుఁడు పేర్మిన్.

వ. నీవు మఱియును-

చ. రసములు తొమ్మిదింగలుగు రమ్య నవార్థ సుశబ్ద మాధురీ
విసరము లుల్లసిల్ల నతివిస్ఫుట లక్షణ రూఢిఁ బ్రౌఢిమన్
రసికుల నెమ్మనంబు లనురాగమునొందఁ దెనుంగుబాస నిం
పెసఁగఁగఁ జెప్పనేర్తు సరియెవ్వరునీకును మాదధీమణీ!

ఈవిధముగ వేజెర్లగోపమంత్రి మాదయ్యాకవినిఁ బ్రశంసించుటచే నన్నగారు సంస్కృతపాండిత్యమునకును, దమ్ముఁడు నాంధ్రకవిత్వము నకును నానాఁడేఁ బేరుపొందిరని తెలియుచున్నది.

మాదయ్యాకవి శైవమతావలంబి. ఇవ్వటూరిపురశాసనుఁడగు మల్లికార్జునుఁ డీతని గురువౌటచే బహుశః వీరశైవమునకుఁ జేరినవాఁ డై యుండవచ్చును. ఇవ్వటూరివా రిప్పటికిని లింగధారి నియోగిబ్రాహ్మణులేయని యందరెఱిగినదే. మాదయ్యాకవి గుడివాడపురమందున్న భీమేశ్వరస్వామి యారాధకుఁడ నని చెప్పుకొనుటచే నీతని శైవమత దీక్ష మఱింత స్పష్టమగుచున్నది. గుడివాడపురము కృష్ణామండలములోని ప్రస్తుతపు గుడివాడయేయని చెప్పుటకు సందేహింపఁబనిలేదు. ఆపట్టణమున నిప్పటికిని భీమేశ్వరస్వామివారి దేవాలయమే యెక్కువ ప్రతిష్ఠ నంది యున్నది.

చ. వలనుగ నాత్మలోన గుడివాడపురాధిపు భీమలింగనిం
దలఁచి, కరంబులెత్తి ప్రమదంబునమ్రొక్కి నుతించి, భక్తి ని
శ్చలమతి నివ్వటూరిపురశాసను మద్గురు మల్లికార్జునిన్
గొలిచి తదాజ్ఞచేఁ బ్రకటకోమలకావ్యకళావివేకినై.

వేజెర్లగోపమంత్రి మాదయ్యాకవినిఁ గృతినిర్మాణమున కాహ్వానించుచు జేసిన ప్రశస్తియెంతయుఁ జరిత్రాత్మకములైన చిత్రకథాంశములతో నలరారుచున్నది.

సీ. మెప్పించినాఁడవు మెఱవడిఁ గర్ణాట
నరనాయకుని వీరనారసింహు
దట్టించినాఁడవు తస్కరకవిరాజుఁ
గోటసింగనమంత్రి గొలువులోనఁ
గాంచినాఁడవు కనత్కాంచనాభరణంబు
లేపార నందాపురీశు చేత
నందినాఁడవు నుత్తమాశ్వద్వయంబును
కిమిడెభూమండలరమణు చేత
నవమతిస్ఫూర్తిఁ గ్రోడించినాఁడ వఖిల
కావ్యలక్షణలక్ష్యసాగరము నెరయ
నిన్ను వేర్వేర నింక వర్ణింపనేల
ప్రౌఢవన్నింట సర్వయమాడ సుకవి.

ఈచారిత్రకవిశేషముల నన్నిటిని సరిగా నవగాహనముఁ జేసికొనుట కానాఁటిరాజకీయమతచరిత్రమంతయు సువిశేషముగ నెఱుఁగవలసియున్నది. అయ్యది సమగ్రముగాఁ దెలిసిన యెడల మాడయ్య యొక్క చాకచక్యమును, లౌక్యమును, సామర్థ్యమును బాగుగ గుర్తింపగల్గుదుము.

రాజకీయవిషయములో విజయనగరరాజులకుఁ బ్రబలశత్రువు లొకవంక భామినీసుల్తానులును, వేరొకవంక కటకపురాధీశులగు గజపతులు నై యుండిరి. ప్రస్తుతము మాడయ్యచరిత్రము గజపతిరాజుల శత్రుత్వస్థితితో సంబంధించియున్నది. కపిలేశ్వరగజపతియను గొప్పసేనానాయకుఁడు (క్రీ. వె. 1452–1479) కటకపురము నేలుచుండి గాంగవంశపు రాజును పదభ్రష్టునిజేసి కటకపురిరాజ్యమునుఁ దా నాక్రమించుకొని దక్షిణమున కాంచీపురమువఱకుఁ దన యద్వితీయబలప్రభావమున రా

జ్యమును విస్తరింపఁజేసెను. ఆకారణమున నాతనికి విజయనగరరాజులతో సరిహద్దుపోరాటములు తఱచు జరుగుచుండెనుగాని తాను వారికెంత మాత్రము లొంగిపోలేదు. నెల్లూరిసీమలోనున్న కర్ణాటకరాజ్యాంతర్భాతమగు నుదయగిరిదుర్గమునుఁగూడ స్వాధీనముచేసికొని యుత్తరసముద్ర తీరదేశము నంతటినిఁ బరిపాలించెను. గాంగవంశపురాజులనుఁ దోసి రాజుఁజేసి రాజ్యమునాక్రమించినకతన నాతఁడు గాంగవంశపువారి కంద ఱికి నేత్రకంటకుఁ డయ్యెను. ఆనాఁడు నందాపురమునేలుచుండిన ఓఢ్ర రాజులును, కిమిడెపట్టణమునందలి యోఢ్రరాజులును గాంగవంశజులే యైయుండిరి. ఆకారణమున నందాపుర కిమిడె ప్రభువులతో కపిలేశ్వరగజ పతి తఱచుఁ దలపడవలసి వచ్చుచుండెను. అమిత్రామిత్రులు రాజకీయ మున మిత్రులుగాన విజయనగరప్రభువులకును నందాపురి కిమిడెరాజన్యులకును సఖ్యమేర్పడినది. నందాపురరాజ్య మనఁగా విశాఖపట్టణపుజిల్లా లోని జయపురసంస్థానము. కిమిడెరాజ్య మనఁగా గంజాముజిల్లాలోని పర్లాకిమిడెసంస్థానము. ఈరెండు నాంధ్రదేశములోనివేయైనను పూర్వ కాలమునుండియు నోఢ్రరాజులచేఁ బరిపాలింపఁబడుచున్నవి.

ఇంక మతవిషయమున నాకాలపువ్యవస్థ యిట్లుండెను. విజయ నగరభూమీశులలో మొదటివంశమగు సంగమవంశమునకుఁజెందిన రాజులు సామాన్యముగ వీరశైవము నవలంబించినవారే. అయినను శైవమతము నకు కేవలము ప్రతికక్షిగానుండనిహేతువున మాధ్వమతమునకుఁగూడ వారుఁ గొంతయాశ్రయము నిచ్చినవారైరి. మధ్వమతప్రతిష్ఠాపకులగు మాధవాచార్యులువారు (క్రీ. వె. 1288-1317) లో భౌతికశరీరముఁ దాల్చినవారగుటచే విద్యారణ్యమాధవాచార్యులవారితోఁ గొంతపరిచ యముఁ గలిగియేయుండురు. ముఖ్యముగ మధ్వాచార్యులవారిశిష్యుడగు పద్మనాభతీర్థులును, (క్రీ॥ వె॥ 1317—1324) నరహరితీర్థులును

(క్రీ. శ. 1324-1565) విజయనగరసామ్రాజ్యమునఁ బేరుప్రతిష్ఠలనొంది శిష్యవర్గములతో నుండి రాజపోషణము ననుభవించుచుండిరి. ఈయిద్దఱును ప్రప్రథమమున కళింగదేశవాసులై మధ్వాచార్యులవా రుత్తరదిగ్విజయముఁ జేసినకాలమున వారికి శిష్యులై ఆచార్యులవారితరువాత మాధ్వమతపీఠమున పీఠాధిపతులుగఁ గాలక్రమమున నధిష్ఠించిరి. వీరిలో, ముఖ్యముగ నరహరితీర్థులవారు కళింగదేశమున గాంగరాజులయొద్ద మంత్రిగాను, గురువుగాను, రాజపోషకుఁడుగాను జాలకాలముండినకారణమున మాధ్వమతమున కోఢ్రదేశములో నెక్కువప్రతిష్ఠ గలుగుటకు హేతుభూతులైరి. దీనిఫలితముగ నోఢ్రదేశమందు నిప్పటికినివ్యాప్తమైన చైతన్యమతమున మాధ్వమతకళ విస్పష్టముగాఁ గాన్పించుచున్నది. ఇట్లు విజయనగరరాజులకును, నోఢ్రరాజులకును రాజకీయస్నేహమేగాక మత సంబంధమగు స్నేహముగూడఁ దోడగుటచే నన్యోన్యానురాగము గాఢముగఁ బెంపొందియుండెను.

మాధ్వమతస్థుల పరమదేవతలలో నాంజనేయుఁడు ముఖ్యప్రాణదేవరయను సార్థకనామమున మాధ్వులకుఁ బరమపూజ్యుఁడుగా నున్నాఁడు. మాడయ్య రచించిన మైరావణచరిత్రము శ్రీఆంజనేయుని నిరుపమాన భక్తిసామర్థ్యములను వేనోళ్లఁ జాటుచుండినదగుటచే మాధ్వులకభిమానగ్రంథముగ నుండనోపు. మాడయ్యకాలమున మాధ్వమతమందలి గురుపీఠమున నాసీనులైన వ్యాసరాయలవారు (క్రీ. శ. 1447-1539) నిస్తులప్రతిభాశాలియై సాళువనృసింహునిమొదలు శ్రీకృష్ణదేవరాయలవారి జీవితాంతమువఱకు రాజమాన్య రాజపూజితుఁడుగా మెరసి యొకానొకప్పుడు కృష్ణరాయలవారిచే నర్థసింహాసనమునొసంగఁబడి రాజగురువుగాను, రాజకార్యధురంధరుఁడుగాను నుండెను. అట్టి

మహోదారపురుషుఁడు నిత్యరామాయణ పఠనవ్రతుఁడగు మల్లన్నను, మైరావణచరిత్రమహాకవియగు మాడయ్యను సాదరమునఁ జేరఁదీసి పోషకుఁడుగానుండుట యొకవింతకాదు. కావున వ్యాసరాయలవారిద్వారా హనుమద్విజయమనఁదగు నీమైరావణచరిత్రమును రచించిన మాడయ్యకవి యభిమానాశీర్వచనములతో మాధ్వమత పోషకులగు కర్ణాట రాజులయాశ్రయములో నుండుటయు వారినెయ్యురైన నంద్యాపురి, కిమిడె మండలేశ్వరులఁ గొలువులలో సగౌరవబహుమానములఁ బొందుటయు సయుక్తికముగానే యున్నది. ఇట్లు రాజకీయమతసంబంధములనుఁ బురస్కరించుకొని మాడయ్యకవి రాజపోషణాన్వేషియై కర్ణాట భూపతుల కొలువునుండి, యాంధ్రరాజుల సన్మానముకొఱకాంధ్రదేశపర్యటనముఁ గావించినవాఁడయ్యెను. కవితాగరిమచే ననేకరాజసభలలోఁ గీర్తిఁగాంచి, యమూల్యసత్కారములను స్వీకరించుట, నాఁడు శ్రీనాథునికిని, నేఁడు మాడయ్యకవికిని సిద్ధించినది. శ్రీనాథుఁడు విద్వద్రంగములలో మహాయోధుఁడు, మాడయ్య గొప్పనేర్పరి.

మాడయ్యకవియొక్క కవిత్వవిజయములను వర్ణించు పూర్వోదాహృతపద్యములో మొట్టమొదట కర్ణాటకనరనాయకుఁడగు వీరనృసింహుఁడు పేర్కొనఁబడెను. కర్ణాటకరాజ్యచరిత్రములో వీరనృసింహనామధేయమిద్దఱకుఁ బ్రాయశః కాన్పించుచున్నది. సాళువ నృసింహరాయల కొడుకగు తమ్మరాయలును, తుళువ నరసరాయల జ్యేష్ఠపుత్రుఁడగు నృసింహరాయలును, వీరనరసింహుఁడను బిరుదమును వహించినట్లు శాసనములవలనఁ దెలియుచున్నది. వీరిద్దఱిలో తమ్మరాయలు నామమాత్రపురాజుగా నుండెనుగాని సమర్థుఁడుగానుండలేదు. అతని స్థానమందు తుళువనరసరాయలు విద్యానగరరాజ్యభారమంతయు వహించెను. తుళువ వీరనృసింహరాయ లట్లుగాక స్వశక్తిమీఁద నాధారపడి

రాజ్యధౌరేయ్యమును వహించి కీర్తి వైభవములను గాంచి ప్రజాపాలన మొనర్చెను. అక్కారణమున పద్యమందలి వీరనారసింహాశబ్దము తుళువనృసింహరాయలకే చెందునని నిశ్చయింపవచ్చును. కావున మాదయ్యకవి కర్ణాటకసార్వభౌముని ప్రత్యక్షమునం గవితావిలాసమును జూపి ప్రారంభదశలోం బ్రసిద్ధిలోనికి వచ్చెను.

ఇంక పైపద్యమందలి రెండవచరణములోనున్న కోటసింగనమంత్రియెవరు ? ఈ మంత్రివరుని యుదంతమొకించుక "విప్రకులదర్పణ" సంపాదకులగు సత్తిరాజు సీతారామయ్యపంతులుగారి సహాయ్యమునం దెలిసికొనం గల్గితిని. "పట్టిసపు వీరభద్రుని ప్రేమచే, జెన్నొందె శ్రీ కోటసింగరాజు" అనుచాటూక్తి కలదట. కోటసింగనమంత్రి పట్టిసపు వీరభద్రునిభక్తుండని తెలియుచున్నది. ఆపట్టిసక్షేత్రము రాజమహేంద్రవరమున కనతిదూరములో గోదావరీతీరముననున్న పట్టిసమని చెప్పవలసియున్నది. అచ్చట వీరభద్రస్వామివారిప్పటికిని గొప్పదగుక్షేత్రప్రతిష్ఠ నొందియున్నారు. సింగనమంత్రి యార్వేలవంశపువాండు. అతనితండ్రి కొండయమంత్రి.

"మహితచారిత్ర కొండయామాత్యపుత్ర
కుటిలదుర్మంత్రిమదభంగ కోటసింగ"

అనియున్నది. సింగయమంత్రిభార్య గంగమాంబయట.

"కోట సింగరాజు మాటవాసియెగాని
గంగమాంబచేత ఘనతకెక్క
గంగమాంబయెంతో గయ్యాళి యైతేను
సింగరాజు యేమి చేయగలండు."

అను చాటుపద్యమున నీమహాసాధ్వీలలామయొక్క వితరణసౌశీల్యాది గుణములభివర్ణితములైనవి. కోటసింగనమంత్రిపేరున పశ్చిమగోదావరి

జిల్లాలో నిడుదవోలుదరిని సింగరాయపాలెమను నొకగ్రామము వెలసినది. ఈ సింగనమంత్రికి మగసంతానము లేకపోవుటచేఁ దనయేకపుత్రినిఁ దల్లాప్రగడవారిపుత్రునకిచ్చి తనమిరాశీదారుపదవినిఁగూడ నాతనికే సంక్రమింపఁజేసెనట !

క. నరజన్మంబునఁబుట్టిన
కరణీకమెయుత్తమంబు. కరణంబైనన్
బురుషార్థపరుఁడుఁగావలె
శిరసెత్తినఫలము కోటసింగనవర్యా !

పైవిషయముల నన్నిటిని సమన్వయించి చూచినయెడల కోటసింగన గోదావరీతీరస్థుఁడనియుఁ, దనకాలమునఁ బేరొందిన మంత్రిపుంగవుఁ డనియుఁ దేలుచున్నది.

పదునాఱవ శతాబ్దప్రారంభమున జీవించియుండిన కోటసింగన మంత్రి యేరాజులయొద్ద మంత్రిగానుండెనో విచారింపవలసియున్నది. గజపతిరాజుల బలాటోపమున కటకరాజ్యము తూర్పుసముద్రతీరమునఁ గాంచీపురమువఱకు వ్యాపించినదని పైనసూచించితిని. మొదటినుండి యు విజయనగరరాజుల యేలుబడిలోనున్న నెల్లూరిజిల్లాలోని యుదయగిరిరాజ్యముసైతము గజపతులవశమైయెనది. కాబట్టియిప్పు డుత్తర సర్కారులనుపేరునఁ బిలువఁబడుచున్న దేశమంతయుఁ గోటసింగన మంత్రికాలమునఁ గటకాధిపతులగు గజపతులయధీనమైయుండెను. ఆ హేతువున, గోటసింగనమంత్రి రాజమహేంద్రవరమున, దుర్గాధిపతిగా నో, సచివుఁడుగానో యుండి గజపతులచేతిక్రింద నధికారముసేయుచుం డెను. గజపతులు విజయనగరరాజులకుఁ బ్రతిశత్రులుగాన విద్యానగర మునుండివచ్చిన కవీశ్వరుని గౌరవించి, బహూకరించిన తమపై యుద్ధకాలముల కాగ్రహముకలుగవచ్చునని కాఁబోలు సింగనమంత్రి తనకొలువులో

నుండి నేతిబీరకాయవలెఁ గవిరాజనామముధరించిన, "తస్కరకవిరాజు"ని దట్టించిన మాడయ్యపుకవికిఁ బ్రత్యేకముగాఁ బారితోషికమునిచ్చిన పంపినట్లు కాన్పించుచున్నది. మాడయ్యకవియుఁ శత్రురాజాస్థానమునఁ దన కవీశ్వరబిరుదుఁ, బాదుకొల్పి విజయచిహ్నములతో వెడలుటయే లెస్సయని యాలోచించియుండవచ్చును. రాజమహేంద్రవరము విడచి యుత్తరాంధ్రమనఁదగు కళింగదేశమునకుఁ బోయినప్పుడచట నందాపురీ కిమిడిసంస్థానములే యాకాలమునఁ గొప్పపేరుప్రతిష్ఠలఁబొంది యున్నవి.

నందాపురరాజ్యమునకు అనఁగాఁ బ్రస్తుతఁపు జయపురసంస్థానమునకు మాడయ్యకవి వెళ్లెను. అట నక్కాలమున భానువంశసంజాతుఁడగు విజయచంద్రుఁడనురాజు పాలించుచుండెను. ఆరాజునుమెప్పించి మాడయ్య "కనకాంబరంబులు" పొందినాఁడఁట. *

నందాపురీరాజ్యమునుండి మాడయ్యకవి కిమిడిరాజ్యమునకుఁ బోయెను. ఆరాజవంశశాఖయే ప్రస్తుతము గంజాంజిల్లాలోని పర్లాకిమిడి సంస్థానము నేలుచున్నది. ఆ కిమిడిరాజ్యమునుఁ బరిపాలించుచున్న

---

* నందాపురీరాజవంశ చరిత్రము: —

శైలోద్భవ వంశమునకుఁ జేరిన ప్రతాపగంగమహారాజు నందాపురీరాజ్యమునుఁ బదునేనవశతాబ్దములో నేలుచుండెను. అతనికొక కుమార్తెయే పుట్టెను. ఆమెను సూర్యవంశజాఁడును కాశ్మీరరాజ్యమందలి జమ్మసంస్థానఁపు రాజన్యుఁడునగు వినాయకదేవునకు నిచ్చి తనరాజ్యమంతయు నాతనికప్పగించెను. ఆవినాయకదేవుని వంశస్థులు చాలకాలమువఱకు నందాపురీ రాజ్యమునుఁ బరిపాలించిరి.

క్రీ. శ. 1443—1476 వినాయకదేవుఁడు; ఈతనికొడుకు విజయచంద్రుఁడు 1476—1510. ఈతఁడే మన మాడయ్యను సన్మానించినవాఁడు. అతనికొడుకు భైరవేశ్వరుఁడు 1510—1527; అతనిపుత్రుఁడు విశ్వనాథుఁడు 1527—1571; అతనికుమారుఁడు (1571—1599) బలరాముఁడునుఁ బరిపాలించిరి.

భూధవుఁడు, చంద్రమౌళి గజపతియనునాతఁడు ఈ మాదయ్యాకవీశ్వరుని సాదరమున సన్మానించి యుత్తమాశ్వద్వయము బహుమతిగా నొసంగెను. "అందినాఁడవు నుత్తమాశ్వద్వయంబును కిమిడెభూమండల రమణుచేత" *

* కిమిడెభూపతుల వంశవృక్ష మిట్లున్నదని తెలియవచ్చుచున్నది. శ్రీయుత సత్యనారాయణరాజగురువుగారు సేకరించి దీనిని మ. రా. శ్రీ పారనంది జగన్నాథస్వామి M. A. గారు నాకుఁబంపిరి.



నందాపుర వసుమతీశుఁడును, కిమిడిభూజానియును బంధుసంబంధమున మిత్రులుగానుండి గజపతులతోఁ దలపడి పోరాడి జయముగాంచుచుండిరి. కావున విజయనగరరాజుల కొలువునుండివచ్చిన మాదయ్యను దగువిధమున గారవించుట కవితారసికజ్ఞతయేగాక, రాజకీయమర్మజ్ఞతయు ననిపించుకొనినది.

ఇట్లు విజయశీలముగ నాంధ్రదేశమంతటను గవిసంచారముచేసిన మాదయ్య బహుసమర్థుఁడై యుండునని వేఱె చెప్పనవసరములేదు ఈతఁడు కావ్యజ్ఞుఁడును, కార్యజ్ఞుఁడునై యుండుట విస్పష్టమే.

# కథా విషయము.

## ప్రథమాశ్వాసము

రావణవధానంతరము రామలక్ష్మణులు సీతాసమేతులై సాకేతపురమున కేఁగి యచ్చట రామచంద్రుఁడు ధర్మము నాలుగుపాదములునడచినట్లు న్యాయపరిపాలనముచేయుచుండ నొకనాఁడు సకలఋషులు శ్రీరాముని జూడఁగోరి యయోధ్యకు వచ్చిరి. వారిలో నగస్త్యుఁడు దాశరథి న్యాయధర్మపరిపాలనము ననేకవిధములఁ గొనియాడెను. అప్పుడు శ్రీరామచంద్రుఁడు దగ్గరనుండి తన పాదపద్మముల సేవించుచున్న హనుమంతునిఁ జూపి "ఈ మహాత్ముని సాహాయ్యమునఁ గాదే మేమియిడుములనుండి తప్పించుకొని విజయులమై రాఁగలిగితిమి" అని చెప్పెను. అంత నగస్త్యుఁడు "రామచంద్రా! మీరు చెప్పినదంతయు సత్యము. ఈ యంజనాపుత్రుఁడు దాఁజేసినకార్యముల నెన్నఁడును చెప్పికొనఁడు గాన దేవరవారికి వీని యద్భుతకార్యములు కొన్ని తెలియకపోవచ్చును. అట్టి యద్భుతకార్యములలో నొకదానిఁ దమకిపుడు విన్నవించెద"నని పల్కెను.

రావణునితో మీరు యుద్ధము చేయుచున్నకాలమునఁ గుంభకర్ణేంద్రజిదాది బంధువులఁ గోల్పోయిన రావణుఁడు కొండొకయుపాయముఁ గానక యొకరేయిఁ దనస్నేహితుఁడును, బంధుగుఁడునై యుండి, రసాతలమున రాజ్యమేలుచున్న మైరావణునిఁ దలంచుకొనెను. ఆక్షణముననే యారాక్షసమోహకుఁడు పౌలస్త్యుని

ప్రేమాలనిల్పి, కేల్మోడ్చి "రావణా! ఏలనీ రేయి నాకొఱకుఁ దలంచితివి? ఏమియుప ద్రవము వాటిల్లినది? నావలననెట్టి సహాయ్యముఁ బొందఁగలవు? ఆనతీయు"మని యడిగెను. అంత రావణుఁడు శూర్పణఖ నాశికాభంగము మొద లప్పటివఱకుఁ జరిగిన విషయములన్నిఁటినిఁ బూసగ్రుచ్చినట్లు చెప్పి రామలక్ష్మణుల నెట్లువధింపఁగలనో తెలియరాకున్నదని సందేహమగ్నుఁడనైయుంటిని. కావున వీరినెట్లయినఁ గడతేర్ప వలెనని కోరెను. అంతట మైరావణుఁడు "అయ్యో! రామచంద్రుఁడు సాక్షాద్వి ష్ణువు. రాక్షసకులనాశనము గావించుకొఱకె యవతరించినవాఁడు. వానిని జంపుట యసాధ్య"మని పలుక దైత్యరాజు కటకటంబడి నేత్రకోణములు జేవురింప గోపావే శితుఁడయ్యెను. మైరావణుఁడు "నీమనస్సునందలి గబ్బితనమును బరీక్షింపఁ బలికితిని గాని నీలావునను, చలమును నెఱుఁగనివాఁడను గాను. కావున నీపంపు వేవేగము చేసి నీకువిజయమొనగూర్తు"నని చెప్పి యాతనియాజ్ఞఁగైకొని మరలి తనపాతాళపురి కేతెంచెను. అచ్చట దీనాననుఁడై విచారవిమగ్నుఁడైయుండ నాతనిభార్య మాతంగి పతియొద్దకువచ్చి "నాథా! ఏలయిట్లు విన్నఁదనమున వసివాడియున్నారు? మీరెంద మిట్లు గొందలమందుటకుఁ గతంబేమి?" యని పల్కెను. అంత మైరావణుఁడు తన ప్రియసతికిఁ దాను రావణునియొద్దకరిగిన కారణమును, నాతనితోఁ దనకుఁజరిగిన ప్రసంగమును నివేదించెను. ఆమె కడుంగడు దుఃఖించి "అయ్యో! యిదియేమి? కొఱవిదెచ్చికొంటిరి? లీలామానుషరూపమున నవతరించిన శ్రీమహావిష్ణువుగాదే యీ శ్రీరామభద్రుఁడు! ఈమహాపురుషుఁ డెందఱదఱితో రాక్షసనాయకుల నిదివరకే యమపురికంపినాఁడు. రావణుఁడు నట్టే సమువర్తిసదనమునకుఁ బోవనున్నాఁడు. మీరేల దీనిలోఁజిక్కుకొనెదరు?" అని పరిపరివిధముల విలపించి వేడికొనెను.

మైరావణుఁ డీయుదంతమంతయు నెఱిఁగియున్నను రావణునకుఁజేసిన బాస తప్పవలనుపడనందున రామలక్ష్మణులఁ జంపుటయో, లేక వారిచేఁ దాను జచ్చు టయోగాక తప్పదని భార్యనూరార్చి లోనికంపివేసెను.

## రెండవ యాశ్వాసము.

మైరావణుఁడు శస్త్రాస్త్రములధరించికొని, యింద్రజాల మహేంద్రజా లాది కపటవిద్యల స్మరించుకొని కృత్రిమవేషధారణమున దారితేరిన సూచీముఖుఁడు కులమువారిని వెంటనిడుకొని రామలక్ష్మణులున్న శిబిరముఁ జేరెను. అచ్చట వాయు నందనుని వాలప్రకోటఁజూచి ఘటుకునిఁబిల్చి యాకోటలో వనచరులెటులున్నారో,

రామలక్ష్మణు లేమి చేయుచుండిరో యారసి రమ్మని పంపెను. వాఁ డెంత ప్రయత్నించినను కోటపైకి లంఘించుటకుఁ గాని కోటకుఁ గన్నము త్రవ్వుటకుఁ గాని వీలుగాక ఖిన్నుఁడై మైరావణునొద్దకు మఱలివచ్చెను. తన భంగమునంతయు విన్నవింప మైరావణుఁడు చాల కోపించి సూచీముఖుని రావించి యా పనిమీద నే పంపెను. వాఁ డెన్ని విధముల యత్నించినను కోటను భేదింపలేక భగ్నాశముతో వచ్చి మొరపెట్టుకొనెను. అంత మైరావణుఁడు స్వయముగాఁ బోవ నుద్దేశించి విభీషణుని వేషము ధరించి కోటముఖద్వారమునకుఁ బోయి, యచ్చటఁ గూర్చుని యున్న పవనతనయునితో మాయ యచ్చుపడ రామలక్ష్మణుల సేమము గూర్చి యెంతయో వ్యాకులచిత్తుఁడుగా నున్నట్లభినయించి లోనికరిగి వారెట్లుందురో చూచివచ్చెదనని చెప్పి హనుమంతుని యనుజ్ఞ వడసి చెచ్చెర లోనికేగి రామలక్ష్మణుల నొక యినుపమందసమున నిడి దానిని దన చంకఁ బెట్టికొని తిరిగి బయటకు వచ్చి యాంజనేయునితో రామలక్ష్మణులు సుఖనిద్ర నున్నారనియు, నంతయు సుముఖముగా నున్నదనియు నచ్చ జెప్పి, యనుమానమిసుమంతయుఁ గలుగనీయకుండ నటించి యినుపపెట్టెను దీసికొని తన పాతాళపురమునకు శీఘ్రముగఁ బోయెను. అచ్చట కాళికాలయమున నా పెట్టెనుంచి యా రాత్రియందే రామలక్ష్మణులా దేవికి బలియిచ్చుటకు నిశ్చయించుకొనెను.

ఇట్లుండ శ్రీరామశిబిరమున మఱికొంత సేపటికి నిజమైన విభీషణుఁడు కోట చుట్టి ప్రహరితిరిగి కోటముఖమున కేతెంచి హనుమంతునితో "సమీరనందనా! రామలక్ష్మణులు సుఖులైయున్నారుగదా! లోనికెవ్వరైనను వెళ్ళలేదుగదా!" యని యడుగ నాతఁడు "విభీషణా! యిటులేల యడిగెదవు? ఇప్పుడేగదా నీవు లోనికరిగి యా రాజచంద్రులు సుఖముగా నిద్రించుచున్నారని చెప్పితి"వని మాఱుపలుక "అయ్యో! మోసమైనది. నేను లోనికిఁ బోవనే లేదు. కోటచుట్టి యిపుడే వచ్చితిని. మహామాయావియగు మైరావణుఁడు నా రూపమున లోనికేగి దాశరథులను గొనిపోయి యుండవచ్చునని పిడుగుపడినట్టి వార్తను బలికెను. అంతఁ గపివీరులందఱుఁ గలవరము నొంది రామలక్ష్మణులకొఱకు సందుల గొందుల వెదకి కానక మైరావణుఁడు మాయోపాయమున వారినిఁ దనపురికి గొంపోయెనని నిశ్చయించుకొని తమ బుద్ధిమాంద్యమును, నలసత్వమును దూరుకొనుచు సమీరకుమారునిఁ జూచి "మహానుభావా నీవు మమ్ముల నన్నియిక్కట్టులనుండియుఁ దప్పించి మాకనిశము నేడుగడవైయుంటివి. ఈ తరుణమున సైతము నీవే మాకు దిక్కు. రాఘవులను భద్రముగాఁ గొనితేర నీవే సమర్థుఁడ"వని యనేక విధముల ప్రతిమాలిరి. ఆంజనేయుఁడు శ్రీరామపాదారవిందములయందు మిళిందమువలె విశ్వాసానందమునొందు డెందమునఁ దత్కార్యమునకుత్సహించి విభీషణుని

వలన మైరావణునిపురికిఁ దెరవు నెఱిఁగికొని సూక్ష్మరూపమున రసాతలముఁ బ్రవేశించి ద్వారికడ్డుగ నిల్చియున్న యొకయతికాయుఁడగు రాక్షసునిఁజూచి, వాఁడడ్డుపడ వానితో భీకరసమరము సలిపెను. ఇరువురును పోరాడి పోరాడి యొకరినొకరు నిర్జింపలేక విసువుఁజెందుచుండిరి. లోకైకవీరుఁడనని యోచించుకొనుచుండిన వంజనాసుతుఁడు తనతో దీర్ఘకాలము సమముగఁ బోరుసల్పఁగలిగిన యీమహాయోధుఁడెవ్వఁడై యుండునోయని యచ్చెరువొంది యాతని యితివృత్తముఁ దెలిసికొనఁ గుతూహలాయత్తచిత్తుఁడై "నీవెవ్వఁడ ?" వనివానిఁబ్రశ్నింప, నాతఁడు "తాను మత్స్యవల్లభుఁడను రాక్షసుఁడననియు, హనుమంతునకుఁ బుట్టినవాఁడ ననియు, మైరావణుని సేవకుఁడ ననియుఁ దెల్పెను. అంత నాజన్మబ్రహ్మచారియగు పవనాత్మజుఁడు తా నెట్టితనినిఁ గనియెనో తెలియక యాశ్చర్యనిమగ్నుఁడై "వాయునందనుఁడు నిత్యబ్రహ్మచర్యవ్రత నియముఁడని మూఁడులోకములుద్ఘోషించుచుండ నాతఁడెట్లు నీకు జనకుఁడయ్యెనో తెలుపమని యడిగెను. అంత మత్స్యవల్లభుఁడు "అయ్యా ! అనిలసూనుఁడు సీతాన్వేషణ పరాయణుఁడై లంకఁజేరుటకు వారినిధి నుల్లంఘించుచుండ, తదధ్వశ్రమమున దేహమున నుప్పతిల్లిన స్వేదబిందువొకటి క్రిందకుజార నద్దానినొక తిమింగిలము మ్రింగెను. ఆస్వేదబిందు వమోఘవీర్యముగలదౌటచే నాజలచరము గర్భముఁదాల్చెను. కాలక్రమమున నేనామత్స్యమునకుఁ బుట్టితినిఁ గాన నాపేరు మత్స్యవల్లభుఁడును, నాతండ్రి హనుమంతుఁడునునయ్యెన"ని చెప్పెను. ఈవృత్తాంతము సాకల్యముగ విని యాంజనేయుఁ డత్యాశ్చర్యమున నాతనిఁగౌఁగలింప నతఁడు "నీవెవ్వఁడ"వని యడిగెను. "నేను హనుమంతుఁడను. నీజనకుఁడను. కావున నీవు ప్రియతముఁడ"వని ప్రత్యుత్తరమొసంగ "నట్లైనచో నాకు నిదర్శనములు కనుపరుపవలె"నని యాతఁడుకోరగా హనుమంతుఁడుఁ దనకాయమును బెంచి గగనమార్గము నవరోధించెను. అంత మత్స్యవల్లభుఁడు తృప్తినొంది తండ్రికి సాష్టాంగనమస్కారమొనర్చి, తానెట్లు పితౄణముఁదీర్చికొనఁగలనని వేడికొనెను. అనిలతనయుఁడు తన ప్రస్తుతకార్యమును దెలిపి మైరావణుని వీటికి మార్గముఁజూపి తత్ప్రవేశక్రమమును జెప్పుమని కోరెను. మత్స్యవల్లభుఁడు తత్ప్రవేశక్రమమంతయు సవిస్తరముగఁ దండ్రికిఁ జెప్పెను. మారుతియు సానురాగముఁ గొడుకు భుజముపైనెక్కి పునః ప్రయాణముసాగించి పట్టణపుదరినున్న యొక కాసారతటమున జలపాత్రను జేతపట్టుకొని నిల్చియున్న యొక వృద్ధాంగనను జూచి "అమ్మా ! ఏల నీవు కడుడస్సియుండి దీనాలాపములనిట్లు పలుకుచున్నావని యడిగెను. ఆవృద్ధాంగన తాను మైరావణుని తోఁబుట్టువుననియుఁ, దనకొడుకు నాదురంతకుఁడు చెరసాలయందుంచి తనకుఁగూడ సంకెళ్లువైచెననియు నట్లుచేయుట కొకానొక

సమయమున నాకాశవాణి తనకుమారుఁడు మైరావణునితర్వాత సింహాసనము నధిష్ఠించుననిపలుకుటయే కారణమనియుఁ దెలిపెను. మఱియుఁ దన యన్నగారియాదేశమునఁ దాను నీరుతీసికొనిపోవుచున్నట్లును, యానీటితో రామలక్ష్మణులను స్నానమాడించి వారిని కాళికాదేవికప్పుడే యాతఁడు బలినీయఁబోవుచున్నాఁడనియు సవిస్తరముగ నెఱుకపరచెను. అంతఁబావని తన నిజరూపముఁజూపి తాను మైరావణునిఁజంపి యామెకుమారుని సింహాసనముననుంచి రామలక్ష్మణుల భద్రముగాఁ గొనిపోఁదలఁచినట్లు నమ్మకముగలుగఁబల్కి యామెశృంఖలములను విడగొట్టి భృంగరూపముదాల్చి జలపాత్రము నంటికొని పయనమయ్యెను.

## మూడవ యాశ్వాసము

పురద్వారమున మైరావణుఁడు నిలిపిన తుల యొకటి శత్రులెవ్వరైనను ద్వారముదాటి లోనికరుదెంచినచో విరిగిపడును గాన ననిలతనయుఁడు ద్వారములో ప్రవేశింపఁగనే యది విరిగిపడెను. తోడనే ద్వారపాలురెవ్వఁడో యొకశత్రువు లోనఁజొచ్చెనను సంభ్రమమున నామెమట్టు మూగిరి. వారినందఱను ఆంజనేయుఁడు రెప్పపాటులోఁ జావమోది లోనికిఁ బ్రవేశించి కాళికాలయముననున్న రాఘవులను గన్నులారగాంచి వారింకను సుఖసుప్తులై యుండుటఁజూచి సంతసించి, వారున్న పెట్టెను భుజమున నిడికొని పురము వెల్వడి యాపెట్టెనొక లతానికుంజమున భద్రముగ నుంచి రాక్షససేనతోఁ దలఁపడెను.

రాక్షసమూకల మదమాడి విజృంభించి వారినాయకులనందఱఁ జావఁగొట్టఁగ మైరావణుఁడు స్వయముగ సంగరమునకుఁ బోవలసివచ్చెను. అంత హనుమంతునకును, పాతాళపతికిని ఘోరయుద్ధము జరిగెను. కపివీరుఁడు రక్కసనాయకుని నెన్నిసారులు చంపినను వాఁడు తిరిగి బ్రతుకుచునే యుండెను. అవైపరీత్యమునకుఁ గారణము తెలిసికొనలేక చింతాకులుఁడైయుండ దుర్దంతి మారుతినిసమీపించి రహస్యముగ నిట్లు జెప్పెను. "ఈపురమునం దొకబిలము గలదు. దానియం దొక గుహయున్నది. దానియం దొకగుండురాయి యుండును. ఆగుండురాతియందున్న నేడుకన్నములలో నేడుతుమ్మెదలుండును. వానియందు మైరావణునిప్రాణములు సంచరించుచుండును. వానినన్నిఁటిని నేకముగ నొక్కసారిచంపినఁగాని వీఁడు చావఁడని గుట్టు తెలియఁజెప్పెను. పవమానతనయుఁడట్లే మైరావణుని వాలమున బంధించి యాతుమ్మెదలఁబట్టి యొక్కసారి నలిపివైచెను. వెంటనే మైరావణుఁ డసువులఁగోల్పోయెను. ఆవార్తవిని మైరావణునిభార్య మాతంగి మిక్కిలి దుఃఖించుచుండ కరుణారసపూరితుఁడైన కపిపుంగవుఁ డామె నూరార్చుటకు దుర్దంతి కుమారుని నీలమేఘుని

నియమించి, యాతనికి పాతాళపురము పట్టముగట్టి మత్స్యవల్లభుని యువరాజుగఁజేసి యచ్చటివారికందఱికి రామనామతారకప్రభావమును బోధించి పురమువెల్వాడి రాఘవులున్న పేటికను సప్రమాణంబుగ భుజముల నిడికొని రయమున తన స్కంధావారమునుఁజేరెను. అచ్చట సుగ్రీవవిభీషణాదులు పరమానందంబున పవమానసూనుని గారవించి చెక్కుచెదరక సుఖనిద్రను బొందియున్న రామలక్ష్మణులనుజూచి సంతసించిరి మరునాఁడు రామలక్ష్మణులు రావణునితోఁబోరి, వానిని జంపి, సీతనుదెచ్చి యయోధ్యకు మరలిరి. "ఆంజనేయుని యనన్యసామాన్య విక్రమము నాతఁడుగాని సుగ్రీవాదులుగాని యెన్నడును దెలియఁజేయరైరి. దానిని నేను జెప్పవలసివచ్చె"నని యగస్త్యుడు రఘురామునితో విన్నవింప రాఘవుఁ డాంజనేయుని మెచ్చి తన కంఠమున నున్న నవమాల్యరత్నహారమును హనుమంతునికంఠమున నిడి గారవించెను. తరువాత దాశరథులును, తమచరులును, విభీషణాదులు నొకచో గూడి విందారగించిరి. పిదప శ్రీరాముఁడు వారినందఱినిఁ దగువిధముగ సత్కరించి నిజనివాసములకుఁ బంపెను.

## శిల్పము.

రామరావణయుద్ధసందర్భమునఁ జరిగిన యీ యితివృత్తము వాల్మీకిరామాయణమునఁ గన్పట్టదు. వాల్మీకికిఁ దరువాత గొంతకాలమునకు సృజింపఁబడిన విచిత్రాదిరామాయణములలో నెద్దానియందో యిక్కథ కల్పింపఁబడియుండవచ్చును. ఈయితివృత్తమును గైకొని దానిసిఁ దన ప్రబంధమున నమర్చుటలో మాడయ్యకవి దేశకాలపాత్రములను బూర్తిగామార్చివేసెను. యుద్ధసమయమునఁ లంకలోజరిగిన యీ యితి వృత్తము యుద్ధానంతరమున శ్రీరాముఁ డయోధ్యయందు రాజ్యపాలనము జేయుచుండగా వమ్మహాపురుషునకు నూతనముగా నివేదింపఁబడినట్లు చెప్పుటచే దేశకాలభేదము కల్పింపబడినది. అగస్త్యమహర్షి ముఖమున మహామునులసభలోఁ జెప్పించుటచేఁ బాత్రభేదముగూడ గాన్పించుచున్నది. కావున సీకథానిర్మాణమున మాడయ్యకవి దేశకాలపాత్రభేదములన్నింటినిఁ గథానుకూలముగ సమకూర్చెను. ఇట్టి మార్పులను జేసి నూతన వాతావరణమును నేర్పరచుట కీ కవివరున కొక

చక్కని యవకాశము దొరకినది. అదియేదన యుద్ధభూమియందు రామలక్ష్మణులు సుఖముగా నిద్రించుచున్న సమయములో నీ యితివృత్తము జరుగుటయే. దాని నాధారముగా గైకొని రసవంతమైన కల్పనలు జేసి మనోహరరంగస్థలి నేర్పరిచి యాకథాకథనము జనరంజకముగానుండునట్లు కవిచేఁ జేయఁబడినది. హరికథలు లేక కాలక్షేపములనువానిని జెప్పెడి హరిదాసు లీ తీరుననే జనసామాన్యమునకుఁ జిత్తాకర్షముగ నుండునట్లు పౌరాణికకథలను దీసికొని భక్తిరసోత్పాదనముకొఱకిట్టి మార్పులను గావించుచుందురు. సర్వజ్ఞుఁడగు శ్రీరాముఁడు నిద్రయందుండినమాత్రమున నీవృత్తాంతమును దెలిసికొనలేకుండుట అసంభావ్యము. అయినను సామాన్యయుక్తికిట్టి తెలియమి సరిపోవుచున్నది గావున నీమార్పులన్నియు స్వాభావికముగనుండినట్లగపడుటయుఁ దన్మూలముగఁ గథాకథనము రమణీయతరముగనుండుటయు సమకూడెను.

మఱియొకవిశేషము :— కాలవిలంబనముచే రసోత్సుకత దగ్గించెడి దీర్ఘవర్ణనలను జేర్చక కథేతివృత్తమందలివిషయములు వేవేగముగ జరిగినట్లభివర్ణించి ప్రబంధకవులవర్ణనాచాపల్యమునకు లోనుగాక సముచితరీతిని విషయములనుగూర్చుటకు మాత్రమే కొద్దిపాటివర్ణనలనుజేర్చి తనయనల్పకావ్యశిల్పితనమును జూపింపఁగల్గెను. ఈవిశేషము దగ్గుపల్లి దుగ్గన్నయందును మాదయ్యగారిమల్లన్న యందునుగూడఁ జూడఁగలము. రసవంతమగుకథానిర్మాణమే ముఖ్యోద్దేశముగానుండిన నీముగ్గురు మహాకవులు నొకేమార్గమునవలంబించిరి. కాని వారివారిప్రతిభాతారతమ్యములనుబట్టి వారిశిల్పితనమందును తారతమ్యమగుపడుచున్నది. రసావిష్కరణముకొఱకు సమయోచితవస్తుభావసంఘటనముఁ జేసి తదనురూపదృశ్యసాధనములుగ స్వాభావికవర్ణనల నచ్చటచ్చట బొదివి, సంతత హృదయాహ్లాదకరమగు కథాసంవిధానము చేయుటయందు దుగ్గకవి

యద్వితీయుఁడని మున్నే చూపించితిని. తాదృశంబగు ప్రతిభాగౌరవ మీమహాకవియందును కించిన్న్యూనముగఁ గాన్పించుచున్నది. ఈయుభయులును మొత్తముమీఁద మల్లనకంటెఁ బై చేతివారని చెప్పక తప్పదు. కావ్యశిల్పితనమున మాడయ్యయు నాంధ్రమహాకవులకుఁ దీసిపోనివాఁడని చెప్పవచ్చును.

## శైలి

ఈకావ్యమందలి శైలీవిషయమునఁగూడ మాడయ్యకవి కొంత వఱకుఁ బ్రత్యేకవ్యక్తిత్వము గనుపరచెను. ఆంధ్రప్రబంధరచనకు నూతన యుగమును గల్పించి ప్రబంధశైలియను నొకదానిని వాడుకలోనికి దెచ్చిన శ్రీకృష్ణదేవరాయలకు దేశకాలసంబంధమునఁ గడుసమీపస్థుఁడు గానుండిన మాడయ్య రాయలకాలపు ప్రబంధశైలి నాదరించుటలేదు. పెద్దన్న, తిమ్మన్న, ధూర్జటి, నృసింహకవి మున్నగు ప్రథితకవివతంసులు జూపినమార్గ మీతనికవిత్వమందు గానరాదు. మాడయ్యకవియెంతయుఁ బ్రాచీనులగు కేతన, మారన, మాచన, విన్నకోట పెద్దన మొదలగు కవివరేణ్యులయొక్కయుఁ, దనకాలమందలి కవిజంటయైన నంది మల్లన, ఘంట సింగన్నలయొక్కయుఁ గవితాఫక్కి ననుకరించెను. ఈతని శైలి మృదుపదగుంఫితమై సరళభావములుగలిగి స్వాభావికవర్ణనలతో నలరారుచు శబ్దాలంకారములులేక ధారాళముగను బ్రసన్నముగను బ్రవహించుచుండును. పిల్లలమఱ్ఱివానివలెను, అల్లసానివలెను నుచ్చైస్స్వరమునఁ బ్రతిధ్వనించు నుత్తుంగతరంగిణివలెనుండక మృదుల స్వనముతో సన్నసన్నముగఁ బ్రసవించుచుండెడి స్రోతస్వినివలె శ్రవణపేయముగ నొప్పారుచున్నది. ఈతని శైలినిగుఱించి కృతిపతియగు గోపమంత్రిజెప్పిన యభిప్రాయము సర్వవిధముల యథార్థముగ నున్నట్లు నాకుఁ దోఁచినది.

చ॥ రసములు తొమ్మిదింగలుగు రమ్యతవార్థమశబ్దమాధురీ
విసరము లుల్లసిల్ల నతివిస్ఫుటలక్షణమార్గిఁ బ్రౌఢిమన్
రసికుల నెమ్మనంబు లనురాగముఁ బొందఁ దెనుంగుభాస నిం
పెసఁగఁగఁ జెప్ప నేర్తు సరియెవ్వరునీకును మాదధీమణీ !

భావములు శిరీషకుసుమసుకుమారములు. శబ్దములు ద్రాక్షాఫల సమములు. రసములు స్వభావసిద్ధములు. వర్ణనములు సర్వజనాదరణీయములు. ఇట్లన్నివిధముల మనోజ్ఞముగా నెగడొందుచుండిన శైలిని సాధించి, ప్రబంధకవులయందు మిక్కుటముగఁ గాన్పించెడువర్ణనాసక్తియు నలంకారాన్వేషణమును లేకుండఁ దన యఖండకవితాప్రజ్ఞను సమయోచితముగ నిరోధింపఁగలిగిన యనల్పకావ్యమర్మజ్ఞతఁ జూపియుండుటెంతయుఁ బ్రశంసింపఁదగినవిషయము గదా !

దగ్గుపల్లి దుగ్గనకుఁ జోడుకోడైయె యీతఁడు మాదయ్యగారి మల్లన్నకంటె సరసపదవిసరములను, భావనాచమత్కారములను వెదచల్లఁగలిగిన దిట్ట; భావజ్ఞుఁడును సమయజ్ఞుఁడును సర్వదాయుచితజ్ఞుఁడునైన లోకజ్ఞుఁడు. కావునఁ దన నూతనకల్పనమంతయు నూతనమని దోపనీయక యథార్థముగ జరిగినదానివలె నగపఱ్చగలిగెను. అన్నగారు సంస్కృతమునఁ గొప్పపౌరాణికుఁడు. తానాంధ్రమునఁ దద్విధమైన కవి ప్రకాండుఁడు.

శైలీమార్దవమునకు గ్రంథమంతయు నేకోదాహరణముగఁ జెప్ప నొప్పుగనున్నను మచ్చునకుఁ గొన్నిపద్యముల నచ్చటచ్చటనేర్చి పొందుపరచెదను.

రామలక్ష్మణుల యపహరణ సందర్భమందలి తగు కరుణారసపూరితములును, నలంకరణసంభృతములునగు బద్యములలో వీనినిఁ జూడుఁడు.

చ. అన విని వజ్రఘోషముల కద్రితలం బడునట్లు భీతిచే
నవయముభీతిఁ బొంది యతఁ డల్లనఁ దెప్పిలిమాచిపల్కె నే
వివరలు లున్నచోటికిని వెళ్ళఁడుపోయితినయ్య చెల్లబో
విను మదినమ్మి యుండఁగను నీవును నేమతిశయ్య పావనీ !

ఉ. కావిటముండఁగాను మతితోటికిఁ బల్మరు రానటంచు నే
నావలనీవలం దిరిగియాడఁగ నాకలరూపుఁదాల్చి పై
రావణుఁడేగుదెంచి మనరాజుల నెత్తుకపోయెనో కదా
పావని ! యేమి సేయుదును భావము నోవలజాలిపుట్టెడున్.

సీ. చంద్రుఁడులేనట్టి శర్వరిభంగిని
వనజబంధుఁడులేని దినముపగిది
ధవుఁడువాసిన పద్మదళనేత్రచందాన
జనపతిలేని రాష్ట్రంబుపగిది
జలములులేనట్టి జలజాకరముభాతి
విద్యయేమియులేని విప్రుమాడ్కి
నుడిపోయియుండిన యుర్వీరుహముపోల్కి.
ప్రాణంబులేని గాత్రంబులీల

శుభములనుబాసి, సర్వంబు శూన్యమగుచు
సోలిపడియున్న కపిసేనఁజొచ్చి చూచి
మిమ్ముఁబొడగానకక్కడ మిగులభీతిఁ
బుడమిపైఁబడి పెనుమూర్ఛఁబొందితేటి.

సీ. అయ్యయో ! మనరాజహవ్యవాహనులను
గాల్చెగా రాక్షసకాననంబు
చెల్లబో ! మనరాజసింహపోతంబుల
మట్టెఁగా దానవమత్తగజము
కటకట ! మనరాజఖగకులాధీశులఁ
గఱచెఁగా దైత్యోరగంబు వెలఁగి
అక్కట ! మనరాజహంసమండలములఁ
గప్పెఁగా దైత్యాంధకారమెలమి

ఎంతశౌర్యంబుగల్గిన నేటికొక్క !
యమరపతికైన హరికైన వజానికైనఁ
బూర్వకర్మానుభవములఁ బొదలకేల
దప్పదనుమాట లిప్పుడు తథ్యమయ్యె.

సీ. మైరావణుం డను మరకాఁడు చనుదెంచి
యొకపైనమాయల యోడ నెక్కి
మద్వాలవ ప్రాబ్ధి మాటమాత్రనె దాఁటి
తిరుచరద్వీపంబుఁ దనరఁ జొచ్చి
పొందుగాఁ దనచేతి మందుమంత్రంబుల
సరకులు పచరించి చాలఁ జల్లి
రామలక్ష్మణరాజ రత్నంబులను గొంచుఁ
దనదీవి కేగనే దండిలోడ
నేమి సేయుదు సాధింప నేమి వెరవు
నిమిషమాత్రంబు గడచిన నీచదనుజుఁ
డకట వధియింపకుండునే యనుచు మఱియు
భూమిపై వ్రాలి పెనుమూర్ఛ నొంది యుండె.

—: వీరాంజనేయ వర్ణనము :—

సీ. భానుబింబంబులు పండెండు నొక్కటై
తరుచరరూపంబుఁ దాల్చెనొక్కొ
మొగిమీఱ నగ్నులుమూఁడును నొక్కటై
యగచరాకృతి యొప్పనయ్యె నొక్కొ
కడుజవంబున నేడుగాడ్పులు నొక్కటై
ప్లవగపుంగవురీతిఁ బరఁగె నొక్కొ
హరునిచిచ్చుఱకన్ను గరళంబు నొక్కటై
యలవడఁ గపిచంద మయ్యె నొక్కొ
యనుచు దైతేయసైన్యంబు లడరి చెదరి
యల్లకల్లోలమై పాఱ నాంజనేయుఁ

దుగ్రదుర్వారపటునిష్ఠురోగ్రభీమ
వాల మంకించి సంగరలోలుఁ డగుచు.

— పతివ్రత మాతంగి వర్ణనము —

సీ. ఇరుగేలంకుల దైత్యతరుణీకదంబంబు
గొలువ గద్దియమీఁద నలరుదాని
సలలితసత్కళా సౌభాగ్యరేఖలఁ
జాలోమిరొప్పులఁ బఱగుదాని
నవరత్నమయభూషణములకుఁ దనమూర్తి
భూషణంబైయుండఁ బొలుచుదాని
మృదుపాణిపద్మంబు మెఱుఁగుఁజెక్కిటఁ దాల్చి
తనభర్తసేమంబుఁ దలఁచుదాని
వృద్ధపుణ్యాంగనలు చెప్ప వీను లలరఁ
గథలువినుచున్న ధర్మమార్గంబుదానిఁ
గలితతన్వంగి మాతంగిఁ గాంచి మ్రొక్క
హస్తములుమోడ్చి కడుఁ గంపితాత్మ లగుచు.

# రసము

మాడయ్య యీగ్రంథమును భక్తిరసప్రధాన మగుఁ గావ్యముగా నుండినట్లు యోచించినను నిజముగాఁ గథేతివృత్తమునుఁ బట్టియు, కథాకథనమును బట్టియు నిది వీరరసప్రధాన మైనదని చెప్పవలసియున్నది. ఆంజనేయుని శ్రీరామభక్తిశక్తి నిరూపించుటకుఁగా నీకథను అగస్త్యమహాముని చెప్పెను. వాయుపుత్రుఁడు తనయప్రతిమప్రతాప మంతయు శ్రీరామచరణకమలసేవానిరతత్వమునఁ బొందఁగలిగె నని మనకు స్పష్టము చేసెను.

చ. అనిలతనూభవుండు వెస నంతకుమున్న నిశాటు పైవఁ బ
ట్టిన తనిచేతికొండఁ గని డెందములో భయ మింత లేక య

య్యినకులుఁ డైన రాఘవుల కే నిజభృత్యుఁడ నైతి నేనియుం
జని యిది వానిఖడ్గమును జయ్యనఁ ద్రుంచెడుఁ గాక యుగ్రతన్.

క. అనుచున్ వైచె నతం డె। త్తినచెయ్యిఁ గదల్పకుండ దిక్కులు వడఁకన్
జని ఖడ్గముఁ దురిమార్చెను । జనపర నీనామమంత్రసామర్థ్యమునన్.

అని తనరామభక్తిప్రభావము నూతఁ జేసికొని దారుణరణమున మైరావణునిఁ జంపి విజయము నొందెను. కాబట్టి యిక్కథకు రామభక్తియే ప్రాణము. అట్లయినను కథాకథనమందుఁ గవి తలఁచు వీరరసవర్ణనలను ననంతరము తత్సంబంధమైన రౌద్రభీభత్సములను వర్ణించుటచే నీగ్రంథము ముఖ్యముగ వీరరసద్యోతకమని చెప్పవలసియున్నది. తొలుత నుగ్రరాక్షసవీరులగు రావణమైరావణుల సంభాషణమును, తరువాత మైరావణునిసేనానాయకుల వీరాలాపములును, పదంపడి, హనుమన్మత్స్యవల్లభుల ఘోరబాహుయుద్ధమును, దుట్టతుదకు హనుమన్మైరావణుల యద్భుతసంగ్రామమును వరుసక్రమమున వర్ణించుటచే వీరరసమునకు విరివిగు నవకాశ మేర్పడినది. శృంగారరస మించుక నొకానొకచోటఁ బొడసూపుచున్నది. మైరావణుని భార్యయగు మాతంగి తన ప్రాణనాథునిఁ జూచుటకు వచ్చినప్పుడు కొంచెము శృంగారరసము దాల్చిఁది. అచ్చటఁ గవి తనసహజలాలిత్యమును ద్విగుణీకృతము చేసెను.

ఉ. అన్నవ కౌనుదీఁగ యసియాడఁగఁ బయ్యెద పిక్కటిల్లుచున్
జన్నులు తొంగలింప మరుసానను దిద్దినరూపులో యనన్
గన్నులు బిత్తరింపఁ గనుగం దొకయించుక లేక తిన్ననై
పున్నపుఁజంద్రు నొప్పిదముఁ బోలెడు మోమున నవ్వు దేఱగన్.

ఉ. మారునిమోహనంబునకు మాడ్కిని బాణము లైదు నున్న బం
గారపుబొమ్మరీతిఁ దొలుకారుమెఱుంగుల ప్రోకభంగి శృం
గారరసంబునం దొలచికట్టిన పువ్వులయెత్తుభాతి న
న్నీరజగంధి వచ్చి తగ నిల్చెను బ్రీతిని భర్తముందటన్.

(మైరా. ఆశ్వా. ౧.)

మైరావణునిమరణము విని మాతంగి విలపించునప్పుడు కరుణారసము చక్కఁగాఁ బోషింపఁబడినది. యుద్ధానంతరమున సమరాంగణమును వర్ణించుచు రౌద్రభీభత్సభయానకములు మేనుదాల్చినట్లు రణరంగమును జిత్రించెను. ఇట్లు నవరసములును "రమ్యనవార్థసుశబ్దమాధురీవిసరము లుల్లసిల్లు"న ట్లభివర్ణించుచుఁ బ్రజ్ఞాబంధురుఁడైన మహాకవియను బిరుదమున కీతఁడుఁ దగినవాఁ డయ్యెను. ఇంతసమర్థుఁడు దేశాటనము చేసి విజయశీలుఁ డగుట యరుదే?

## —* వీరరసవర్ణనము *—

ఉ. అంబుజసంభవాదులకు నైనను దప్పక చూడరాని యీ
యంబుజనాళ మొక్కఁడవు నాత్మ నొకింతయు భీతిలేక గ
ర్వంబునఁ జొచ్చి పోయెదవు వానరకీటమ నిన్ను నింక మ
త్స్యంబులపాలుసేయ కిటు సాగిచనంగఁ దొలంగనిత్తునే.

మ. అనిన వ్వాయుతనూభవుండు విని యుద్యత్క్రోధకాలాగ్నిలో
చనుఁడై యాతనిఁ జూచి మండి సమరోత్సాహప్రతాపస్ఫుట
ధ్వనవాలంబునఁ గంధరంబు బిగియంగాఁజుట్టి పద్మాకరం
బున ముంచెత్తి విదిర్చి వేగ దరికిం బోవైచె మూర్ఛిల్లఁగన్.

* * *

* * *

ఉ. వైచిన లేచి ధీరతను వానరనాథుఁడు మత్స్యవల్లభున్
జూచి యదల్చి వక్త్రమున శోణితధారలు గ్రమ్మ నంఘ్రులం
దాచె నురంబు దాని కటు తద్దయు గంపమునొంది లేచి వాఁ
డేచినయుల్కతోఁ గపికులేశ్వరుఁ గొట్టెఁ జలింప కింతయున్.

మైరా. ఆశ్వా. ౨.)

# ఉపసంహారము

ఆంధ్రమహాకవులలో ననేకులపేర నొక్కొక్కగ్రంథమే మనకుఁ గాన్పించుచున్నది. ఈమహాకవు లందఱు సామాన్యముగఁ గవితావృత్తి

నాశ్రయించి రాజాస్థానములలో జీవనముఁ గడుపుచుండెడివారు. కవన వృత్తియే ముఖ్యజీవనోపాయముగ నుండిన యీమహాకవులు తమజీవిత కాలములో నొక్కగ్రంథముఁ దప్ప మఱేదియును వ్రాసియుండరని తలంచుట కేవలము హాస్యాస్పదమని విజ్ఞులు తెలంపవలసియున్నది. కావున వా రనేక కావ్యములను రచించియే యుందురు. అయినను మనదురదృష్ట వశమున నవియన్నియు నశించియుండెను. *

మాడయ్యకవి యాంధ్రదేశ మంతయుఁ దిరిగి పెక్కుసంస్థానములలో బహుమతు లందినవాఁడు. కావునఁ గవివృత్తియే యతనిముఖ్యజీవనాధారమై యుండెను. అట్టివాఁ డెన్నియో కావ్యములను రచించియుఁ, జెప్పియు నుండును. అవన్నియు విస్మృతరసాబ్ధిలో మునిఁగిపోయెను. పెద్దన్న, తిమ్మన్న, ధూర్జటి మున్నగువారికిఁగూడ నిట్టిదుర్గతియే పట్టినది. ఆంధ్రసరస్వతియొక్క దౌర్భాగ్యము కడుశోచనీయము గదా!

---

* మనభారతదేశమునకుఁ బ్రక్కఁగానున్న చీనాదేశములో గ్రంథముద్రణ విధానము వేయివత్సరములకుఁ బూర్వమే కనిపెట్టఁబడినది. ఆదేశముతోఁ దఱచు రాకపోకలుఁగల మనదేశ మావిధానమును నేర్చికొనకుండుటయు ననేకవేలమైళ్ళదూరమున నున్న నైరోపాదేశములనా రారహస్యమును సంగ్రహించి తమదేశములందుఁ గొన్నిశతాబ్దములక్రిందటనే యుపయోగించుటయుఁ, దన్మూలముగఁ దమవాఙ్మయము నందలి గొప్పగ్రంథముల ననేకప్రతు లతిశీఘ్రముగ సిద్ధముఁజేసి వానిని నశింపకుండఁ గాపాడుకొనుటయుఁ జూడఁ బ్రాపంచికవిషయములలో మన మెంత మతిహీనులమై యుంటిమో తెల్లమగుచున్నది. వైదికనిష్ఠలో మునిగిన మనకుఁ దాళపత్రలేఖనమే మొన్నమొన్నటివఱకు శరణ్యమైనది. ఆంగ్లేయప్రభుత్వము దేశమున నాటుకొనిన తరువాత మనము మిథ్యాప్రపంచ మనెడు భ్రాంతిని వదలి నూతనవికాసములను బొందఁగల్గితిమి. ఆవికాసములలో ముద్రణాలయస్థాపన మొకటి. ముద్రణయంత్రముల సహాయమున నిపుడు గొన్నిప్రాచీనకవుల యుద్గ్రంథము లుత్సన్నము గాకుండ నిలుపుకొనుచుండుటయు, నాధునికకవుల గ్రంథముల నన్నిటిని ననేకసంపుటములుఁగాఁ గూర్చి ముద్రించుటయుఁ జేయఁగలుగుచున్నాము.

మైరావణచరిత్రము కృష్ణదేవరాయల కించుకపూర్వము రచింపఁబడి యుండుటచే మనుచరిత్ర పారిజాతాపహరణములకంటెఁ బ్రాచీనమని తలంపవలసియున్నది. సంస్కృతవాఙ్మయమున మాడయ్యకాలమునఁ గాని, తత్పూర్వమునఁ గాని మైరావణచరిత్రమను పేరునఁ గావ్యముఁ గాని, నాటకముఁ గాని గాన్పింపదు. ఆకారణమున నిది యాంధ్రీకరణమని చెప్పుటకు వీలులేదు. దీనికి గీర్వాణమాతృక దొరికెడివఱకు దీనిని స్వతంత్రకావ్యముగానే పరిగణింపవలసియున్నది. కావున మనుచరిత్రముకంటెను, పారిజాతాపహరణముకంటెను దీనికే ప్రథమాంధ్రప్రబంధ మను పసదనము ముఖ్యముగాఁ జెల్లవలసియున్న దని నా యాశయము.

మైరావణచరిత్రము పరిమాణమునఁ జిన్నదైనను ప్రామాణ్యమున మిన్నయే. కృష్ణరాయల కించుకపూర్వము రచింపఁబడిన దగుటచే రాయలవారి భావముద్రణము దీనియందులేక తత్పూర్వకవిత్వపుసొంపులుమాత్రమే పొడసూపుచున్నవి. రాయలకాలఁపుఁ గవులు శృంగారమునకుఁ బ్రాముఖ్యము నిచ్చి తమకథలయం దది లేకపోయినను దాని నెట్లో తెచ్చిపెట్టి తమరసజ్ఞతఁ జూపవలసియుండెడిది. మైరావణచరిత్రమం దట్టిది గాన్పింపదు. భాషావిషయమునఁగూడఁ గృష్ణరాయల కాలఁపుఁ గవుల శబ్దాడంబరరీతియుఁ గాన్పింపదు. ఈహేతువులనుబట్టి మాడయ్య ప్రబంధము రచించినవాఁడయ్యును బౌరాణికకవులగుఁ బ్రాచీనుల సంప్రదాయప్రతిష్ఠలను దనగ్రంథమున నిలుపుటచే నాంధ్రవాఙ్మయమునఁ బ్రత్యేకస్థానము నలంకరింప సమర్థుఁ డయ్యెను. ఆంధ్రకవితాపిపాసువు లీకవివరేణ్యుని మృదులలలితఫణితములను జదివి మురియుదురు గాక !

# మూఁడవ అధ్యాయము

## కృష్ణదేవరాయలు—ఆముక్తమాల్యద

—:0:—

శ్రీకృష్ణదేవరాయలు మహాయోధాగ్రేసరుఁడే గాక మహాపండితుఁడును, గొప్పకవీశ్వరుఁడు నై యుండెను. ఈమహారాజునకుఁ దన యాస్థానపండితబృందము "సాహిత్యసమరాంగణసార్వభౌమ" యను నుత్తమబిరుదము నొసంగినది. ఈవిధమయిన యుత్కృష్టస్తుతికి శ్రీకృష్ణదేవరాయ లెంతయుఁదగినవాఁడె. తాను స్వయముగ నాంధ్రగీర్వాణములఁ గావ్యగ్రంథముల రచియించియు, గౌరవించియుఁ దనక్రింది సర్దారులచే నట్టిగ్రంథరచనను వెలయింపఁజేసియు నిత్యాదివిధముల వాణీసేవ నొనరించెను.

శ్రీకృష్ణదేవరాయల యాస్థానము దాస్థానకవీశ్వరుఁడును, మనుచరిత్ర రచయితయు నైన 'అల్లసాని పెద్దనార్యుఁడును, పారిజాతాపహరణ గ్రంథకర్తయగు ముక్కు తిమ్మన్నయు, రాజశేఖరవిలాస కావ్యకర్తయగు మాదయ్యగారి మల్లన్నయుఁ, గాళహస్తిమహాత్మ్యము రచించిన ధూర్జటికవియు మున్నగు నాంధ్రమహాకవులును, వెంకటనాథ, స్వయంభూనాథ, ఏకామ్రనాథ ఇత్యాది సంస్కృతమహాకవులును, రాయల యాజ్ఞానుసారముగఁ గన్నడ భారతమునుఁ బూర్తిఁజేసి కర్ణాటకవికుల సార్వభౌమ యను బిరుదును సంపాదించిన మహాకవి తిమ్మణ్ణయుఁ గృష్ణదేవరాయల సింహాసనము నెక్కి కొలఁదికాలము సామ్రాజ్యవైభవ మనుభవించిన వ్యాసరాయరును మొదలగు కన్నడమహాకవులును కుమారసరస్వతి జ్ఞానప్రకాశుఁడు హరిదాసుప్రభృతులగు నటవమహాకవులును' శ్రీకృష్ణదేవరాయల యభిమానసన్మానములకుఁ బాత్రులై యాతనియాస్థానము నలంకరించియుండిరి.

కృష్ణదేవరాయలు ప్రథమమున సంస్కృతభాషలోఁ గొన్ని ప్రబంధముల రచించినట్లు తెలియవచ్చుచున్నది. * విజయవాడ సమీపముననున్న శ్రీకాకుళక్షేత్రమందలి యాంధ్రమధుమథనుని సేవింపఁబోయినప్పు డాయాంధ్రజలజాక్షుఁడు శ్రీకృష్ణదేవరాయలం జూచి యిట్లానతిచ్చె నఁట.

సీ. పలికి తుత్ప్రేక్షోపమలు జాతి పెంపెక్క
రసికు లౌనన మదాలసచరిత్ర
భావధ్వనివ్యంగ్యసేవధి గాఁగ జై
ప్పితివి సత్యావధూప్రీణనంబు
శ్రుతిపురాణోపసంహిత లేర్చి కూర్చితి
సకలకథాసారసంగ్రహంబు
శ్రోత్రత్రిపుచ్ఛటలు విచ్చుగ రచించితి
సూక్తినైపుణి జ్ఞానచింతామణికృతి
మఱియు రసమంజరీముఖ్యమధురకావ్య
రచన మెప్పించుకొంటి గీర్వాణభాష
నంధ్రభాష యసాధ్యంబె యందునొక్క
కృతివినిర్మింపు మిఁక మాకుఁ బ్రియము గాఁగ.

(ఆముక్తమాల్యద)

దీనినిబట్టి చూడఁ గృష్ణదేవరాయ లీక్రిందఁ బేర్కొన్న గ్రంథములను సంస్కృతమున వ్రాసె నని తెలియవచ్చుచున్నది. 1 మదాలసచరిత్రము, 2 సత్యావధూప్రీణనము, లేక, సత్యభామాసాంత్వనము, 3 సకలకథాసారసంగ్రహము, 4 జ్ఞానచింతామణి, 5 రసమంజరి, 6 ఇంకఁ గొన్ని యితరగ్రంథములు. ఈగ్రంథములలో నిప్పటి కెవ్వియు లభింపలేదు. చెన్నపట్టణమునఁ బ్రాచ్యలిఖితపుస్తకాగారమునఁ గృష్ణదేవరాయలు రచించినదని జాంబవతీపరిణయ మను సంస్కృతగ్రంథ మున్నది.

* ప్రస్తుతము కృష్ణాతీరమందలి బెజవాడ.

పైనఁ బేర్కొనిన గ్రంథములు వ్రాసినకాలమున నీరాజకవి యాంధ్ర మున నేగ్రంథమును రచించినట్లు కాన్పింపదు. ఆవిషయము పైపద్యము లో విస్పష్టముగనున్నది ఆంధ్రవిష్ణుఁడే యీకవిపుంగవుని హెచ్చరించుచు నిన్ని సంస్కృతగ్రంథములు రచించిన కవీంద్రునకు నాంధ్రమున నొకగ్రం థము వ్రాయుట కష్టముకాదు. కాఁబట్టి తనకొక యాంధ్రగ్రంథమును వ్రాసి యిమ్మని యాజ్ఞాపించెను. కనుక నాంధ్రవిష్ణుని యాజ్ఞానుసారము గా వ్రాసినగ్రంథ మీకవియొక్క ప్రథమాంధ్రగ్రంథమే యని స్పష్టము. ఆగ్రంథమే యీ 'ఆముక్తమాల్యద, లేక, విష్ణుచిత్తీయము.'

సంతతసన్నద్ధసమరయానాసనసంరంభములలోను, మాతంగతురం గస్యందనపదాతిసంకులస్కంధావారసంఘట్టనములలోను, సర్వదా కాల ముఁ గడపవలసివచ్చిన యీసమరాంగణసార్వభౌమునకు నేతద్గ్రంథ రచన కెట్లనుల్లంఘనీయప్రతిజ్ఞ చేయవలసివచ్చినదో యీరాజకవియే తనగ్రంథమందలి యవతారికభాగమున నుడివెను. ఈవాక్యము లేయాం ధ్రునిడెందమున నద్భుతామోదకౌతుకము లుద్భవింపఁజేయఁజాలవు?

"మున్నొక కళింగదేశవిజిగీషామనీషన్ దండెత్తిపోయి విజయ వాటిం గొన్నివాసరంబు లుండి శ్రీకాకుళనికేతనుం డగు నాంధ్రమధు మథను సేవింపంబోయి హరివాసరోపవాసం బచ్చటఁ గావింప నప్పుణ్యా రాత్రిచతుర్థయామంబునఁ దదంధ్రజలజాక్షుఁడు దనకలలోఁ గాన్పించి యాంధ్రభాష నింకఁ గృతి వినిర్మింపు" మని యానతిచ్చె నఁట. అప్పు డీనరనాథకవి "ఎన్నిను గూర్తునన్న విను, మేమును దాల్చినమాల్య మిచ్చు నప్పిన్నది రంగమందయిన పెండిలిసెప్పు" మని యాంధ్రవల్లభుఁ డీభూవల్లభున కాజ్ఞయొసంగె నఁట.

కావున నీగ్రంథముయొక్క యుత్పత్తి మహాద్భుతమయినది. ఆంధ్రవిజయలక్ష్మి తనతమ్మి కేలధరించిన కావ్యాంబుజమే యీగ్రంథము. కృష్ణరాయలు శాంతచిత్తుఁడుగా విజయనగరమం దంతఃపురకామినీజన పరివృతుఁడై శృంగారకేళీవిలాసంబుల వినోదించుచుఁ దదీయాస్థానపండిత కవిరాణ్మండిత సభాసీనజేగీయమానన్యత్యగీతంబుల కుపొంగుచుఁ నీ గ్రంథరచనమున కుపక్రమించుటలేదు. ఆహవభూమిసాన్నిధ్యమున ఘిరంగి మోతల గుండెయలజడులలో నీగ్రంధము ప్రారంభితమైనది ! అట్టి మృతిజీవనసందిగ్ధసమయములే కదా మహామతుల లోకోత్తరకావ్యకరణ చణత్వంబునకు సాధనసమయంబులు సంధానించుచున్నవి.

కావున నీగ్రంథము విజయనగరములోఁ గాక విజయవాడలోఁ బ్రారంభించినాఁడు. గ్రంథరచనాకాలనిర్ణయము కొన్నిశిలాశాసనాదిక సహాయముచేఁ జరిత్రకారు లిట్లు చేసియున్నారు. దీనినిఁ గుఱించి మ. రా. రా. శ్రీ కుందుర్తి ఈశ్వరదత్తు, బి. ఏ. గారీక్రిందివిషయము నాకుఁ దెలియఁజేసినారు. "ఆముక్తమాల్యద" పీఠికలో శ్రీకృష్ణదేవ రాయలు తాను శ్రీకాకుళనికేతనుఁ డగు నాంధ్రవిష్ణువును సేవింపఁబోయి హరివాసరోపవాస మచ్చటఁ గావించితి నని చెప్పుకొనెను ఆకాలమున శ్రీరాయలవారు శ్రీకాకుళములో నాంధ్రవిష్ణువునకు నొకదానముచేసి శిలాశాసనము చెక్కించిరి. కావున నాశిలాశాసనసహాయమున శ్రీరాయలవారి శ్రీకాకుళతీర్థయాత్రకాలము నిర్ణయింపఁబడినది. రాయలవారు బహుధాన్యనామసంవత్సరకుంభసంక్రమణకాలమునందు నాంధ్రవిష్ణువు నారాధించినట్లు విస్పష్టముగ నున్నది. ఈకుంభసంక్రమణకాలము రాయలు చెప్పినహరివాసరముతోఁ గూడ సరిపోవుచున్నది. అనఁగా క్రీ॥ శ॥ 1519 సం॥ జనవరి 26 తేదీని రాత్రి సుమారు

50 గడియలకుఁ గుంభసంక్రమణపుణ్యకాలము. మఱునాఁడు కుంభసం క్రమణపుణ్యదినము. అనఁగా క్రీ॥ శ॥ 1519 సం॥ జనవరి 27 తేదీని రాయలవారు హరివాసరోపవాసము గావించిరి. ఆదినము మాఘబహుళైకాదశి యైనది. కాఁబట్టి 27–1–1519 తేదీతో సరియైన మాఘబహుళైకాదశినాఁడు శ్రీకృష్ణదేవరాయలవారు 'ఆముక్తమాల్యద' ప్రబంధరచనకుఁ గడంగిరి.''

ఈప్రకారము నేతద్గ్రంథనిర్మాణకార్యము కృష్ణదేవరాయలచే నుద్యమింపఁబడిన స్థలము కాలము నితరసాంబంధికసందర్భములు మున్నుగునవి సూక్ష్మాంశసహితముగ వర్ణింపఁబడినను నీకర్తృత్వవిషయము, వివాదాస్పదమై పండితావళిమానసంబులఁ గొంత కలఁత పుట్టించుచున్నది. ఈప్రబంధమును గృష్ణరాయలవారే రచించి రని కొందఱును, కాదు కా దల్లసాని పెద్దన్నగారు రచించిరని మఱికొందఱును వాదించుచున్నారు. ఈవాదప్రతివాదములకుఁ గారణము, ముఖ్యముగాఁ గ్రీడాభిరామకర్తృత్వవిషయమందువలెఁ గొందఱి లక్షణకవుల యుదాహృతి సూచనలును బండితసంప్రదాయప్రసంగములును మాత్రము.

ఈచర్చనుగూర్చి విపులముగ వ్రాయుటకు నా కిష్టము లేదు. కారణ మేమనఁ, గృష్ణరాయలకర్తృత్వము నిరసింప నుద్దేశించిన పక్షము వారును నాచక్రవర్తి యాంధ్రదేశమునకు నాంధ్రభాషకు నొసంగిన చిరంతనస్మరణీయసపర్యను సాకల్యముగఁ జూచి యేతద్గ్రంథకర్తృత్వము నాతనినుండి తప్పించుటకు సాహసింపలేకున్నారు. కావున వారిపక్షము నవలంబించినవారి సంఖ్యయుఁ దక్కువే; వాదనసామగ్రియుఁ దక్కువే. తత్కారణమున నీవిషయమును సామాన్యమాత్రముగ సూచించి విడిచెదను. ఈవివాదమును సంపూర్ణముగాఁ దెలిసికొనఁ దలఁచిన

వారు కీ. శే. శ్రీవేదము వేంకటరాయశాస్త్రులువారు తమ 'సంజీవనీ' వ్యాఖ్యసమేతముగముద్రింపించిన యాముక్తమాల్యదగ్రంథమునకు వారు రచించిన యపారపాండితీప్రకటితమైన పీఠికను జదివినఁ దెలిసికొనఁగలరు. ఈవిషయమును శాస్త్రులువారు బహుసమర్థతతోఁ జర్చించి వారియస్నిగ్ధనిబద్ధాద్భుతవైదగ్ధ్య మల్లసాని పెద్దన్నగారిపక్షమునకు ములుమొన సూచించుచున్నను, లోకాభిప్రాయమును మానవపరికృతి విలక్షణజ్ఞానము ననుసరించి శ్రీకృష్ణరాయలపక్షమునఁ దుదకు నిలిచిరి. పూర్వాచారవితండవాదము ననుసరింపక కళాపరిపూర్ణు లగు శ్రీశాస్త్రులువారు తమ యమేయవాఙ్మయవిజ్ఞానధౌరేయమును బూన్చికొని పండితచక్రవర్తి పక్షమునకుఁ బరిబలసహాయము నొనరించినందులకు నాంధ్రు లందఱు వారియెడఁ గృతజ్ఞతాసక్తులయి యుండవలసినది.

ఈవాదమందలి ముఖ్యవిషయములు, 1 రాజు లేడ ? కావ్యరచన యేడ ?

రాజులును జక్రవర్తులును గ్రంథరచనకు సహజముగ నసమర్థులను మతము కొంతమంది విద్వాంసుల మనస్సులలో దాఁగియున్నది. కావున నట్టివా రవనిపతులు కేవలము లక్ష్మీపూజకేగాని సరస్వతీపూజకుఁ జాలని వారని నమ్ముచున్నారు. ప్రాయశః యుద్ధావనిలో నిరంతరముఁ బ్రయాసపడవలసిన పృథ్వీశులకు సారస్వతసేవావకాశ మాకాశకుసుమ మని వారి గట్టినమ్మకము.

ఈవిషయముగుఱించి ప్రపంచచరిత్రమును బరిశోధించి చూచి తరువాత భారతవర్షచరిత్రమును గూడఁ బరికించెదము. మహావీరులు మహామహీభృతులు నెచ్చటనైనఁ గావ్యరచనాధురంధరు లగుటకూడఁ గాన్పించుచున్నదా ? తరిచిచూచెదము.

గ్రీసుదేశమందలి మహాసేనానులలోఁ బ్రథమగణ్యుఁ డగు మహా అలగ్జాండరు తనసమరయాత్రలలో నిత్యము గవులను బండితులను శాస్త్రజ్ఞులను వెంటఁ దీసికొని వారితో సారస్వతగోష్ఠిఁ జేయుచుండె నని చరిత్రకారులు చెప్పుచున్నారు. అరిస్టాటిల్ మహాశాస్త్రజ్ఞుని యెడల నామహామహునికెట్టిగురుభక్తి యుండెనో యెల్లరకుం దెలిసినవిషయమే. అలగ్జాండరు చాలఁ జిన్నతనములో మరణించియుండుటచే నాతని దిగ్విజయ ఫలము దక్క సారస్వతగోష్ఠిఫలము లోకమున కిచ్చుట కవకాశము లేకపోయెను. తరువాత రోమనురాజ్యములో నలగ్జాండరుతో సమానుఁ డగు దిగ్విజేత యయిన సీజరుచక్రవర్తి యైరోపాఖండము నాసియాఖండములో సాఁబాలు జయించి పాలించుచుఁ 'గామెంటరీల'ను (Commeutaries) పేరువహించిన యుద్ధగ్రంథముల నెన్నింటినో రచించి తనదండయాత్రలను దాను జయించిన దేశప్రజల యాచారవ్యవహారభాషాదికములను విపులముగ నభివర్ణించి ప్రపంచమునకు మహోపకారము నొనరించెను. ఆగ్రంథరాజము లిప్పటికిని ల్యాటిన్ (Latin) భాషకు భూషణములుగా నున్నవి.

జర్మనీదేశపు చక్రవర్తి యయిన మహాఫ్రెడిరికు (Frederick the Great) తనరాజ్యముచుట్టు నున్న ప్రబలశత్రురాజులతో ననేకసంవత్సరములు విసువువిరామములు లేక పోరాడుచు నఖండవిజయలక్ష్మినిఁ జేకొని తనసామ్రాజ్యము నన్నివైపులకు విస్తరిల్లఁజేసి ప్రజాక్షేమము కొఱకు ననిశము పాటుపడుచున్నను వాగ్దేవీకైంకర్యము విడువఁడయ్యెను. చిన్నతనమునుండియు ఫ్రెంచిభాషయం దమితాదరణము గలిగి ఫ్రెంచి కవిపతంసుల స్నేహము సంపాదించి ముఖ్యముగ నానాఁటి కవిసార్వభౌముఁ డగు వాల్టేరుతో నంతేవాససాహచర్యమున మెలంగి

యనేకపద్యకావ్యములను, నంతకంటె హెచ్చుగ గద్యకావ్యములను వ్రాసి, సాహిత్యసమరాంగణసార్వభౌముఁ డయ్యెను. తాను వ్రాసిన గ్రంథములను వాట్టరుమహాకవికిఁ జూపి యాతనిచే సరిపఱిపించుకొని ముద్రించుచుండెను.

ఇఁకఁ జక్రవర్తి నెపోలియన్‌ను గుఱించి విచారించెదము. సామాన్యకుటుంబములోఁ బుట్టి తన యతిమానుష ప్రతిభచే మహాసామ్రాజ్య చక్రవర్తియై భవన్నైకవీరాతిశయమునఁ దన్ను మార్కొనిన యరాతి బృందమ్ములనెల్లఁ దలక్రిందుఁజేసి మధ్యందినమార్తండునిపగిది విజృంభించిన యీమహాప్రతాపశాలి ఫ్రెంచిభాషాయోషామణికిఁ గొన్ని స్వరచిత గ్రంథోపాయనములను సమర్పించెను. చిన్నతనములో ననేక గ్రంథములఁ జదివి తత్సారమును సమయసముచితవ్యాసరూపమున రచించి వెల్లడిచేసి వార్ధక్యములోఁ దన యప్రతిమానానుభవమును గ్రంథరూపమునవ్రాసి తన మాతృదేశమున కొప్పగించెను. ఇంతియెకాక యీ మహాధీరుఁడు కదనరంగమున వైరినికాయములతోఁ బోరాడుచుఁ జిత్రలేఖనముగూడఁ జేయుచుండెనఁట! అతను చిత్రించిన చిత్తరువులు కొన్ని పుస్తకరూపముగ నిటీవల దొరకినట్లు తెలియవచ్చుచున్నది.

ఇంక భారతభూమి యందలి భూధవుల విద్యాకృషినరయుదము.

ఉత్తరహిందూస్థానమును దక్షిణహిందూస్థానములోఁ జాలభాగమును దన దిగ్విజయమున జయించి యశ్వమేధయాగము నొనరించిన సముద్రగుప్తుఁడు తాను బ్రచురించిన యలహాబాదు శాసనములో "తా ననేక కావ్యముల రచించినకతన కవిసార్వభౌముఁడయ్యె ననియుఁ దన కావ్యములు బీదలకు జీవనాధారము లయ్యె" ననియుఁ దెలియఁ జేసెను.

కాన్యకుబ్జదేశాధీశ్వరుఁ డగు హర్షవర్ధనుఁడు 'రత్నావళీ' 'నాగానంద' నాటకములను రచించెను. ముంజభూపతి యగు భోజుఁడు శతాధిక గ్రంథములను గీర్వాణభాషలో రచించి తనసాహిత్యము నాచంద్రార్కముగ భారతభూమిలోఁ బ్రకర్షించి సంగ్రామరంగమున నసువులఁ గోల్పోయెను.

హిందూదేశము జయించి ఢిల్లీసింహాసన మెక్కిన బాబర్ పాదుషా పారశీకభాషలో ధారాళముగఁ గవిత్వముఁ జెప్పఁగలిగెను. తెలుచుఁ దనగుఱ్ఱముమీఁద స్వారిచేయుచుఁ బద్యముల నాశువుగఁ బలుకుచుండెనఁట! తనజీవిత చరిత్రముఁ దానేవ్రాసికొని యీవిషయముల నన్నిటినిఁ దానే వ్యక్తపఱిచెను. ఇంక మహాబుద్ధిశాలి యగు నక్బరుపాదుషాను గూర్చి వేఱే చెప్పవలెనా? చేవ్రాలయినఁ జేయలేని యీచక్రవర్తి నిరంతరము పండితులగోష్ఠి మెలఁగుచు మతచర్చలను వినుచు ననేక శాస్త్రములయందును గళలయందును బ్రావీణ్యము నలవఱుచుకొని మహావిద్వాంసులను గూడఁ దన మర్మజ్ఞతచే డిందుపఱుచుచుండెను.

ఇట్లనేకులగు పార్థివోత్తములు లక్ష్మీకటాక్షపాత్రులై సరస్వత్యుపాసనయందుఁ గూడఁ గాలము గడపుచుఁ దద్దేవీపూజార్హములగు కావ్యకుసుమములను నేర్పుతో నేర్చి కూర్చుచువచ్చిరి. ఈవిషయముఁ గూర్చి యింతవట్టుచెప్పుట కొక్కటియే కారణము. మనదేశమందు బుద్ధిశాలు లగు గీర్వాణాంధ్ర పండితులలోఁ గొందఱు భూమీశులలోఁ గూడఁ గవు లుందు రన్నఁ గనుబొమ్మ లెత్తి పెదవి విఱిచి యీసడింతురు. వారికొఱ కీస్వల్ప విషయమును గూర్చి యింత విఱివిగా వ్రాసితిని. చదువరులు క్షమింతురుగాక!

మఱి కృష్ణదేవరాయలతట్టు మరలుదము. కృష్ణదేవరాయల గ్రంథరచనావిషయముల గుఱించి యిదివఱలో వ్రాసిన విమర్శకు లొక గొప్పపొరపాటుఁ జేసియున్నారు. వారెంతమట్టునకైనను గృష్ణరాయల రాజ్యకాలజీవితమును గూర్చియే యాలోచించుచువచ్చిరి. తత్పూర్వపు జీవితము గుఱించి సూక్ష్మపరిశీలనఁ గావింపరైరి.

శ్రీకృష్ణదేవరాయలు సుమారు ముప్పదియేండ్ల వయసు వచ్చినపుడు సింహాసన మెక్కెను. సింహాసనమునకు వచ్చినతరువాత నతనికి నిరంతరము శత్రువులతోఁ బోరాటములు గలిగినను దత్పూర్వ మాయనకు వలసినంత తీరుబడియు నవకాశము నుండినవి. సుమారిరువదిమూఁడేండ్ల వయస్సు వచ్చినవఱకుఁ దనతండ్రి యయిన నరసరాయలు జీవించియే యుండెను. తలిదండ్రుల సంరక్షణలోను వారికంటె నెక్కువ వాత్సల్యముఁ జూపుచుండిన మహామంత్రి తిమ్మరుసుయొక్క ప్రేమార్ద్రశిక్షణములో, నుండి కృష్ణదేవరాయలు చిన్ననాఁటనుండియు విద్యాబుద్ధు లామహామంత్రియొద్దనే విశ్వాసపూర్వకముగ నేర్చుకొను చుండెను. ఆహేతువునఁ దిమ్మరుసును 'అప్పాజీ' యనఁగాఁ దండ్రియని పిలుచుచుండెను. ఈకాలమున రాయలసమాన మగు గీర్వాణాంధ్ర సాహిత్యము సంపాదించుకొని యుండనోపు. కృష్ణరాయల పుత్రికలకు నాట్య సంగీతములను నేర్పిన గురువును, "సంగీతసూర్యోదయ"మను శాస్త్రగ్రంథమును రచించిన భండారు లక్ష్మీనారాయణ కవివర్యుఁడు కృష్ణరాయలు బాల్యమందే సకలకళలను అభ్యసించినట్లు వ్రాసిచ్చెను. కృష్ణదేవరాయల యౌవనదశను గుఱించి నూనిజ్ మొదలగు చరిత్రకారులు తెల్పిన విషయములనుబట్టి చూడ రాయల విద్యార్థిదశ యంతయు సంప్రీతికరముగ నుండెను. ఈవిషయమందును మఱి రాజ్యపాలనా

విషయమందును గృష్ణదేవరాయలు జర్మనుచక్రవర్తి యైన ఫ్రెడరికును (Frederic the Great) నెంతయు సరిపోలియున్నాఁడు.

కృష్ణదేవరాయలకును, అల్లసాని పెద్దన్నకును, గలిగినప్రథమపరిచయమును, దమపరి క్రమముగా వృద్ధినొందిన స్నేహమును రాయలు రాజ్యమునకు రాకపూర్వమే, యనఁగా, విద్యార్థిదశయందే జరిగియుండెనని నేఁ దలంచుచున్నాను. ఈప్రథమదశయందుఁ గృష్ణదేవరాయలు తనపేరు వహించియున్న మదాలసచరిత్రాది సంస్కృతగ్రంథములను వ్రాసియుండెనని నాయభిప్రాయము. ఈగ్రంథములను, పెద్దనయొద్దఁ గవితాశుశ్రూష వొనఁగుచున్న కాలములో రచించియుండుటచేఁ గొంతమంది పండితులు పెద్దన్నగారే రచించి రనుప్రతీతి లోకమునకు వెల్లడించియుందురు. జర్మనుచక్రవర్తి ఫ్రెడరిక్ విషయములోను నిట్టిలోకప్రవాదము పుట్టినట్లు కొంత చరిత్రదృష్టాంత మున్నది. ఏలయన, నాతఁడు రచించిన గ్రంథములను దొలుదొల్తఁ దనమిత్త్రుఁడును గవిశిరోమణియు నగు వాల్టేరునకుఁ బరీక్షనిమిత్తమంప నతఁడు సరిచూచి వానిని ముద్రించుచువచ్చెను. ఏతాదృశసారస్వతపరిశ్రమసంబంధమే కృష్ణరాయలకును పెద్దన్నకును గలిగియుండెనని నాయాశయము. ఈసంబంధము క్రమక్రమముగా వృద్ధినొంది పరస్పరగాఢానురాగమయ్యె నని సువిదితమే. కావునఁ గృష్ణదేవరాయలు రచియించిన వని చెప్పఁబడిన గీర్వాణగ్రంథములు నిక్కముగఁ గృష్ణరాయలే రచించియుండె ననియు వానిరచనయం దల్లసాని పెద్దన్నగారి సహాయము విస్పష్టముగఁ బొంది యుండెననియు నానిశ్చితాభిప్రాయము. ఈవిషయము మఱింత విపులముగా నా మనుచరిత్ర విమర్శనములో గాన్పించును.

మఱియొకవిశేషము—ఈప్రథమకవితాప్రయత్నము లగుమదాలసచరిత్రయు సత్యావధూప్రీణనము నను సంస్కృతకావ్యములను వ్రాసి

నపుడు కృష్ణదేవరాయలు కేవలము కవిత్వవిద్యార్థియై యుండవచ్చు ననఁగాఁ గావ్యశక్తినిఁ గవితాసామగ్రిని మున్ముందు సేకరించు కొంటయు, వివిధకావ్యధోరణుల నలవఱుచుకొనుటయు నభ్యాసకుని లక్షణములు గానఁ గృష్ణదేవరాయలు తనప్రథమకావ్యప్రయత్నములఁ నాయారీతుల నభ్యసించినట్లు గాన్పించుచున్నది. లేనియెడల—

"సీ. పలికి తుత్పేక్షోపముల జాతి పెంపెక్క—
రసికు లౌనన మదాలసచరిత్ర
భావధ్వనివ్యంగ్యసేవధి గాఁగఁ జెప్పి
తివి సత్యావధూప్రీణనంబు"

అను సీపద్యములో నున్న వివిధకావ్యరీతిలక్షణములఁ బ్రత్యేకముగఁ జేర్కొనుటకుఁ గారణము గాన్పింపదు. అల్లసాని పెద్దన్నవంటి యారితేఱిన కవి యొకగ్రంథము నొకవిధమైన కావ్యశైలికి నిదర్శనముగాను మఱియొకగ్రంథమును మఱియొకకావ్యశైలికి దృష్టాంతముగాను రచించి యుండునా? ఏగ్రంథమునైనను సర్వావయవపరిపుష్టియు సర్వాంగసౌందర్యమును గలుగునట్లు రచించును గాని యలంకారములకు నిధిగ నొకదానిని భావధ్వనివ్యంగ్యములకు సేవధిగ నొకదానిని రచించుట యస్వాభావికము, నసంగతము. కావున నీసంస్కృతగ్రంథములు కృష్ణదేవరాయలే కవితాభ్యాసకదశయం దున్నపు డల్లసాని పెద్దనాదుల శిక్షణమున రచించి యుండె నని మన మూహింపవచ్చును.

కొందఱు లక్షణకవులును వ్యాఖ్యాతలును గృష్ణదేవరాయల పేరున నున్నసంస్కృతగ్రంథములనే గాక యాతని యాంధ్రగ్రంథ మగు నాముక్తమాల్యదనుగూడ నల్లసాని పెద్దనయే రచించినట్లు నాఁడఁడి వెల్లడి చేసిరి.

1. కాకునూర్యప్పకవి తనయప్పకవీయములో "సాంధ్రకవితా పితామహుఁడు 'కొనియె' ననుటకు 'కొనె' నని చెప్పె...... విష్ణుచిత్తీయమునందు.

2. చ. ఉరు వగు విష్ణుచిత్తతనయోద్వహనంబును సంస్కృతాంధ్రవా
గ్గరిమ నలంక్రియారససుఖం బగునట్లుగఁ బెద్దనార్యుఁడు
ద్ధురఫణితిన్ రచించె.........శ్రీనివాసవ్యాఖ్య.

3. గుడిపాటి వేంకటాద్రి:—

గీ. పేర్మి నల్లసాని పెద్దన్న యాముక్త
మాల్యదాఖ్యకృతి సమంచితముగఁ
జేసె నీవు టీక సేయుము చెఱకునఁ
బండుపండినట్లె యుండుఁగాక !

ఆముక్తమాల్యదయందు విస్పష్టముగ నాగ్రంథమును శ్రీకృష్ణరాయలు రచించిన ట్లున్నను పైనుదహరించిన వాక్యములఁబట్టి కొంత సందేహము కలుగుచున్నది. కావున నేతద్గ్రంథకర్తృత్వసమస్య నిస్సంశయముగఁ దీర్చుటకుఁ దగినబుజువును సంపాదింపవలసియున్నది. మన యదృష్టవశమున నవసరమగు సాధనసామగ్రి కావలసినంత యున్నది. అల్లసాని పెద్దన్న రచించిన యాంధ్రప్రబంధమగు మనుచరిత్ర కృష్ణదేవరాయలకే యంకితము చేయఁబడినది. కృష్ణదేవరాయలపేర నొక సంస్కృతగ్రంథము గూడ లభ్యమగుచున్నది. వీని నన్నిఁటిని పరిచూచి తారతమ్యములను నిరూపించిన నీసందేహము తప్పక నివృత్తి కాఁగలదని నానమ్మకము.

అల్లసాని పెద్దనార్యుఁడు మనుచరిత్రను వ్రాసి యాప్రబంధము సులభశైలిని నుండుటచే నంతకంటెఁ గఠినశైలిని నీయాముక్తమాల్యదను వ్రాసె నని యొక వాదము. ఈవాదముఁబట్టి చూచిన నీ రెండు గ్రంథములకుఁ గలభేదము శైలియందలి మార్దవకాఠిన్యములే యని

నపుడు కృష్ణదేవరాయలు కేవలము కవిత్వవిద్యార్థియై యుండవచ్చును; అనఁగాఁ గావ్యఘక్కినిఁ గవితాసామగ్రిని ముమ్ముందు సేకరించు కొను టయు, వివిధకావ్యధోరణుల నలవఱచుకొనుటయు నభ్యాసకుని లక్షణ ములు గానఁ గృష్ణదేవరాయలు తనప్రథమకావ్యప్రయత్నములలో నాయారీతుల నభ్యసించినట్లు గాన్పించుచున్నది. లేనియెడల —

"సీ. పలికి తుత్ప్రేక్షోపముల జాతి పెంపెక్క —
రసికు లౌనన మదాలసచరిత్ర
భావధ్వనివ్యంగ్యసేవధిగాఁ గఁ జెప్పి
తివి సత్యావధూప్రీణనంబు"

అను సీసపద్యములో నున్న వివిధకావ్యరీతిలక్షణములఁ బ్రత్యేక ముగఁ బేర్కొనుటకుఁ గారణము గాన్పింపదు. అల్లసాని పెద్దన్నవంటి యాఱితేఱిన కవి యొకగ్రంథము నొకవిధమైన కావ్యశైలికి నిదర్శన ముగాను మఱియొకగ్రంథమును మఱియొకకావ్యశైలికి దృష్టాంతము గాను రచించి యుండునా ? ఏగ్రంథమునైనను సర్వావయవపరిపుష్టియు సర్వాంగసౌందర్యమును గలుగునట్లు రచించును గాని యలంకారములకు నిధిగ నొకదానిని భావధ్వనివ్యంగ్యములకు సేవధిగ నొకదానిని రచిం చుట యస్వాభావికము, నసంగతము. కావున నీసంస్కృతగ్రంథములు కృష్ణదేవరాయలే కవితాభ్యాసకదశయందున్నపు డల్లసాని పెద్దనాదుల శిక్షణమున రచించి యుండె నని మన మూహింపవచ్చును.

కొందఱు లక్షణకవులును వ్యాఖ్యాతలును గృష్ణదేవరాయల పేరిట నున్నసంస్కృతగ్రంథములనే గాక యాతని యాంధ్రగ్రంథ మగు నాముక్తమాల్యదనుగూడ నల్లసాని పెద్దనయే రచించినట్లు నాఁడిడి వెల్లడి చేసిరి.

1. క్రాతునూర్యప్పకవి తనయప్పకవీయములో "సాంధ్రకవితా పితామహుఁడు 'కొనియె' ననుటకు 'కొనె' నని చెప్పె......విష్ణుచిత్తీయమునందు.

2. చ. ఉరు వగువిష్ణుచిత్తతనయోద్వాహనంబును సంస్కృతాంధ్రవా
గ్గరిమ నలంక్రియారససఖం బగునట్లుగఁ బెద్దనార్యుఁడు
ధ్ధురఫణితిఙ్ రచించె.........శ్రీనివాసవ్యాఖ్య.

3. గుడిపాటి వేంకటాద్రి:—

గీ. పేర్మి నల్లసాని పెద్దన్న యాముక్త
మాల్యదాఖ్యకృతి సమంచితముగఁ
జేసె నీవు టీక సేయుము చెఱకునఁ
బండుపండినట్లె యుండుఁగాక !

ఆముక్తమాల్యదయందు విస్పష్టముగ నాగ్రంథమును శ్రీకృష్ణరాయలు రచించిన ట్లున్నను పైనుదహరించిన వాక్యములఁబట్టి కొంత సందేహము కలుగుచున్నది. కావున నేతద్గ్రంథకర్తృత్వసమస్య నిస్సంశయముగఁ దీర్చుటకుఁ దగినబుజువును సంపాదింపవలసియున్నది. మన యదృష్టవశమున నవసరమగుసాధనసామగ్రి కావలసినంత యున్నది. అల్లసాని పెద్దన్న రచించిన యాంధ్రప్రబంధమగు మనుచరిత్ర కృష్ణదేవరాయలకే యంకితము చేయఁబడినది. కృష్ణదేవరాయలపేర నొక సంస్కృతగ్రంథము గూడ లభ్యమగుచున్నది. వీని నన్నిఁటిని సరిచూచి తారతమ్యములను నిరూపించిన నీసందేహము తప్పక నివృత్తి కాఁగలదని నానమ్మకము.

అల్లసాని పెద్దనార్యుఁడు మనుచరిత్రను వ్రాసి యాప్రబంధము సులభశైలిని నుండుటచే నంతకంటెఁ గఠినశైలిని నీ యాముక్తమాల్యదను వ్రాసె నని యొక వాదము. ఈవాదమునుఁబట్టి చూచిన నీ రెండు గ్రంథములకుఁ గలభేదము శైలియందలి పూర్వకాఠిన్యములే యని

సూచింపఁబడుచున్నది. ఈ రెండుగ్రంథములకుఁ గలభేద మింతమాత్రమే యైనచో నీవాదము నంగీకరింపవచ్చును. కాని యీగ్రంథములను విమర్శదృష్టితో సమ్యక్పరిశీలనఁ జేసినయెడల నొక్క శైలియందే గాక యన్ని విషయములందును నీరెండుగ్రంథములు భేదించుచున్నవని విశదమగును. ఈరెంటికిని యద్వివిధమైన పోలికయు లేదు. శిల్పము, భావము, రసము, భావనాశక్తి, యలంకృతి, శబ్దసామగ్రి, శాస్త్రవ్యత, యిత్యాది యేవిషయముఁ జూచినను నీ రెండుగ్రంథములకు నిసుమంతయుఁ బోలిక గాన్పింపదు. కావున నొక్కకవియే యీరెండుగ్రంథములను రచించె నని చెప్పుట కేవలము దుర్గ్రాహ్యము – దురూహ్యము — మామిడిచెట్టున మామిడిపండును తాటిపండును బుట్టింపఁగల వృక్షశాస్త్రజ్ఞుఁడు, నావు కడుపున నావుదూడను గేదెదూడను బుట్టింపఁగల పశుశాస్త్రజ్ఞుఁడు, నీ నానారూపిణి యగు ప్రకృతియందుఁ బొడసూపినా యప్పు డొక్కకవియే మనుచరిత్రము, నాముక్తమాల్యదను రచించె నని నేను నమ్మెదను. కాఁబట్టి యీగ్రంథకర్తృత్వయశస్సు కృష్ణదేవరాయల కిచ్చుట కిష్టము లేనియెడల, మఱి యొక పేరు లేని పెద్దమనుష్యున కీపేరుప్రతిష్ఠల నొప్పఁ జెప్పవచ్చును; గాని పెద్దనార్యునకు మాత్రము సమర్పించుట యెంత మాత్రము వలనుపడదు.

కావునఁ దక్కినవిషయము లెవ్వియు — ననఁగాఁ గాలనిర్ణయాదుల సందర్భము, గ్రంథమందలి వ్యాకరణాదిదోషములు, కొన్ని కల్పనలయసంభావ్యత మున్నగు నంతర్నివాతవిషయములను దడవి చూడకయే, సామాన్యపరిశీలనమీఁదనే యీగ్రంథము పెద్దన్న రచించినది కాదనియుఁ గృష్ణదేవరాయలో, లేక మఱి యొకకవియో వ్రాసి యుండవచ్చు ననియు, స్పష్టముగాఁ జెప్పవచ్చును. పెద్దన్ననుండి కర్తృత్వముఁ దప్పించి నప్పుడు కృష్ణరాయల కీయక మఱియొకనియెడకుఁ జట్టుట యేటి

న్యాయము ? కావున శిల్పమును, శైలియుఁ బరీక్షింపఁగఁ బెద్దన్న కృష్ణ రాయలలోఁ గృష్ణరాయలదే యీగ్రంథ, మని వక్కాణింపవచ్చును.

కాని, పెద్దన్నగారి పద్యములు కొన్ని దీనియం దుండుటకుఁ గారణమేమి ? పెద్దన్నగారు మనుచరిత్రములోఁ గృష్ణరాయల వంశావళిఁ గూర్చియు నాతనిశౌర్యప్రతాపవిజయాదికములఁగూర్చియు వ్రాసినపద్యము లతిస్వల్పమ్ములైన మార్పులతో నల్లే యాముక్తమాల్యదయందు స్వీకరింపఁబడినవి. ఉభయగ్రంథములలో నీపద్యములు సమముగా నుండుటచేతఁ గొంతమంది విమర్శకు లీగ్రంథముల నొక్కఁకవియే రచించె నని వాదముఁ బొసఁగించుచున్నారు. మఱికొందఱు కృష్ణదేవరాయలకుఁ బెద్దన్నగారిమీఁద నున్న గౌరవాతిశయసూచకముగా నీపద్యముల నా రాజకవి యుపయోగించెనని యభిప్రాయపడుచున్నారు. మఱికొందఱు కృష్ణదేవరాయ లాత్మస్తుతిఁ జేసికొనుట కిష్టములేక తనయాస్థానకవీశ్వరుఁ డగునల్లసానివాని పద్యములనుఁ దన గ్రంథములోఁ జేర్చికొనియె నని తలఁచుచున్నారు.

పైఁ జేర్కొనిన హేతువులలో దేనివలనఁ గృష్ణరాయ లీపద్యములఁ దనగ్రంథమున నిమిడ్చికొనియుండవచ్చును ? ఆత్మస్తుతి కిష్టము లేకపోయిన నాశ్వాసాంతపద్యముల నెట్లు వ్రాయఁగలిగెను ? కావునఁ బెద్దన్నగారియందలి గౌరవాతిశయముచే నీపద్యములఁ దనగ్రంథమందుఁ జొప్పించి యుండవచ్చును. ఈయూహకుఁ దోడుగ నేను మఱియొక యూహ నిచట సహృదయులకు విన్నవించుచున్నాను.

కృష్ణదేవరాయలకు నల్లసాని పెద్దన్నగారియెడల నత్యంత భక్తి విశ్వాసము లుండిన ట్లనేకనిదర్శనము లున్నవిగదా !

సీ. "ఎదురైనచోఁ దనమదకరీంద్రము నిల్పి
కేలూఁత యిచ్చి యెక్కించుకొనియె

గోకటగ్రామాద్యనేకాగ్రహారంబు
 లడిగిన సీమల యందు నిచ్చె
మనుచరిత్రంబందుకొను వేళ పురమేఁగ
 బల్లకి తనకేలఁ బట్టి యెత్తె
బిరుదైన కవిగండపెండేరమున కీవె
 తగుదని నాదుపాదమున దొడిగె
గీ. ఆంధ్రకవితాపితామహా అల్లసాని
పెద్దనకవీంద్ర ! యని నన్నుఁ బిలుచునట్టి
కృష్ణరాయలతో దివి కేఁగలేక
బ్రతికియున్నాఁడ జీవచ్ఛవంబనగుచు.

ఇత్యాదిపద్యముల మూలమునఁ బ్రభువాత్సల్యము విశదమే కదా! రాజ్యవిషయములో మంత్రితిమ్మరసు రాయనికి నప్పాజీ యయ్యెను. కవిత్వవిషయములోఁ దనయాస్థానకవీశ్వరుఁడైన యల్లసాని పెద్దన్న యీరాజకవికి నప్పాజీతుల్యుఁ డయ్యె నని చెప్పవచ్చును. ఇట్లుభయులును బితృసమానులే. వారియెడల నత్యంతప్రేమాతిశయము రాయలు చూపుచు వచ్చెను గదా ! మఱియు నల్లసాని వానిగ్రంథమందుఁ దన యేలిక యగుకృష్ణరాయలప్రశంస కృతిపతికారణమున నున్నది. కాఁబట్టి యాగ్రంథముఁ జదివినపు డెల్లఁ గృష్ణదేవరాయలు జ్ఞప్తికి వచ్చును. అట్లే కృష్ణరాయలగ్రంథముఁ జదివినపుడెల్ల నల్లసాని పెద్దన్న స్మరణకు వచ్చుటెట్లు ? రాయలు తనగ్రంథముఁ దనయాస్థానకవీశ్వరునకు నంకితము చేయుట యయుక్తము గదా ! ఇంక నేవెరవునఁ దనకవితాగురుసంబంధ మభేదాధ్యవసాయముగఁ గల్పింపవచ్చును ? ఆకవీశ్వరుఁడు తన్నుఁగూర్చి వ్రాసినపద్యములఁ బ్రా నుపయోగించుకొనినయెడలఁ దనకుఁ గల గౌరవము, భక్తి, కవిత్వాదరణము, గాఢానురాగము, నివి యన్నియు నొక్కసారిగఁ దోఁచును ! కావున శాశ్వతప్రీతిబంధ

స్ఫోరకముగ నీపద్యములను దా నుపయోగించుకొనె నని నేఁ జెప్ప సాహసించుచున్నాను.

వేఱొకవాదము:—అంతఃపురములోను దర్బారులలోను గాల ముఁ గడపుచుండు రారాజుల కెన్నఁడుఁ దెలియరాని జానపదవిషయ ములును దత్త్వజ్ఞానవిషయములు నీగ్రంథమందు ననేకములు కలవు కావునఁ గృష్ణదేవరాయలు గాక పెద్దన్న యీగ్రంథము రచించె నని యొకవాదము. రారాజులకు జానపదులజీవితము తెలియనియెడల సామా న్యజనులకు రారాజులజీవిత మెట్లు తెలియుచున్నది? సామాన్యకుటుంబ ములకుఁ జెందిన కవీశ్వరులు రాజుల యితివృత్తములఁ గూర్చి వ్రాయు చున్నారుగదా? వారి కెట్లవి తెలియవచ్చుచున్నవి. అలాగునే రాజు లకుఁ గూడ సామాన్యమానవుల జీవితరహస్యములు తెలియఁగలవు. "రవి గానని చోఁ గవి గాంచునేకదా?" అన్నట్లు కవితాదృష్టిఁ గలిగిన యేమానవుఁడైన సామ్రాట్టైనను సామాన్యుఁడైననుఁ బ్రపంచమందలి నానావిధమర్మకర్మములను గుర్తెఱుఁగుటకుఁ బ్రేరేపించెడి ప్రజ్ఞాప్రభావ మెక్కువగఁ గలిగియుండును. అంతియేగాక కృష్ణదేవరాయలు ముప్పది వర్షములవయస్సువఱకు రాజ్యభారము వహించినవాఁడు కాఁడు. స్వతం త్రుఁడుగ సాత్వికదీక్షలోఁ గాలముఁ గడపినవాఁడు. లక్ష్మీనారాయణ కవి యనుసంగీతశాస్త్రజ్ఞుఁడు కృష్ణదేవరాయలబాల్యముఁ గుఱించి వర్ణిం చుచు "బాల్యేఽసౌ సకలకలాకలాపయుక్తః" అని చెప్పినాఁడు. అనఁగాఁ జిన్నతనముననే యనేకశాస్త్రములు కళలు సాంగోపాంగముగా నేర్చినవాఁడు, అని చెప్పఁబడినది. కావునఁ గృష్ణరాయఁడు తనచిన్నతన మునఁ దన యత్యున్నత నానావిధవిజ్ఞానసౌధమునకుఁ బునాదులు వేసి కొనియుండెను.

రాజ్యమునకు వచ్చినతరువాతనైన నీ " కవితాప్రావీణ్యఫణీశుడు " సంతతము పండితకవీశ్వరగోష్ఠిలో మెలఁగుచుండెడివాఁడు. పూర్వము బాగ్దాదుసుల్తానగు హారూన్-అల్-రషీదు అను ప్రసిద్ధచరిత్ర పురుషుఁ డెట్లు రాత్రులందు తనపట్టణమున గూఢవేషమున సంచరించి వివిధజను లేమి చేయుచుందురో యేమి చెప్పుకొందురో కని విని వచ్చుచుండినట్లు కృష్ణదేవరాయలుకూడ విద్యానగరమున తనరాజ్యకాలములో చేయుచుండెను (రాయవాచకము పుట 30నుంచి 32వఱకు). యుద్ధయాత్రలలోఁ దన యాస్థానకవి పండితబృందములను దనతోఁ దీసికొని పోవుచుండెడివాఁ డని యెల్లరకుఁ దెల్లమే కదా ? కావునఁ దనగ్రంథమునకు సంబంధించిన విజ్ఞానవిశేషములను జేర్చి కూర్చుకొనుటకుఁ జాల నవకాశ ముండెను. విశిష్టాద్వైతవాదప్రతివాదములసారము. నష్టాంగ యోగవివరణము, నిత్యాది నిగూఢతత్త్వసంప్రదాయము లన్నియుఁ దనగురువుల సమ్ముఖమున నేర్చికొని తాను బద్యరూపముగ నల్లి గాని లేక వారిచే వ్రాయించి గాని తనగ్రంథమం దిమిడ్చికొని యుండవచ్చును. కాఁబట్టి శాస్త్రములయం దధికారి గాఁ డనియు, మతవిషయములందలి మర్మము లెట్లు తెలియ వచ్చిన వనియు నిట్టిశుష్కాక్షేపణలు కొఱగానివాదములే.

కృష్ణరాయల కంకితము చేసినగ్రంథములలో ననఁగా మనుచరిత్రమునందుఁ బారిజాతాపహరణమందుఁ, గృష్ణరాయలు కవిత్వప్రియుఁ డని చెప్పుటయేగాని యతఁడు రచించిన గ్రంథముల వేనినైనఁ బేర్కొని యుండలే దని యొకవాదము. కవిబ్రహ్మ యగుతిక్కనసోమయాజి కంకితముచేసిన దశకుమారచరిత్రమందుఁ దిక్కయజ్వ వ్రాసినగ్రంథములలో వేనినైనను కేతనకవి యుదాహరించినాఁడా ? 'మహాభారతము' గాక పోయినను ' నిర్వచనోత్తరరామాయణము ' నేనిఁ బేర్కొనియున్నాఁడా

తిలకింపుఁడు. అందున లేనికారణమున మహాభారతముఁ గాని యుత్తర రామాయణముఁ గాని కవితిక్కన వ్రాయలే దని చెప్పఁగలమా? బహుశః యిట్టిమహాపురుషులవిషయములోఁ గవిత్వ మొకయానుషంగిక విలాసముగ మనపూర్వులు పరిగణించిరేమో! యని నే నూహించుచు న్నాను. ఆమహాపురుషుల రాజకీయకృత్యముల తేజఃపుంజములో వారి గ్రంథరచన యొకకిరణకణముగ నుండెను. కావున వారికావ్యరచనము గణింపఁబడలే దని తోఁచుచున్నది. ఇప్పటికాలముననో వారి రాజకీయ కీర్తి కంటెఁ గావ్యములయశస్సే స్థిరమైనది. ఇట్టివియే కదా లక్ష్మీసర స్వతుల యన్యోన్యాతిశయతారతమ్యములు!

వీనియన్నింటికంటె నెక్కువైన కారణము గ్రంథమందే యున్నది. దాని నిదివఱకే కొంత సూచించితిని. శ్రీకృష్ణరాయ లేకాదశి నాఁ డుపవసించి శ్రీకాకుళములో నున్నయాంధ్రవిష్ణువును దర్శింపఁ బోయి యచ్చట నాభగవత్సన్నిధి నారాత్రి గడపి యుండఁ దచ్చతుర్థ యామమునఁ గలలో నాభగవంతుఁడే కృష్ణదేవరాయల కొకసందేశము తెలిపెను. అది యేమన, 'ఆముక్తమాల్యద' గ్రంథము తెనుఁగున రచింపు మనియే. ఆ ట్లానతిచ్చుటలో సంస్కృతగ్రంథములఁ గొన్నిటిని కృష్ణరాయలు రచించినట్లు తెలుపుడు చేసెను. కావున నట్టిపవిత్రస్థల మున, నట్టిపవిత్రసమయమున సాక్షాద్భగవంతునిచే నబద్ధము లాడించు టకు నేరికైన మనస్సు కలుగునేమో యాలోచింపవలెను. సర్వదా, అనృతము లాడెడుచోరులు సహితము, దేవాలయములో నిలువఁబె ట్టించి దేవునియెదుట మాటలాడించిన నిజమునే పలుకుదురు! అట్టిస్థితి లో నుపవాసదీక్షలో నుండినఁదనకుఁ దనయిష్టదైవము సాక్షాత్కరించి ప్రసాదించునపు డాభగవంతునిచే నేమనుజుఁడైనఁ గల్ల లాడించునేమో యాలోచింపఁదగినది. అట్టిసమయమున మృషావచనముల కేమైన నవ

కాళ ముందునేమో యోచింపఁదగినది. కాఁబట్టి యీగ్రంథములు కృష్ణదేవరాయలు దప్ప యితరులు రచియించి రని యూహించుట కేవల మసంగతము, నన్యాయము, నపూవము.

కావున నీయాముక్తమాల్యదఁ బెద్దన్న ప్రత్యేకముగా రచియించియుండలే దనియుఁ గృష్ణదేవరాయలు రచించినపిమ్మట పెద్దనాదు లచ్చటచ్చటఁ బరిష్కరించియుండవచ్చు ననియు నానిశ్చితాభిప్రాయము.

సామాన్యజనపక్షమునకుఁ జేరిన మనయభిప్రాయ మెట్లున్నను రాజపక్షమువారి యభిప్రాయ మెట్లుండునో తెలిసికొనుటకు రాజవంశములోఁ బుట్టి రాజ్యభారము వహించుచు రాజకార్యానుభవము గలిగిన వారికిఁ గవిత్వపాండిత్యముల విషయములో నెంతవఱకు నిపుణత సంపాదించుట కవకాశము గలుగఁగలదో నిర్ణయించుట కట్టివారి యభిప్రాయమునే తీసికొనుట విద్వల్లోకమున కామోదకరముగా నుండవచ్చును. కావునఁ బెక్కువిధములఁ దాదృశగుణసంపత్తి గలిగినట్టియు, పీఠికాపురాధీశ్వరులును, ఆంధ్రాంగ్లములయం దసమానపండితులును, నిరంతర సారస్వతసేవాపరాయణత్వమున నభినవాంధ్రభోజవిఖ్యాతులు నైన శ్రీ రాజా రావు వేంకట కుమార మహీపతి సూర్యారావుబహద్దరువారి యభిప్రాయమును జూపుటకు వారియనుజ్ఞ వడసి "దుందుభి" సంవత్సరమునందలి యాంధ్రసాహిత్యపరిష 'త్సాంవత్సరికోపన్యాసము' నందలి కొంతభాగము నిచట నుదాహరించుచున్నాను.

"ఆముక్తమాల్యదామహాకావ్యమును రచించినవా రెవ్వ"రను విషయమునుగుఱించి చర్చ జరుగుచున్నది. శ్రీకృష్ణదేవరాయ లని కొందఱును, అల్లసాని పెద్దనార్యుఁ డని కొందఱును వాదించుచున్నారు. గ్రంథములోఁ గృష్ణదేవరాయలే తత్కర్త యైనట్లు స్పష్టముగఁ జెప్పఁ

బడి యున్నది. అందట్లున్నపుడు దానికి వ్యతిరేకముగ బలవత్కారణము లుండినఁగాని యది కా దనుటకు వీలులేదు. అట్లయినచోఁ బ్రతిగ్రంథకర్తను గ్రంథకర్త కాఁ డనియే చెప్పవచ్చును. ఈకావ్యము రాయలు వ్రాయలే దని ఋజువుచేయఁగల బలమైన హేతువు లేవియుఁ గావున కున్నవి. మనుచరిత్రలోని వంశాభివర్ణనపద్యములు విష్ణుచిత్తీయమునఁ గలవన్నంతమాత్రమున నీకావ్యము మనుచరిత్రకారుఁడే వ్రాసినాఁ డనుట న్యాయముగాదు. కృష్ణరాయలు తనవంశవర్ణనము చేయవలసి వచ్చినచోటఁ దనయాస్థానకవి రచించినపద్యముల నందుఁ బొందుపఱచిన నందముగనుండు నని యట్లు చేసియుండవచ్చును. ఆలోచించి చూడఁగా నిది యిట్లు చేయుటయే యత్యంతోచిత మని తోఁచుచున్నది. రాయలు తనగ్రంథమున నీపద్యముల నిట్లు నిర్భయముగను నిస్సంశయముగను జేర్చుకొనుట, యీకృతికర్త శ్రీకృష్ణదేవరాయలే యని ఋజువుచేయుటకుఁ బ్రబలకారణములలో నొకటియై యున్నది. అట్లు కాక, కృష్ణరాయలు విష్ణుచిత్తీయమును పెద్దన్నచేత వ్రాయించి తన పేరు పెట్టుకొని పేరు పొందవలయు నని తలంచినచోఁ బెద్దన రచించిన మనుచరిత్రములోని పద్యముల నిం దుండనిచ్చునా? ఆముక్తమాల్యద నుండి యెత్తి వ్రాయఁబడిన యీక్రిందిపద్యమువలన నీతఁడు పెక్కు సంస్కృతగ్రంథములు గూడ రచించినట్లు విస్పష్ట మగుచున్నది.

సీ. వలికి తుత్ప్రేక్షోపమల జాతి పెంపెక్క
        రసికు కానన మదాలస చరిత్ర
   భావధ్వనివ్యంగ్య సేవధిగాఁగఁ జె
        ప్పితివి సత్యవధూప్రీణనంబు
   శ్రుతిపురాణోపసంహిత లేర్చి కూర్చితి
        సకల కథాసారసంగ్రహంబు

శ్రోత్రఘుచ్ఛటులు విచ్చుగ రచించితి సూక్తి
నైపుణి జ్ఞానచింతామణికృతి
గీ. మఱియు రసమంజరీముఖ్య మధురకావ్య
రచన మెప్పించుకొంటి గీర్వాణభాష
నంధ్రభాష యసాధ్యంబె ? యందు నొక్క
కృతి వినిర్మింపు మిఁక మాకుఁ బ్రియము గాఁగ.

ఇన్ని సంస్కృతగ్రంథములు రచియించిన రాయ లీయాంధ్రగ్రంథమును రచించుట యొక యబ్బురముగాదు. ఇదియునుగాక, శైలినిఁబట్టి చూచినను, ఆముక్తమాల్యదా మనుచరిత్రముల కిచ్చటను బోలిక గానరాదు. ఆముక్తమాల్యద మనుచరిత్రముకన్న మిక్కిలి ప్రౌఢమైన ప్రబంధము. ఆంధ్రముననుండు నుత్తమోత్తమకావ్యములలో నొకటి. అందలి యుపమ లనుపమానములు ; శైలి నారికేళపాకము ; సరళత తక్కువ. మనుచరిత్రశైలి మిగుల సరళమైనది. పాకము కదళీపాకము. ఈరెండుగ్రంథములు నొక్కఁడే వ్రాసియున్నచో నాముక్తమాల్యదను మనుచరిత్రము వ్రాసిన వెనుకనో ముందో వ్రాసియుండవలయునుగదా ? విష్ణుచిత్తీయము మనుచరిత్రముకన్న ముందు వ్రాసిన దనుటకు వీలుకనఁబడదు. ఏలయన ? దీనికన్న నది మిక్కిలి ప్రౌఢతరముగా నున్నది. అందుఁ జక్కనివర్ణనములు చేయఁబడియున్నవి. రసపోషణమునఁ గూడ మించియే యున్నది. ఇంక మనుచరిత్రముతరువాత నది వ్రాయఁబడిన దనుటయు సమంజసముగాఁ దోఁచుటలేదు. ఏలయన ? దాని శైలి దీని శైలికన్న నెక్కువ సరళముగా నున్నది. కవిత్వముఁజెప్ప నలవాటధికమైనకొలఁది సరళత యెక్కువ యగుచుండునుగాని యున్నసరళతకూడఁ బోవుట యసంభవము గదా ? కావున మనుచరిత్రకారుఁడైన పెద్దనార్యుఁడు విష్ణుచిత్తీయమును రచించె ననుట న్యాయము గాదు. ఆముక్త

మాల్యదయందుఁ బేదవారి బ్రదుకు రీతులను గుఱించి చాలఁ జక్కఁగ వర్ణింపఁబడి యున్నది. కృష్ణరాయలకు వాని నంత బాగుగ నెఱుంగుట కవకాశములే దని కొందఱందురు. ఇట్లనుట యుక్తముగాదు. రాజులు మాత్రము పేదల స్థితిగతులనుగుఱించి యేల తెలిసికొనరాదు ? సేవకుల వలనఁ దెలిసికొనఁగూడదా ? ఆకాలమున రాజులు చారులను బంపి ప్రజ లెట్లుండిరో తెలిసికొనుచుండెడియలవాటు గలిగి యుండెడువారు గదా. ఇంతయేల ? ప్రభువు ప్రచ్ఛన్నవేషమునఁ దానే స్వయముగా నేఁగి ప్రజల కష్టసుఖములు గనుఁగొనుచుండెడువాఁడు గాదా ? ఈయాక్షే పణ మొకయాక్షేపణము గాదు. ఈగ్రంథరాజమునందు రాజనీతి యెంతయుఁ బ్రశస్తముగా వర్ణింపఁబడినది. స్వయముగ రాజ్యముఁ జేయుచు నష్టకష్టములఁబడి జనులఁ బాలించుచు స్వానుభవముగల జనవల్లభుఁడు దక్క మఱియొకరు వ్రాసినట్లు కనఁబడదు. వీని నన్నిటినిబట్టి చూడ నాముక్తమాల్యదాగ్రంథకర్త శ్రీకృష్ణరాయమహారాజే యని చెప్ప వలసియున్నది. ఇదిగాక:—

గీ. తెలుఁగదేల యన్న దేశంబు తెలుఁగేను
తెలుఁగువల్లభుండ దెలుఁగొకండ
యెల్లనృపులుఁ గొలువ నెఱుఁగవే బాసాడి
దేశభాషలందుఁ దెలుఁగు లెస్స.

ఈపద్యమునుబట్టి చూడ విష్ణుచిత్తీయకృతికర్త కితరభాషలందుఁ బ్రవేశముండుటచే నాభాషలకును దెలుఁగుభాషలకును గలభేదము బాగుగఁ దెలిసియున్నట్లును దేశభాషలలోఁ దెలుఁగుబాస లెస్స యైనది గనుక తెలుఁగునందే కృతిరచింపు మని తెలుంగురాయఁ డాజ్ఞాపించి నట్లును తేలుచున్నది. మనుచరిత్రకారున కితరదేశభాషలయందుఁ బ్రవేశ మున్నట్లు కానఁబడదు; మఱియును,

శ్రీకృష్ణదేవరాయలకుఁ బారిజాతాపహరణమును గృతియిచ్చిన ముక్కుతిమ్మనార్యుఁ డాగ్రంథములో నారాజనత్తము నిట్లని స్తుతించెను.

క. శ్రీవేంకటగిరివల్లభ !
సేవాపరతంత్రహృదయ ! చిన్నమదేవీ
జీవితనాయక ! కవితాప్రౌ
ఢీన్యాఘణీశ ! కృష్ణరాయమహీశా !

ఇందలి 'కవితాప్రౌఢీన్యాఘణీశ!' యనుదానింబట్టి యీాయన కవిత్వము చెప్పుటయం దుద్దండప్రతిభ గలవాఁ డని విశద మగుచున్నది. ఈపద్యముననే " శ్రీవేంకటగిరివల్లభ ! సేవాపరతంత్రహృదయ ! " యనుదాని కనుగుణముగ నాముక్తమాల్యదయందు గ్రంథాదినున్న:—

ఉ. శ్రీకమనీయహారమణిఁ జెన్నగుఁ దాను గౌస్తుభంబునం
దాకమలావధూటియు నుదారతఁ దోఁపఁ బరస్పరాత్మలం
దాకలితంబు లైన తమయాకృతు లచ్చతఁ బైకిఁ దోఁప న
స్తోకతనందుఁ దోఁచె నన శోభిలు వేంకటభర్తఁ గొల్చెదన్.

అని రాయలు శ్రీవేంకటేశ్వరుల భక్తితోఁ గొల్చువాఁ డని తెలుపుదు చేయుచున్నది. ఈపద్యముతో మనుచరిత్రమునందలి మొదటి పద్యమును బోల్చి చూడఁదగును.

శ్రీవక్షోజకురంగనాభ మెదపైఁ జెన్నొంద విశ్వంభరా
దేవిం దత్కమలాసమీపమునఁ బ్రీతిన్ నిల్పినాఁడో యనం
గా వందారు సనందనాది నిజభక్తశ్రేణికిం దోఁచు రా
జీవాక్షుండు కృతార్థుఁ జేయు శుభదృష్టిన్ గృష్ణరాయాధిపున్.

ఈ రెండిటికినిగల తారతమ్యము పరిశీలింపుఁడు ! ఈ రెండు వాక్కులు వేఱువేఱని తెల్లమగుచున్నది. శ్రీకృష్ణదేవరాయలు స్వభావ

వర్ణనముల నతిమనోహరముగఁ జేసినాఁడు. అభూతోపమలు కల్పించి నాఁడు. రసపోషణము బహుప్రౌఢముగఁ జేసినాఁడు. భక్తిరసమును గుఱిపించినాఁడు. ద్రావిడ దేశాచారములను మిగుల లెస్సగ వర్ణించి నాఁడు. అఱవదేశమును బాగుగ నెఱుంగుటకుఁ గృష్ణరాయల కనేకావ కాశములు గలిగియుండును. ఆహా! ఈమహారాజకవి యెంతటిఘనుఁడు! కవిరాట్కంఠీరవుఁడు; పండితప్రవరుఁడు. రాజుల కిట్టి యఖండపాండితీ పటిమ యుండియుండునా యని కొంద ఱందురేమో? ఏల యుండరాదో తెలియకున్నది. ఇతరరాజు లెందఱు పుస్తకరాజముల రచియింపలేదు ? నన్నెచోడుఁడు కుమారసంభవము, రఘునాథభూపాలుఁడు వాల్మీకిరా మాయణము, ముల్లె అనంతభూపాలుఁడు కుముద్వతీకల్యాణము, సవరము చినరాయణనాయకుఁడు కువలయాశ్వచరిత్రము, దామెర వేంగళభూ పాలుఁడు బహుళాశ్వచరిత్రము, కోటిరాయ రఘునాథ తొండమాన్ భూపాలుఁడు పార్వతీపరిణయము, కట్టా వరదరాజు శ్రీరంగమాహాత్మ్య ము, కాచభూపతి విఠలరాజు రంగనాథరామాయణము, తిమ్మనృపా లుఁడు పరమయోగివిలాసము, విజయరంగచొక్కనాథుఁడు అహల్యా సంక్రందనము, రేచెర్ల మాధవరాయఁడు చంద్రికాపరిణయము, పాలవే కరి కదిరీపతి శుకసప్తతి మొదలైన యాంధ్రగ్రంథములను, భోజరాజు చంపూరామాయణము, రావు సర్వజ్ఞసింగమహీపాలుఁడు రసార్ణవ సుధాకరము మొదలైన సంస్కృతగ్రంథములను రచియించి యుండ లేదా ? ఇంక ననేకులు రాజకవులు లేరా ? వారందఱుఁ బండితులు కారా ? ప్రభుసత్తములు సద్గ్రంథరచనాపటిష్ఠులే కాకున్నచో వీరందఱి గతి యేమి ? కావున నట్టివాద మెంతయు నసమంజసము. వీరిలో మా

వంశజ్ఞుడైన రావు సర్వజ్ఞసింగమహీపాలుఁడు రచియించిన రసార్ణవ సుధాకరము ప్రసిద్ధలక్షణగ్రంథ మని సంస్కృతకవీంద్రు లెఱుంగుదురు.

ఇదియునుంగాక శ్రీకృష్ణదేవరాయలు వివిధవిద్యావిశారదుఁడు, బహుభాషాకోవిదుఁడు; దేశభాషల ననేకములు నేర్చి 'దేశభాషలందుఁ దెలుఁగు లెస్స' యని చెప్పినవాఁడు; రాజనీతిపారంగతుఁడు; శౌర్యరాశి; భాషాపోషకుఁడు; కవిబృందమందారము; సహజసహాయసద్గుణసంపన్నుఁడు. తాను గవిశ్రేష్ఠుఁ డయ్యును, దనకన్నఁ దక్కువ వైన కవులను, బెద్దన ముక్కుతిమ్మనామలను బోషించి గౌరవించిన కరుణాశాలి. ఈయనగ్రంథమున నచ్చటచ్చటఁ దప్పులుగలవని వాదుకయుండెడిది. ఈమధ్యకాలమునఁ బండితరాజగు బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రులవా రాగ్రంథము నామూలాగ్రముగఁ బరిశీలించి యాదోషములను నిజముగఁ దప్పులు కావనియు శబ్దపల్లవాదులలోఁ జేరుననియు సిద్ధాంతీకరించి గ్రంథకర్త యొక్క పాండిత్యప్రకర్షమునకించుకయుఁ గొఱంతలేదని నిర్ధారించినారు. ఆంధ్రభాషకు నాంధ్రదేశమునకు నీ ప్రభువతంస మొనర్చిన మహోపకార మింతింత యని చెప్పనలవికాదు. ఇట్టి స్తోత్రపాత్రుని స్తుతించి వక్త్రములు పవిత్రములుగఁ జేసికొనవలయును గాదా? అయిన నేయాంధ్రకవియుఁ గావ్యములలోఁ గవిస్తుతి చేయనప్పు డామహానీయునిఁ బేర్కొనియుండలేదు. అది యేలకో? ఒకవేళ నాతనిగ్రంథమున నపప్రయోగము లున్నవని యనుకొనుటచే నయి యుండునా? ఇంకేమైనఁ గారణ ముండునా? ఇదమిద్ధ మని చెప్ప వీలులేదు. ఇంతమాత్రమున నాయనకు లోటువాటిల్లె నని తలఁప రాదు. లోపము లేశమైనను లేదు. బ్రహ్మజాతిహీరకమును, హీర మన కున్నచో నది వజ్రము కాకుండునా? విద్వత్కవిశ్రేష్ఠుఁ డెప్పటికిని విద్వత్కవిశ్రేష్ఠుఁడే.

ఆముక్తమాల్యదకు విష్ణుచిత్తీయ మను నామాంతరము కలదు. వైష్ణవద్వాదశాళ్వారులలో నొకఁడగు విష్ణుచిత్తునియొక్కయు, నాతని కుమార్తెయగు గోదాదేవియొక్కయు కథ దీనియందు వ్రాయఁబడినది. విష్ణుచిత్తుఁడు శ్రీవిల్లిపుత్తూరులో నున్న 'వటపత్రశాయి' యను విష్ణు మూర్తికి భక్తుఁడై, స్వామివారి దేవాలయమున నర్చకుఁడుగా నుండెను. అతని కుమార్తెయగు గోదాదేవికి అఱవభాషలో 'మూడికొడుత్తాళ్' అని పేరున్నది. 'మూడికొడుత్తాళ్' అనఁగా 'ఆముక్తమాల్యద' అని యర్థము. గోదాదేవి బాల్యమునుండియు శ్రీరంగములోనున్న రంగనాయకస్వామివారిని ప్రేమించుటచే దండ్రియగు విష్ణుచిత్తుఁ డామెను స్వామివారి కిచ్చి వివాహము చేసెను.

వైష్ణవపన్నిద్దరాళ్వారులచరిత్రము లన్నియు ప్రథమమున సంస్కృతభాషలో 'దివ్యసూరిచరిత్ర' మను పేరున గరుడవాహనపండితునిచే రచింపఁబడినది. ఈగ్రంథమందు శ్రీరామానుజాచార్యులవారు తత్కాలమున జీవించియుండినట్లును, వైష్ణవమతవ్యాప్తికై చాలవఱకు పాటుపడుచుండినట్లును వ్రాసియుండుటచే నేతద్గ్రంథము రామానుజులవారికి సమకాలిక మనియు, గావున క్రీ॥ వె॥ పదునొకండవశతాబ్దము నాఁటి దనియుఁ జెప్పవచ్చును. ఈదివ్యసూరిచరిత్రమును బట్టి సంస్కృతాఅవమిశ్ర మగు మణిప్రవాళభాషలో 'గురుపరంపరప్రభావ' మను పేరున 'పిన్నబాలకీయపెరుమాల్ జియార్' అను కవివరుఁ డొక వైష్ణవ చరిత్రగ్రంథమును రచించెను. ఈగ్రంథము సుమారు క్రీ॥ వె॥ పదునాల్గవ శతాబ్దమునాఁటిదిగ నుండనోపు. ఏల యన, పెరుమాళ్ జియార్ ఆశతాబ్దమందు జీవించియుండిన ట్లగపడుచున్నది. ఈ యఱవగ్రంథమందు శ్రీరామానుజులవారి పుట్టుకవిషయము, నిర్యాణవిషయము గూడ సూచింపఁబడినది. కావున నిది యాచార్యులవారి జీవితానంతరమున రచింపఁ

బడియున్నది. ఈ రెండుగ్రంథములయందును విషయ మొక్కటే. ఆళ్వారుల పారంపర్యమును, వారి జీవితములయందలి మహాకార్యములును మున్నగునవి యించుకయేని భేదములేక వర్ణింపఁబడినవి. కావున అఱవగ్రంథము సంస్కృతమాతృకకు పుత్రిక యని చెప్పవచ్చును.

శ్రీకృష్ణదేవరాయలు తనగ్రంథమందలి విష్ణుచిత్తునికథ, పై రెండుగ్రంథములలో దేనినుండియైనను గ్రహించియుండవచ్చును. అఱవమున కంటె సంస్కృతమున గొప్పపండితుఁ డగుటచే గీర్వాణమాతృకనుండియే తనగ్రంథమందలి కథను స్వీకరించియుండె నని చెప్పుట యెక్కువ సమంజసము. అయినను, అఱవసంప్రదాయములును, నతనిగ్రంథమం దెక్కువగాఁ గాన్పించుటచే గురుపరంపరప్రభావమునుకూడ వాడుకచేసి యుండును. ముఖ్యముగ కథావిషయక్రమము రెంటియందును సమానముగా యున్నను, విష్ణుచిత్తుని జీవితవర్ణన మంతయు, ననఁగా, దేవాలయకైంకర్యమును, మధురసభయందు వాదనువిషయమై స్వామివారితో జరిపినసంభాషణము మున్నగునివిశేషము లన్నియు ద్రావిడగ్రంథమం దెక్కువగా నుండుటచేతను, తదనుసరణముగా శ్రీకృష్ణదేవరాయలు తనగ్రంథమందు వానిని పెంచియుండుటచేతను, ద్రావిడగ్రంథము రాయలువారికి తఱచు సూచనలు గావించిన దని యొప్పుకొననలసియున్నది. తనగ్రంథమును విష్ణుభక్తిప్రతిపాదక మగు గొప్ప వైష్ణవ ప్రబంధముగ రచింపనెంచినవాఁడు గనుక మాతృకలో లేని కొన్నికథలను వైష్ణవమతసిద్ధికొఱకు స్థలాంతరములనుండి సంగ్రహించి తనగ్రంథమందు చేర్చుకొనెను. వానిలో ముఖ్యములు, ఖాండిక్యకేశిధ్వజోపాఖ్యానమును, మాలదాసహరికథయు, యామునాచార్యచరిత్రము మున్నగునవి. భిన్నవిషయములగుఱించి మున్ముం దెక్కువగా నాయాసందర్భముల సమాలోచనము చేయఁబడును,

# మూఁడవ అధ్యాయము

## * కథాసారము

విష్ణుచిత్తుఁడు శ్రీవిల్లిపుత్తూరులో నున్న వటపత్రశాయిస్వామి దేవాలయమునం దర్చకుఁడు. ఈతఁడు గొప్ప వైష్ణవభక్తుఁడు. అందుచే నీతనికి "పెరియాళ్వార్" అని పేరువచ్చినది. ఈతఁడు దేవునికి నిత్యము కైంకర్యము చేయుచుండెడివాఁడు. దేవాలయపుఁదోఁటలోఁ బూలమొక్కలకు గొప్పుఁద్రవ్వుట, నీరుపోయుట, పూలను గోసి దేవునికిఁ దోమాలెలను గ్రుచ్చుట, దేవునికి నిత్యము ధూపదీపనైవేద్యాదిక్రియలు చేయుట. ఇట్లే దేవుని సేవయందే కాలము గడుపుచుండెను. "ఆరామశ్రమఖనక్రియాఖరఖనిత్రగ్రాహితోద్యత్కిణస్తోమాస్నిగ్ధకరుం భవద్భవనదాసున్" అని చెప్పుకొనెను.

ఇట్లుండ నాపాండ్యదేవరాజు గొప్పశివభక్తుఁడుగానుండి తనముఖ్యపట్టణము మధురాపురమునఁ గొండొకరాత్రి భోగినీపురమునకుఁ బోవుచు మార్గమధ్యమున నొక బ్రాహ్మణగేహమున

"......నెలల్ చతుర్ద్వయిని వృష్టిదినాళికి రాత్రికై దివం,
బున జరకై వయస్సునను బూని పరంబున కిప్పు డుద్యమం,
బనువుగఁ జేయఁగావలయు........................"

అనుమాటలను వినెను. తత్క్షణమే చింతాపరుఁడై గిఱ్ఱున మరలి నగరికేతెంచి మఱునాఁ డుదయమునఁ గొలువుదీర్చి సభకేతెంచిన పండితులను "మీమీశాస్త్రములలో నెవ్వరు మోక్షం దెలియించునో చూచి నిశ్చయింపుఁడని" కోరి యట్టిమోక్షమార్గమును జూపఁగలిగినవానికిఁ బారితోషికముగా నిచ్చుటకు వరాలపంచి నచటనే వ్రేలాడఁగట్టెను. అటుపైని వారందఱు నొకరితో నొకరు వాదములు చేయ మొదలిడిరి. శివుఁడు మోక్షప్రదాత యని కొందఱును, ఇంద్రుఁడని కొందఱును, అగ్ని యని కొందఱును-ఇట్లు వాదములాడిరి. మధురలో నిట్లు సభ జరుగుచుండఁగా శ్రీవిల్లుపుత్తూరులో వటపత్రశాయిస్వామి విష్ణుచిత్తునికి సాక్షాత్కరించి "వెంటనే మధురకుఁ బోయి రాజసభలో జరుగుచున్న వాదములోఁ బాల్గొని వారి నందఱిని నోడించి విష్ణువుయొక్క యాధిక్యత స్థాపింపు" మని కోరెను. ఆమాటలకు విష్ణుచిత్తుఁడు వెఱఁగంది తాను జదువులేని మూర్ఖుఁడ ననియు స్వామివారి కైంకర్యమునకుఁ దక్క మఱియొందునకుఁ బనికిరానని యు విన్నవించుకొనెను. కాని స్వామివా రభయహస్తముఁ జాఁచి ధైర్యముఁ జెప్పి వెంటనే వెళ్లుమనిరి.

విష్ణుచిత్తుఁడు శీఘ్రముగా సభకుఁ బోయి వాదమందుఁ గలసి భగవత్స్వా

యమునఁ దక్కినవారి నెల్ల నోడించి విష్ణుమతమును స్థాపించెను. ఆసందర్భమున ఖాండిక్యకేశిధ్వజసంవాదమును గూడఁ జెప్పి విష్ణుభక్తులకుఁ బరమార్థసాధనమును దెలిపెను. అంతటఁ బాండ్యరాజు సంతసించి రూకలమూట విష్ణుచిత్తుని కిచ్చి యితర బహుమానముల ననేకములఁజేసి తాను వైష్ణవమతమును స్వీకరించి విష్ణుచిత్తుని బ్రహ్మరథము నెక్కించి శ్రీవిల్లిపుత్తూరునకు సపరివారముగ సాగనంపెను.

ఇట్లు శ్రీమహావిష్ణువు తనభక్తుఁ డగువిష్ణుచిత్తునిద్వారా తన కఖండవిజయము గలుగఁజేసికొని తనహృదయేశ్వరియగు లక్ష్మీదేవితో సరసముగ సల్లాపించుచు దన భక్తులలో నీవిష్ణుచిత్తుఁడును యామునాచార్యుఁడును నగ్రగణ్యులని నుడివెను. యామునాచార్యునిఁగూర్చి తెలిసికొనుట కామెకుఁ గుతూహలము గలుగ నాతని చరిత్ర మంతయు నెన్నఁ డామెకు నివేదించెను.

ఇట్లుండ విష్ణుచిత్తుఁ డొకనాఁడు తనపురమందలి యొకయుద్యానవనములోఁ దిరుగుచుండఁగా నాతని కొక యాఁడుశిశువు గానిపించెను. ఆశిశువును దీసికొని వచ్చి యనపత్యురాలయిన తనభార్యకు భగవత్ప్రసాదముగ నొప్పగించెను. ఆసాధ్వీమణి చాల ముదమంది బాలికను దనకూఁతురుగాఁ బెంచుచు వచ్చెను. ఇట్లు దినదిన ప్రవర్ధమాన యగుబాలిక యౌవనవతియై విష్ణుమూర్తియందు బద్ధానురాగయై యాభగవంతునిచర్యలను గూర్చిన పాటలను గీర్తనలను వినుచుఁ బాడుచు లక్ష్మీకళ్యాణములను జూచి సంతసించుచుఁ దానావిష్ణునిఁ బరిణయము చేసికొనెడి భాగ్య మెన్నఁడైనను గలుగునాయని యువ్విళ్లూరుచు విరాళిఁ గుందుచుండెను. తండ్రి విష్ణుచిత్తుఁడు ప్రతి దినము కూర్చుచుండిన పూలమాలికను దానొక్కసారి మెడలో ధరించి నూతినీటను దన ప్రతిబింబముఁ జూచి యానందించుచు వచ్చెను. విష్ణుచిత్తుఁ డీమాలికను ధరించుచున్నదని యెఱుఁగకయే దానితో స్వామి నలంకరించుచుండెను.

ఇట్లు విరహవేదనలఁ గుందుచున్న కుమారికస్థితినిఁ జూచి యేమియుఁ దోఁపక విష్ణుచిత్తుఁ డామెయవస్థ స్వామికి విన్నవించుకొనెను. అప్పుడు స్వామివారు "నీకొమార్తె ధాత్రీదేవి. భగవంతుఁ డగు కేశవుని వివాహమాడుటకు విరహము నొందుచున్నది. కావున నామెను శ్రీరంగమందున్న రంగనాథస్వామి సముఖమునకుఁ గొనిపొమ్ము" అని సెలవిచ్చిరి. ఆసమయమున మాలదాసరి బ్రహ్మరాక్షసుల కథ విష్ణుచిత్తునికి స్వామివారు చెప్పిరి.

స్వామియాజ్ఞానుసారముగఁ గూఁతుని వెంటఁబెట్టుకొని, విష్ణుచిత్తుఁడు శ్రీరంగమునకు వెడలి స్వామివారియాలయములోఁ బానుపు గొమార్తెయగు గోదాదేవి

బదిలపెట్టుటకు చంద్రగిరికోటలో నుంచినట్లు దెలియవచ్చుచున్నది. అట్లైనయెడల జిన్నతనముననే కవితాగురువైన అల్లసాని పెద్దనామాత్యుఁడు కడపప్రాంతములలో నుండియుండవలెను.

(3) అల్లసాని పెద్దనార్యుఁడు శ్రీకృష్ణదేవరాయలవల్ల పొందిన బహుమతులలో 'కోకట' గ్రామము ముఖ్యమైనది. ఈగ్రామమును తాను తిరిగి దేవబ్రాహ్మణుల కిచ్చివేసినట్లు దానశాసనము లున్నవి. సామాన్యముగ నేమానవుఁడైనను తాను సంపాదించెడు భూవసతులు తాను పుట్టినస్థలములో సంపాదించుట లోకస్వభావము. అల్లసాని పెద్దన్న కడపజిల్లా గండికోటసీమలో నున్న యీకోకటగ్రామముఁ గోరుట తన కాప్రాంతములయం దున్న జన్మస్థలాభిమానమును దెలియఁజేయుచున్న దని నా యభిప్రాయము.

(4) ఈకోకటగ్రామమునకు సమీపమున 'పెదనపాడు' అను గ్రామమున్నది. ఆగ్రామమున నిప్పటికిని పెద్దన్నగారిపేరున అగ్రతాంబూలము దీసికొందురు. ఆపెద్దన్నగారు మన అల్లసాని పెద్దన్నగా రనియే అచ్చటి జనుల యభిప్రాయము.

ఈకారణములబట్టి అల్లసాని పెద్దనార్యుఁడు కడపమండలములో కమలాపురముతాలూకాలో నున్న 'కోకట' గ్రామములో గాని, దాని సమీపగ్రామముగా నున్న 'పెద్దనపాడు' నందున గాని జన్మించె నని నా యభిప్రాయము. ఈవిషయమై కడపపట్టణపునివాసియు, సుప్రసిద్ధాంధ్రమహాకవియు నగు జనమంచి శేషాద్రిశర్మగారి యభిప్రాయమును గూడ నిట నుల్లేఖించుచున్నాను. *

* (శుక్లసంవత్సర ఉగాది సంచికనుండి ఉద్ధృతము)

## —♦ అల్లసానివారి కుటుంబము ♦—

"బల్లారి మండలమున దూపాటి సీమలోనుండు దోరాల యను గ్రామము కవిజన్మస్థలమని శ్రీ వీరేశలింగముపంతులుగారు వ్రాసిరి. వారు కవిజీవితమును సంస్కరించి మరలవ్రాసి ముద్రించునిమిత్తము చెన్నపురికి దయచేసినపుడు నేను కొన్ని ప్రశ్నములు వ్రాసి పంపితిని వానికి బదులిడక వారికుశలమును వ్రాయుచు నన్నాశీర్వదించిరి. మరల పీకవిని గూర్చి వ్రాసితిని. ఆవిషయమును చర్చించునపుడు మీప్రశ్నములను దిలకింతుమని వ్రాసిరి. మఱి కొలఁదిదినములకే వారు తనువునుఁ త్యజించిరి. కాన వారి మహాకవిని గూర్చి విశేషించి చర్చింపవలను పడదయ్యెను. దూపాటిసీమ యిపుడు కందనూలు మండలమునకు జేరినదని నాయెఱింగినంత వఱకు జెప్పఁగలను. ఏమండలమునకుఁ జేరినదేమి యాభాగమునఁ దెనుఁగు మాటలాడువారు తక్కువ. ఒకటి రెండు కుటుంబముల వారందు గ్రామములందుండవచ్చును. దోరాల పెద్దన్నగారి జన్మస్థలమనునది యు లోక ప్రవాదమును బట్టి చెప్పినది కాదని యెంచెదను. కింవదంతి లేకయున్న నెట్లు శ్రీపంతులుగారు వ్రాయుచున్నారు ? అల్లసాని వారి కుటుంబముకూడ నందుండవచ్చును. ఆకుటుంబమునఁ బెద్దన జన్మించెనో లేదో దైవమెఱుఁగును. ఇప్పుడేయూరనైన నల్లసానివారుండినచో వారిని బ్రశ్నింతుమేని మాకుఁ బూర్వుఁడే పెద్దన్నగారందురు. ఇది లోకస్వభావమేగదా. కావున దానిం జర్చింపక మరొక కింవదంతిని దెల్పెదను.

కడప మండలమునఁ గమలాపురమను నుపమండలము (తాలూకా) గలదు. దానిచెంత నొక గ్రామము కలదు. "పెద్దనపాడు" అని దానికిం బేరు. ఇప్పుడుకూడ నున్నది. దానికి సమీపమునందే 'పెద్దన చెఱువు' కలదు. అది యిపుడు పశ్వాదులకు జలము త్రాగుట కుపయోగించుటకై కట్టింపఁబడిన జాడఁ దెల్పును. దానిక్రిందఁ గేదారములు లేవు. పుణ్యసమార్జనము నిమిత్తమది కట్టింపఁబడి యుండనోపు, "పెద్దనపాడు" అను గ్రామమునఁ బెద్దనగారిపేర తాంబూల మెత్తుదురు. వివాహాది శుభకార్యముల యందన్ని జాతులవారును మొదటి తాంబూలము పెద్దనగారిదని యెవరికో నిత్తురు. ఆయూరనిపుడు బ్రాహ్మణకుటుంబమేలేదు. దానికి సమీపముననే 'కోకట్టి'

గ్రామమున్నది. ఆయూర వరిపైరు ఫలింపదు. జొన్న మొదలగు పైరులు పండును. పినాకిని చెంత నున్నది కాని కుండలతో నీరు తెచ్చుకున్నఁగాని యానదీజలమూ యూరును స్పృశింపదు. నదివలన నా గ్రామమునకుఁ గల సహాయ మంతమాత్రమే. అట్టిగ్రామమును మహాకవి యేలకోరెనో తెలియఁజాలను. వారి గురువులగు శఠగోప స్వాము లందుండిరనియు వారికి నీయఁదలచి కోకటమును గోరెననియుఁ గొందరు పల్కుదురు. గురువులకుఁ గోకటమునకుఁ బ్రక్కనున్న గ్రామములు కేదార సంభృత ములుండఁగా వానిని గోరక జొన్నపండు గ్రామమును గోరెననుట యుక్తియుక్తము కాదు. కాఁబట్టి యీ పైమూడు గుఱుతులనుబట్టి యూహింపఁగాఁ గోకటి ప్రాంత మున నున్నవాఁడనియు, నందును ప్రథమ తాంబూలము క్రొత్తయూరి కిచ్చు నాచా రమే లేదుగాన పెద్దనపాడు గ్రామమున జన్మించిన వాఁడనియు నూహించుట పొర పాటు గాదు. ఈ క్రింది కారణమును బట్టియు నీసిద్ధాంతమును దృఢపఱచవచ్చును.

“మనుచరిత్రమునఁ బురవర్ణనమున సీసపద్యపు టెత్తుగీతి:—

అచటి వెలయాండ్రు రంభాదులైన నోరయఁ
గాసె గొంగున వారించి కడపఁ గలరు
నాట్యరేఖా కళా దురంధర నిరూఢి
నచట బుట్టిన చిగురు కొమ్మైనఁ జేవ”

యని యున్నది. అందు చిగురు కొమ్మైనన్ = అనుదానికి చిగురు = చిగురు చెట్టు యొక్క; కొమ్మైనన్ = కొమ్మయైనను; చేవ = దృఢమైనది. సారము గలదని భావ ము. చిగురు చెట్టను నది కడపమండలమున, ననంతపురమండలమునఁ గలదు. దానికిఁ జేవయే యుండదు. చాలకాలముండినఁ బడిపోవును. అంతియగాని చేవయే దానికి లేదు. బల్లారి ప్రాంతము నందును, బల్లారియందు ప్రతియింట నీ చిగురుచెట్లు కలవు. కాని వాని నాయూర సిగరచెట్లందురు. అనంతపురమండలమున విశేషించి యాచెట్ల ను వంట కట్టెయల కుపయోగింతురు. ఈకారణమునుబట్టి యీప్రాంతముల నున్నవాఁ డనియు యూహింప నవకాశము గలదనవచ్చు. చిగురు కొమ్మయను పదము నిటీవల ముద్రించువారు ‘చిగురుఁ గొమ్మ’యని దిద్దిరి. చిగురు అను పదమును విశేషణముగా భావించి ద్రుతమును పిదప ద్రుతకార్యమునుజేసి చిగురుఁ గొమ్మయని చేసిరి. అది

మిగులఁ బొరపాటు. 1879 సం॥ భారతీనిలయ ముద్రాక్షరశాలయందు పిళ్లారుసెట్టి రాఘవయ్య నాయడుగారిచే ముద్రింపఁబడిన మనుచరిత్రమునందు "చిగురుకొమ్మైన" అనియే కలదు. కాని యర్థమున మాత్రము లేతకొమ్మ యనియే వ్రాసిరి. చిత్రము మీద నీయర్థము వ్యాఖ్యానము చేసినవారు వ్రాయలేదనుట సత్యము. చిగురుచెట్టు యొక్క కొమ్మకుంగూడఁ జెప్పఁగలదనుట సరసము. ఈపద్యమునందుఁ జేర్కొన్న విషయముల కీయర్థము సరిపడి యుండును.

ఈపేర్కొన్న కారణములంబట్టి కడపమండలమునఁ బెద్దన పెద్దనపాడు వందో, కోకటమునందో యున్నవాఁడనుటకుఁ బైకారణములు కొంతవఱకుఁ జాలి యుండును. కాని యిదియే సత్యమనియు వచింపఁజాలక యున్నాను. ఇతరస్థలవాసుఁడనుట కింతకంటె నెక్కుడు కారణము లుండిన నీయూహలు నిలువఁ జాలవు కదా ! ఐనను నాకుందోఁచినవానిని దెల్పితిని. దీనఁదప్పేమియులేదు. పెద్దనపాడు నందుఁగల ప్రథమ తాంబూల మాగ్రామవాసుఁడే కాకున్నఁ బుట్టదని మాత్రము చెప్పగలను. అల్లసాని పెద్దన్నగారు మఱొకరుండగూడదా యన్నఁ గూడదని యెట్లు చెప్పవచ్చును ? అది యంత యుక్తియుక్తమగు ప్రశ్నము కాదనవచ్చును, ఈమహాత్ముఁడు కవితల్లజుఁడు మాత్రమేకాక శూరుఁడనియు దక్షిణదేశ దండయాత్రలయందు పాల్గొనెననియు వందొక్క గ్రామము రాయల వారీయన కొసంగిరనియు స్పష్టమగుచున్నది. కావున భారతమున ద్రోణాచార్యులంబోలి యీ పెద్దన శ్రీకృష్ణదేవరాయల కాలమున నన్నివిధముల నాచరిభువతింసమునకుఁ దోడ్పడుచుండెననియుఁ, గావుననే, "పల్లకి తన కేలఁ బట్టి యెత్తె" నని చెప్పుకొనెననియుఁ దక్కఁగల కవులకిట్టి గౌరవమందు లేదనియుఁ గన్పడును. కోకటముమాత్రమే గాక యింక నసేకాగ్రహారముల నడిగిన సీమలయందెల్ల రాయలిచ్చినట్లు చెప్పుకొనుట నుసంగతముగా నున్నయది. ఇన్నివిధముల రాజచూడామణి తన్నాదరించుచున్నందుననే "కృష్ణరాయలతో దివి కేగలేక బ్రదికి యున్నాఁడ జీవచ్ఛవంబ నగుచు" అని చెప్పుకొనియెను. దీనింబట్టి యీమహాపురుషుఁడు మిగులఁ గృతజ్ఞుఁడనియుఁ గన్పట్టును. ఇంక నీవిషయమును దెంచి వ్రాయక కృతి విషయమును గూర్చికొలఁది మాటలు వ్రాసెదను.

పెద్దనార్యునితండ్రిపేరు చొక్కనామాత్యుఁడు. తల్లిపేరు తెలియదు. ఈయన ఋగ్వేది. ఆశ్వలాయనసూత్రుఁడు. వశిష్టసగోత్రుఁడు.♦ ఇతఁడు ప్రథమమున స్మార్తుఁడైనను గొంతకాలము తరువాత 'శఠగోపయతి'యను వైష్ణవస్వాములవారియొద్ద వైష్ణవస్వీకారము జేసినట్లు గాన్పించుచున్నది. మనుచరిత్రములో:—

"కొలుతున్ మద్గురు విద్యా
నిలయున్ గరుణాకటాక్షనిబిడజ్యోత్స్నా
దళితాశ్రితజనదురిత
చ్ఛలగాఢధ్వాంతసమితి శఠగోపయతిన్."

అని గురుస్తుతి జేసికొనియెను. మఱియు నీయన రచించిన రెండవ గ్రంథ మగు హరికథాసారమునగూడ:—

"శఠగోపయతికి శఠతరు
కుఠారకోప మమతికిని గురుమతహృత్క
ర్మఠనిరతికిఁ జతురాగమ
పఠనాయతనియతికి నజపా సంభృతికిన్."

♦ ఇప్పటికిని యీగోత్రమువారైన అల్లసానివారు అనంతపురం జిల్లాలోను, కర్నూలు జిల్లాలోను కొన్ని గ్రామములలో నున్నారట. అల్లసాని కుటుంబమువాఁడైన అల్లసాని రామనాథము అను యువకుఁడు రాజమహేంద్రవరమువచ్చి అచ్చట నున్న మహాకవులగు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు, చిలకమర్తి లక్ష్మీనృసింహముగారు, వడ్డాది సుబ్బారాయుడుగారు మున్నగువారియొద్ద శుశ్రూషఁజేసి ఆంధ్రకవిత్వరచన మలవరించుకొనుటకుఁ గొంతవరకు నంతేవాసిగా నుండెను. అపిల్లవానికి నేనుగూడ పైన పేర్కొనిన వారివలెనే యాతిథ్యము నొసంగి వాని కుటుంబవిషయములుఁ గనుగొనినాను. అనంతపురం జిల్లాలో పోతురాయి, ఇల్లూరు గ్రామములలోను, కడప జిల్లాలో కోకట గ్రామములోను, కర్నూలు జిల్లాలో శృంగినమల, సలకంచెరువు గ్రామములలోను అల్లసానివారి కుటుంబములు ఇప్పటికిని యున్నట్లు తెలియవచ్చినది.

అని తనగురువును శఠగోపయతిగాఁ బేర్కొనెను. ఇతరాంధ్రకవులవలెఁ గాక, యీకవీశ్వరునిజీవితవిషయమున నొకగొప్పవిశేషాంశ మున్నది. అది యేదనిన, నితరాంధ్రకవుల జీవితవిషయములును, వంశవిషయములును దాముఱచించిన గ్రంథములనుండియే తెలియవచ్చుచున్నవి. ఈకవివిషయములో నటుల గాదు. ఇతఁడు రచించిన గ్రంథములకంటె, నితఁడు జేసిన దానశాసనములమూలమున మనకెక్కువ భోగట్టా తెలియవచ్చుచున్నది. బ్రాహ్మణకవియైనను రాజనీవి నన్నివిధముల ననుభవించె నని యోచింపవచ్చును. ఈకవీశ్వరుఁడు శ్రీకృష్ణదేవరాయలయొద్ద నాస్థానకవియై, యైశ్వర్యవంతుఁడుగా నుండెను. మఱియు రాజుచే ననేకబహుమతులను, సన్మానములను బొందియుఁ దానే యనుభవింపక నితరులకుఁ గూడ దానములు సేయుచుండెను.

"కోకటగ్రామాద్య నేకాగ్రహారంబు
లడిగినసీమలయందు నిచ్చె"

నని పెద్దనార్యుఁడు కృష్ణరాయల స్మృతిపద్యములోఁ జెప్పుకొనెను. శ్రీకృష్ణదేవరాయ లీతనికిఁ గడపజిల్లా గండికోటసీమలో నున్న 'కోకట' గ్రామము నగ్రహారముగ నిచ్చినట్లుగ దానశాసనము లున్నవి. ఆకోకట గ్రామమునకు 'శఠగోపపుర'మను పేరు పెట్టి పెద్దనార్యుఁడు దేవబ్రాహ్మణులకుఁ దిరుగ దానముసేసి రెండుశాశనములు జెక్కించెను. మొదటి శాసనమున విజయవాడలో నున్న మల్లికార్జునదేవులసన్నిధిని దా నీశాసనమును జేసినట్లు చెప్పుకొనెను. ఆశాసనము 25_4_1518 తేదీకి సరియైన శకాబ్దకాలమున వెలువడినది. దీనిలోఁ గోకటగ్రామములోఁ గొంతభాగ మాగ్రామములో నున్న 'సకలేశ్వరదేవు'నికి ధూపదీప నైవేద్యముల కిచ్చినట్లుగా నున్నది. రెండవశాసనము 31_10_1518 తేదీనాఁటిది. దానియందును గోకటగ్రామములో మఱికొంతభూమిని నా

గ్రామములో నున్న చెన్నకేశవస్వామివారి దీపారాధనకు నిచ్చివేసెను. ఇట్లు దాను బొందిన కోకటగ్రామాగ్రహారమును శివకేశవు లిరువురకు సమర్పించెను. ఇంక నీకవివరునిగుఱించి మఱియొకశాసనము గాన్పించు చున్నది. ఇది దక్షిణ 'ఆర్కాటు'జిల్లాలో నున్న 'అన్నూరు'గ్రామము నకు సంబంధించినది. ఆజిల్లాలోనున్న కరివాచిసీమలోనున్న 'అన్నూరు' గ్రామములోఁ గొంతభూమిని నాగ్రామమందలి శ్రీవరదరాజస్వామివారి కిని, అమ్మవారికిని 'యంగరంగవైభవాలకు ధూపదీపనిత్యనైవేద్యాదు లకు' నిచ్చివేసెను. ఈశాసనము 6-11-1519 నాఁటిది. దీనియందు బెద్ద నార్యుఁడు తనకు 'నాంధ్రకవితాపితామహుఁ'డను బిరుదు గలిగినటులు జెప్పుకొనెను. ఈబిరుదుప్రశంస కోకటశాసనముల రెంటియందును లేదు. ఇంతియేగాక, చిత్తూరుజిల్లాయందలి 'మేల్పాడు'గ్రామ రికార్డులో నల్ల సాని పెద్దనార్యుని ప్రశంస కొంత గాన్పించుచున్నది. శ్రీకృష్ణదేవరాయ లల్లసాని పెద్దన్నకు 'తానెంపూడి'గ్రామము నగ్రహారముగా నిచ్చినట్లును, నాగ్రామములోఁ గొంతభాగ మాకవిపుంగవుఁడు 'చోళేంద్రసింగయుద యరాక్'అను దేవునికి సమర్పించినట్లును, ఇత్యాదివిషయములు గాన్పిం చుచున్నవి.

వీని నన్నిటినిఁ జూడఁగాఁ బైనఁ జెప్పినరీతిని నల్లసాని పెద్దనా ర్యుఁడు శ్రీకృష్ణదేవరాయలవల్ల ననేకాగ్రహారసన్మానములను బొంది నట్లును, వానిని దానే ప్రత్యేకముగా ననుభవింపక దేవద్విజులకు దాన ధర్మములు జేసికొనినట్లును సువ్యక్తమగుచున్నది.

పుట్టుకలో నితనిస్థితి యెట్లున్నదో దెలియదు కాని, కావ్యయ శస్సు పెంపొందినది లగాయతు ముఖ్యముగా శ్రీకృష్ణదేవరాయల యాశ్ర యము గలిగినదిమొదలు నీకవీశ్వరుఁడు సిరిసంపదలతోఁ దులతూఁగు చుండె నని జెప్పవచ్చును. అంతసంపద యున్నను దేవబ్రాహ్మణభక్తి

వదలలేదు. కేవలము భోగపరాయణుఁడై దాను సంపాదించిన దంతయు విషయలోలత్వమునఁ బోఁగొట్టుకొనక త్యాగశీలుఁడై కీర్తి గడించెను. శ్రీనాథుఁడుగూడ ప్రభువులవలన ననేకబహుమానములఁ బొందినట్లు గాన్పించుచున్నది. కాని, యా ధనధాన్యసంపద లన్నియుఁ దన భోగేచ్ఛకై వినియోగించెనేమో యని సందేహింపవలసి యున్నది. తుట్టతుదకు వార్ధక్యములో దారిద్ర్యము ననుభవింపక తప్పినది కాదేమో యని యనుమానింపవలసియున్నది. అల్లసాని పెద్దన్నను గూర్చి వినవచ్చుచున్న చాటూక్తులు నాతఁడు భోగి యనియు, వైభవోన్నతులతోఁ బొరలుచుండె ననియు సూచించుచున్నను ప్రాతిపదికమైన సౌశీల్యమును, దైవభక్తిని మాత్రము గోల్పోవ లేదని యీశాసనాదికములు వేనోళ్ళఁ జాటుచున్నవి. రెండవవిషయము, ఇతడు వైష్ణవము స్వీకరించినను దనప్రభు వగు కృష్ణరాయలవలెనే దానును శివకేశవులయెడల సమానమైన భక్తితాత్పర్యములు గలిగియుండెనని దెలియవచ్చుచున్నది.

కృష్ణదేవరాయ లొకానొకసమయమున నేదోవిషయమును గురించి కవిత్వముసెప్పుమని పెద్దనార్యు నడుగఁగా నాప్రభువున కిట్లు జవాబిచ్చెనట.

చ. నిరుపహతిస్థలంబు రమణీప్రియదూతిక తెచ్చియిచ్చు క
ప్పురవిడె మాత్మకింపయిన భోజన ముయ్యెలమంచ మొప్పుత
ప్పరయు రసజ్ఞు లూహ తెలియంగల లేఖకపాఠకోత్తముల్
దొరకినఁగాక యూరక కృతుల్ రచియింపుమటన్న శక్యమే?

దీనినిబట్టి మనకుఁ దెలియుగలదేమనఁగా నీకవీశ్వరుని కవిత్వము శరీరసౌఖ్యమునుండియు, మనస్సౌఖ్యమునుండియు చెలమనుండి పొంగి పొరలుచున్న జలమువలెనే నైసర్గికముగ నుప్పతిల్లి యానందమును గలిగించుచుండును. సుఖస్థితిలోనుండు పలుకు మృదుమధురముగానుండు

నుగాని కటువుగాను క్లిష్టముగా నుండదుగదా! ఇట్టి యానందదాయక మగు గుణ మీతని కవిత్వమునం దెచ్చట జూచినను గానుపించుచుం డును. ఈయానందము కేవలమైంద్రియకమేనా? లేక యాధ్యాత్మిక ముగఁగూడ నగునా? అను నంశ మీవిమర్శనమందు క్రమక్రమముగా విశదము కాఁగలదు.

పెద్దనార్యుఁడు మనుచరిత్రము, హరికథాసారము అను రెండు గ్రంథములు రచించెను. ఈరెంటిలో మనుచరిత్రముమాత్రమిప్పుడు లభ్యమగుచున్నది. హరికథాసారము మైసూరు ప్రాంతములో నున్నట్లు దెలియవచ్చినదని శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు నాతో నొకపరి సెలవిచ్చిరి. ప్రాచీనాంధ్ర గ్రంథముల కొఱకు వెదకువారు ఆప్రాంత మందలి పుస్తకాగారములను బరిశోధింపవలెను.

ప్రస్తుతము పెద్దనార్యునికీర్తి మనుచరిత్రము మీదనే యాధారపడి యున్నది. ఆంధ్ర ప్రబంధమగు 'ఆముక్తమాల్యద'యును 'సత్యావ ధూప్రీణనము' ఇత్యాది సంస్కృతగ్రంథములను గూడ నీకవి రచించెనని జెప్పు లోక ప్రవాదము సరికాదని సహేతుకముగా వెనుకటి నా 'ఆముక్తమాల్యదావిమర్శ'లో గనఁబఱచితిని. ఆగ్రంథములు శ్రీ కృష్ణదేవరాయలే వ్రాసి తనకవితా గురువగు పెద్దనార్యుని సాయము గొంత దీసికొని యుండవచ్చునని జూపఁగలిగితిని. పెద్దనార్యుఁడు 'రామ స్తవరాజము, అద్వైత సిద్ధాంతము' అను రెండు గ్రంథములనుగూడ వ్రాసెనని కావలి వెంకటస్వామిగారు (The deccan poets అను ఆంగ్ల గ్రంథములో) జెప్పిరి. దీని యథార్థము మృగ్యము.

## మనుచరిత్రము—కథాభాగము.

ఆర్యావర్తదేశములో వరుణానదియొడ్డున నరుణాస్పదం బను పట్టణ ముండె ను. అందుఁ బ్రవరుఁ డను బ్రాహ్మణోత్తముఁడు నివసించియుండెను. అతఁడు శేశ

వయస్సువాఁడు. మన్మథునివలె బహుచక్కనివాఁడు. అతఁడు సాంగవేదవేదియై నిత్యవైదికానుష్ఠాననిష్ఠాతుఁడై, అధ్వరము జేసి, సోమయాజియై మనోవాక్కాయకర్మభిః ఏకపత్నీవ్రతుఁడై, తనసోమిదేవమ్మతోఁ గూడ తలిదండ్రుల సేవఁజేయుచు, నతిథ్యభ్యాగతులకు రేయింబవళ్లు మజ్జనభోజనాదిసత్కారము లొసంగుచు, రాజులకైనను 'దేహి' యని చేయి చాఁపక, తన వృత్తిమాన్యములనుండి గ్రాసముం దెచ్చుకొనుచు, శిష్యులతోఁగూడ స్వగృహమున కాపురము జేయుచుండెను.

అతనియింటి కొకనాఁ డొక సిద్ధుఁడు వచ్చెను. ఆసిద్ధున కర్ఘ్యపాద్యము లిచ్చి, భోజనాదిసత్కారముల నాతనిఁ దన్పి, కుశల మడుగుచు నాతఁడు జూచిన చోద్యముల వినిపింప వేఁడికొనెను. అంతట నాసిద్ధుఁడును దానుఁ జూచియున్న చిత్రముల నభివర్ణించుచు, హిమవత్పర్వతముల మహిమను జెప్పెను. ఆవిషయము లన్నియు విని, ప్రవరుఁడు హిమవత్పర్వతమునందుండిన మహిమలఁ గనుఁగొననెంచి, కుతూహలముతో స్వల్పకాలములో నింతటిమారస్థలములఁ జూచెడు భాగ్యము దనకుఁ గలుగఁజేయుమని వేఁడెను. ఆసిద్ధుఁడు ప్రవరునిపాదముల నొక పసరు రాసి, దానిమహాత్త్వమున నతిత్వరలో నెచ్చటికైననుఁ బోవచ్చునని జెప్పి వెడలిపోయెను.

ఆవెంటనే ప్రవరుఁడును రసమహాత్త్వమున హిమాలయముఁ జూడఁబోయెను. అచ్చట ననేకదృశ్యముల వీక్షించి గృహోన్ముఖుఁ డయ్యెను. ఎండవేడిమిచేతను, మంచునీటిచేతను పాదలేపము కఱిగిపోవుటచే శీఘ్రగమనశక్తి వదలిపోయినది. కొండలమధ్య నేకాకిగా నుండి, యెటులైనను తన్నింటికిపంపెడు వా రుందురేమో యని వెదకుచుండ, నొకగంధర్వస్త్రీ యాతనికిఁ గనిపించెను. ఆమెపేరు వరూధిని. ఆమెతోఁ దన యవస్థనంతను జెప్పికొని, తనను దనయింటికిఁ బంపుమని వేఁడుకొనెను. కాని రూపజితమన్మథుఁడగు నాభూసురకుమారుని జూడఁగనే, వరూధిని కాతనియందు ప్రేమ యెక్కువయ్యె, మనం బాతనియందుఁ దగుల్కొనుటచే నెట్టియున నాతనిని దనతోనుండి సుఖింప వేఁడుకొనమొదలిడెను. ప్రవరుఁ డామెపలుకు లాదరింపక, మానవసాహాయ్యము లేమిని హుతాశనుని సమంత్రకముగఁ బ్రార్థింప వెంటనే యగ్నిదేవుఁ డాభూదేవు నింటఁ జేర్చెను.

ఇట్లుండఁగా వరూధిని ప్రవరునిపై మోహమున వేదనలఁ బొరలుచుండఁగా, ము న్నామెను కామించి, నిరసింపఁబడిన యొకగంధర్వకుమారుఁడు వరూధినీప్రవరుల

పరిసంగము నంతయుఁ దనయోగబలమున దెలిసికొని, యదేసముయముగా గైకొని, యామెను వంచింపఁదలంచి ప్రవరునివేషముతో నామె దరిఁ జేరెను. ఆమెయు వానికైతవమును గ్రహింపఁజాలక నిజముగ ప్రవరుఁడే యనుకొని, యాతనితో భోగించెను. తర్వాత నామె గర్భవతికాఁగా మాయాప్రవరుఁడు నిజసంగతి బయల్పడకేని వరూధిని శపించునని భీతిచే నేదో యొకనెపముపై మెల్లఁగా జారిపోయెను.

కాలక్రమమున వరూధిని ప్రసవించి 'స్వరోచి' యను మహాబలిష్ఠుఁడగు పుత్రునిఁ గనెను. అతఁడు మహర్షులచే నుపనీతుఁడై, క్షత్రియసంబంధమగు విద్యల నెల్ల నభ్యసించి మంధరపర్వతప్రాంతమందు రాజ్యము జేయుచుండెను.

అట్లుండ నొకనాఁ డాతఁ డరణ్యములో వేటాడుచుండఁగా నొకయార్త నాదము వినెను. అది యేదైయుండునని యోజింప నొకయువతి కాందిశీకయై రక్షింపుఁడుఁ రక్షింపుఁ డని తనదిక్కునకు బరుగెత్తుకొనివచ్చుచుండ, స్వరోచి చూచి, ధనుర్బాణములు సిద్ధముజేసి యడ్డుగ నిల్చిన, నాచకితాక్షి యాతనియెదుట నాగి, యారాజన్యుని యభయసంజ్ఞచే నూఱడిల్లి తనవృత్తాంతము నివేదించెను.

ఆమె యిందీవరాక్షుఁ డను గంధర్వరాజు కూఁతురు. పేరు మనోరమ. ఒకనాఁడు తనచెలికత్తెలగు కళావతీ విభావసులతో వనవిహారము సల్పుచు, బాల్యచాపల్యమున బూచివలెనున్న నొకమునినిపట్టి వేళ్లతో నొక్కఁగా నాతఁడు దెలివొంది, తన నాతఁడు బెత్తముతోఁ గొట్టియు రాక్షసునికి యాహారము గమ్మని యామెను శపించెను. అంతలోఁ జెలికత్తె లామునిని క్రూరుఁ డని నిందావాక్యములు బల్కుటఁ జేసి వారినిగూడ క్షయరోగమున బాధనొందుఁ డని యాముని శపించెను. ఇట్లు దనవృత్తాంతము జెప్పి, యస్త్రహృదయ మను విద్య స్వరోచికిచ్చి రక్కసునిబారినుండి రక్షింప వేఁడుకొనునంతలో నారాక్షసుఁ డుగ్రరూపమున నటకు వచ్చెను. తక్షణము స్వరోచి వానిని వధించెను. అంతలో నారాక్షసుడు నిజ [ఇందీవరాక్షుని] రూపము నొంది స్వరోచికిఁ దనకథ నంతయు నివేదించెను. కైతవముచే నొకమునివద్ద నాయుర్వేదము నేర్వఁగా నమ్ముని దుష్టరాక్షసుఁడవు గమ్మని శపించినట్లుదనవృత్తాంతము దెలిపెను. మనోరమ యాతని దనతండ్రి యని దెలిసికొని నమస్కరించెను. అంతట నిందీవరాక్షుఁ డాయుర్వేదమును స్వరోచికి నేర్పి మనోరమనాతనికిచ్చి పెండ్లి గావించెను. పిమ్మట మనోరమ చెలికత్తెలిద్దరును రాఁగా వారిరోగములు కుదిర్చి వారినిగూడ

వివాహమాడి, ముగ్గురుభార్యలతోడను స్వరోచి సుఖింపుచు, మువ్వురపుత్రులను గని, వారికిఁ బ్రత్యేకముగ రాజ్యములిచ్చి సంతోషముతో నుండెను.

కొంతకాలమిట్లు గడచినతర్వాత నొకచోట నొకహంసయు, చక్రవాకియు స్వరోచికాముకత్వముఁగూర్చి పరిహసించినవి. అది విని స్వరోచి సిగ్గుపడెను. కాని కాంతలపొత్తు వీడలేకఁబోయెను. తరువాత నొకమృగమిధునముఁగూడ నాతని హేళనము జేసెను. ఇంతలో వనదేవత యొక యాడులేడిరూపుతో నీతనిఁ జేరి స్పర్శనసుఖమిప్పించుమని వేఁడుకొనెను. రా జట్లుసేయుటయె తడవుగా నయ్యది స్త్రీయై, తాను వనదేవతయైనట్లును, స్వరోచివలన మనువుం గనుమని దేవతలు గోరినందున నవిధ్వముగ నాతనిఁ జేరినట్లును నిజకథ నెఱింగించి తన్ను పరిగ్రహింప వేఁడుకొనెను. స్వరోచియు నామెకోర్కెఁ దీర్చెను. అంత నామెకొక పుత్రుఁ డుదయించెను అతఁడే స్వారోచిషమనువు. అతఁడు మహావిష్ణువును బ్రార్థించి, వరములు బొంది చాలకాలము భూలోకములో రాజ్యముచేసిన మనువులలో నొకఁ డయ్యెను.

## మూలకథ

### (సంస్కృతమార్కండేయపురాణమునుండి సంక్షిప్తాంధ్రీకరణము)

వరుణానదీతీరమున అరుణాస్పదమను పురమున బ్రాహ్మణప్రవరుఁ డొకఁ డుండెను. * ఆబ్రాహ్మణుఁడు అశ్వినీదేవతలవలె రూపవంతుఁడును, మృదుస్వభావుండును, సద్వృత్తిగలవాఁడయిన వేదవేదాంగపారంగతుఁడును. అతఁడు యెల్లప్పుడు నతిథిసంతర్పణ జేయుచును రాత్రి వచ్చినవారికి సమాశ్రయ మిచ్చుచుండెను. అవిప్రున కొకకోరిక యుండెను. నానానగరశోభిత మైనదియు, యతిరమ్యవనోద్యానములు గలదియు నైన వసుంధరను జూడవలయు నను వేడుక పొడముచుండెను.

* మూలకథయందు బ్రాహ్మణప్రవరుఁ డనియే యున్నది. అనఁగా బ్రాహ్మణశ్రేష్ఠుఁ డనియర్థము. అతనిపే రెద్దియో గాన్పించదు. కావున మనుచరిత్రలోనున్న ప్రవరనామము అల్లసాని పెద్దన్న యిచ్చినదే.

అంత నొకనాఁ డొకయతిథి తద్బ్రాహ్మణునియింటి కేతెంచెను. ఆ యతిథి నానావిధయోషధిజ్ఞుఁడును, మంత్రవిద్యావిశారదుఁడును. ఆయతిథి శ్రద్ధాపూతముగా యభ్యర్చితుఁడై ద్విజపుంగవునికి ననేకదేశములను గుఱించియు, రమ్యమైన నగరములను గుఱించియు, వనములు, నదములు, శైలములు, పుణ్యాయతనముల గుఱించియు జెప్పెను. ఆబ్రాహ్మణుఁడు విస్మయావిష్టుఁడై యిట్లాయతిథితోఁ బలికెను. 'అయ్యా! అనేకదేశదర్శిత్వముచే చాల శ్రమనొందియున్నారు. చూచుట కతివృద్ధులు గారు. యౌవనమునుండి యెక్కువగా మరలియుండలేదు. కావున కొలదికాలములో పృథివి యంతయు నెట్లు సంచరించితిరి ?'' అందుల కాయతిథి మారుబలికెను, "మంత్రౌషధప్రభావమున అప్రతిహతగతి గలవాఁడనై సహస్రయోజనములను సైతము యర్ధదినమందు సంచరింపఁగలను.'' ఆమాటలు విని విప్రుఁ డాయతిథిభూసురు నిట్లు వేఁడుకొనెను. "అయ్యా! నేనును యీప్రపంచమును జూడ కుతూహలపడుచున్నాను. కావున మంత్రప్రభావంబును బ్రసాదింపుము.'' అంత నాయతిథి పాదలేపనమును యిచ్చి విషయములను బోధించెను. బ్రాహ్మణుఁడు పాదలేపనము ధరించి, సహస్రయోజనములును అర్ధదినములోఁ బోవఁగఁలను గాన, శీఘ్రముగ రావచ్చు నని యోచించి నానాప్రస్రవణాన్వితమైన హిమవత్పర్వతమునకుఁ బోయెను. ఆచేలికొండఁజేరి శ్రమఁ బొందనివాఁడై కొంతకాల మచ్చటచ్చట దిరిగి యవలోకించుచుండెను. ఇంతలో కరగిన మంచుచేత పాదలేపనము దుడుచుకొనిపోయి యాతఁడు జడగతియై యచ్చటచ్చటఁ దిరుగులాడుచు మనోజ్ఞములగు సానువులను, సిద్ధగంధర్వకిన్నరజుష్టములగు క్రీడావిహారారణ్యములో దివ్యాప్సరోగణములను దిలకించుచు పులకితగాత్రుఁ డయ్యు తృప్తిఁ బొందలేదు.

ఒకానొక సెలయేటిదరిని శిఖికేకాదినినాదములచేతను, దాత్యూహకోయష్టికలకలరావములచేతను, పుంస్కోకిలకలాపములచేతను మనోరమమై ప్రఫుల్లతరుగంధవాసితములగు మందపవనములచే వీచఁబడిన హిమవద్గిరిని ససంభ్రమముగా జూచెను. ఇట్లుఁ జూచి రేపటిరోజున తిరిగివచ్చి మిగిలినవి జూచెదననియోచించుకొని గృహముపైకు బుద్ధిమరల్చెను. అంతట కారిపోయిన పాదలేపనముగల యాద్విజుఁడు జడితక్రముఁడై "యేమి యిది! యజ్ఞానమున జేసితిని. హిమవారిచే కరగిపోయి పాదలేపనము నష్టమైనయెడల నీశైల మతిదుర్గమము. నేను చాలదూరము వచ్చినాఁ

డను. అగ్నిశుశ్రూషాదికములు జేయనియెడల ప్రత్యవాయదోషము సంభవించును. వాని నిచ్చట నే నెట్లుఁ జేయఁగలను ? గొప్పసంకటము తటస్థించినది.'' అని విచారించుచు "ఆహా! యిది యెంతరమ్యముగనున్నది. అత్యంతమనోహరముగ నున్నది. ఈదృశ్యమును మనస్ఫూర్తిగా నూరుసంవత్సరములు జూచినను తృప్తి పొందఁజాలను. కిన్నరకలాపములు, ప్రఫుల్లతరుగంధములు, సుఖస్పర్శమగు వాయువులు, రసవంతములగు ఫలములు, మనోహరములగు కొలను లన్నియును డెందమునకు యానందము కలిగించుచున్నవి. అయినను నెవ్వరైన తపోనిధినిఁ జూచి యింటికేఁగుటకు మార్గము నడిగెదను'' అని వితర్కించుకొనెను.

ఇట్లు చింతించుచు మంత్రౌషధము పోవుటచే వైక్లబ్యము బొందిన యాబ్రాహ్మణుఁడు హిమవద్గిరిమీఁదఁ దిరుగుచుండెను. ఇట్లు దిరుగుచుండఁగా, అప్సరసశ్రేష్ఠురాలును, రూపశాలియు నగు వరూధిని యాబ్రాహ్మణునిఁ జూచెను. చూడఁగానే యాతనియందు మదనాకృష్టమానసురాలై యనురాగమును బొందెను. ఈరమణీయతమమైన యాకృతిగల పురుషుఁ డెవ్వఁ డని చింతించుచు తన నాతఁడు అవమానించనియెడల తనజన్మ సఫల మగునని యోచించుకొనెను. "ఆహా! ఎంతటి రూపమాధుర్యము! గమనలాలిత్యము! చూపులయందలి గాంభీర్యము! వీనికి సమానుఁ డెచ్చటను గలఁడే! దేవతలు, దైత్యులు, సిద్ధులు, గంధర్వులు, పన్నగులు నాచేఁ జూడఁబడిరి గాని, వారిలో నీతనికి తుల్యుఁడు లేఁడు. నే నాతనియందు తగులుకొనినట్లు నాయం దాతనికి ననురాగము గలిగిన నా కార్యము సమకూరును. నా పుణ్యసంచయము ఫలించును. నాయం దాతనిదృష్టి సుస్నిగ్ధముగ బడినయెడల ముల్లోకములయందును నాకంటె పుణ్యతరమైన స్త్రీ యుండఁబోదు. ఇట్లాలోచించుచు తన కమనీయతరమైన యాకృతిని స్మరాతురాలై యాదివ్యాంగన యాద్విజునకుఁ జూపెను. ఆవిప్రుఁ డాచారురూపిణియగు వరూధినిని జూచి సమీపించి యిట్లు బలికెను, "ఓ కమలగర్భాభ! నీ వెవరవు ? ఎవరికొఱ కిట్లు నిలుచున్నావు ? నేను అరుణాస్పదమను గ్రామమునుంచి వచ్చిన బ్రాహ్మణుఁడను. పాదలేపనసహాయమున నిచ్చటకు రాఁగల్గితిని. అది యీమంచునీటిచే కరగి చెడిపోయినది.'' ఆమాటలకు వరూధిని యిట్లు బలికెను, "నేను వరూధిని యను పేరుగల అప్సరసస్త్రీని. నేను ఎల్లప్పుడును యీరమణీయమగు హిమగిరిసాను

వులఁ దిరుగుచుందును. నిన్నుఁ జూడఁగానే నీయందు మోహముగలిగి నా కామము జెప్పుకొనవలసివచ్చినది. నీ వేమియాజ్ఞాపించినను జేయుదానను. నీ కధీనురాలనైతి ని.'' ఆమాటలకు బ్రాహ్మణుఁడు ''ఓ కల్యాణీ! ఏయుపాయమున నే నింటికిఁ జేరఁగలుగుదునో దానిని జెప్పుము. ఇంటికి వెళ్ళనియెడల నిత్యనైమిత్తిక కార్యములు జరుగక హాని గలుగును. కావున నన్నెట్లయిన నీగిరినుండి యుద్ధరింపుము. బ్రాహ్మణుల కెప్పుడును ప్రవాసము చెల్లదు. కావున నాదేశదర్శనకౌతుకము నాకుఁ దగినది కాదు. సమస్తకర్మలకును యునికిపట్టయినది ద్విజులకు గృహమేగాన దానిని విడిచినయెడల కర్మలన్నియు నశించును. కావున సూర్యుఁ డస్తమింపక మున్న నన్నింటికిఁ జేర్పుము''అనెను.

ఈమాటలకు వరూధిని ''ఓ మహాభాగా! యిట్లు జెప్పకు. నన్ను విడిచి పెట్టి నీస్వగృహమునకు నీవు వెళ్ళుట నేను సహించలేను. అట్లు జరుగకుండుగాక! స్వర్గముకంటె యీహిమాచలము రమ్యతరమైనదిగాన మే మిచ్చటనే వసించియు న్నాము. నీవు నాతోఁగూడ నీతుహినాచలమున రమించుచుండిన యెడల మనుష్య బంధువులను మఱచియేపోదువు. ఇచ్చట పూదండలను, వస్త్రాలంకారములను, భోగ్య భక్ష్యములను మున్నగువానిని నీ కిచ్చెదను. కిన్నరులు పాడెడు వీణావేణుస్వనయుక్త మైన సంగీతమును వినియెదవు. సుఖమైనవాయువును, వెచ్చనియన్నమును, చల్లని నీరును, మృదులమైనశయ్యయును, సుగంధానులేపనమును నీ వనుభవింపగలవు. ఈ స్థలముకంటె నీ గృహ మేమియెక్కువ? ఇచ్చట నున్నవారికి ముదిమి యుండదు. త్రిదశులమైన మాకు నిత్యయౌవనమే. కావున నిచ్చటనే యుండు'' మని వలికి యాతనిని సరభసముగ యాలింగనము జేసికొనెను.

ఆబ్రాహ్మణుఁడు కౌఁగిలి విదల్చుకొని ''నన్ను ముట్టకు. ఓదుష్టురాలా రా! నీసదృశుఁ డెచ్చటనుండునో యచ్చటి కరుగుము. నేను యాచించినది యొకటి, నీ వాచరించినది మఱియొకటి. సాయంప్రాతఃకాలములవేల్చిన హవ్యము శాశ్వతలోక ముల నిచ్చును. ఓ మూఢురాలా! యీమూఁడులోకములును హవ్యముమీఁదనే యాధారపడియున్నవి. ఆమాటలను వరూధిని ''నీకేల నేను ప్రియమగుట లేదు? ఈపర్వతము రమణీయము కాదో? గంధర్వకిన్నరులను విడిచి యింకేమికోరెదవు? పోనీ మాసహాయమున నీస్వగృహమునకు నీవు నిస్సంశయముగఁ జేరఁగలవు. నీవు

స్వల్పకాలమైనను నాతోనుండి యీ సుదుర్లభమైన భోగము లనుభవింపు'' మనెను. ఆమాటల కిట్లు విప్రుఁడు మారుపల్కెను. "నాకు సతతము గార్హపత్యాదిత్రయాగ్ను లును యిష్టము. అగ్నిశరణమే రమ్యమైనది. స్వాహాదేవియే నాకు ప్రియమైనది.''

అంత వరూధిని "పరమాత్మ కుండవలసిన యిష్టగుణములలో కరుణ మొదటిది. కావున ధర్మపాలకుఁడవగు నీవు నాయందాకరుణను యెందుకు జూ పవు? నీవు విడిచినచో నే నింక బ్రతుకను. ఈమాట లెంతమాత్రము బూటక ములు గావు. కావున ప్రసాదింపు''మనెను. అందుకు బ్రాహ్మణుఁడు "నాయందు నీకు నిజముగ ప్రీతియున్నచో మొగమోటమికి మాత్రమే బలుకకుండినచో నేనెట్లు స్వగృహమునకుఁ బోఁగలుగుదునో ఆయుపాయముఁ జెప్పుము.'' అన, వరూధిని "తప్పక నీ యిల్లు చేరెదవు. ఇచ్చట నీవు కొద్దికాలముండి యీభోగము లనుభవిం పుము.'' అనెను. బ్రాహ్మణుఁడు "ఓ వరూధినీ! విప్రులకు భోగానుభవము శాసిం పఁబడలేదు. వారి కీజన్మ క్లేశముకొఱకే. ఉత్తరజన్మయే ఫలప్రద'' మని మారుపల్కె ను. వరూధిని "మృత్యువునుంచి నన్ను సంరక్షించుట వలననీకు పరలోకమున పుణ్యఫలము లగు భోగములు కలుగును. కావున నీవు రెండువిధములగు లాభములను పొందఁగలవు. లేనియెడల నా కిక్కడ చావును, నీకు పాపమును సంఘటిల్లు'' నని వేఁడికొనెను. దానికి బ్రాహ్మణుఁడు "పరస్త్రీలను అభిలషింపఁ గూడదని నాగురువులు జెప్పిరి. కావున నీ పొత్తు నే వాంఛింపను. నీ విష్టమైనట్లుగా యేద్చుము, శోషింపు'' మని ప్రత్యుత్తర మిచ్చెను. ఇట్లు పలికి అమ్మహానుభావుఁ డాచమనముచేసి శుచిర్భూ తుఁడై నమస్కారపూర్వకముగా గార్హపత్యాగ్నిని గూర్చి యిట్లు స్తుతించెను. "ఓ భగవంతుఁడగు గార్హపత్యాగ్ని! సర్వకర్మలకు నీవే యాధారము. నీనుంచియే ఆహవనీయదక్షిణాగ్నులు బుట్టినవి. నిన్ను తృప్తిపరచుటచేతనే దేవతలు వర్షమును, సస్యములను, యిచ్చుచున్నారు. సస్యములవలనే యీయఖిలజగత్తు కలిగినది. కావున నన్నిటికిని నీ సత్యమే మూలకారణము. నే నెన్నడును వైదికకర్మ సకాలమున చేయక విడువనియెడల యీశోభన సూర్యుఁ డుండఁగానే నేను నా గృహమును జూతును గాక! నే నెన్నడును పరదారపరద్రవ్యములను గోరనియెడల సూర్యుం డుండఁగానే నే నిప్పుడు నా గృహమును జేరుదును గాక!'' ఇట్లు స్తుతింపఁగా గార్హపత్యపావకము తత్క్షణమే అయువశరీరమందు ప్రవేశించి ఒడలునంతయు ప్రభా

మండలమున బ్రవేశించెను. కావున వరూధినికి యాద్విజునిఁ జూచుటచే మఱింత మోహముఁ బుట్టెను. వెంటనే యాతఁడు వరూధిని జూచుచుండఁగా హవ్యవాహను నిచేఁ గొంపోఁబడి యిల్లు జేరెను. తాను నిర్వర్తించవలసిన వైదిక కాండ మంతయు శీఘ్రముగఁ జేసికొనెను.

ఇచ్చట వరూధిని యాతనియందే మన స్సుంచుకొని యాహార్నిద్రలతయు, రాత్రియందుగూడ విచారముతో నిట్టూర్పులు నిగిడించుచు మాటిమాటికి నేడ్చుచు తనమందభాగ్యతను నిందించుకొనుచు ఆహారవిహారములను త్యజించి విలపించుచుండెను. “ఆతఁడు నన్ను దిరస్కరించినతరువాత యీతాపవ మెందుకు? ఈశైల శిఖరమున నే నెచ్చటికిఁ బోదును? నాకట్టి పురుషుఁ డెచ్చట తిరిగి గోచరింపఁ గలఁడు? ఆతనియందలి దుస్సహకామాగ్నిచే నే నవశ్యము క్షీణింపవలసినదే? ఇదివరలో మనోహరములగు కోకిలముల కూతలు నా కిప్పుడు ప్రాణసంకటముగ నున్నవి” అని విలపించెను.

ఈప్రకారము మదనావిష్టురాలై యాబ్రాహ్మణుని నెరకుటకు బయలు దేరినది. ఇట్లుండ వెనుక వరూధినియందు మక్కువకలిగి ఆమెచే నిరాకరింపఁబడిన కలి యను గంధర్వుఁడు ఆమెయవస్థను కన్నులారఁజూచి యిట్లు చింతించెను. “ఏమి వరూధిని యిట్లు దుఃఖితురాలై యున్నది? కన్నీళ్ళు ధారలుగా విడుచుచున్నది. ఏమునియైనను శపించెనా? లేక యేపురుషుఁడైనను అవమానించెనా? ఈసంగతి యంతయు కనుఁగొనెదను” అని తనదివ్యదృష్టిని జూడఁగా నాతనికి సమస్తము యథార్థముగాఁ గోచరించెను. బ్రాహ్మణునిసంగతి యంతయు తెలిసినవాఁడై యాగంధర్వుఁడు చాల సంతసించి యిది యంతయు తనమేలుకే జరిగినదని యూహించుకొనెను. “నే నెన్నిసార్లు బ్రతిమాలినను నన్ననురాగముతోఁ జూచినది కాదు. ఇప్పుడామె నా చేతిలోఁ జిక్కినది. ఆబ్రాహ్మణునియందు ప్రేమయుగ్రము ముగా నుండినయామె నే నాతనిరూపును ధరించిన నాకు లొంగిపోవును. ఇంక నాలస్య మెందుకు? వెంటనేబోయెద” నని దలంచెను.

ఇట్లు యోచించి యాతఁడు విప్రునిరూపము ధరించి యచ్చట తిరుగాడు చుండఁగా వరూధిని జూచి దగ్గరి కరుణింపుమని యాతనిని వేఁడుకొనెను. “నీవు నన్నువిడిచిన నా జీవితమును నే విడిచెదను. ఇది నిస్సందేహము, నీకు అధర్మమును

క్రియాలోపమును కలుగును. నాతో రమించినయెడల నన్ను రక్షించినధర్మమును పొందఁగలవు. నేనింకను జీవించుటగూడ జరుగును. కావున నే నీ విట్లు నాకు హృదయాహ్లాదకరముగ తిరిగి వచ్చినావు'' అందుకు గంధర్వుఁడు "నే నేమి చేయుదును. నాకు క్రియాహాని గలుగుచున్నది. నీ విట్లు పలుకుట మానలేదు. కావున నాకు గొప్పసంకటము తటస్థించినది. నేను చెప్పినప్రకారము నీవు చేయుదువా, నీతో సంగమము చేయుదును. లేనియెడల కుదురదు.'' అనెను. ఈమాటలు విని వరూధిని ప్రసాదింపు మనియు, ఆత నేమిచెప్పినను తాను నిక్కముగఁ జేసెదననియు బాస యివ్వఁగా కలిగంధర్వుఁడు సంభోగసమయమున నిమీలతలోచనగ నామె యుండవలసినదని నియమించెను. అందుల కామె యొప్పుకొని సర్వవిధముల నాతనికి వశ్యురాలనని ప్రమాణము చేసెను.

తరువాత వా రిద్దరుసుకలసి పర్వతకంధరములయందును, సరస్సులతీరములయందును, వనాంతరములయందును విహరించుచు, భోగించుచు గొంతకాలము గడచిరి. క్రమముగ నామె చూలాలయ్యెను. తనపని నెరవేరినదని తలఁచి యావ్యాజద్విజుఁడు విడిచిపోవుటకు నామెను సాంత్వనపరచి వేఁడఁగా నామె ప్రీతితో నాతనిని విసర్జించెను. ఆమె కొకకుమారుఁడు గలిగెను. ఆబాలుఁడు సహజముగ ప్రభాన్వితుఁ డగుటచే స్వరోచి యను పేరున బిలువఁబడెను. ఆపిల్లవాఁడు క్రమముగ వేదములును, ధనుర్వేదమును యితరకళల నభ్యసించినవాఁడై యౌవనారంభమున నొకనాఁడు మంధరాద్రిపైఁ దిరుగుచుండఁగ భయాతురయగు నొకకన్యను జూచెను. ఆమె "రక్షింపు రక్షింపు'' మని కేకలిడుచు నేడ్చుచుండెను. భయపడకుమని యాతఁడు హెచ్చరించుచు నామెదరికిఁ జేరెను. ఏమియిది యని యడుగఁగా నామె తనవృత్తాంత మిట్లు చెప్పఁదొడంగెను. "నేను యిందీవరాక్షుఁడను విద్యాధరుని కుమార్తెను. పేరు మనోరమ. నాతల్లి మరుధన్వుని పుత్రిక. మందారుఁడను విద్యాధరుని దుహితయగు విభావరియు, పారుఁడను మునియొక్క తనయయగు కళావతియును నా చెలికత్తెలు. వారితో నే నొకనాడు కైలాసతటమునకుఁబోయి విహరించుచు నొకకృశించినతాపసిని జూచి పరిహసించితి. అతఁడు కోపించి నన్ను శపించెను. * అతని నన్యాయముగ నపహసించినందుకు నేను రాక్షసునిచే పరిభ

* ఈమూలమందు ముని శపించినట్లుగాని బెత్తముతోఁ గొట్టినట్లు లేదు.

వము బొందెదవని నిష్ఠురశాపమిచ్చెను. అంతట నాసఖులుకూడ నాముని నిందించిరి. వా రిట్లనిరి. "క్షమలేని నీకు బ్రాహ్మణ్య మేటికి? తపస్సేటికి? బ్రాహ్మణ్యము క్షాంతికిని, తపస్సు క్రోధసంయమమునకును స్థానములు. అవి నీకు లేవు." ఈమాటలు విని యాతఁడు ఒకతెను కుష్ఠురోగముచేతను, రెండవదానిని క్షయరోగముచేతను బాధపడుఁ డని శపించెను. వారు తక్షణమే రోగపీడితులైరి. నన్ను మూఁడు రోజులనుంచి యొకరక్కసుఁడు వెన్నాడించుచున్నాఁడు. అదిగో వానికూత. నావల్ల నస్త్రహృదయమను విద్యను నేర్చికొని వెంటనే యాతనిని సంహరింపుము. ఆవిద్యను ప్రథమమున పినాకపాణి స్వాయంభువమనువున కిచ్చెను. ఆతఁడు సిద్ధుఁడగు వశిష్ఠునకును, యాతఁడు నామాతామహుఁడగు చిత్రాయుధునకును, యాతఁడు నాతండ్రికిని, నాతండ్రి నాకును క్రమమున నేర్పిరి. దీనివల్ల సమస్తరిపునాశమును జరుగును." అని తనచరిత్రి నుడివెను.

స్వరోచి శుచిర్భూతుఁడై యావిద్యను నేర్చికొనఁగానే రాక్షసుఁడు పరుగెత్తుకొనివచ్చి యాకన్యను గదిసెను. స్వరోచికిని యానిశాచరునికిని యుద్ధము సంభవించెను. స్వరోచి యొకమహాస్త్రమును ప్రయోగింపఁగా నక్తంచరుఁడు రక్షింపు రక్షింపుమని వేఁడుకొనెను. అంత స్వరోచి తనదివ్యాస్త్రము నుపసంహరించెను. రాక్షసుఁ డాక్షణమే యిందీవరాక్షుఁడను విద్యాధరునిగా మారి తనకథ నిట్లు జెప్పెను. "నేను యిందీవరాక్షుఁడను విద్యాధరుఁడను. నలనాభుఁడను. విద్యాధరపతికిఁ బుత్రుఁడను. ఈకన్యయగు మనోరమకుఁ దండ్రిని. పూర్వమం దొకనాఁడు బ్రహ్మమిత్రుఁడను మునియొద్దకుఁ బోయి నా కాయుర్వేదవిద్య నేర్పు మని యాబ్రాహ్మణుని యాచించితిని. ఆబ్రాహ్మణుఁ డందుల కీయకొనలేదు. నే నెట్లయినను నావిద్య నేర్చుకొనఁదలఁచి యాతఁడు కొందఱశిష్యులకు బోధించుచున్నపుడు నే నాతని కగపడకుండ యంతర్ధానరూపమున నాశాస్త్రమునంతయు విని గ్రహించితిని. అంతియగాక నే నాతనియొద్దకుఁ బోయి యాతనిని వెక్కిరించితిని. ఆబ్రాహ్మణముని కోపోద్దీపితుఁడై నన్ను రాక్షసుఁడవు కమ్మని శపించెను. నేను భయపడి యాతనిని బ్రతిమాలుకొంటిని. ఆతను కరుణించి శాపమును కొంతవఱకును తగ్గించెను. నేను రాక్షసరూపమున నాబిడ్డను తినివేయుటకు తొందరపడుచుండఁగా నాబిడ్డయొక్క యస్త్రబలముచే నాకు తిరిగి నిజరూపము వచ్చుననియు, పూర్వస్మృతి గలుగుననియు

నాతను నాకు ప్రసాదించెను. ఆమునిశ్రేష్ఠుఁడు చెప్పినదంతయు నిప్పుడు జరిగినది. నీవు నాకుపకారి వైతివి. కావున నీ కాయుర్వేదము నేర్పుటయు, నా కుమార్తెయగు మనోరమను బెండ్లిచేయుటకు నుద్దేశించుకొంటిని. అని ఆయుర్వేదము నేర్పెను. మనోరమ పెండ్లికి ప్రయత్నించుచుండఁగా నామె తనతండ్రితో నిట్లు జెప్పెను. "తండ్రీ! ఈరాజకుమారుని నేను చూడఁగానే వరించితిని. మఱియు మనకుపకారి యగుటచే నాతనియం దనురాగము వృద్ధిబొందినది. అయినను నామూలమున నాసఖులిద్దఱు రోగముచే బాధపడుచుండఁగా నాకు భోగములయం దాసక్తి యెట్లుకలుగును ? నేను నీకెట్లో నాసఖులును నీ పిల్లలే. కావున వారిస్థితి నీ వాలోచింపవలసియున్నది. ఆమాటలు విని స్వరోచి యాచెలికత్తె లిద్దరకును రోగబాధ ఆయుర్వేదచికిత్సచే నివృత్తి చేసెద నని వాగ్దానము చేసెను. అంతట మనోరమ స్వరోచిని వివాహముజేసికొనుట కంగీకరించెను. వారికి తండ్రియెదుట గాంధర్వవివాహము జరిగినపిమ్మట నిందీవరాక్షుఁడు తనపురమునకుఁ బోయెను. స్వరోచియును మనోరమయును చెలికత్తెలిద్దఱు నున్న యుద్యానవనమునకు వెళ్లిరి. అచ్చట స్వరోచి వారికౌషధసేవజేసి వారినిరోగవిముక్తులఁ జేసెను. అటుతరువాత వా రిద్దరును తమయుదంతముల నిట్లు రాజునకు విన్నవించుకొనిరి.

విభావరి "నేను మందారుఁడను విద్యాధరుని కుమార్తెను. నా పేరు విభావరి. నా కుపకారియైన మీకు నన్ను నే నిచ్చుకొనుచున్నాను. మీరు నన్ను పరిగ్రహింపుఁడు. నాయొద్ద సమస్తపశుపక్షిజాలమును చేసెడుధ్వనులయర్థమును తెలిసికొనెడు విద్య యున్నది. దానిని మీకు సంపూర్ణముగ నేర్పెద" నని చెప్పి యాతనిని పరిగ్రహించెను. రెండవకన్యయగు కళావతి యిట్లు తనచరిత్రమును జెప్పికొనెను "పారుఁడను కుమారబ్రహ్మచారియగు బ్రాహ్మణుఁడు తపస్సు చేయుచుండఁగా పుంజికస్థలయను యప్సరస్త్రీ యాతనికి వసంతకాలమున దృగ్గోచరమయ్యెను. ఆమెయందు మరులుగొని యామెతో రమింపఁగా నేను బుట్టితిని. నాతల్లి నన్ను కాననమందు విడిచిపెట్టి లేచిపోయెను. నేను చంద్రకిరణములచేఁ బెరిగితిని గాన నన్ను కళావతి యందురు. నన్నొకగంధర్వుఁడు పెండ్లిచేసికొనుటకు నాతండ్రిని యడుగఁగా నాతఁడు నిరాకరించెను. అంత నాగంధర్వకుమారుఁడు క్రుద్ధుఁడై నాతండ్రిని జంపివేసెను. తల్లిదండ్రులులేని నే నాత్మహత్యఁ జేసికొనుటకు యత్నించుచుండఁగా పార్శ్వ

శ్రీదేవి కటాక్షించి వానికిట్లు జెప్పెను. "ఓకుమారీ! నీవు విచారింపకుము. నీకు స్వారోచి యను నతఁడు భర్తయగును. అతనిపుత్రుఁడొకమను వగును, ఇట్లు ననున్నారడించి నాకు నవనిధులను దెలిసికొనెడు శాస్త్రముపదేశించెను. దానిప్రభావమున కోరినధన మంతయు లభించును. అవిద్యపేరు పద్మిని. నీవు స్వారోచియే యైయుండువు. ఏలయన దాక్షాయణి సత్యపరాయణురాలు. కావున నేను నావిద్యను, నాశరీరమును నీ కొప్ప గింతును. నీ వనుగ్రహింపు"మని వేఁడుకొనెను.

ఇట్లు స్వయముగ వరించిన వారిద్దరిని స్వారోచి వివాహమాడెను. అప్పుడు దేవతలు తూర్యనాదములు జేసిరి. అప్సరసలు నాట్యమాడిరి.

స్వారోచి యీముగ్గురుభార్యలతో రమణీయములగు వనములలోను, పరిమళ పుష్పములతో నిండియున్న యారామములలోను విహరించుచు వారితోఁ గ్రీడించుచుం డెను. పద్మినీవిద్యసహాయమున నానావిధరత్నవస్త్రపరిగాదు లన్నియు యథావాంఛి తముగ లభించుచుండెను. ఇట్లు స్వర్గభోగములన్నియు హిమాచలమున ననుభవించు చుండిరి. ఇట్లుండ నొకనాఁడొకకలహంసి తనస్నేహితురాలగు చక్రవాకితో నిట్లనె నఁట. "సౌందర్యరాసులును, యౌవనవతులును వినయశీలురు నగుభార్యలుగల యీ రాజెంత ధన్యుఁడోగదా! వారితో నెంతసుఖముగ భోగించుచున్నాఁడు ప్రపంచ ములో భర్తలు చక్కనివారైన భార్యలు చక్కదన ముండకపోవును. భార్యలు సుందరులైన భర్తలు తగియుండకపోవును. వీరిలో నట్టిలోపమేమియు లేదు. పరస్ప రానురాగముతో మెండుకొనిన వీరివంటిదాంపత్యము దుర్లభము. కావున వీరు చాల ధన్యులు." ఈమాటలు చక్రవాకి విని యిట్లు మారుబల్కెను. "ఓకలహంసీ! నీవను కొనిన ట్లీతఁడు ధన్యుఁడు కాఁడు. వారును ధన్యురాండ్రు గారు. వీరిలో నెవరికిని పవిత్రమైనదియు, పుష్కలమైనదియు ప్రేమ గాన్పింపదు. ఇతరస్త్రీలు జూచుచుం డఁగ నీత నొకస్త్రీతో రమించుచుండుటకు యితనికి లజ్జలేదు ఇంతమందిభార్య లుం డఁగ నీత డెవ్వతెయందు నిజమైన యనురాగము గలిగి యుండఁగలఁడు? వీరినందఱి యెట్లు సంప్రీతమనస్కులను జేయఁగలఁడు? కావున వీరాతనికి దైతలు గారు. ఆతడు వీరికి దైత గాఁడు. పరిజనులెట్లో యుల్లేఖులును వినోదమాత్రమునకే యుపచరింతురు. వీరిలో నెవ్వతెకైనను నిజమైన ప్రేమయున్నయెడల మఱియొకస్త్రీతో రమించుటఁ జూచి సహించునా? ప్రాణత్యాగము జేయునా? కావున బహుభార్యలుగల పురు

షునివిషయములో నితరేతరము నిజమైన ప్రేమ యుండదు. ఓకలహంసీ ! నేను చాల ధన్యురాలను. నాభర్తకు నే నొక్కతనే. నాకాతఁ డొక్కఁడే ప్రియుఁడు.''

ఈపలుకులన్నిటి నాలించి మృగపక్షిధ్వను లర్థము చేసికొనఁగల స్వరోచి లజ్జచే ఖిన్నుఁడై యాపక్షియనుకొనిన మాటలు నిజమనుకొనెను. ఇట్లొక శతవర్షములు గడచినతరువాత యాగిరిసానువుల పరిభ్రమించుచుండఁగా నాతనిదృష్టి కొక మగలేడి కాన్పించెను. ఆమగలేడివెంట ననేకములగు యాఁడులేళ్ళు దగుల్కొని చుట్టును మూగికొని యున్నవి. ఆయాఁడులేళ్లతో నామగలే డిట్లు పలికెను. "ఓవనితలారా ! మీరందరు పొండు. నేను స్వరోచివలె సిగ్గుమాలినవాఁడను కాను. ఒకస్త్రీ ననేకులగు యుపపతులతో రమించుట యెంతహాస్యాస్పదమో యట్లే యొకపురుషుఁ డనేకస్త్రీలతో భోగించుటయు పరిహాసనీయమే. అట్టివానికి ధర్మక్రియాహాని గలుగును. అతనికి పరలోకగతియును లేదు. కావున మీరు స్వరోచిని కామించవచ్చును. నేను స్వరోచితో తుల్యుఁడను కాను.'' హరిణముపలుకులన్నియు స్వరోచి విని చాల సిగ్గుపడి తలవంచుకొని తాను పతితుఁడని యోచించుకొనెను. తరువాత భార్యలను విడిచిపెట్టుటకు మనోనిశ్చయము జేసికొనెను. అయినను వారిని తిరిగి కలుసుకొనినపుడు వెనుకటి తెంపు సడలి మఱియొకశతవర్షములు వారితోఁ గ్రీడించెను. అట్లయినను ధర్మమునకు విరోధములేకుండ ధర్మక్రియలగు పనులను జేయుచు తనభార్యల యందువిషయభోగము లనుభవించుచుండెను. కాలక్రమమున మనోరమకు విజయుఁడును విభావరికి మేరునందుఁడును, కళావతికి ప్రభావుఁడను ముగ్గురుపుత్రులు బుట్టిరి. పద్మినీవిద్యాసహాయమున వారికి మూఁడుపట్టణములను గల్పించి తూర్పున విజయమను పట్టణమును విజయునకును, ఉత్తరమున నందవతియను పురమును మేరునందునకును దక్షిణమున పురంతాలమను నగరమును ప్రభావునకును యిచ్చివేసెను. తాను తిరిగి తనభార్యలతో భోగక్రీడలు సలుపుచుండఁగా నొకనాఁడు ధనుర్ధరుఁడై యటవీదేశమున గ్రుమ్మరుచు నొకవరాహముఁ గూర్చి బాణమెత్తిన నొకమృగి యాతనియొద్దకు వచ్చి యాబాణమును తనపైని ప్రయోగించి తనను జంపుమని కోరెను. అంత రాజామాటలు విని యచ్చెరువొంది యేల నిస్పృహురాలవై యసువుల గోల్పోయెదవని యడిగెను. అంత నాహరిణి తనప్రాణవల్లభుఁడు వేఱుయువతులం దాసక్తి గలిగి యుండుటచే తాను ప్రాణత్యాగము జేయఁదలఁచితి నని జెప్పెను. ఆపైని రాజు దాని

ప్రాణనాయకుఁ డెవరని యాలేడి నడుగఁగా నది స్వరోచియే తనకూర్మిపతి యని చెప్పెను. రాజు విస్మితుడై "ఏమియీవింత, నేను నరుడను, నీవు మృగివి. మనయిద్దఱకు కూటమి యెట్లు పొసగునని యడుగగా నాయాడులేడి నన్ను నీవాలింగనము చేసికొనినయెడల సర్వము నీయిష్టప్రకారము సంఘటిల్లునని మారుబల్కెను." స్వరోచి దానిని కౌగలింపగా నది తక్షణమే యొక చక్కనిస్త్రీ యయ్యెను. నీవెవ్వతెవని స్వరోచి యడుగగా నామె నేను వనదేవతను దేవతలందఱు నన్ను నీవలన నొకపుత్త్రుని గనుమనియు నాతడు మనువు కాగలడనియు వేడికొనగా నేను నీయొద్దకు లేడిరూపమున వచ్చితిని. అంత స్వరోచి యావనదేవతయందొక దేదీప్యమానుడగు పుత్త్రుని గనెను. ఆబాలుడు పుట్టగనే దేవతలు దుందుభులు మొరయించిరి. గంధర్వులు పాడిరి. అప్సరసలు నాట్యమాడిరి. ఆబాలుడు తన శరీరకాంతిచే దిక్కుల నన్నిటిని వెలిగించుచుండగా నాతనికి ద్యుతిమంతుడని పేరిడిరి. అతడే స్వారోచిషమనువు.

స్వరోచి తన భార్యలగూడి భోగపరాయణుడై సంచరించుచుండగా నొక హంసమిథునమును పొడగాంచెను. అక్కడయందలి మగహంస యాడుహంసతో నిట్లు బల్కెను "నేను నీతో చాలాకాలము సంభోగించితిని. నాకు ముదిమి వచ్చినది. ఇంక భోగము లెందుకు? కాబట్టి నిన్ను పరిత్యజించెడు కాల మాసన్నమైనది." ఆ మాటలకు హంసి "ఈజగత్తంతయు భోగాత్మకమైనదే. యజ్ఞములను భోగములకొఱకే బ్రాహ్మణులు చేయుదురు. భోగములకొఱకే దానధర్మాది పుణ్యములగూడ మనుష్యులందఱు జేయుదురు. కావున నీవు భోగములను విడిచిపెట్టు టెందులకు? అని బదులు చెప్పెను. ఆమాటలకు మగహంస యిట్లుఁజెప్పెను. "భోగములను విడిచిపెట్టినయెడల పరమాత్మయందు మదిగల్గును. పుత్రమిత్రకళత్రములయం దెల్లపుడు సక్తులైనవారు నశింతురు. నీకట్టెదుట స్వరోచిని జూడవా? ఆతడాబాల్యము కామపరాయణుడై యౌవనమంతయు భార్యాసంగమున గడపి పుత్రులనుగని యిప్పటికిని స్త్రీవాంఛ విడువలేక యున్నవాడు. నేను స్వరోచివలె గాదు. వివేకవంతుడనై భోగనివృత్తి జేసికొనుచున్నాను." ఆమాటలు స్వరోచివిని హృదయోద్వేగముబొంది భార్యలతో తపస్సుజేయుటకు నొక తపోవనమునకుబోయి యచ్చట తానును వారును ఘోరమైన తపస్సునుజేసి ముక్తిని బడసిరి.

స్వరోచి పుత్రుడగు స్వారోచిషుడు భగవంతునిచే మనువుగా నిర్ణయింపబడెను. అతని మన్వంతరకాలమున దేవతలు పారావతులుకూడ సంతోషించిరి. అతనికాలమందు, యిందుడ్రు, యూర్జస్తంభుడు, ప్రాణుడు, దత్తోలి, ఋషభుడు, నిశ్చరుడు, ఆర్జవీరుడును సప్త ఋషులుగా నుండిరి. చైత్రకింపురుషాదు లీతనికి సప్తపుత్రులుగా జనించి పృథ్వని పరిపాలించిరి. ♦ ఈతనిదగు జన్మను గురించియు, యీతడు రెండవ మనువుగా నేర్పడి ప్రసిద్ధిగాంచిన చరిత్రమును గురించియు వినినవారు పాపములు విడగొట్టుకొని పుణ్యమును బొందును.

## గ్రంథవిమర్శనము—కృతిపతియాదేశము.

ఈకథ యంతయు మార్కండేయపురాణములో నున్నది. మనుచరిత్రము రచింపుమని శ్రీకృష్ణదేవరాయలు పెద్దనార్యున కనుమతి యిచ్చినప్పుడు జెప్పిన మాటలు మనము వినదగ్గవి. *ఏలయన మహాకవి

---

♦ మూలములో స్వారోచిషమనువు బాల్యమందే విరాగియై మహావిష్ణువుగూర్చి తపస్సుచేసిన సంగతేమియు గాన్పింపదు.

*శ్రీకృష్ణదేవరాయలు కళింగ దిగ్విజయము చేసి తిరిగి విజయనగరమునకు రాక పూర్వము దక్షిణదేశమందున్న పుణ్యక్షేత్రములన్నిటిని సేవించి విజయనగరమునకు విజయము చేసినారు. ఆవెంటనే అప్పాజి మున్నగు మంత్రిసామంతులకు బహుమానములు చేసినారట. "అమరునాడు కొలువులోపల యిష్టకథా వినోదమైన నగరి నియోగులున్ను కవీశ్వరులు విద్వాంసులు మొదలైన నిండుసభలోన సాళువ తిమ్మరుసయ్యగారున్ను రాయసం కొండమరసయ్య మొదలైనవారున్ను ప్రసంగం వెంబడిని అందరును యోచించినట్టు కవితా చాతుర్యము గలవార్లున్ను రాయలవారిని జూచి ప్రసంగం వెంబడిని నీదుకీర్తి శాశ్వతముగా నిలిచేటందులకు ఆదియందు అవనీపతులు కృతులందుచుండగా వారల ప్రతాపములున్ను కీర్తిన్ని అందరున్ను యోచినట్లు స్వామివారున్ను కృతులందుకొంటే కీర్తిప్రతాపములు శాశ్వతముగా నిలుచును గనక తిమ్మరసయ్య అయ్యామరసయ్య కొండమరసయ్య తిప్పరసు అయ్యామరసు మొదలైనవార్లు దెలుపగా

యైన రాజాధిరాజు తనయొద్దనున్న కవిసార్వభౌముల కెట్లు నివేదించెనో ఆమహామనీషు లిద్దరు నేకగ్రీవముగా దేనిని, ఏల నంగీకరించుకొనిరో ఇత్యాది విషయములు మనకు ద్యోతక మవును. పెద్దనార్యుడు మనుచరిత్ర మందలి యవతారిక పద్యములలో నిట్లుఁ జెప్పెను.

క. భువనవిజయాఖ్య సంస
ద్భవనస్థిత భద్రపీఠిఁ బ్రాజ్ఞులగోష్ఠిన్
కవితామధురిమ డెందము
దవులన్ గొలువుండి సదయత న్ననుఁబల్కెన్.

తే. సప్తసంతానములలోఁ బ్రశస్తిఁగాంచి
ఖిలము గాకుండునది ధాత్రిఁగృతియకానఁ
గృతిరచింపుము మాకు శిరీషకుసుమ
పేశలసుధామయోక్తులఁ బెద్దనార్య!

క. హితుఁడవు చతురవచోనిధి
వతులపురాణాగమేతిహాసకథార్థ
స్మృతియుతుఁడ వాంధ్రకవితా
పితామహుఁడ వెవ్వరీడు పేర్కొన నీకున్.

క. మనువులలో స్వారోచిష
మనుసంభవ మరయ రససమంచితకథలన్
విననింపు కలిధ్వంసక
మనఘ! భవచ్చతురరచన కనుకూలంబున్.

రాయలవారున్ను చాలాసంతోషబడి ముక్కుతిమ్మయ్య అల్లసాని పెద్దయ్య మాదన గారి మల్లయ్య మొదలైన కవీశ్వరులతో కృతులందుకోవలెనని కవితా నాయకులతో పలుకరించి ఆతీరున అయ్యాని అనంగా కుళ్లాయి కబ్బాయి తాళిచోకుట్లు చేసరిపేరులు కోకడాకులు యిచ్చి పారిజాతాపహరణమున్ను మనుచరిత్రాను చెప్పమని ఆజతిచ్చినారు."

రాయవాచకము పుట 115—116.

వ. "కావున మార్కండేయపురాణోక్త ప్రకారంబునన్ జెప్పుమని క
ర్పూరతాంబూలంబు వెట్టినన్ బట్టి, మహాప్రసాదంబని మోదంబున
నమ్మహా ప్రబంధ నిబంధనంబునకుఁ బ్రారంభించితి........."

ఈకృతిభర్త, కృతికర్తల పరస్పర ప్రేమాదరణ సూచకమగు నీ వృత్తాంతములో మూడు ముఖ్యసంగతులు స్ఫుటమగుచున్నవి. అవేవన కృష్ణదేవరాయల ముఖ్యోద్దేశములు (1) కవిని గుఱించియు, (2) కథను గుఱించియు (3) ఏతద్గ్రంథరచనను గుఱించియు— ఎటులున్నవో, ఆమూడు విషయములు చక్కఁగ మనము గమనించవలెను. కృష్ణదేవరాయలవిషయ మితరాంధ్రప్రబంధముల కృతిపతులవలె గాదు. ఇతఁడు గీర్వాణాంధ్రముల మహాపండితుఁడు; మహాకవి; కావున సారస్వత విషయములలో తాను స్వయముగ నాలోచించి, విమర్శించుకొనఁగల్గిన మహామేధావి. ఆతనిమాటలకుఁ దగిన యాదరణము జూపవలసియున్నది.

1. కవినిగుఱించి యాతనికిఁగల యభిప్రాయము.

(1) హితుఁడవు— ఇది వారిరువురి యన్యోన్యానురాగ సూచకము. మనకు సంబంధములేదు.

(2) చతురవచోనిధివి; అతులపురాణాగమేతిహాసకథార్థస్మృతియుతుఁడవు; ఆంధ్రకవితాపితామహుఁడవు.— ఈకడసారి వాక్యము పెద్దన్నగారి బిరుదు. రెండవవాక్య మతని పాండిత్యపోషకము. తొలివాక్యము మనకు ముఖ్యము. పెద్దన్నగారినిగూర్చి రాయలయభిప్రాయము— పెద్దనార్యుఁడు చతురవచోనిధియని. చతురవచోనిధియనగా వాక్చాతుర్యమునకు గనివంటివాఁడని— కృష్ణదేవరాయ లాతనివిషయమై ఇంకేమియుఁ జెప్పలేదు. కాబట్టి వాక్చాతుర్యమే ఆతనియందు ముఖ్యముగానున్నదని రాయల యభిప్రాయము. పెద్దనార్యుఁడుగూడ నంతటితో సంతోషించెను. కావున నీవాక్చాతుర్య లక్షణమున్నదో లేదో,

ఉన్న యెడల నెంతవరకున్నదో— ఇదిగాక నింకనేవేని గుణవిశేషములు న్నవో, దోషము లున్నచో నవియేవో— ఇత్యాదులు మనము నిర్ణయింపవలసియున్నది.

2 కథనుగుఱించి :—

క. "మనువులలో స్వారోచిష
మనుసంభవ మరయ రసవమంచితకథలన్
వినవింపు కలిధ్వంసక
మనఘ! భవచ్చతురరచన కనుకూలంబున్."

అనగా కృష్ణరాయల యభిప్రాయము యీకథను గుఱించి— (1) చక్కని రసవంతమైన కథలు గలది. (2) పుణ్యవిషయసంబంధియగుటచే పాపహారియైనది (3) ముఖ్యముగా పెద్దనార్యుని చతురరచనకు చాల ననుకూలముగా నున్నది. ఏవిధమునఁ బెద్దనార్యుని చతురరచన కనుకూలించెనో మనము గుర్తించవలసి యున్నది. చతురవచోనిధి—చతురరచన— కావ్యవచన రచనలయందు చాతుర్యమే పెద్దనార్యునియందలి ముఖ్యలక్షణమని కృష్ణరాయుని యభిప్రాయము.

3 గ్రంధరచనను గుఱించి:— ఈగ్రంధమును కవి యెట్లు వ్రాయవలెనో నయ్యది గూడ రాయలు నిర్ణయించెను.

(1) మార్కండేయపురాణోక్త ప్రకారము జెప్పుమనెను. అనగా, నాపురాణములో నున్న కథాక్రమములు తప్పగూడదు. ఇది శిల్ప నిర్ణయము.

(2) శిరీషకుసుమపేశలసుధామయోక్తుల రచింపవలెను. ఇది శైలీనిర్ణయము. శైలి యెటులుండవలెననిన శిరీషపుష్పమువలె పేశలము అనగా, చక్కగా నుకడవలెను. శిరీషకుసుమము చక్కనిరంగులు కలిగి మిక్కిలి మృదువుగాను, కోమలముగాను, సువాసనగాను నుండును. కావున నీతనిశైలి చక్కని యలంకారములతోను, మృదువైన శబ్దరచనల

తోడను నలరారుచుండవలెను. పైగా సుధామయోక్తులుగూడ నుండవ లెను. అనగా నమృతమువలె మధురమైన పదగుంఫన యుండవలెను. అనగా శైలీవిషయములో రాయలు నిర్దేశించిన దేమన మృదుమధుర ఫణితి, చిత్రవర్ణాలంకారసంభృతి.

కావున నీకవిని గుఱించియు, గ్రంథమును గుఱించియు కృష్ణరా యల యాదేశ సారాంశమేమనగా, పెద్దనార్యుఁడు వాగ్రచనాచాతుర్య ముఁగలవాఁడు గాన నాతని రచన కనుకూలమైన రసవంతములగు కథలు గల యీకథను మార్కండేయ పురాణములోనున్న కథాక్రమంబున, మృదుమధురశైలిని, స్వాభావికాలంకారవర్ణనములతో నొప్పునట్లుగా రచింపవలెనని, ఈయాదేశ మెంతవరకు నిర్వహింపబడెనో మన మెంచి చూతము.

## కథాసంవిధానము—శిల్పము.

కృష్ణదేవరాయల కాలమువరకు, ననగా, పదునేనవ శతాబ్దాంత మువరకు సామాన్యముగ నాంధ్రకవులు గీర్వాణ గ్రంథముల నాంధ్రము నకు పరివర్తనఁజేయుటయే ముఖ్య కర్తవ్యముగా నెంచుకొనిరని స్థూలదృ ష్టిని చెప్పవచ్చును. అయినను ఆకాలమందలి కొన్ని గ్రంథములకు గీ ర్వాణమాతృకలు గాన్పింపకపోయినను, నీయభిప్రాయము నిరవశిష్టమ నియే నమ్మవచ్చును. నన్నెచోఁడుని 'కుమారసంభవము' సుప్రసిద్ధమ గు కాళిదాసుని 'కుమారసంభవము'నకు భాషాంతరీకరణముగాదని నిర్ణ యింపఁబడినది. అట్లయినను వేరొక గీర్వాణమాతృక యుండవచ్చునని విమర్శకులు నమ్ముచున్నారు. ఏలయన సామాన్యముగ నాకాలమున నాంధ్రకవీశ్వరులు స్వతంత్రగ్రంథములను రచించుటకు సాహసించి గ డంగుటలేదని చూపట్టుటయే. అట్లయిన నీగ్రంథమునకు మాత్రము

గీర్వాణ మాతృక లేదు.

ఈభాషాంతరీకరణయుగము సామాన్యముగా శ్రీనాథుని కాలముతో నంతమొందెనని దిఙ్మాత్రసూచకముగా జెప్పవచ్చును. ఆతని 'హరవిలాసము' కేవల మాంధ్రీకరణముగాక, స్వకపోలకల్పితాఖ్యాయికల గుచ్ఛము. ఇంక నాఖ్యాయికలనుంచి యాఖ్యానమునకు మఱియొక చిన్నమెట్టు. ఆమెట్టును పినవీరభద్రుఁ డెక్కలేకపోయినను, నంది సింగన్న, ఘంటమల్లయ్యలను జంటకవులు యెక్కఁ బ్రయత్నించిరి. నారి వరాహపురాణమందలి 'మర్త్యయోపాఖ్యానము' కొంచె మెచ్చుతక్కువగ స్వతంత్ర ప్రబంధమనియును, ప్రబంధరచనకు మొదటి దృష్టాంతమనియును వెనుక నేను దెలియపరచితిని. కావున పదునేనవ శతాబ్దాంతమునకు స్వతంత్ర ప్రబంధనిర్మాణము మార్గశ్రమమునుండి గమ్యస్థానమున కించుక దరిని జేరుచున్నదని చెప్పవలసియున్నది.

ఇట్టివ్యవస్థలో నాంధ్రభోజుఁడగు శ్రీకృష్ణదేవరాయ లవతరించెను. సంస్కృత గ్రంథములకు నాంధ్రభాషావేషము నిచ్చుటతోఁ దృప్తినొందక స్వతంత్రాంధ్రగ్రంథముల వ్రాయ బ్రోత్సహించెను. ఆయన 'ఆముక్తమాల్యద'యో, లేక, పెద్దన్నయొక్క 'మనుచరిత్ర'మో ఆప్రయత్నమునకు మొదటిఫలముగా నుండనోపును. ఆముక్తమాల్యదయందలి కథాప్రణాళికతో నున్న యొక సంస్కృత గ్రంథమును చిన్నతనమున నైజామురాజ్యములో సంచరించుచు నొకవైష్ణవగృహమున దాను జదివినట్లు కొంతజ్ఞాపకమున్నదని శ్రీ మానవల్లి రామకృష్ణయ్యగారు నాతో నొకసమయమునఁ జెప్పిరి. వారుఁ జెప్పినప్రకారము గీర్వాణ మాతృకయుండినయెడల నాముక్తమాల్యదగాక మనుచరిత్రమే మొదటి స్వతంత్రాంధ్రప్రబంధ మనియెడు యశస్సునకర్హమై యుండును.

ఇంతియగాక నాకాలమందలి గ్రంథములలో ప్రధానస్థానము నలం

కరించుటకు మనుచరిత్రమునందు మఱియొక యపూర్వాతిశయముగూడ నున్నది.

ప్రపంచమందంతటను మానవకోటిచే నైకకంఠముగాఁ బొగడ్తకెక్కిన సుప్రసిద్ధ గ్రంథరాజములలో నొక విశేషాంశము సమానధర్మముగానున్నది. అదియేదన; మానవకోటి యంతటిచే నేకగ్రీవముగా నంగీకరింపఁబడిన పరమ పవిత్ర మానవజీవితాదర్శముల కాగ్రంథములు నిదర్శనములై, దేశకాలభేదములులేక సమస్తజనులచేతను పూజింపఁబడుచున్నవి. అట్టి యుద్గ్రంథములైన హోమరుని 'ఈలియడు' 'వాల్మీకి'కవి 'రామాయణము,' డాంటీ 'డివైన్‌కామెడి' మున్నగు పవిత్ర ప్రబంధరాజములు, శ్రుతిగ్రంథములగు వేదములు, భగవద్గీత, బైబిలు, ఖురాను మొదలగు ప్రమాణ గ్రంథములవలెనే ఒక్క నిత్యనిర్వికల్పనిరామయంబగు మానవజీవితాదర్శమును సువ్యక్తపరుచుచున్నవి.

హోమరుని 'ఈలియడ్' నందు త్రిలోకసుందరియగు 'హెలెను' కామాసక్తురాలై, తనపతినివీడి, అఖిలోకసుందరుఁడగు 'ప్యారిసు'తో లేచిపోయెను. అట్టి యధర్మకర్మమువలనఁ గలిగిన విపత్పరంపరలయొక్కయు, తుట్టతుదకు ధర్మమునకుఁ గలిగిన విజయముయొక్కయు చరిత్రయే 'ఈలియడ్.'

ఇంక రామాయణమున సీతాదేవియొక్క సౌందర్యముచే మోహితుఁడై రావణుఁడు, ధర్మాత్ముఁడగు శ్రీరామునినుండి యాతని ధర్మపత్నిని నూడఁబెరికి బలవంతముగాఁ గొంపోవుటచేతఁ గలిగిన విపత్పరంపరలును, తుట్టఁదుదకు ధర్మమునకుఁ గలిగిన విజయమును నుద్ఘోషింపఁబడినవి.

డాంటిరచించిన 'డివైన్‌కామెడి'లోఁగూడ నింద్రియలోలత్వముకంటె ధర్మబంధమే యెక్కుడు పవిత్రమని డాంటెబియాట్రిసుల ప్రేమ

సాశీల్య ముగ్గడించుచున్నది. ఈవిషయమునే భగవద్గీత పలుసారు లు ద్ఘోషించుచున్నది.

శ్లో. ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా
కామరూపేణ కౌంతేయ ! దుష్పూరేణానలేనచ.

శ్లో. ఇన్ద్రియాణి మనోబుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే,
ఏతైర్విమోహయత్యేష జ్ఞాన మావృత్య దేహినమ్.

శ్లో. తస్మా త్త్వమింద్రియాణ్యాదౌనియమ్య భరతర్షభ
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్.

భగవద్గీత—కర్మయోగం.

ఈవిషయమే టెన్నిసను మహాకవిచే తన పౌరాణిక ప్రబంధమగు 'ఆర్థరు' రాజుకథలలో (Idylls of King Arthur) విశదీకరించబడెను. దీనిని ఆమహాకవి, "Sense at war with Soul," "ఇంద్రియములకు నాత్మకుఁ గల పోరాటము"ని సంక్షేపముగా నుడివెను.

ఇట్లు మానవజీవితములో నిరంతరము నాత్మేంద్రియములకుఁ గలుగుచున్న సంగ్రామమే యీమనుచరిత్రమందును నభివర్ణితమైనది. పైనఁ జెప్పఁబడిన మహాగ్రంథములదోఁ బాటు నీగ్రంథమందును మానవ ప్రకృతియందలి నిత్యసత్యము ప్రకాశింపఁ జేయబడినది. వరూధినీ ప్రవరుల ప్రసంగము ఆత్మేంద్రియముల సంగర మని యెవరికి ద్యోతకము గాదు ? ఈమహావిషయము కడుంగడు సమర్థతతోఁ జిత్రింపఁబడిన కారణమున మనుచరిత్రము ఆదర్శప్రాయములగు గొప్పప్రబంధముల వరుసలో లెక్కింపఁదగియుండి, ముఖ్యముగా నానాటిగ్రంథములలో మిన్నయని చెప్పఁదగియున్నది.

ప్రస్తుతవిషయము:—ఇట్టి సార్వజనీనప్రేమభాజనమగు కథయుండుటచేతనేకదా, కవిప్రవరుఁడగు కృష్ణదేవరాయలును ఆంధ్రకవితాపితా

మహాకవి యగు పెద్దనార్యుఁడును నేకగ్రీవముగా దీనిని ప్రబంధ రచనకు నిర్ణయించుకొనిరి.

ఇప్పుడు మనకు కృష్ణదేవరాయల పలుకులయందలి స్వారస్యము బోధపడినది. రసనమంచితకథలను గలిగి, కలిధ్వంసకమును నైయుండుట అనగానేమో మనకుఁ దెలియవచ్చినది. ఏకారణమున చతురరచయిత యయిన పెద్దన్నకు నీకథ యెక్కువగ ననుకూలించెనో ద్యోతకమయినది. ఇట్లు మానవ జీవితమునంతను నఖశిఖపర్యంతము సంక్షోభించి దాని నిజమైన లోతును కనుఁగొనఁగల కథను నిర్ణయించి, మెచ్చి, మెడఁగట్టి, పైగా ముగుదాడు బిగించి రాయలవారు పెద్దనార్యుని విడిచిరి.

మార్కండేయపురాణోక్తప్రకారముగా నీకథను జెప్పవలెను. మార్కండేయపురాణమనగా వ్యాసరచితమైన సంస్కృతగ్రంథమే. ఆ గ్రంథమందున్నప్రకారము కథను పెంచి, ప్రబంధరూపముగా నాంధ్రమున వ్రాయవలెనని కృష్ణరాయల తలంపు. అయితే నిక్కడొక చిన్నచిక్కు తటస్థించినది. ఈసంస్కృతమార్కండేయపురాణమును తిక్కనసోమయాజి శిష్యుఁడగు మారనమహాకవి శ్రీకృష్ణరాయలకు బూర్వమే యాంధ్రీకరించెను. ఈ యాంధ్రీకరణము మాతృకకంటె ననేకవిధముల మెరుగుగా నుండుట చేత మార్కండేయపురాణ కథలను తెలుఁగుప్రబంధములుగ వ్రాసెడువారు తప్పక చదివితీరవలెను. మఱియు మారనకవి తనగ్రంథమున స్వారోచిషమనుసంభవకథను ప్రత్యేకాభిమానముంచి రసవత్తరముగ రచించుటచే నాకథను తరువాత వ్రాసినవారు మారనమార్గము ననుసరింపక తప్పదు. ఈవిషమస్థితిలో నుచితజ్ఞుఁడగు పెద్దన్న యొకవిలక్షణ మార్గము నవలంబింపక సంస్కృతాంధ్రగ్రంథముల రెంటియందలి యుత్కృష్టరస భాగముల మార్గములనే దానును అనుసరించి, బహుస్వల్పమార్పులు మాత్రమే చేసి, తన గ్రంథమును పూర్తి చేసెను. ఇట్లు

చేయుట ప్రతిభావిశేషమే గాని గ్రంథచౌర్యమెంతమాత్రము గాదు.

ఇట్లు చెప్పుటలోఁ బెద్దనార్యుఁడు మాతృకకు ప్రతిబింబముగా త న గ్రంథమును రచించెనని యూహింపఁగూడదు. కథాక్రమము రెండు, మూడు స్వల్పవిషయములలోఁ దప్ప కేవలము మాతృకానుసరణమే. కథాకల్పనలును జాలవరకు మాతృకలోనివియే.

పెద్దనార్యుని శిల్పితనము కథాశరీరమును పోషించి యలంకరించుటలో ముఖ్యముగా కానిపించుచున్నది. అతని సంధాననైపుణ్యము ముఖ్యముగా స్వాభావికవర్ణనలయందును, పాత్ర సంభాషణములందును, నానాభావ ప్రకటనలయందును జూడనగును! 'అల్లసానివాని యల్లిక జిగిబిగి' అని యున్నదిగదా! కథయందలి అల్లిక ప్రత్యేకముగా పురాణములోనిదే. కథ కడు దీర్ఘమైనదగుటచే నాఙాశ్వాసముల గ్రంధమునకు పూర్తిగ సరిపోయెను. కాబట్టి కథనుపెంచి యల్లవలసిన యవసరము లేకపోయెను. అయితే నీకవివరుఁడు గనుపరచిన విశేషములు జిగియు, బిగియు; జిగి యనగా కాంతి. బిగి యనగా సాంద్రత. రసపుష్టిమూలముగా జిగియు, భావసంభృతిమూలముగా సాంద్రతయు కథావల్లికయల్లికకుఁ జేర్పఁబడినవి. ఇట్లు రసభావములను సువిశేషముగాను, స్వాభావికముగాను పెంచి విస్తరించుటలో బెద్దనార్యునికంటె పెద్ద ఆంధ్రకవులలోఁ గాన్పింపడు.

పెద్దనార్యుని కావ్యసంధానమును గుఱించి బ్ర॥ శ్రీ॥ వేటూరి ప్రభాకరశాస్త్రిగారిట్లు వక్కాణించిరి. "లోక స్వభావమునకు సరిపోవు సంవిధానముతో నయ్యైపాత్రముల నెలకొలపి, యౌచితికెందును భంగము రాకుండ దత్తద్రూపచేష్టాదుల నమర్చి యేపట్టునఁజూచిన నాపట్టున నద్ది రాయనవలయునట్టు లితివృత్తమును నడపించునేర్పు పెద్దనకుఁ గుదిరినట్లు మఱియొక కవికిఁ గుదిరినదికాదు. నిగూఢములుగానుండు మనోభావ

ములను స్ఫుటపఱిచి, చప్పున విప్పి చెప్పునట్లు పద్యమున నీతఁడు నిరూపించును.'' ఈయభిప్రాయముతో నేనెంతయు నేకీభవించుచున్నాను. ఈగ్రంథమందలియనుబంధములో శ్రీకాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారి వ్యతిరేకాభిప్రాయమును సహేతుకముగా విమర్శించి పెద్దనార్యుని కథాసంధానచతురతను సమర్థించితిని.

మార్కండేయపురాణోక్తముగా కథేతివృత్తమును రచించినను తనబుద్ధిచాతుర్యమున రసపుష్టికొఱకును, ఔచిత్యము కొఱకును గొన్ని చిరుమార్పుల నచ్చటచ్చటఁ గావించెను. ఈమార్పు లన్నిటిలో నొక్కటిదక్క మిగిలినవి చాల స్వల్పములును కొద్దివియును. ఈమార్పులు చేయుటలో సంస్కృతమాతృకను, మారన యాంధ్రీకరణమును గూడ జాగ్రత్తగాఁ బరిశీలించి తన యుదారబుద్ధికిఁ దోఁచినరీతి నాస్వల్ప మార్పులను జేసినట్లు గాన్పించుచున్నది. ఈమూఁడు గ్రంథములయందలి సామ్యభేదములను స్థాలీపులాకముగా నిచ్చట జూపించెద.

1. సిద్ధప్రవరుల సంభాషణము.

1, మూలము:—

శ్లో. అనేక దేశదర్శిత్వే నాతిశ్రమసమన్వితః
త్వంనాతి వృద్ధోవయసా నాతివృద్ధశ్చ్యయావనాత్
కథమల్పేనకాలేన పృథివీమటసిద్విజ
మంత్రౌషధప్రభావేన విప్రాప్రతిహతాగతిః
యోజనానాం సహస్రంవా దినార్ధేనవ్రజామ్యహం.

1 మా ర న:—

ఉ. వాయువు రజ్జురేల? మునివల్లభ! వృద్ధుఁడ వౌండఁ గాప్రశేఁ
బ్రాయపువాఁడ వద్రివనరమ్యములైన యనేకదేశముల్
ధీయుత! యల్పకాలమునఁ దిరిమ్మరశక్యమె? నీకునెమ్మొయిన్
జేయుట చెల? తమ్మి చెద దీపలుకన్న మునీంద్రుఁ డిట్లనున్.

ఉ. ఏనొక సిద్ధుఁడన్ వినుమహీసురశేఖర! ధాత్రియంతయున్
మానుగఁ బాదలేపమను మందుప్రభావమునం జరించితిన్
దానిఁ బదంబులందుఁ దగఁ దాల్చిన నంతయు నిర్జితశ్రముం
డై నరుఁ డేగు యోజనసహస్రము నాపగలింటిలోపలన్.

3 పెద్దన్న:—

చ. వెలవక మీకొనర్తు నొకవిన్నప మిట్టిదియెల్లఁ జూచిరా
నెలకలు గట్టుకొన్న మతి యేండ్లును బూండ్లును బట్టఁ బ్రాయపుం
జెలుతతనంబు మీమొగము చెప్పక చెప్పెడు నద్దిరయ్య మా
తెలుపఁగఁదరంబె? మీమహిమ లీర యెఱుంగుదు రేమిచెప్పుడున్.

కం. అనినఁ బరదేశి గృహపతి
కనియెన్ సందియముఁ దెలియనడుగుట తప్పా
వినవయ్యా జరయు రుజయును
జెనకంగా వెఱచు మమ్ము సిద్ధుల మగుటన్.

మ. పరమంబైన రహస్యమైనయున దాపం జెప్పెదన్ భూమిని
ర్జరవంశోత్తమ! పాదలేపమను పేరం గల్గు దివ్యౌషధం
పు రసం బీశ్వర సత్కృపం గలిగెఁ దద్భూరిప్రభావంబునన్
జరియింతున్ బవమానమానసతిరస్కారిత్వరాహంకృతిన్.

మూలములోఁ బ్రవరుఁడు సిద్ధునిగుఱించి మాట్లాడుచునాసిద్ధుఁ డతివృద్ధుఁడుగాఁ గాన్పింపలేదు, యౌవనమునుదాటి క్రిందించునట్లుగాఁ గన్పింపలేదు; కావున స్వల్పకాలములో సమస్తదేశముల నెట్లు జూడఁగలిగెనో యని ఆశ్చర్యము మాత్రముఁ గన్పరచెను.

మారన దీనిని కొంత మార్చుచు సిద్ధుఁడు తాననేకదేశములు ద్రిమ్మరితినని చెప్పినమాట లబద్ధములనియు, దాను నమ్మలేదనియుఁ జె ప్పుటచే మూలములోనున్న యుభయుల గౌరవమును జెడగొట్టిన వాఁ

డయ్యెను. మునీంద్రుఁడు కల్లరియనియుఁ బ్రవరుఁడు మునుల శీలము నెఱుంగని వాఁడనియుఁ దెల్పుటచే నుభయుల పాత్రపోషణము సమో గ్యమైనది.

పెద్దన్న యీసంభాషణమును గొంతవఱకు మార్చి పెంచినను, మునివ్రవరుల శీలము నెంతమాత్రముఁ జెడఁగొట్టక మూలముకంటె మ ఱికొంత మెఱుఁగుఁ బెట్టినవాఁ డయ్యెను. ఎట్లనఁగా యోగసిద్ధునితో నీ చిన్నిపాపఁడు మాట్లాడులకే వెఱచుచున్నట్లును, నాసిద్ధుఁ డన్నిదేశ ములు దిరిగినను జిఱుతప్రాయము దాటలేనట్లును గాన్పించుట తన కా శ్చర్యముఁ గల్గించుచున్నది. కాని మునిసత్తముల మహిమలు తెలిసి కొనుట యశక్యమని సవినయముగాఁ జెప్పికొనెను. ఈసంబంధము చాల దృష్టికరముగా నున్నది. గురువునొద్ద శిష్యునికుండఁదగిన వినమ్రతను, భక్తినిఁ జూపించుచున్నది

2. వరూథినీ ప్రవరుల సంభాషణము.

1. మూ ల ము:—

శ్లో. అభీష్టాః గార్హపత్యాద్యాః సతతమేత్రయోగ్నయః
రమ్యం మమాగ్ని శరణం దేవి విస్తరణేప్రియా.

2. మా ర న:—

సీ. అనఘ నీయందు రేపును మాపు వేల్వంగఁ
బడు హవ్యములఁ జేసి పడయవచ్చు
పుణ్యలోకంబులు పొలఁతి నీవెఱుఁగవె
త్రిజగంబు హవ్యప్రతిష్ఠితంబ
యనిన నాయింటి నాయందు నగ్గిరియందు
నీకుఁ బ్రియం బేల పెంపుగాదు
విద్యాధరాదుల విడిచి మనుష్యుల
కడ నేల యుండంగఁ గడఁగెదనఘ

కం. వినుము దర్భలు నరణుల వేదికలును
నగ్నులును నాకుఁ గరము ప్రియంబౌ నర్చ
గాని యొండెందుఁ బ్రియమెదఁ గలుగదనిన
నవ్వరూధిని యిట్లను నతనితోడ.

3. పెద్దన్న:—

మ. తరుణీ! రేపును మాపు హవ్యముల చేతన్ దృప్తుఁడౌ వహ్ని స
త్కరుణాదృష్టినొసంగు సౌఖ్యము లెఱుంగన్ శక్యమే నీకునా
కరణుల్ దర్భలు నగ్నులున్ బ్రియములైన ట్లన్యముల్ గా వాడల్
తిరమే చెప్పకుమిట్టి తుచ్ఛసుఖముల్ మీసాలపై తేనియల్.

3. ప్రవరుఁడు హవ్యవాహనుని స్తుతించుట.

1. మూలము:—

శ్లో. ఇత్యుక్త్వా సమహాభాగః స్పృష్ట్వాపః ప్రయతః శుచిః
ప్రాహేదం ప్రణిపత్యాగ్నిమ్ గార్హపత్య ముపాంశునా
భగవన్ గార్హపత్యాగ్నియోనిస్త్వం సర్వకర్మణామ్.
తత్త్వ ఆహవనీయాగ్నిర్దక్షిణాగ్నిశ్చ నాన్యతః
యుష్మదాప్యాయనాద్దేవా వృష్టిసస్యాదిహేతవః.
భవంతి సస్యాదఖిలంజగద్భవతి నాన్యతః
ఏవం త్వత్తోభవత్యే తద్యేనసత్యేన వై జగత్
తదాహమద్యస్వంగేహంపశ్యేయంసతిభాస్కరే
యథావైదికం కర్మస్వకాలేనోజ్ఝితంమయా
తేన సత్యేనపశ్యేయం గృహస్థోద్య దివాకరమ్
యథాచ నపరద్రవ్యే పరదారేచ మేమతిః
కదాచిత్సాభిలాషాభూత్ తథైవసిద్ధిమేతుమే

2. మా ర న: —

సీ. అనియమ్యవాశ్యాగుఁ డాచమన మొనర్చి
నియతుండు శుచియునై నిలిచి గార్హ
పత్యాగ్నిఁ నెమ్మది భావించి వందన
మొనరించి యిట్లను ననిలమిత్ర!
నీయంద యాహవనీయాగ్నియును దక్షి
ణాగ్నియుఁ బ్రభవించె నఖిలదేవ
తలకును దృప్తి నీవలన సిద్ధించును
సకలలోకముల కాశ్రయము నీవ

ఆ. నిత్యసత్యమూర్తి నీ ప్రసాదంబున
నినుఁడు గ్రుంకకుండ నిపుడ యుంటి
కరుగువాఁడఁ గాక యాగమోదితకర్మ
జాతసాక్షికుండ నైతి నేని.

క. పరనారీ పరధనరతి
పరత్వ మెన్నఁడును నాకుఁ బాటిల్లనియా
స్థిరసత్యమహిమవలన
త్వరితగమన సిద్ధి గలుగవలయు హుతవహ!

3. పెద్దన్న:—

ఆ. ... ... ... ... ...
... ... ... ... ...
... వార్చి ప్రవరుడు గార్హపత్య
వహ్ని నిట్లు పొగడె భావమునఁ దలఁచి.

మ. దివిషద్వర్గము నీముఖంబున తృప్తిఁ జెందు నిన్నికుఁ గా
స్త్రవముల్ సేయు శ్రుతుల్ సమస్తజగదంతర్యామివిన్ నీవ యా
హవనీయంబును దక్షిణాగ్నియును నీయందుద్భవించున్ గ్రతూ
త్సవసంధాయక నన్నుఁ గావఁగదవే స్వాహావధూవల్లభా!

ఉ. పావజపాగ్నిహోత్ర నరతంతుఁడఁ జేని భవత్పదాంబుజ
ధ్యానరతుండఁ జేనిఁ బరదారధనాదులఁగోర నేని స
న్మానములోడ నన్ను సదనంబుననిల్పు మినుండు పశ్చిమాం
భోనిధిలోనఁ గ్రుంకకయ మున్న గయుంబున హవ్యవాహనా !

దీనినిబట్టిచూడఁ,గా వరూధినీ ప్రవరసంభాషణములో మూలము లోనున్న విషయములను యథావిధిగా మార్కండేయుఁ బెద్దన్నయుఁ గూడ పరిగ్రహించిరి. మార్పులు లేవనియే చెప్పవచ్చును.

4 మనోరమా కన్యాప్రదానము.

1. మూలము.

శ్లో. దత్వా విద్యాంతతఃకన్యాంసదాతుముపచక్రమే
తమాహసాతథాకన్యాజనితారం స్వరూపిణం
అనురాగోమయాప్యత్రతాతాతీవమహాత్మని
దర్శనాదేవసంజాతో విశేషేణోపకారిణి.
కిన్త్వేషామేసఖీసాచ మత్కృతే దుఃఖపీడితే
అతోనాభిలషేభోగాన్ భోక్తుమే తేనవై సమం
పురుషైరపినోశక్యంకర్తుమిద్ధంనృశంసతా
స్వభావరుచిరై ర్మాదృక్ కథంయోషిత్ కరిష్యతి
సాహంయథాతేదుఃఖార్తే మత్కృతే కన్యకేపితః
తథాస్థాస్యామితద్దుఃఖేతచ్ఛోకానలతాపితా॥

2. మారన.

వ. స్వరోచికి నాయుర్వేద విద్యనిచ్చి యక్కన్యకనీయ నుపక్రమించిన తండ్రికినామె యిట్లనియె.

చ. మన కుపకారియైన సుకుమారుని నీతనిఁ జూచినప్డు నా
మనమున రాగమైనయది మానుగనైనను దండ్రి నా కతం

బడఁ బటురోగదుఃఖములఁ బొందుచు నెచ్చెలు లిట్టులుండగా
మనసిజభోగలీలకు మానస మెమ్మెయి నాకు నూల్కొనున్.

3. పెద్దన్న.

కం. ఈయుపకారమునకుఁ బ్రతి
సేయఁగ శక్యంబె? జంభజిన్నిభశఫరా
త్యాయతలోచన రైనను
దీయాత్మజ నీకు నిత్తు దేవీమణిఁగన్.

కం. ఆయుర్వేదముఁ గైకొని
యీయింతినిఁ బెండ్లియాడు మెలమి రమానా
రాయణపరిణయగేయవి
గాయనగంధర్వమైన కవ్వపుగొండన్.

అనిమాత్రమే చెప్పి యిందీవరాక్షుఁడు మనోరమతో వెంటనే తన పట్టణమునకుఁ బోయెను. మనోరమ యచ్చట నేమియు మాటలాడుట లేదు.

ఈమనోరమా కన్యాప్రదాన సందర్భములోఁ బెద్దనార్యుఁడు మూలముకంటెను మారనకంటెను బ్రత్యేక భిన్నమార్గమునఁ బోయెను. మూలములో నున్నప్రకారమే యించుకయుఁ దప్పకుండ మారన తెనిఁగించినట్లు స్పష్టమగుచున్నది. అనగా నిందీవరాక్షుఁ డాయుర్వేదముతోఁ బాటు తనకూతురగు మనోరమను స్వరోచి కిచ్చుటకు వాగ్దత్తముచేసిన వెంటనే ప్రక్కనున్న మనోరమ తన యభిప్రాయము తండ్రికిని స్వరోచికిఁ దెలియఁజెప్పెను. తన కుపకారముఁ జేసిన స్వరోచియందామె కనురాగము పొడమినను దనమూలమున నార్తిం బొందిన సఖులు రోగబాధితలై యుండఁ దనకుఁ బరిణయసౌఖ్య మెట్లురుచింపఁగలదని దీనాలాపములఁ బలికెను. పెద్దనార్యుఁ డీసమయమునఁ బ్రత్యేకముగా వేఱుమార్గ[illegible] బోయెను. ఇందీవరాక్షుఁడు స్వరోచితోఁ దనకుమార్తెను బరి

ణయముకై యిచ్చెదనని ప్రతిజ్ఞసేసినపుడు మనోరమ దగ్గరనేయున్నను నించుకైనను మాటలాడలేదు. పెండ్లిమాటలుజెప్పి వెంటనే స్వస్థానమునకు బయలుదేరుచున్న తండ్రితోఁ దానును బయలుదేరివెళ్లినట్లు పెద్దన రచించెను. తండ్రితోఁగాని స్వరోచితోగాని యొకమాటయైనను బలుకలేదు. ఇట్టి ముఖ్యమైనమార్పుఁ జేయుటకుఁ గారణమేమి? మనుచరిత్ర కథాక్రమము యావత్తును బహుజాగ్రత్తగను, సూక్ష్మదృష్టితోను మూలానుసారముగ నడిపించిన పెద్దనార్యుఁడు ఈవిషయమున మరచిపోయెననిగాని ప్రమాదవశమునఁ దప్పిపోయెననిగాని చెప్పవలనుపడదు. ఏలయన మనోరమ తన మనోపచారమును వివాహానంతరమున భర్తతో నేకాంతముగ నున్నప్పుడు విన్నవించుకొన్నటులు పెద్దన్నయే రచించినాఁడు. కాబట్టి మనోరమ వాక్యములను పెద్దన్న యుద్దేశపూర్వకముగ స్థలాంతరమునకు మార్చినాఁడని చెప్పుకొనవలసియున్నది. అనగా తన్ను స్వరోచికిఁ బెండ్లిచేయుటకు నిశ్చయించుకొని తండ్రి వాగ్దత్తము జేసినపుడు తాను మిన్నక యూరకొని వివాహానంతరము తనపతితోఁ గేళీమందిరముననుండ భర్తను వేడుకొనెను. ఈమార్పు యొక్క యుద్దేశమును స్వారస్యము మనముఁ గ్రహింపవలెను.

వివాహమునకుఁ బూర్వమేమియు మాటలాడక వివాహానంతరము పతి రతికుతూహలుఁడై యుండ నాతనిని నాసమయమున వేడుకొనుట వెలయాలి వర్తనమనియు, మనోరమ భోగస్త్రీవలె నటించినదనియు బ్ర. శ్రీ. కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు తీవ్రముగా నాక్షేపించిరి. కాఁబట్టి యీవిషయములో మనోరమశీలమెట్టిదియో పెద్దనార్యుఁ డీమార్పేలఁజేసెనో మనము పరిశీలింపవలెను. తన తండ్రి తనను స్వరోచికిఁ బెండ్లిచేయ నిశ్చయించుకొని వాగ్దత్తము చేయుచున్నప్పుడు దానేమియుఁబలుకక, యిష్టానిష్టములేవియుఁ దెలియఁజేయక మిన్నక యూర

కొని తండ్రితోఁగూడ వెడలిపోయెను. అనఁగా దనతండ్రికిని పెండ్లికుమారునకును జరిగిన సంభాషణములోఁ దానేమియుఁ బాలుగొనలేదు. తనను పెండ్లిచేయుట తన తండ్రిపనియేగాని తానావిషయములో నేమియుఁగలుగఁజేసికొనుట యుక్తముగాదని తలఁచి యూరకున్నదా? వివాహనిర్ణయము కేవలము మాతాపితృసంబంధమేనా? లేక కన్యాభిప్రాయములో నేమైన సంబంధించి యున్నదా? ఇదియే మనము ముఖ్యముగా నిర్ణయింపవలసిన విషయము. మన హిందూసంప్రదాయములో నగ్రవర్ణములలో గొప్పకుటుంబములందు జరుగుచున్న వివాహసంబంధములెట్లు నిర్ణయింపఁబడుచున్నవో మనము యూహింపవలసియున్నది. ఈకాలమునఁ గొంచెము మార్పున్నను యింతకుఁబూర్వము రాజకుటుంబములలోని కుమారితలను వివాహము జేయునపుడు, పెండ్లిమాటలు జరుగుచున్నపుడు, పెండ్లికాఁదగుకన్య లేమైనను వారి యభిప్రాయములను పెండ్లికుమారునియెదుటఁగాని, వారిబంధువులయెదుటఁగాని బాహాటముగాఁ జెప్పుట మనదేశాచారముగా నున్నదా? అను విషయము మనము ముఖ్యముగా నాలోచింపవలసియున్నది. అట్టి యాచారము మనదేశములో లేనియెడల మనోరమ తన పెండ్లిమాటల సమయమున నేదైన మాట్లాడుట కవకాశ మెట్లుండును? కులీనులగు కన్యలు తమ వివాహసమయమునఁ దమ యభిప్రాయములను గాఁబోవు భర్తలయెదుటఁగాని వారి యాత్మీయబంధువుల యెదుటఁగాని యెన్నడును మాట్లాడుట కేవలము దూష్యమనియు, నశ్లీలమనియు నభిప్రాయములో మనమున్నాము. మనదేశాచారమునకు ననుగుణముగానే మనోరమకూడా తన యభిప్రాయములు మనసులో దాచుకొని వివాహమైనతరువాతఁ బతికి నేకాంతముగా నివేదించుకొనినది. ఇది గొప్ప కుటుంబములలోని

కన్యల సౌశీల్యమేఁగాని వెలయాలివర్తనముగాదని మనదేశాచారమును, మనవ్యవహార పరిజ్ఞానమును గలవారొప్పుకొనకతీరదు.

అయితే దీనికొక యాతంకమున్నది. ఈయాచారము మనదేశములో ననాదిగానున్నదా? లేక యిటీవల నుత్పన్నమైనదా? అనాదిగా నున్నయెడల మార్కండేయపురాణములో రాజకన్యయగు మనోరమ యెట్లు తనయభిప్రాయము వెంటనే తెలుపఁగలిగెను? అని ప్రశ్నింపవలసి వచ్చును. పౌరాణికకాలములో మనదేశమందు గన్యలకు వాక్క్రియా స్వాతంత్ర్యము లెక్కువగా నుండెనేమో యని మనమూహించుట కవకాశము గలదు. ఆకాలపు వ్యవహారములనుబట్టి మనోరమ తండ్రియెదుట స్వరోచితోఁ దన యభిప్రాయము స్పష్టముగాఁ జెప్పఁగలిగెను. కాని యిప్పటికాలమువలెనే పెద్దన్నకాలమందును రాజకన్యలు వివాహ సందర్భములలోఁ దమ యభిప్రాయములు వెల్లడిగా మాట్లాడుట యనుచితమని సంఘమర్యాదలలోఁ గట్టుబడియున్నవారే! కావునఁ దన దేశకాలవ్యవహారములఁబట్టి పెద్దన్న యీపెద్దమార్పుఁ జేసినవాడయ్యెను. పౌరాణికకథను పౌరాణిక నియమములనుండి తప్పించి తనకాలానుసరణముగ వ్రాసినాడని పెద్దనార్యుని నిందింపవచ్చును. కాని మనోరమవర్తనము వెలయాలి వర్తనమనియు, భోగస్త్రీవలె నామె స్వరోచిని వంచింపఁదలచినదనియు నిత్యాదిప్రసంగములు చేయుటచాల యనుచితము, అన్యాయము, అని మనవిచేయుచున్నాను. తన్ను స్వరోచికిఁ బెండ్లిసేయుదునని తండ్రి చెప్పిన క్షణమునుండి యామెస్థితి పూర్ణముగ మారినది. స్వరోచి తనకు భర్తయైనవాఁడే; పాణిగ్రహణము కాకపోయినను మనస్సంకల్పమున నాతఁడు భర్తయయ్యెను. కావునఁ బతితో వెల్లడిగఁ దండ్రి సమక్షమునన్నైనను మాటలాడయోజింపదు. కావున మనోరమ మిన్నకుండెను. కాని చెలికత్తెలకుం దు ఆమెడెందము నెట్లు కొందలపెట్టు

చుండెనో శయ్యాగృహమునఁ బతితో నేకాంతముగ మాట్లాడుట కవకాశము గలిగినవెంటనే ద్యోతకపరచినది. అంతకుఁ బూర్వమామె యాపరిసంగము జేయుటకుఁ గొంచెమైనను పై కారణములచే వీలుకలుగలేదు. వీలుకలిగినవెంటనే మొదటిపనిగఁ దనచెలికత్తెల రుజనుగుటించి పతిని బ్రతిమాలుకొనినది. కావునఁ బెద్దన్నగారు చేసినమార్పు మన కులాచారమునకును, మనసంఘమునకునుఁ దగినట్లుండుటకే యాతడు మనఃపూర్వకముగఁ జేసినాఁడని మనవి జేయుచున్నాను.

కావున కథా సంవిధానవిషయములో పెద్దనార్యునిమార్పు చాల వరకు మూలానుసరణముగ నున్నను, అతడుచేసిన కొలదిమార్పులును ఔచిత్యమర్యాదలను మించకుండ కథానిర్మాణమున కొకవిధమైన స్వాభావికత్వమును, సౌమనస్యతను కలుగఁజేసినవని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును.

ఈకథానిర్మాణ సందర్భములో పెద్దనార్యుడు చేసిన మరికొన్ని చిరుతమార్పుల యౌచిత్యమును సమర్థించుచూ ఈగ్రంథమునకు మొదటి యనుబంధముగానున్న వ్యాసములో విపులముగ వ్రాయవలసివచ్చినది.ఆ భాగమునిచటతిరిగి యెత్తి వ్రాయుట చర్వితచర్వణము.కావునపెద్దనార్యుని కావ్యశిల్పమును బరిశీలించునపుడు మొదటి యనుబంధమందలి విచారణ కూడ చదువదగినది. రసవిషయములో నచ్చటచ్చట స్ఖాలిత్యములున్నను, కథానిర్మాణములోమాత్రము అనౌచిత్యదోష మెచ్చటను జూడ బోమని నిస్సంశయముగాఁ జెప్పగలను. "అనౌచిత్యాదృతే నాన్యత్ రసభంగస్య కారణం" అని క్షేమేంద్రుడు చెప్పినాడుగదా!

కావ్యరచన: శైలి.

ఆంధ్రకవిత్వమున మొట్టమొదట రాజమార్గము జూపినవాఁడు నన్నయభట్టారకుఁడైనను కవిబ్రహ్మయగు తిక్కనసోమయాజియే మొ

దటి యాచార్యుఁడని చెప్పవలసియున్నది. తిక్కనసోమయాజి యనేక శిష్యులకును, ప్రశిష్యులకును నాంధ్రకవితామృతమును ధారపోసి పోషించి యొక యాంధ్రకవితాశాఖను (School of Poetry) స్థాపించెను. కేతన, సోమన, మారన, మంచన మున్నగు మహాకవు లామహాత్ముఁడు జూపిన దారినేఁబోయి యనేక యుద్గ్రంథములు రచియించి, యాంధ్రకవిత్వమును చిరస్థాయిగానెలకొల్పిరి. తిక్కనసోమయాజి యాదర్శకశక్తి సుమారు రెండువందల సంవత్సరములవరకు నాంధ్రకవుల యుల్లములలో పల్లవించుచుండినది. ఆతనికవితాపద్ధతి ముఖ్యముగా రసపోషణయందును భావవిస్ఫురణయందును నెక్కువప్రాముఖ్యముజూపుచుండెను. భాషావిషయికములగు శైల్యలంకారములపై నాతఁడు దృష్టి మరల్పలేదు. తాను *"ఉభయకావ్యప్రౌఢి బాటించు శిల్పమునన్ బారగుఁడనని" చెప్పి ముఖ్యముగా కావ్యశిల్పమునకే ప్రాముఖ్యమునిచ్చెను. శైలీవిషయమంతయు శిల్పమున కధీనమేగాని యధికమని తలంచినవాఁడుగాడు. కావున నతని కవితారీతి ననుసరించినవారందరు భాషకంటె భావమునకే యెక్కువయాదరము కనుపర్చిరి.

ఇట్లుండఁ గ్రమక్రమముగఁ దిక్కయజ్వపద్ధతులు ప్రాతగిల్లినవి. ఆంధ్రకవులు క్రొత్తదారులకొఱకెదురుజూచుచుండిరి. మఱియొక మహానుభావుఁ డుదయించి దారిఁజూపినగాని సామాన్యులకుఁ ద్రోవతెన్నులు గాన్పింపవుగదా ?

శ్లో. యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరోజనః
సయత్ప్రమాణంకురుతే లోకస్తదనువర్తతే. (భగవద్గీత)

* మ॥ అమలోదాత్త మనీషి నే నుభయ కావ్యప్రౌఢిఁ బాటించు శి
ల్పమునం బారగుఁడన్ గళావిదుఁడ.........

తిక్కన: (నిర్వచనోత్తరరామాయణము.)

అను గీతాన్యాయ మన్ని కార్యములలోవలెనే కవిత్వ కార్యము నందును వర్తించుచున్నది. ఇట్టిస్థితిలో మఱియొక మహానుభావుఁ డవతరించి యాంధ్రకవులయందు మందగించిన శక్తులను రగుల్కొల్పి క్రొత్త దారులయందు విజృంభించునట్లు చేసెను. అతఁడే శ్రీనాథ కవిసార్వభౌముడు.

తిక్కయజ్వ మనుమసిద్ధి మనుజేంద్రునియొక్క మంత్రి. కార్యదీక్ష, కార్యదక్షత ఈయనయందు మూర్తీభవించినవి. ఆంధ్ర లౌక్య వ్యాపారములను కొనసాగించునేర్పును, కూర్పును ఆంధ్రకావ్యవ్యాపారములోఁ బ్రయోగించెను. మితభాషిత్వము, ప్రయోగకౌశలము, నిర్వహణ ప్రావీణ్యమును మహామంత్రులకు నైసర్గికములుగదా! ఇవియే యీకవిశేఖరుని కవిత్వమందును గాననగును. శ్రీనాథుఁడు రెడ్డిరాజుల యొద్ద విద్యాధికారి.* అనగా రాజస్థానమునకువచ్చు పండితులను, రాజ్యమందలి పాఠశాలలను, కళాశాలలను, శాస్త్రపఠనాలయములను పరీక్షించు నిర్ణేత. ఈతఁడు హిందూవిద్యలను బరీక్షించు నుద్యోగి. విద్యలను బరీక్షించుటకు విద్యలను దెలుసుకొని యుండవలెనుగదా! వేదములును, శాస్త్రములును, పురాణములును, కావ్యములును నిత్యాది హిందూసారస్వతమంతయు నీతనికి కరతలామలకముగా నుండవలెను. అనగా నీతనిలోకమంతయు భాషాప్రపంచము గావున నీతని దృష్టియంతయు గీర్వాణాంధ్రసాహిత్యమునఁ బోయినది. తన పాండిత్యము ప్రకర్షించుటయే ముఖ్యకర్తవ్యము. ప్రాకృత గ్రంథములను, అతి క్లిష్టగీర్వాణ గ్రంథములను నాంధ్రీకరించి కీర్తిఁగడించెను. కావునఁ బాండిత్యము ప్రథమము. కవిత్వము ద్వితీయము. ఇట్టిమహాపండితుఁ డుద్దండకవియై ఆంధ్రభాషాయోషను ద్వితీయరంగములో దింపినాఁడు. భాషార్భటి

* "విద్యాధికారీ శ్రీనాథో అన్నవేమమహీపతేః"
"ఫిరంగిపురము శాసనము."

యు, సమాసభావాఢ్యమును, కఠినపదప్రయోగము నిత్యాది పాండి త్యోచిత పద్ధతులను వాడుకలోనికిఁ దెచ్చినాఁడు.

పురాణములనుండి ప్రబంధములలోనికి క్రమముగా దిగినట్లుగా భావప్రాధాన్యమునుండి భాషాప్రాధాన్యమున కాంధ్రకవిత క్రమముగా దిగ మొదలిడినది. శ్రీనాథుని భాషానిగుంఫనములు మున్ముగునవి యాంధ్రకవుల కాదర్శములైనవి. కావ్యశిల్పముకంటె కావ్యశైలియే ప్రాముఖ్యమునొంద నారంభించినది.

ఈమార్పు కొంచెమెక్కువ తక్కువగా పదునేనవశతాబ్దాంతము న కాంధ్రలోకమున వ్యాపించినది. కృష్ణదేవరాయలు పాండిత్యమును కవిత్వమును జీవితమందు ప్రధానకృషిగా జేసికొననివాఁడు గాన శ్రీనా థుని శైలీపద్ధతుల నంతగా ననుగమింపలేదు. కాని కవిత్వమే ముఖ్యజీ వికగా నున్నవారందఱు శ్రీనాథునే యనుకరింప మొదలిడిరి. వారిలో ప్రథముఁడు పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు. రెండవపెద్దకవి మన అల్లసాని పెద్దన్న.

శ్రీనాథునిశైలి ఉపన్యాసక శైలియని గాని, లేక వాగ్మియ శైలియనిగాని చెప్పవచ్చును. అతఁడు దనగ్రంథములందు సాధారణము గా నొక్కొక్కవిషయమును త్రిప్పి త్రిప్పి, గ్రుచ్చి గ్రుచ్చి అనేకరీతు లుగా ననేకపదకల్పనలతో వక్కాణించు చుండును. వినువారిమనస్సులలో బలమగు భావములను నెలకొల్పుటకుఁగాను మహావక్తలు మహాసభలలో నేవిధముగఁ బ్రయత్నింతురో శ్రీనాథుఁడు నదేవిధముగ తనవాగ్జాలప రంపరల నుపయోగించి యాయావిషయము లనేకరీతులనుల్లేఖించి, యు గ్గడించి, పాఠకుని మనమందొక విధమగు నుదారమైనదియు నుత్కృష్ట మైనదియు నగుభావమును సాక్షాత్కరింపఁజేసి దానియందు బుద్ధిని ప్రబ లముగా నిలుపఁజేయును. అంతియకాని యుత్తమకవీశ్వరులవలె సుకుమా

రములగు భావములను లలితములగు రసోదయములను మృదువుగాను, మితముగాను జెప్పఁగలనేర్పుగలవాఁడు కాఁడు. అతను మొదట మహాపండితుఁడు. తరువాత మహాకవి. పాండిత్యప్రకర్షిత కవిత్వమే యాతని సొమ్ము. రెండవవిషయమేమనఁగా శ్రీనాథుఁ డద్వితీయ శబ్దసంధాత (Phrase-maker). ఆతనిపదముల కూర్పునేర్పులు నితరకవియందును గానరావు. గీర్వాణాంధ్రభాషలు రెండును ఆతనికి నామూలాగ్రముగా వాఙ్మయవిధేయములైనవి. ఆతని వక్తృత్వమహిమకు హద్దులేదు.

పెద్దన్న యట్లుగాదు. ఆతఁడు ప్రాథమికముగా రసికుఁడగుకవి. తరువాత పండితుఁడు. నైసర్గికములగు రసికతాకళలకు పాండిత్య సౌరభముఁ జేర్చినాఁడు.

శ్రీనాథుని శబ్దఘటనాశక్తి ప్రౌఢమైనదియు, పసిగల్గినదియుఁగాని ప్రాయికముగా రసార్ద్రమైనదని గాని రసస్నిగ్ధమైనదనిగాని చెప్పుటకు వీలులేదు. పెద్దనార్యుని పలుకులలో ప్రతిమాటయందును తదుచితముగు రసము పూరించియుండి, యామాటలు రసగుళికలవలె నింపుసొంపులతో ముఱియుచుండును. రసపూరితమైన శబ్దజాలము నుపయోగించుటలో కవిబ్రహ్మను మినహాయించినయెడల పెద్దనార్యునితో సమానులు ఆంధ్రవాఙ్మయమునఁ నిద్దరే. ఒకప్రక్క నాచనసోముఁడును, రెండవప్రక్క రామరాజభూషణుఁడును. తక్కినవారు సామాన్యముగ కొంచెము దూరముగ నుండవలసినవారే, ఆంగ్లేయభాషలో కీట్సు (keats) మహాకవి కెట్టి ప్రతిభావముండెనో యట్టిసామర్థ్యమే పెద్దనమహాకవికిని కలదని యౌపమ్య న్యాయమున జెప్పవచ్చును. ఇది యీకవులయొక్క స్థూల దృష్టి విమర్శనము.

సూక్ష్మాంశముల నిరూపణమునకు దిగినచో నతనిశైలియందు కొన్నిముఖ్య భేదములు గాన్పించుచున్నవి. మనుచరిత్రమందలి శైలి

తొలినుండితుదివఱకు నొకేరీతినుండలేదు. మొదటి మూఁడాశ్వాసములలో నొకరీతిని తరువాత మూఁడింటియందును వేరు విధముననున్నది.

మొదటి మూఁడాశ్వాసములలోను నవతారిక భాగమువదలినచో, మిగిలినభాగమందు ముఖ్యముగా శృంగారరసమే యెక్కువగానున్నది: వరూధినీప్రవరులును; వరూధినీమాయాప్రవరులును; వీనియందలి శృంగారము విప్రలంభ శృంగారము, సంభోగశృంగారము ఇత్యాది శృంగార రసమే యైయున్నది. ఈభాగమందలిశైలి శ్రీకృష్ణదేవరాయలుకోరినట్లుగను, నమ్మినట్లుగను, శిరీషకుసుమసౌకుమార్యము, సౌరభము, మార్దవము, మాధుర్యము, రససంపుష్టి, రసోత్సుకత, ఇత్యాద్యుత్తమకవితా గుణములతో, నిండుసోయగమున, నిద్దంపు నిసుగులతో, నిత్యనిరంతరాహ్లాదము గలిగించుచున్నది. పాఠకుఁడు తనివిలేనితమకమును, కడలేని కౌతుకమును బొందుచుండును.

మిగిలిన మూఁడాశ్వాసములలోను సామాన్యముగ నట్టి సౌరభమును, మాధుర్యమును జూపట్టవు. రెండుభాగములయందును సమానములైన యితివృత్తములును, వర్ణనావిషయములును గలవు. కాని వానిశైలి పరిశీలించినచో మొదటిభాగమందలి శైలీసౌమ్యత రెండవభాగమందు తెలుచు గాన్పించదు. మృదుమధురశబ్దఘటితి మొదటిదానియందు సర్వత్ర యున్నది. రెండవదానియందు దానికొఱకు వెతకి చూడవలసి యున్నది. ఒకేగ్రంథమందిట్టి శైలీవ్యత్యాసములుండుటకుఁ గారణములు రెండుగా నుండునని నాకుఁ దోఁచుచున్నది.

ఒకటి:— మూలకథలోనున్న యొకచిన్న యితివృత్తమును దన యద్భుతశక్తిసామర్థ్యములఁ బోషించి, పెంచి సుమారు మూఁడాశ్వాసములు పూర్తిజేసెను. అప్పటికింకను చాలవఱకు కథాభాగము మిగిలియే యున్నది, అందుచే మిగిలిన మూఁడాశ్వాసములలోను కథాకథనమును

జాలవఱకు కుదించి, బంధించి నొక్కి క్రుక్కి పూర్తి చేయవలసి వచ్చెను. తత్కారణమునఁ జెప్పవలసినదానిని విరళముగాను విరివిగాను చెప్పక, సమాసబాహుళ్యమున సంక్షిప్తపఱచి క్రోడీకరించెనేమో యని తలఁచు చున్నాను.

రెండవకారణము:— బహుశః మొదటిభాగములో నున్న శైలీ పాకము చాలలేఁతగానున్నదని పండితులుపరామర్శించిపరిహసించిరేమో! ఆకారణమున పెద్దన్న తన పాండిత్యప్రౌఢిమను పూర్తిగ రెండవభాగ మందుఁ గనుబఱచి శ్రీనాథుని శిష్యుఁడని యనిపించుకొనెను. కారణమేది యెట్లయినను, శైలీభేదము మాత్రము ప్రత్యక్షము.

మొగటిభాగములో కమ్మని నెత్తావులతో నిండి, క్రొప్పూరితేనె లొలుకుచున్న పద్యములు వరుసవరుసలుగ సుందారవిందమందారమాల లుగా పాఠకుని హృదయపీఠి నాలింగనమొనర్చుచుండును. రెండవభాగ ములో నట్టి పద్యము లచ్చటచ్చట వెదకినఁగాని కాన్పింపవు. ఈ భాగ మందు ముఖ్యముగా సంస్కృతశబ్దజటిలమున దీర్ఘసమాసములు, క్లిష్ట పద ప్రయోగములు, పరుషాక్షరప్రాసములు ఇత్యాది భాషాకాఠిన్య లక్షణములే యెక్కువ. ఈ క్రిందియుదాహరణభాగములను జంటజంట లుగా చదువుఁడు.

(1) వరూధిని స్వవృత్తాంతము జెప్పికొనుటయు; మనోరమ స్వవి షయము నెఱింగించుటయు.

(2) మొదటిభాగములోనున్న రాత్రివర్ణనము; రెండవభాగము లోని రాత్రివర్ణనము.

(3) మొదటిభాగములోని హిమవద్గిరివర్ణనము; రెండవభాగము లోని మందరగిరి వర్ణనము.

ఈదృశంబులగు సమానవిషయములుగల భాగములను జదివిన యెడల మొదటిభాగమునందలి శైలి, కృష్ణరాయల మాటలు జ్ఞాపకముంచుకొనినచో, పెద్దనార్యుని సహజశైలియనియు, రెండవభాగమందలిది గ్రంథసంకోచమునకో, లేక, పండితులను తృప్తిపఱచుటకో యాతఁడు తెచ్చిపెట్టుకొన్నదనియు చెప్పవలసియుండును. ఈరెండుభాగములలో శైలీభేదముఁ జూపుట క్రింది పద్యములను దిక్సూచకముగా నుదాహరించుచున్నాను.

1. వరూధినీ వర్ణనము.

ఉ. అబ్బురపాటుతోడ నయనాంబుజముల్ వికసింపఁ గాంతిపె
ల్లుబ్బి కనీనికల్ దిశల నుత్పలపంక్తులఁ గ్రుమ్మరింపఁగా
గుబ్బమెఱుంగుఁ జన్గవ నిగుడ్చి పడున్ మదిలోనఁ గోరికల్
గుబ్బటిలంగఁ జూచె నలకూబరసన్నిభు నద్ధరామరున్.

(2ఆ- 28 ప. వ)

2. మనోరమావర్ణనము.

శా. మట్టెల్ మ్రోయఁగ గబ్బిచన్నుఁగవ కంపంబంద వేణీభరం
బట్టిట్టై కటిఁ జిమ్మఁ జిన్కకటలుల్ గా నఱ్ఱివ్రేఁగం బోడిక
ల్గట్టన్ జూపులు చిమ్మరేఁగి దపిగోలంబాళిఁ గల్పింపఁగా
మిట్టాడంగ నరుండు లేనియడవిన్ మీనాక్షి దీనాకృతిన్.

(4ఆ- 68 వ).

3. హిమవద్గిరి వర్ణనము.

సీ. పసపు నిగ్గులు దేఱు పాపజన్నిద మొప్పఁ
ప్రమథాధిపతి యింటిప ప్రైతెంగ,
శచికిఁత గఱపుచుఁ జదలేట సురరాజు
జలకేళిసవరించు చెలువెఱింగఁ
నదనుతోఁ జేపి చన్నవిసి యోషధులమ

యత్నములు చేయుచు, తన యపారసారస్వతశక్తి నంతను ధారపోసి యాదృశ్యములను జీవితమునకు ప్రతిబింబముగానుండునట్లు చేయుటకై తనివినొందని యభిలాష కనుపఱచుచుండును. పర్వతారణ్యాది స్థావర ప్రకృతి నితరకవులుగూడ తఱచు యథావద్వస్తువర్ణనకుఁ దెచ్చిరి. కాని మన పెద్దనార్యుఁ డంతటితోఁ దృప్తినొందక ప్రాణిలోకమునుగూడ యథాస్థితముగా వర్ణించుటకు ప్రతిసందర్భములోను ప్రయత్నించుచునే యుండును. లేనియెడల పలుతావులఁ గానంబడు నీధ్వన్యనుకరణముల ప్రయోజనమేమి? హుటాహుటి, ఝుణంఝుణ, చిమచిమ, చకచక, ధగంధగ, బుడబుడ, ఘుర్ఘుర— ఇత్యాది ధ్వన్యనుకరణ వాక్యము లితర కవులకంటె నీతనియం దెక్కువ కాన్పించుచున్నవి. ఇవి యాయాతావుల నానావస్తువులు చేయు నైసర్గికధ్వనులే, కావున పెద్దనార్యుని యభిప్రాయము ప్రకృతివర్ణనము శబ్దసాదృశ్యమునంతవఱకు ప్రకృతిజీవితమునకు సరిపోవునట్లు చేయుటయేయని నిశ్చితముగాఁ జెప్పవచ్చును. మఱియొక విషయము— సందర్భోచిత వర్ణనలు వచ్చినప్పుడు తనయపారప్రాపంచిక విజ్ఞానమంతయు నుపయోగించి, ముఖ్యాంశములనే సూచించి, తృప్తి నొందక, నతి సూక్ష్మాంశములకుఁగూడఁబోయి, యావర్ణనలను దీర్ఘతమములను జేయుచుండును. ఈవిశేషము రాయలయందును జూచితిమి.

సీ. కంఠాత్తకై రాయుఁ గర్కశంబగు నుంటిఁ
బీఁటవెట్టిన ప్రామ పెల్లగిల్లఁ
జెవిదార్చి విని చీమచిటుకన్న నొకసారి
సెలవివెంపగలాడుజిట్టలెల్లఁ
జప్పరించు నముల్లు సట లుబ్బ దంష్ట్రాగ్ని
చొంగ పైఁబడి చుంయుచుంయు మనఁగఁ
జంద్రనిప్పులువోలెఁ దీండ్రించు కనుమించు
లెసగ నొండొంటిపై నక్కఁబాఱు

గీ. వట్టదినముల మడుఁగుల మట్టిగలఁగ
బుడబుడధ్వనివెడలు బుద్బుదములందుఁ
జిలుపచిలుపని చేతులు జిడ్డుదేలు
నేమి చెప్పను గ్రొవ్విన యేకలగుల.

సీ. సావదేశ్ పాటమరించి సెబాసవాదినయట్టి
యాకురాలుఘుగండ్లుయుంగు గొలఁగి
యతిబాలకిరచ్ఛదాంకురాకృతిఁ గొల్చి
కరవీర కోరకగతిఁ, గమమున
వరుణంపు మొగ్గలై యరవిచ్చి కికిరియాఁ
కలదంపు లల్లు గుంపులయి కినిక
రేఖలేర్పడఁగ వర్ధిల్లి వెడల్పయి రెమ్మ
వసరువాలము నెక్కుఁ బరగునస్సు

గీ. పూఁట పూఁటకు నెక్కుఁ గప్పునకుఁ దగిన
మెఱుఁగు నానాఁటికిని మీఁద గిఱిగొనంగ
సొగసైయాకు వాలంగ జొంపమగుచుఁ
జిగురు దళుకొత్తెఁ దరులతా శ్రేణులంగు.

కం. కుటిలకృశ సాంధ్యగజనీ
విటకోర కకోమలచ్ఛవిస్ఫుట దంష్ట్రో
ద్భటపాత్ర ఖనితాగ్రగ
స్ఫుటితవనీధాత్రి నొక్కపోత్రిన్ గనియున్.

కావున ప్రకృతి వర్ణనలలో నితను జీవితమునకు సరిపోవు స్థితి వర్ణించుటకుఁ జాలప్రయత్నములుచేసి యితరకవులకంటె నెక్కువగా సఫలీకృతుఁ డయ్యెనని చెప్పవచ్చును. ఈతని వర్ణనలు సామాన్యముగా బాహ్యాకృతులు, బాహ్యచేష్టితములు, శరీరాభినయములు— యిత్యాది చక్షురాదీంద్రియగోచరములగు వ్యాపారములనే యెక్కువగాఁ జూపఁగ

లుగుచున్నవి. గాని యంతరింద్రియ వ్యాపారములను అనఁగా భావములు, ఊహలు, మనోరహస్యములు— యిత్యాది యంతర్బుద్ధి వికారములు సంతతగాఁ జూపలేదు. కావున నీతనిపని చాలవఱకు చిత్రకారుని శోభాసర్గ సమాలబ్ధమైన చిత్రపటములవలెను, మూకనాటకములోనున్న హావభావాభినయములవలెను చూపట్టును. పింగళి సూరన్నవలె హృదయమర్మములను మనోరహస్యములను తరచి తరచి పాత్రసంభాషణ పూర్వకముగాఁ దెలియ పఱచలేదు. ఈమహాకవిని చాలవరకు బాహ్యావిష్కయిక కవియని (objective poet) చెప్పవలసియున్నది. దీనికి కావలసిన నిదర్శనములు గ్రంథమం దేపట్టునఁ జూచినను పెక్కులు గాన్పించును. వరూథినీ మదనోద్వేగము, మాయాప్రవరాభినయము, మునికోపము, స్వరోచియుప్పెసన్నాహము— ఇత్యాదుల నెక్కడఁజూచినను చిత్రకళాకౌశలము కవితా ప్రావీణ్యమునకు బంగరుపూఁతవలె నమ్భుతమైన హృదయాకర్షణ సాధకమైనది.

ఇంతియుగాక దీర్ఘాక్షరములుగల శబ్దముల నుపయోగించుటయం దీతనికి చాలనభిలాష. ఆకారణముచేత నీతనిశైలి సంగీతము నాలపించుచున్నట్లగపడును. దీర్ఘస్వరము లితరకవు లచ్చటచ్చట నవసరార్థము వాడుచుండిరి.

నన్నయభట్టు:-

ఉ వాఁడిమయూఖముల్ గలుగువాఁ డపరాంబుధిఁగుంకె ధేనువుల్
నేఁడిటవచ్చె నేకతమనిష్ఠ మెయిన్ భవదగ్నిహోత్రముల్
నోఁడిగ నేల్వఁ గాఁబడియెఁ బ్రొద్దునుబోయెఁ గచుండు నేనియున్
రాఁడు వనంబులోన మృగరాక్షస పన్నగ బాధనొందెనో.

యనుపద్యమున దేవయాని కచునకై యెట్లు శోకించినదో స్వరసహాయమునఁ జూపించినాఁడు.

తిక్కన:-

శా. సింగంబాఁకటితో గుహాంతరమునం జేడ్పాటుమైనుండి మా
తంగస్ఫూర్జితయూథదర్శన సముద్యత్క్రోధమై వచ్చు నా
భంగిం గాంతారనివాస ఖిన్నమతి నస్మత్సేనపై వీఁడె వ
చ్చెం గుంతీసుత మధ్యముండు సమరస్థేమాభిరామాకృతిన్.

ఇచ్చట నర్జునుని దీర్ఘప్రవాస ప్రయాసమును ఉద్గీర్ణకోపావేశమును, దీర్ఘస్వర శబ్దసహాయమున నభివర్ణించెను.

పూర్వకవులు లోకానోక సందర్భముల కుచితముగానుండుటకు సట్టి దీర్ఘాక్షరశబ్దముల నుపయోగించిరి. పెద్దనార్యుఁడట్లుగాక తనశైలిని సామాన్యముగ దీర్ఘాక్షరబంధురముచేసి శ్రవణానందకరముగ నొనరించెను. తనశైలిని చాలవఱకు నుదాత్తగతిని నడిపించుటయు, విపరీతముగా గీర్వాణశబ్దముల ప్రయోగించుటయు నిత్యాదిలోపములకు లోనయ్యెను. అల్పవిషయములు చెప్పునప్పుడైనను నాతనిశైలి ఘనశబ్దాడంబరము గలిగియుండును. శ్రీనాథుని యంత యార్భటి లేకపోయినను నతని శిష్యుఁడని యనిపించుకొనెను. *

* కథానాయకుని మంగళస్నానవర్ణనము ఈ క్రింది గ్రంథములలో చదివిన నా యా కవుల శైలీ తారతమ్యములు స్పష్టమగును. ఈ విషయము పారిభాష్యములు లోకము చ్చుగా నూహింపవచ్చును.

పెద్దన: మనుచరిత్ర:-

ఉ. మజ్జన మాడె రాజు కృతమధ్యము కింపురవంగ గుంపులై
గొజ్జఁగనీటివెల్లువలు గోవజవాజుల నిగ్గుఁజూపఁ గుం
చజ్జరతాహికంచుకము చాయమడుంగులనొత్తెఁ దమ్మృగీ
గుజ్జగిలన్ వహించె మెఱుఁగుఁదిన చలువదుకూల చేలముల్.

ఈసామాన్యవిషయమగు స్నానవర్ణనమందు నీకవివరుల కవితా శైలులయందలి వారివారి ప్రత్యేక గుణవిశేషము లెట్లుకాన్పించుచున్న వో గ్రహింపఁదగును. పెద్దనార్యుని ప్రౌఢోక్తి, శ్రీనాథుని ప్రౌఢతరోక్తి, ముక్కుతిమ్మన్న మృదూక్తి, రామరాజభూషణుని శ్లేషోక్తియు వీనివలన తెల్లమగుచున్నవి. మొత్తముమీఁద నీతనిశైలి రసభూయిష్ఠమై స్వాభావిక వర్ణనలతో నిబిడీకృతము, ప్రౌఢపదసంకలితము, జృంభితస్వరమిళితమై యుండి, సర్వేంద్రియముల సౌఖ్యమావహించుచున్నను, కేవల మింద్రియ భోగలాలసత్వమును ప్రేరేపింపక యువబాలవృద్ధులకును యోగ్యమైన కావ్యాభిరుచి కలుగునట్లు చేయుచున్నది.

వెనుక కృష్ణదేవరాయల ఆముక్తమాల్యదనుగుఱించి వ్రాసినప్పుడు శైలివ్యత్యాస మాంగ్లేయంథమునఁగూడ నున్నదని చూపఁగలిగితిని. అయినను కృష్ణరాయల శైలికిని, పెద్దనార్యుని శైలికిని కొంత భేదమున్నది. కృష్ణరాయని శైలియందు మాధుర్యము తక్కువ, కటుత్వమెక్కువ. పదములు భావగర్భితములుగాని సార్ద్రములుగావు. ఆయన పద్యములు చదివినయెడల సామాన్యముగ హృదయము రసోల్లాసముచే

రామరాజభూషణుఁడు: వసుచరిత్ర:-

మ. ఘనచాంపేయక నాసనాపవళ (?) భృంగ శ్రీలు (?) చేపట్టి చ
ల్లనిపూఁదేనియచల్లి తేర్చు మను వేళాలక్ష్మిమోమున (?) నో
గ నెఱుల్ సంపఁగ నూనె నిగ్గుసడలం గాఁ దైపయిన్ దుప్పి నే
ర్పున గంధామలకంబు వెట్టె నొకయింతో జాక్షి భూజానికిన్.

చ. కరముల నుజ్జ్వలాక్షి నవకైరవ కుంభములంటఁ గూర్చి పు
ష్కరములు కంకణప్రకర సంభ్రమ మొప్పఁగ వంచి రాజకుం
జరునకుఁ గుంభినీధరణసమ్మదశాలికిఁ బద్మనీపరం
పర పరమానురాగమున మజ్జన మార్చెఁ బయోగృహంబునన్.

సంచలితముకాదు. భావ సందోహమున మాత్రము డెందమానందము నొందుచుండును.

పెద్దనార్యుని పదజాలము రసప్రపూరితమ్ము, ఆయా యవస్థలలో తన్మయత్వము నొందించుచుండును. ఈతని పదగ్రథనము స్నాయుస్నిగ్ధముగనుండి శ్రుతిమాధుర్యమును, కృష్ణరాయల శబ్దసంపుటి శుష్కబంధములచే బిగింపఁబడి శ్రుతికటుత్వమును బొందియుండును. పెద్దనార్యుఁడు స్వాభావికవర్ణనలయందే యెక్కువ మక్కువ గనపఱచెను. శ్రీకృష్ణరాయలు స్వభావోక్తికంటె ఉత్ప్రేక్షయందు చాతుర్యము జూపెను.

శైలీప్రామాణ్యవిషయములో ముక్కుతిమ్మన్నను మించిన కవి కాన్పించఁడు. అతని పారిజాతాపహరణము ఆమూలాగ్రమొక్కతీరున రచింపఁబడినది. మొదటి యాశ్వాసమెంత ముద్దులమూటగట్టుచుండునో నయిదవయాశ్వాసమును అంతే బిలిబిలిపలుకులతో చెన్నువహించియున్నది. ఇట్లు చెప్పుటలో తిమ్మనార్యునకుఁ గలి పరిశ్రమమనదనియు, సర్వోత్కృష్టమనదనియు నని నాయభిప్రాయముకాదు. తిమ్మనార్యుఁడు తక్కిన కవులవలె శైలియందు హెచ్చుతక్కువలు కనుపర్చక యొక్కతీరుగా తన గ్రంథమంతయు వ్రాయఁగలిగెనని చెప్పుటయే.

పెద్దనార్యుని శైలి అనేకరీతుల ననేకగతుల నొప్పారుచుండును. దాని జృంభితధ్వని వీణాతంత్రుల జీవనాదమును స్మృతికిఁ దెచ్చుచుండును. ఒక్కొకచోట ఝంఝానిలతాడితసముద్ర తరంగములపోలిక నిరంతరప్లుతిని నుద్ఘోషించుచుండును. ఇంకొకచోట మలయమారుతవీచికలవలె ముద్దుపల్కుల నురియుచున్నను, దాని కలస్వరము కలకంఠనాదమువలె నుండక, విహంగనాథుని ప్రణయకూజితమువలె నుచ్చైస్స్వరమున శ్రవణపుటముల నింపును. ఎచ్చటనైనను పలుకులమ్రోఁత పటుతరపదజాలపరంపరలతోడి "ముహుర్ముహుర్లుఠదభంగ తరంగ మృ

దంగనిస్వనము''ను స్ఫురింపఁజేయుచుండును.

తిమ్మనార్యుని శైలి వేణుగానమువలె సులలిత సౌకుమార్య సుస్వనము గలదైన సప్తస్వరమిళితమైనను పెద్దనని కంఠమునఁ బొడము సంగీతమువలె సూక్ష్మమునకుఁ జిక్కని సంతసముఁ జిలుకరించుచుండును. కాని యెప్పటికైనను బృంహితధ్వనులతో నంభోధిభంగములవలె శ్రవణకుహరముల ఝంఝాటము కలుగఁజేయలేదు.

రామరాజభూషణుఁడు పెద్దన్నకు శిష్యుఁడనియే చెప్పఁదగినది. శిష్యుఁడైనను గురువుకంటె విలక్షణమార్గమునఁ బోయి కొన్నివిధముల నెక్కుడుగను, కొన్నివిధములఁ దక్కువగను, గణనకెక్కెను. సహజప్రజ్ఞాపటిమలో పెద్దన్నకంటె హెచ్చయినను, కళాశిల్పితనమున నవకితవకిలున్న కారణమున వసుచరిత్రమందలి శైలి కావ్యాదర్శమని చెప్ప వీలులేదు. రసపుష్టి, పదపాకము, సుశ్రావ్యత, ఇత్యాది విషయములలో మనుచరిత్రకంటె నెక్కుడు గౌరవము పొందఁదగినదయినను, అనవసరశ్లేషలు సంగీతముకొఱకైన యక్షరనియమములు, ఇత్యాది స్వాభావిక కవితాభంజకములను జొప్పించి యుత్తమ కవిత్వస్థానమును గోల్పోయెను. కాళ్లకు సంకెళ్లు వేసికొని నృత్యమాడెడు నర్తకునివలె ఈమహాకవి వ్యంగ్యప్రధాన కావ్యమును శ్లేషాంతర్గతముఁ జేసి కవితా సౌష్ఠవమునకు గొంత నైరస్యము గలుగఁ జేసెను. సంస్కృత శబ్దబాహుళ్యమునను, దీర్ఘస్వరకవిత్వపదాఢ్య ప్రాసమునను గురుతరప్రౌఢ శబ్దబంధురప్రాగల్భ్యమునను పెద్దనార్యునే యనుగమించెను.*

---

* నేను గుంటూరులో రాజకీయోద్యోగ కారణమున నివసించియుండఁగా ప్రసిద్ధాంధ్ర కవీశ్వరులును నటకాగ్రేసరులును, గాయకవిశారదులు నగు బ్రహ్మశ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంతముగారి పరిచయము కలిగినది. వారితో నప్పుడప్పుడు ఆంధ్రవాఙ్మయ విషయములఁ గూర్చి చర్చించుచుంటిని. కొండొక కాలమున నిట్టి కళాభిజ్ఞుని

పింగళి సూరనార్యుని అల్లసాని పెద్దన్నతోఁ సంబంధింపఁజేసెడు గాథలు కొన్నియున్నవి. కాని వారిద్దరికి కుటుంబ సంబంధ బాంధవ్యము లున్నను, కవితా సంబంధమించుకైనను కాన్పింపదు. పింగళి సూరన్న యితరకవులయొద్దకుఁ జేరలేదు. ఇతరకవులను తనయొద్దకును జేరనీయలేదు. తాను కేవలము ప్రత్యేక వ్యక్తిగా నిలిచియుండెను. అతని కాతఁడే సమానుఁడు. రసావేశ రసనిరూపణలయందుఁ బెద్దనార్యుఁడెక్కువవాఁడు, భావ గాంభీర్య భావప్రకటనలయందు సూరనార్యుఁడే యెక్కువ. అగాధములగు మానవహృదయకుహరములలోఁ జొచ్చి యచ్చటి రహస్యముల కీలకములను బయటకులాగి చూపుటలో సూరనార్యునికన్న నధికుఁడు ఆంధ్రవాఙ్మయములో లేనేలేఁడు. భాషావిషయమున జాతీయతయు సంభాషణ చాతుర్యమునుగూడ నెక్కువే. ప్రయత్న సాధిత ప్రౌఢోక్తి పెద్దన్నయందును, అప్రయత్నలభ్య చతురోక్తి సూరన్నయందును గాంచు గానంబడు.

కృష్ణదేవరాయలు చూపట్టిన చతురవచన రచనల విషయములో సూరనార్యుని కవిత్వము చదివెడు భాగ్యము కలుగునంతకాలము రాయలు బ్రతికి యుండినయెడల పెద్దన్న తిమ్మన్నలతోపాటు సూరన్ననుగూడఁ దల మానికముగా నాతఁడు ధరింప వలసినవాఁడే.

సహాయమున మనుచరిత్రము, వసుచరిత్రముల కావ్యరీతుల సామ్యభేదములు కనుఁగొన నుద్దేశము కలిగి యీరెండు ప్రబంధములను సరససాహిత్య సంగీత సమ్మేళనమున నా కొకసారి వినుపఁ బ్రార్థించితిని. వారియ్యెడ మనుచరిత్రమునందలి తొలిమూఁడాశ్వాసములను వసుచరిత్రమందలి తొలిమూఁడాశ్వాసములను వారినటనా కౌశలమును, గాన మాధుర్యమును వినుపించి తీయతీయగాఁ జదివిరి. ఆసమయమున నీయిద్దరికవుల శైలీ శిల్పభేదములను జాగ్రత్తగాఁ బరిశీలించి నిర్ణయించుకొంటిని. ఆయభిప్రాయము సాగమే పైన ప్రకాశింపఁ బడినది.

## రసము.

మనుచరిత్రము శృంగారరస ప్రధానమైన కావ్యము. ఇందలి శృంగారరసము ముఖ్యముగా మూఁడు ఇతివృత్తములలో కని వర్ణించినాఁడు. వరూధినీ ప్రవరుల కథ, వరూధినీ మాయా ప్రవరులకథ, మనోరమా స్వరోచుల కథ, ఈమూఁడింటిలోను వర్ణితమైన శృంగార రసము మూఁడు వేఱువేఱు అవస్థలఁ బొందియున్నది. మొదటిది విప్రలంభ శృంగారము, రెండవది సంభోగ శృంగారము, మూఁడవది పరిణయ శృంగారము. ఈమూటియందును గల శృంగార రస వర్ణన మత్యద్భుతమని యాంధ్రలోక మెఱిఁగిన విషయమే. కొందఱీ శృంగారము పచ్చి శృంగారమని యాక్షేపించినారు. ఈయాక్షేపణ కేవలము నిర్హేతుకముకాదు. పెద్దనార్యుఁడు స్వభావమున శృంగార రస ప్రియుఁడని తోఁచుచున్నది. విష్ణుభక్తుఁడై పుణ్యజీవనము జేసియున్నట్లనేక నిదర్శనములు కాన్పించుచున్నను, బాహ్యేంద్రియ భోగవర్ణనమునఁ దనివితీరని తృష్ణను కనుపఱచెను. స్త్రీ పురుషుల శారీరక సౌందర్య వర్ణనములో నితనికున్న చాపల్యము మఱి యేపెద్దకవియందును సామాన్యముగఁ గానరాదు. మఱియు నేత్రపర్వములయిన రమ్యవస్తువులును, కర్ణపేయములైన సుస్వరములును జిహ్వాపరితోషకములైన రుచులును ఇద్యాదియింద్రియ లోలత్వమున కుపకరించెడు వర్ణనలు చేయుటలో నీకవికిఁగల సామర్థ్య మప్రతిమానము. ఈతని వర్ణనలు కేవల మాయాయనుభవములు కవి పొందినట్లుగానే తెలుపుచు నుండును. ఈవిషయమునం దీతఁడు ఆంగ్లేయ కవియగు 'కీట్సు' ను పోలియుండును.

అయితే యైంద్రియక విషయ వర్ణన లెంతరసోన్మేషముగాఁ జేసినను మానవజీవితాదర్శములను మాత్రము శాశ్వతమగు నాధ్యాత్మిక సుఖమందే నిల్పెను. కావున నీతని శృంగార రసవర్ణన లక్ష్యలతా ప్రేరక

ములనియు, పశుకామ స్ఫోరకములనియుఁ జెప్పవలను పడదు. అవినీతివర్తనమును కథాఫలితమున నన్ని సందర్భములలోను నిర్విశిష్టముగాఁ దెగడెను.* తారాశశాంక విజయము, రాధికా సాంత్వనము ఇత్యాది నింద్య శృంగార తస గ్రంథములవలెఁ గాక నీతియుక్తమైన జీవితమును వాచ్యముగను, వ్యంగ్యముగను లోకమున కుపదేశించెను. కావున పెద్దనార్యుఁడాంధ్ర మహాకవులలో నొకఁడని నిశ్చయముగా నొప్పుకొనవలసియున్నది. శ్రీకృష్ణదేవరాయలిచ్చిన "ఆంధ్రకవితాపితామహుఁ"డను బిరుదమున కాకాలములో నీతఁడే యర్హతముఁడు.

ఇంక నీశృంగారరస మెట్టిదియో చూతము.

"ఉపనాయక సంస్థాయాం, మునిగురుపత్నీగతాయాంచ, బహునాయక విషయాయాం, రతౌతథా అనుభయనిష్ఠాయాం ఆభాసత్వం భవతి".

(పండితరాజ: రసగంగాధరము)

అనఁగా శృంగారరసము నాయికా నాయకులలో నొకరియందు మాత్రమే యున్నయెడల నట్టిరసమునకు రసాభాసమనిపేరు. పైనఁ జూపిన మూఁడుఘట్టములలోను మొదటి రెంటియందును ననురాగ మొక

* మనుచరిత్రమందలి సూర్యాస్తమయ వర్ణనలో మాత్రము కవి కాలు జాతి యదుసులోఁ బడెను.

చ. తరుణి ననన్యకాంత నతిదారుణ పుష్పశిలీ ముఖవ్యథా
భరవివశాంగి నంగ భవు బారికి నగ్గము సేసి క్రూరుఁడై
యరిగె మహీసురాధముఁ డహంకృతితో నని రోషభీషణ
స్ఫురణ వహించె నోయన నభోమణి దాల్చెఁ గషాయదీధితిన్.

ఇందలి భావమును సమర్థింప వీలుపడదు. ఇచ్చట పెద్దనార్యుని శృంగార రసప్రియత్వము మన దేశమందలి నీతివర్తనపు కట్టుబాట్ల నతిక్రమించినది.

సక్షమందేయున్నది. ప్రవరునిమీఁద వరూధినికి వలపున్నను, ప్రవరునికి వరూధినిమీఁదఁ బ్రేమలేదు. మాయాప్రవరునికి వరూధినియందు కోరికయున్నను, వరూధిని కామాయాప్రవరుని (గంధర్వుఁడు) యందు ప్రేమ యుండలేదు. ఇటుల ప్రేమ యొకపక్షమందే యుండెను. కాఁబట్టి యీరెండు సందర్భములలోను రసము రసాభాసమైనది. ఇది కాదని చెప్పుటకు వీలులేదు. మూలగ్రంథములో నిట్లే యున్నది. దానిని యథాక్రమముగా పెద్దనార్యుఁ డనుగమించెను. రెండవ సంగతి. ఇట్లు రసాభాసముగా నుండుటచేతనే యీరెండుకథలును నీత్యుద్బోధకములును, యవినీతి నిరోధకములును నైనవి. కాఁబట్టి రసాభాసముగా నుండుటయే వానిప్రాశస్త్యము.

ఈవరూధినీ ప్రసంగములో రసము రసాభాసమైనదనియు నట్లు ప్రధానరసమాభాసమగుట కావ్యనియమమున కొకలోపమనియు మనపూర్వకవులుగూడ గుర్తించినట్లొక చిత్రమైన కావ్యసందర్భమును జూచినయెడల బోధపడఁగలదు. మనుచరిత్రకథేతివృత్తము ననేకాంశములలో ననుకరించి కథాకల్పనఁజేసిన పింగళి సూరనార్యుఁడు తన 'కళాపూర్ణోదయము'లో వరూధినీ ప్రవర మాయాప్రవరుల కథవలె కలభాషిణీ మణికంధర నలకూబరుల కథఁగల్పించి నలకూబరవేషమున మణికంధరుఁడు కలభాషిణితో రమించునట్లు చెప్పుచు, మణికంధరునకు మాత్రమే కలభాషిణియందు మక్కువయుండినయెడల రసాభాసమగునని యూశంకించి, కలభాషిణిగూడ మొట్టమొదట మణికంధరుని జూచి, మోహించినట్లును నారదముని శాపభయమునఁ దన మోహమును దెలుపకుండినట్లును సూచించి సమర్థించుకొనినాఁడు. ఈకల్పన యంతయు మనుచరిత్రయందున్నవిధముగ రసాభాసములేకుండఁ జేయుటకేయని యూహింపవచ్చును. అట్లైనను రసాభాసము తప్పినదికాదు. అన్యవాంఛ

రసాభాసమేగదా !

ఇంతవఱకు వరూధినీ కథయందలి శృంగారరసమును గుఱించి చెప్పితిమి. ఇంక మనోరమ కథయందలి శృంగార రసమును గుఱించి కొంతవిచారింతము. ఈకథను గుఱించి వ్రాయుచు నొకానొక విమర్శకుఁడు మనోరమా స్వరోచుల వృత్తాంతమన్ననో స్వరోచికి బహునాయికలుండుటచేత నిదియు రసాభాసమేయని యాక్షేపించెను. ఈవిమర్శకుని మాట నిజమైనచో మన ఆంధ్ర ప్రబంధములలో రసాభాసముగాని కావ్యములు సామాన్యముగ లేవనియే చెప్పవలెను. ఒక్కమనుచరిత్రకేగాక వీరు మోపెట్టిన నింద యనేకములగు నితరాంధ్రోద్గ్రంథములమీఁదఁగూడ పెట్టవచ్చును. వసుచరిత్రము, పారిజాతాపహరణము, ప్రభావతీ ప్రద్యుమ్నము, కళాపూర్ణోదయము— ఇంక నెన్నియో గ్రంథము లీవిధముగ కళంకమును బొందినవే. కాఁబట్టి వీరియాక్షేపణ యెంతవఱకు నిజమో యాలోచింపఁ దగినది.

హిందూశాస్త్రముల ప్రకారము, హిందూమతమున నొకపురుషుఁ డనేకస్త్రీలను పెండ్లియాడవచ్చును. వారియందఱియందును సమానమైన ప్రేమాసక్తి యుండినట్లే పరిగణింపవచ్చును. అట్టినాయకునకు నలంకార శాస్త్రమున దక్షిణనాయకుఁడని పేరు.

కం. హరి యిట్లు సఖుల నందఱ
సరిగాఁ జూచియును భోజజనపాలసుతన్
దరుణీమణి సాత్రాజితి
నిరువురమన్నించి మిగులనిచ్చుం జనవుల్.

(ముక్కుతిమ్మన: పారిజాతాపహరణము)

కాఁబట్టి స్మృతిశాస్త్రములఁ బట్టిగాని యలంకార శాస్త్రముఁ బట్టిగాని బహునాయికాత్వమును కేవలము దోషముగాఁ బరిగణించుట

కు వీలులేదు. కనుక నీవిమర్శకుఁడు చూపిన రసాభాసము మనోరమా స్వారోచుల కథలో పట్టదని మనశాస్త్రములఁబట్టి నిర్ణయింపవచ్చును.

మనుచరిత్రమందలి తక్కిన రసములు, శాంతరసము, కరుణరసము రౌద్రరసము— మున్నగునవి యాయాస్థలములందు బహుమనోహరముగా నభివర్ణింపఁబడినవి. ఏరసము వర్ణింపదలచి వచ్చినను, దాని భావపరిపాకమున మచ్చున తీసినట్లును, పరికృతికి నత్యంత సదృశముగ నున్నట్లును, వర్ణించుటయం దీ కవివరునకున్న నేర్పు కడుంగడు శ్లాఘనీయము. అయిన నొకచిన్నలోపముఁ గానవచ్చును. మహావిషయములను వర్ణించునపు డెట్టి యుదాత్తమగు శైలి నుపయోగించునో స్వల్పవిషయములలోఁ గూడ నట్టి ప్రౌఢశబ్ద సమాసములనే వాడెను. "చిన్న చేఁపలను పెద్దచేఁపల వలెనే కంఠస్వరముస మాట్లాడునట్లు చేయు"నని జాన్సను పండితుని గుఱించి గోల్డుస్మిత్తు ఆక్షేపించిన మాట లీకవికిని వర్తింపఁదగినవే.

శృంగార రసముతరువాత నీకవి చేతిలో నధిక గౌరవము నొందిన రసము శాంతరసము. బహుశః శృంగార రసముకంటె శాంతరసమే యీమహాకవి హృదయము నెక్కువగా నాకర్షించిన దేమో యని సందేహింపవచ్చును. వరూథిని కామాతురతకంటె ప్రవరుని నిర్మోహత్వమే పాఠకుని మనస్సునందు లగ్నమై యాతని నానంద పారవశ్యునిగాఁ జేయుచున్నదని చెప్పిన నత్యుక్తిగాఁజాలదు. శృంగార శాంతరసములను పరస్పర వైరుధ్యమున బలాబలములు చూడ నుజ్జీఁతలూఁగించి శాంతరసమున కఖండవిజయము నిచ్చినాఁడని విస్పష్టముగాఁ జెప్పవచ్చును.

ఉ. ఎన్ని భవంబులన్ గలుగు నిక్షుశరాసన సాయకవ్యథా
భిన్నతవాడి వత్తలయి కేలఁ గపోలములూఁదిచూపులన్

విన్నఁదనంబు దోఁపఁ గను వేఁదుఱునన్ బయిగాలి సోఁకినన్
వెన్నవలెన్ గరంగు నలివేణులఁ గౌఁగిటఁ జేర్చు భాగ్యముల్.

శా. ఎందే డెందము కందళించు రహిచే నేకాగ్రతన్ నిర్వృతిన్
జెందున్ గుంభగతప్రదీపకళికాశ్రీఁ దోఁప నెందెందుఁ బో
కెందే నింద్రియముల్ సుఖంబుఁ గను నాయంపే పరబ్రహ్మ "మా
నందో బ్రహ్మ" యటన్న ప్రాఁజదువు నంతర్బుద్ధి నూహింపుమా.

అని వెన్నవలె మనస్సును గరఁగించెడు వలపు పిలుపుల పులకరింపులతో ధైర్యము సడలింపఁ బూనుకొని యాఘోరశాంతుని నిశ్చలమానసమును వజ్రకీలితమైన వైరాగ్య వ్రతమును గూడ నధికతరోత్సాహమున నిట్లభివర్ణించెను.

శా. ఈపాండిత్యము నీకుఁదక్క మఱియెందేఁగంటిమే కామశా
స్త్రోపాధ్యాయివినా వచించెదవు మే లోకాలో శ్రేయానకర్ముల్
పాపంబుల్ రతిపుణ్యమంచు నిఁక నేలా తర్కముల్ మోక్షల
క్ష్మీపథ్యాగమ సూత్రపంక్తికి నెపో మీ సంప్రదాయార్థముల్.

మ. తరుణీ రేపున నాస్య హాస్యములచేతన్ దృష్టుఁడౌ వహ్ని స
త్కరుణా దృష్టి నొసంగు సౌఖ్యము లెఱుంగన్ శక్యమే నీకు నా
కరణుల్ దర్భలు నగ్నులున్ బ్రియములై నట్లన్యముల్ గావొడల్
తిరమే చెప్పకు మిట్టితుచ్ఛసుఖముల్ మీసాలపై తేనియల్.

శా. ప్రాంచద్భూషణ బాహుమూల రుచితోఁ బాలిండ్లు పొంగారఁ బై
యంచుల్ మోవఁగఁ గౌఁగిలించి యధరం బాసింప "హా శ్రీహరీ"
యంచున్ బ్రాహ్మణుఁ డోర మోమిడి తదీయాంసద్వయంబంటి పో
మ్మంచున్ ద్రోచెఁ గలంచు నే సతుల మాయల్ ధీరచిత్తంబులన్.

## నీ తి.

ఆంధ్రప్రబంధములలో సామాన్యముగ నాయికా నాయకులు రాజవంశములకుఁగాని, దేవజాతికిఁగాని చెందినవారలై యన్యోన్యానురాగ ముద్భవించినది మొదలు పరిణయమువఱకు పురుషుఁ డుత్తమపురుషుని గుణములను, స్త్రీ యుత్తమస్త్రీగుణములను కనుపఱచి కుటుంబజీవనములో కలసిపోవుదురు. వారిజీవితచర్యలు సామాన్యముగా శాస్త్రనియమముల నుల్లంఘింపక పోవుటచే వారిప్రవర్తన మెల్లరకు నీత్యుద్బోధకముగా నుండునని గ్రహింపవచ్చును. భార్యాభర్తల పవిత్రప్రేమయే హిందూసాంఘిక జీవితములో మూలశిలగాన యాంధ్రప్రబంధములలోఁ దద్భిన్నముగా రచింపఁబడిన గ్రంథములు చాల తక్కువ. ఇవియన్నియు సంఘజీవితమున నున్నసామాన్య సంసారదృశ్యములు. ప్రద్యుమ్నుఁడు ప్రభావతిని పెండ్లియాడుట, వసురాజు గిరికను పరిణయమాడుట, సాంబుఁడు లక్ష్మణను పరిగ్రహించుట, అభిమన్యుఁడు శశిరేఖను జేపట్టుట, దుష్యంతుఁడు శకుంతలను వివాహమాడుట—ఇత్యాది; యేకథను జదివినను కొన్ని చిన్నవిశేషములు భేదించినను మొత్తముమీఁద నాయికా నాయకుల ప్రత్యేకజీవితములలో గ్రహణీయమగు భేదమెద్దియుఁ గాన్పింపదు. వీరందఱు నొకేమూసనుండి వెలువడిన జంత్రపుబొమ్మలని స్థూలదృష్టిని చెప్పవచ్చును. ఇట్లు చెప్పుటచే నాప్రబంధములయందు విశేషములు లేవని చెప్పసాహసింపను. ప్రతి ప్రబంధమునను సామాన్యముగ నేదోయొక వ్యక్తిత్వమును, విశిష్టత్వమును ఉన్నవని నిర్వివాదముగఁ జెప్పవచ్చును. కాని యాయాకథాప్రణాళికలయందు సామాన్యముగ గొప్పభేదములు గాన్పింపవు. ఈవిధముగ నాంధ్రప్రబంధయుగము కొనసాగినది.

ప్రస్తుతము మనుచరిత్ర మట్టి సామాన్య గ్రంథములలోఁ జేరినది కాదు. ఇది కొన్ని కథాలక్షణములచే నల్పసంఖ్యాకములైన యాధ్యాత్మిక గ్రంథములలో చేరఁదగినదని ముందే మనవిచేసితిని. ఇందు శృంగారము ప్రధానరసమైనను, తద్రసము తలక్రిందైనది.

"........నాకగణుల్ దర్భలు నగ్నులున్
ప్రియము లౌనట్లన్యముల్ గా వొడల్ తిరమే ?
చెప్పుడు మిట్టి తుచ్ఛసుఖముల్ మీసాలపై తేనియల్".

అని ప్రవరుఁడు నిరాఘాటముగఁ జెప్పెను.

మఱియు,

కం. "బ్రాహ్మణుఁ డింద్రియ వశగతి
జిహ్మ చరిత్రైక నిపుణ చిత్తజ నిశితా
జిహ్మగముల పాలై చెడు
బ్రహ్మానందాధి రాజ్య పదవీచ్యుతుఁడై"

యని బ్రహ్మర్షి పలుకులఁ బలికి వరూథినిని, విదల్చుకొని పోయెను. కాఁబట్టి యిక్కడ శృంగారరసము పలుచనైపోయినది. భౌతిక ప్రపంచము మాయాకల్పితమై నిస్సారతను జూపినది. గంగాసైకతముల లోను, లవలీనికుంజములలో నలరారుచున్న హిమనగాగ్రస్థ సానువుల మీఁద నిలిచియున్నను, యజ్ఞపురుషుఁడు సాక్షాత్కరించి లోకోత్తర దృశ్యములను మనకన్నులకుఁ జూపినాఁడు. కాఁబట్టి యీకావ్యము తక్కిన కావ్యములవలెఁగాక భౌతిక ప్రపంచము నతిక్రమించిన మఱియొక ప్రపంచ మున్నదనియు, శారీరక సౌందర్యముకంటె నెక్కువగు మఱియొక సౌందర్యమున్నదనియు నైహికానందముకంటె మేలైన మఱియొక యాముష్మికానందము గల దనియు నిత్యాది యాధ్యాత్మిక విషయము

లను దృగ్గోచరము చేయుచున్నది. ఇట్టి ప్రబోధము కలిగించుటఁ జేసియే యీ కథ యత్యంత నీతిదాయక మని చెప్పక తప్పదు.

ప్రవరుని సకలుషజీవితమును వజ్రద్వారముగుండా కథా ప్రాసాదములోనికి ప్రవేశించి మొదట వరూధినీదృశ్యముఁ జూచితిమి. ఆమె కేవలము బాహ్యశృంగారము దభిరుచి చూపెనేగాని యాధ్యాత్మిక జ్ఞాన మేమియు నంటనియ్యలేదు. ఆమె భౌతిక సౌందర్యోపాసిని. ప్రవరుని దేహసౌందర్యమేతప్ప వరూధిని మఱి యేసంగతిని మనస్సున కెక్కించుకొనలేదు. తెగబారెడు జుట్టు, శతపత్రిజైత్రములగు నేత్రములు, కసుగందనిమేను, ఇత్యాది బాహ్య సౌందర్యమును జూచి వెఱ్ఱెత్తిపోయినది. ఈమె కేవలము రూపానురక్త. దేవదేవివలె "నీసదాచార మేలయ్య దాసరయ్య" యని వెక్కిరించకపోయినను ప్రవరుని శీలము' సదాచారము, చిత్తనైర్మల్యము మున్నగు సంతర్భావగుణము లెవ్వియును నామె గుర్తింపలేదు కేవలము బాహ్యవేషముతోనే యామె తృప్తినొంది ప్రవరునివలన పరాభవము నొందినది. అటుతర్వాత రెండవదృశ్యము. వరూధినీ మాయాప్రవరులు: శారీరక సౌందర్యమునకే పొంగిపోవుటచే నట్టి బాహ్యవేషముఁ దాల్చిన యొక కుటిలుఁ డామెను వంచించుట కవకాశము గలిగెను. ఇం దాశ్చర్యమేమియు లేదు. ఇది దైవవిపాకమే యని యొప్పుకొనకతీరదు. 'Like for like' ఇదియును నాధ్యాత్మికోత్కర్షనే మఱియొక విధముగ చాటుచున్నది.

ఇంక మూఁడవదృశ్యము:—స్వరోచికథ బాహ్యేంద్రియ వ్యాపారలోలురాలగు వరూధినికిని కాముకత్వపరాయణుఁడగు గంధర్వునకును జనించిన స్వరోచి తల్లిదండ్రుల శృంఖలములనుండి తప్పించుకొనలేకపోయెను.

"గంధర్వ వీర్యతో రూపం చింత నాచ్ఛ ద్విజన్మతః" అని యాతని శరీరసౌష్ఠవముఁ గూర్చి చెప్పఁబడినది. ఆతని మనస్సుగూడ గంధర్వులగు స్త్రీ పురుషుల మూలముగ నుత్పత్తినొందెనని చెప్పవలసియున్నది. కాఁబట్టి యాతఁడు యావజ్జీవము స్త్రీలంపటుఁడై భోగాసక్తిని విడువలేక పరిహాస పాత్రుఁడయ్యెను. హంస, చక్రవాకి వచనంబులవలన కొంత విరక్తి కలిగెను గాని యది క్షణమాత్రమైనదే. వెంటనే తాను వనితా విధేయుఁడై సంచరించెను. తరువాతఁగూడ మృగీమృగముల నిరసనంబున కామేచ్ఛ కొంత యుడిఁగినను మొదలంటఁబోలేదు. ఇదియంతయు జననీజనక సాంక్రామికదోషము. ఈకాముక చరిత్రలోనున్న సుగుణవిశేష మేదనిన తాను స్వైరవిహారిగాక శాస్త్రనియమితముగా తన్ను వరించిన స్త్రీలను బరిణయమాడి వారితో నత్యంతమగు భోగతృష్ణచేఁ గ్రీడించుచుండెను. బహుశః యిది "చింతనాచ్ఛ ద్విజన్మతః" అనినట్లు ప్రవరుడే యీ నియమమునకుఁ గారణమయ్యెను కాఁబోలు. ఈనియమానుసరణమే యాతనికి తుదకు ముక్తిదాయకమైనది. దిగ్గజులు వనదేవతను ప్రార్థించి యీ కామాతురునివలన మనువును గనుమని కోరిరి. కావున స్త్రీసాంగత్యమునువదలలేని యీ భూవల్లభుఁడు వనదేవతయందు స్వారోచిష మనువుం గనెను. ఈతని కామ మతిమాత్రమైనను ధర్మవిరుద్ధము కాదు.

శ్లో॥ కింతు ధర్మావిరోధేన కుర్వన్ ధర్మాశ్రితాః క్రియాః
భుంక్తే స్వరోచి ర్విషయాన్ సహతాభి రువారనీః॥

(మార్కండేయపురాణము)

అనినట్లు ఈతని భోగవాంఛ నియమవిరుద్ధమైనదే కాని అపారము, అతృప్యముగా నుండెను. కావున నేకపత్నీవ్రతముయొక్క యుత్కృష్టత యీతని విపరీతచరిత్రమువలన వ్యతిరేకన్యాయరూపముగా (proof by contraries) ఋజువుచేయఁబడినది.

ఆ. తగులు నెవ్వఁడొక్క తరుణికి నొకనికి
మెలఁత వలచునదియు మే లవంగ
వచ్చుఁ గాని పెక్కువనితలపైఁ గూర్మి
గలుగు ననుట బొంకుగాదె తరుణి.

(పెద్దన: మనుచరిత్రము).

ఈపద్యమును వినినపైని యనేక భార్యలుగల శ్రీకృష్ణదేవరాయల మానస మెట్లుండెనో!

స్వారోచిషమనువు పుట్టిననాఁటినుండియు భగవద్భక్తుఁడే. కావున నాతని శీలము, చిత్తశుద్ధి, నిష్ఠయు మొదలైనవి సర్వ నాశ్చర్యములు.

కాఁబట్టి యీప్రబంధము శృంగారరసప్రధానమైనదైనను ఆశృంగారము అవినీతి మార్గములలోఁగాని విశృంఖల వర్తనములోఁగాని పశుకామములోఁగాని పోవుటలేదు. ఆధ్యాత్మిక శుద్ధికి లోఁబడిగాని శాస్త్రీయమర్యాదల నతిక్రమింపకగాని యది యనిర్వ్యాజస్నేహభావమునే ప్రకాశించుచున్నది.

## పాత్రపోషణము

మనుచరిత్రమందలి పాత్రపోషణము సర్వంకష కళాకౌశలుని నిరవశిష్ట పరిశీలనాశక్తిని గోచరింపఁజేయుచున్నది. ప్రతిపాత్రయును నాకారక్రియాకలాపములలో సంపూర్ణముగఁ బ్రకృతిని బ్రతిఫలించుచున్నది. ఏయేపాత్ర యేయేయవస్థలలో నేయేవిధముగ నాలోచించి యాచరించునో యాయావిధముగ నించుకైనను భేదములేకుండ నాపాత్రము లీమహాకవి చిత్రించెను. ఈమహాకవి పాత్రపోషణమందొక ప్రత్యేకమగు గుణవిశేషము గనఁబడుచున్నది. ప్రతిపాత్రయు వేఱువేఱైన రసోద్రేకములను పొంది పరస్పర సంయోగ వియోగముల ననుభవించుచున్నప్పుడు వారిచర్యలకుఁ దగిన శరీరాభినయముగూడఁ జేయుచుందురు.

తత్తదుచితముగఁ జక్షుర్హస్తాద్యవయవాభినయము వర్ణించక యేపాత్రను కథారంగమున నీకవి చూపలేదు. ఈవిషయములో నీగ్రంథమంతయు మాట్లాడెడు సినిమా (talkie cinema) అని చెప్ప నొప్పు.

ముఖవీక్షణము, హస్తవిన్యాసము, కచకుచాది సంచలనము-ఇత్యాది హావభావసూచకములగు సర్వావయవసంస్థితులను (attitudes) అచ్చునఁ దీసిన ట్లభివర్ణించి యీకవివరుఁడు మనకనుల యెదుటఁ జక్కని చిత్రపటముల నుంచును. ఇట్టి చిత్రపటములు వేగము వేగముగా మాఱుచుండును. ఆమూర్తులు మెఱుపుమెఱసినట్లు విద్యుద్వేగ వర్ణనలతో శబ్దచిత్తరువులోయున్నట్లభివర్ణించి కథా పటము సాగించుచుండును. ఇదియంతయు మహాచిత్రకారుని చాతుర్యము. ఇట్టి చిత్రకారుని చాతుర్య మీమహాకవి కవిత్వపటుత్వమునకు జతపఱచెను. కాఁబట్టి నాచనసోముఁడు, బమ్మెరపోతన్న మున్నగు చిత్రవర్ణదక్షులగు కవివతంసులవలె పెద్దనార్యుఁడును కావ్యకళను చిత్రకళను రెంటిని మేళవించి యసదృశముగు కళానైపుణ్యముఁ జూపెను.

ప్రవరుఁడు

ఇతఁడు బ్రాహ్మణకుమారుఁడు; మకరాంక శశాంక మనోజ్ఞమూర్తి; వేదవేదాంగవేది; నిత్యాగ్నిహోత్రి, నైష్ఠికాచార నిష్ణాతుఁడు జననీజనకులకు సదా సేవఁజేయుచుఁ నేకపత్నీవ్రతుఁడై అతిథ్యభ్యాగతులకు మృష్టాన్న సంతర్పణఁ జేయుచు, శిష్యులకు వేదశాస్త్రము లుపదేశించుచు రాజాధిరాజులకైనను ధనముకొఱకు చేయిసాచక సర్వకాలములందును వైదికాచార కర్మలలో మునిఁగి యున్నవాఁడు. పరస్త్రీలను కన్నెత్తి చూడఁడు. పరధనముల నపేక్షింపఁడు. ఈయువకుని చూడఁగనే వరూథిని మోహించినది. ఆమె మోహమునకుఁ గారణమీతని శరీరసౌందర్యము. అంతియకాని యీతనిశీలము, సదాచారము ఇత్యాదిగుణముల

దెన కామెదృష్టిప్రసరించలేదు. ఆమె యెంతవిలపించి బ్రతిమాలుకొనినను ఈబ్రాహ్మణయువకుఁ డామెను నిరాకరించి, బ్రాహ్మణుఁ డింద్రియ సౌఖ్యములకు లోనయి యుండరాదనియు; తనకు సరణుఁడు అగ్నులే యన్నిటికంటెఁ బ్రియతమములనియుఁ జెప్పి యామదనోద్రిక్తమానసినుండి తప్పించుకొని యిల్లుచేరుటకు వేఱొండుపాయములేక హవ్యవాహనునిఁ బ్రార్థింప నాదేవుఁడు సాక్షాత్కరించి యాతని నింటికిఁ జేర్చెను.

* 'సచ్ఛీలకేమైన శక్తిలేకున్న
దేవుడే యామెకు దిక్కగుమెలంగు'

అని మిల్టను చెప్పిన మాటలు నిజమైనవి.

ఈప్రవరుని శీలమత్యద్భుతము. నిత్యనైష్ఠికుఁడు, సత్యవ్రతుఁడు వజ్రమువలె స్థిరచిత్తుఁడు. నిశ్చల సత్యసంపన్నుఁడు. భగవత్సేవ సదా వైదికవిధానోక్తముగాఁ జేయుచుండును. రసికుఁడు గాఁడు. ప్రపంచ సౌఖ్యముల నెన్నఁడును గోరఁడు. ఇంద్రియవ్యాపారముల నరికట్టినాఁడు. కాఁబట్టి యాతనితో సమానమైన బ్రాహ్మణనాయకుఁడు మనప్రబంధములలోఁ గాన్పింపఁడు.

మృచ్ఛకటికలోనున్న చారుదత్తుఁడు వైదికాచారసంపన్నుఁడై నను వణిగ్వృత్తిలోనుండి దానధర్మము లపారముచేసి దరిద్రుఁడైనాఁడు. ఇతఁడు తన దారపుత్రాదులయందు నధికమోహమున్నవాఁడైనను ఏక పత్నీవ్రతమును మాత్రము నిలుపుకొనలేదు. అతని మనస్సు వసంత సేనయందు ప్రసరించినట్లు దానుచెప్పుకొనెను.

యయా మే జీవితఃకామః
క్షీణే విభవ విస్తరే

* If Virtue feeble were, Heaven
Itself will stoop to her. (Milton: Comus)

క్రోధః సుపురుషస్యేవ
స్వగాత్రేష్వేవ సీదతి.

అనఁగా వసంతసేనయందు మొదటినుండియు మోహమున్నట్లును తన దరిద్రస్థితినిబట్టి తానుమోహమును మనసులోనే దాఁచుకొని నట్లును ఒప్పుకొనెను.

అయినను ఆమె కన్యయై యుండుటచేతను ఆతనినిఁ దప్ప నితరులను ప్రేమింపక పోవుటచేతను నామెను తనవేఱుభార్యగా స్వీకరించెను. ప్రవరుఁ డట్టివాఁడు కాఁడు. ఆతఁడు వరూధినియెడల కించిన్మోహమైనను జూపక నిశ్చలమైన యేకపత్నీవ్రతమును మాత్రమే కొనసాగించుకొనెను.

విప్రనారాయణుఁ డొక వైష్ణవబ్రహ్మచారి. శిష్టాచార సంపన్నుఁడై స్త్రీముఖమెన్నఁడు కన్నెత్తి చూడనటువంటి నైష్ఠికబ్రహ్మచారి. రంగనాధస్వామినిఁ బూజించుచు ననవరతభగవత్కైంకర్యములలో నుండినవాఁడు.

శా. స్వాధ్యాయంబుఁ బఠించు సాంగకముగా సంధ్యాద్యనుష్ఠానముల్
విస్పష్టక్రియ నాచరించుఁ బ్రీతితో వేల్చున్ బ్రహృష్టాత్ముఁడై
మధ్యేరంగశయాన మూర్తికిడు సమ్యగ్భక్తిఁ దోమాలికల్
మధ్యాహ్నంబునఁ గుక్షి భిక్షఁ దనుపు న్మాధూకరవృత్తియన్.

(సారంగు తిమ్మకవి; వైజయంతీవిలాసము.)

మధురవాణీ దేవదేవులను వారాంగనలొకనాఁడాతనికి నమస్కరింప నాతఁడు వారినమస్కారముల నిర్లక్ష్యము చేసిన కారణమున వారిలో చిన్నదియగు దేవదేవి కోపగించుకొని, యాబ్రాహ్మణునిఁ దన వశంబొనర్చుకొందునని పంతముఁ బల్కెను. అటుపిమ్మట నాతని యొద్దకు నొక కపటదాసరిదానివేషమునఁ జేరి యాతనికి శుశ్రూషఁ జేయుచుండెను. ఇ

ట్లు క్రమక్రమముగా విజితేంద్రియుఁడగు నావటుని వేశ్యాలోలుఁడగు విటునిగా నొనర్చెను. ఆమె చర్యయంతయు నటనము, కుహకమే. ఆ బ్రాహ్మణునిపై నామెకు లేశమైనను ప్రేమగాని భక్తిగానిలేదు. అతని వంచించుటకే దంభవ్రతమును దాస్యము నుపచరించెను. ఆబ్రాహ్మణుఁడు కేవల మమాయకుఁడగుటచే నామెను మొదటఁ జేరనిచ్చి క్రమక్రమముగా నామె వలలలోఁ జిక్కుకొని, యామెకు లొంగిపోయెను.

ఉ. కాకులు రావిపండ్లుఁ దినగాను శిలామయదేవమందిరా
నీకములందు రావులు జనించును సజ్జన చిత్తవృత్తియ
వ్యాకులలీల ఱాతిగుడివంటిది లోకములోన వేశ్యలున్
గాకులవంటివార లటుగానఁ బ్రమాదము చేరనిచ్చినన్.

(వైజయంతీవిలాసము)

అని తాను మొదటననుకొనినమాటలు నిజమైనవి. ప్రవరుఁ డిట్టి విపర్యయములకెన్నఁడును నెడముగలుగఁ జేసినవాఁడు గాఁడు. వేశ్యాసంపర్కము గనికరముచేనైనను కలుగఁజేసికో లేదు. కాఁబట్టి తనశీలము నవ్యాహతముగాఁ గాపాడుకొనఁగలిగెను. చారుదత్తుఁడు వేశ్యాపొత్తు తనమనములో రహస్యముగ వాంఛించియుండెను. విప్రనారాయణుఁడు వేశ్యకు లొంగిపోయెను. కాఁబట్టి వీరి యందఱికంటె ప్రవరుఁడు చిన్నయయ్యును సదాచార వ్రత నియమములో మిన్నయనియే నుతింప వలసి యుండును.

## వరూధిని.

ఈమె గంధర్వస్త్రీ. దివ్యవేశ్యాంగన. సంగీతమందును నాట్యమందును కడునేర్పరి. కామశాస్త్రము పుట్టుకనుండియు నభ్యసించినది. శరీరసౌందర్యోపాసిని. ఎంతవఱకైనను ఇంద్రియసుఖానందమే బ్రహ్మానందమని యింద్రియసుఖవ్యాపార నిర్మగ్నచిత్తయై యున్నది.

వేశ్యాంగన కుచితమైన కళలయందు నిపుణురాలైనను స్వభావముచే ముగ్ధ. జాణ కాదు. పాండిత్యమున్నను చాతుర్యము తక్కువ. హావభావములున్నవి గాని ప్రాగల్భ్యములేదు. భూసురుని జూచినవెంటనే వెన్నవలె కరఁగిపోయినది. అతి శీఘ్రముగాఁ దనమనోరథము వెలిబుచ్చినది. నిరాకృతయైనవెంటనే యేడ్వసాగినది. ఈచర్యాశాంతయు నమాయకురాలి కింకని చెప్పకయే తోఁచును. పురుషులలోఁ బ్రవరుఁ డెంతయమాయకుఁడో వేశ్యలలో నీమెయంత యమాయకురాలు. గడుసుఁదనము మాటలలోఁగాని చేతలలోఁగాని కాన్పింపదు. ప్రవరుఁడంత వజ్రకీలితమైన నిష్ఠయం దుండకుండినయెడల నామె యకుటిలత్వమును ముగ్ధత్వమును, చిత్తమును గొంత కరఁగించియే యుండును. పాపమామె చిత్తవృత్తికి సర్వవిధముల వ్యతిరేకమైన స్వభావముగలవాఁడుగాఁ బ్రవరుఁ డుండుటవల్ల వారిద్దఱికీ కలయిక కలుగలేదు. ఆమెకు శరీర సౌఖ్యమే పరమావధి. అతనికి ఈశరీర మస్థిరముగాన తత్సుఖము, పహ్యము. ఇట్లు స్వభావసంకల్పములలో నిరువురును బహుదూరస్థులు. కావున వారికిఁ బొత్తు కుదురుట యెట్లు. ఆపొత్తు మాయాప్రవరునివలనఁ గలిగినది. వాఁడు గంధర్వుఁడు. కాముకవ్యాపారములలో నారితేఱినవాఁడు. కావున నామెకుఁ దగిన సహపాఠి. అయినను నామెకన్న నెక్కువ చతురుఁడును మాయావియు నగుటచే ప్రవరునివేషము దాల్చి, ఆయమాయకురాలి కనుమానము గలుగకుండ దంభము ప్రచరించి తనకార్యము గడతేర్చికొనెను. ఈమెచరిత్రమంతయు శృంగారరస సంకిలమైన దనుకళంకముదప్ప వేఱొండు లోప మెద్దియు చూపట్టదు. సహజకోమలాంతఃకరణము, మృదుభాషిత్వము, కారుణ్యము, నిర్వ్యాజప్రేమ, అత్యధికవిశ్వాసము- ఇత్యాది ఉత్తమ స్త్రీయోగ్యములగు సుగుణములే కాన్పించుచున్నవి.

ఈమె పుట్టుకచే వేశ్యయైనను వారాంగన లక్షణముల నేవిధముగను కనుపర్చలేదు. మనోవాక్కాయ కర్మభిః పతివరునిచే వరించెను. ఆతనినే చేకొనినట్లు తుదవఱకు భావించినది ♦

వసంతసేనమాత్రము కేవలము రూపానురక్తగాక ముఖ్యముగాఁ జారుదత్తుని సుగుణసంపత్తినిఁజూచి మోహించినది. చారుదత్తుఁడు వినీతుఁ డనియు, ధర్మశీలుఁడనియు, నుదారస్వభావుఁడనియు నిత్యాది సదాచారసంపన్నుఁ డనియుఁ జూచి వానిని పరిణయమాడ సర్వవిధముల యత్నించినది. అతఁడు దరిద్రుఁడైనను నిరసించలేదు. వేశ్యపుత్రియైన యీమె పణ్యాంగనవలె ధనము నాసింపలేదు. కేవలము సత్ప్రవర్తనగల పురుషుని వివాహమాడుటకే యభిలషించినది.

మఱియు వరూధినికన్న కొంత ప్రగల్భురాలు. చారుదత్తుని మెప్పు నొందుటకు చాల గడుసైన ప్రయత్నములుచేసి యాతని ప్రేమకుఁ బాత్రురాలయ్యెను. ఎట్టి కార్యములందైనను సహజమైన యుదారస్వభావమును, పాతివ్రత్యమును, నైచ్యనిరసనమును నించుకంతయు విడువక ప్రాణావసానసమయమందైనను ధైర్యస్థైర్యములతో నిలువఁబడెను. వరూధినికంటె ధైర్యము, గడుసుఁదనము, యోచన, గాంభీర్యము- ఇత్యాది ప్రౌఢగుణములు కలవు.

కలభాషిణి వీరిద్దఱికంటె జాణ. చతురోక్తియు, భావగాంభీర్యమును, అత్యధిక సాహసము, పరేంగితజ్ఞానమును వీనియన్నిటికంటె నెక్కుడుగా నాత్మవిశ్వాసమునుగల యువతీలలామ. ఈమె నెఱజాణయని చెప్పినఁ దప్పులేదు. జాతికారణమున మనోవ్యభిచారదోషమును

♦ ఈమె సామాన్యనాయిక కాబట్టి సాజాత్యము గాంచిన యితరవేశ్యానాయికలతో బోల్చుట న్యాయము గాని రాజకన్యలతోను దేవకన్యలతోను సరిపోల్చుట న్యాయము గాదు. కావున గిరిక ప్రభావతి మున్నగు నాయికలతో సరిపోల్పమానితిని.

దప్పించుకొనలేక పోయెను. తుదకు దైవవశమున పాతివ్రత్యభంగము గాకుండ దాఁటిపోయినసంగతిఁ దెలిసికొని నిష్కుటిలముగఁ బశ్చాత్తప్తరాలయ్యెను. ఈమెమనస్సు సానఁబట్టిన వజ్రమువలె ననేకముఖములఁ బ్రకాశించుచున్నది. వేశ్యకులములోఁ బుట్టిన కారణమునఁ గొన్ని బుద్ధిలోపములు గనఁబడుచినను, పరిశుద్ధమైన పశ్చాత్తాపఫలముగా రెండవ జన్మమందుఁ గళాపూర్ణ సార్వభౌమునికి పట్టమహిషి యయ్యెను. ఈమె చరిత్ర మన్నివిధముల రామణీయకమె. ఈమెతోఁ బోల్చినయెడల వరూధినియు, వసంతసేనయు, సాధారణస్త్రీలవలెఁ గాన్పింతురు.

విప్రనారాయణుని భంగపఱచిన దేవదేవి కేవలము మాయలాడియు, తుంటరియును. పైనఁ జెప్పినని సామాన్యనాయికలగు వరూధిని మున్నగువారివలెనే నృత్తగీత సాహిత్యాదులయందుఁ గడు నిపుణురాలయ్యును తా నభ్యసించిన విద్యయంతయు నాయనాయకి బ్రాహ్మణుని పైఁ బ్రయోగించి యాతని నశపఱచుకొని తనవిజయమును దన యక్కకుఁ జూపించి, పందెమును గెలుచుటకొఱకే యని తెలియఁబఱచినది. ఆబ్రాహ్మణుఁడు లొంగిపోయి తనకు దాసుఁడు కాఁగా నీకుటిలహృదయ యాతనిని పరిత్యజించి పంపివేయుటకుఁ దల్లితోఁ కుట్రఁ బన్నెను. అంత వేశ్యమాత "మొదల రోయింతులకు నొక్క ముడి పెగాక, నీ సదాచార మేలయ్య దాసరయ్య" అని యాక్షేపణముగా నిష్ఠురములాడి యతనిని పరిహాసించినది. కాఁబట్టి దేవదేవి ప్రవర్తనము నిక్కముగా వెలయాలి ప్రవర్తనమే! ఈమె ప్రవర్తనమం దొక్కప్రశంసార్హవిషయమైనను గానరాదు. మొట్టమొదటఁ జెప్పిన ట్లీమె మాయావియుఁ దుంటరియును.

వరూధిని ముగ్ధ. వసంతసేన గడుసరియేకాని నైష్ఠికవ్రత. కలభాషిణి గడుసరియు నెఱజాణయును. ఒకించుక వేశ్యాదోషమునకులోనై

పశ్చాత్తాపముబొంది యూర్ధ్వజీవితమునకు నర్హురాలైనది. దేవదేవి వీరం దఱికంటె నధమురాలు. అవ్యాజప్రేమ యనునది యామె యెన్నఁడు నెఱుఁగనట్లు సంచరించినది.

స్వ రో చి.

"గంధర్వవీర్యతో రూపం చింతనాచ్చ ద్విజన్మతః" అని మూలములో నున్నట్లు గంధర్వులకుఁ బుట్టుటచే నత్యప్యమగు కామమే యితనికి ముఖ్యగుణమైనది. పసితనమునందే మహాబలశాలియై కొండను గ్రుద్ది పిండిఁజేయఁగలిగెను. వేదములను, ధనుర్విద్యను, ఇంక క్షత్రియులకుచిత మైన యితరకళలను, నభ్యసించి రాజ్యముచేయ మొదలిడెను. వీరాధి వీరుఁడు, దీనావనుఁడు, తనరాజ్యమం దన్యాయము క్రౌర్యము జరుగ కుండఁ గాపాడుచుండెను, మనోరమ యార్తనాదము వినఁగానే స్త్రీరక్షణకు సంసిద్ధుఁ డయ్యెను. రోగపీడితలైన కళావతీ విభావసులకుఁ జికిత్స యొనర్చి వారికోర్కెతీర్చి వారిని బెండ్లియాడెను. ఉత్తమక్షత్రియ సహజమైన గాంభీర్యము, ఔదార్యము, ప్రజారక్షణము, ఇత్యాది సుగుణ గణాలంకృతుఁడైనవాఁడు. నింతాంత వనితాసక్తియు నిరంతర కాముకత్వమును గలిగియుండియు నీవ్యసనములచే క్షత్రియ ధర్మమునకు విరోధము సంభవింపనీక జాగరూకుఁ డయ్యెను. "ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మిభరతర్షభ" అని భగవంతుఁడు భగవద్గీతలో జెప్పినట్లు ఇతఁడును హిందూధర్మమునకు విరోధము కాకుండ కామక్రీడాపరాయణుఁడయ్యెను. అనగా తన్నువరించి తనను వివాహమాడిన భార్యలతోడనే క్రీడించెను గాని యన్యథా ప్రవర్తిల్లలేదు. ఈతనికిని యయాతివలెనే నిరంతర కాంతా సాంగత్య చింతనము ముఖ్యజీవికగా నుండెను. యయాతివలెనే యితడును దనకంటె నెక్కువ విశుద్ధజీవనమునఁ బ్రసిద్ధులగు సుతులఁ గనుటఁజేసి పేరుప్రతిష్ఠలఁ బొందెను.

## మనోరమ.

మనోరమ ఇందీవరాక్షుఁ డను గంధర్వరాజుకూతురు. తనతండ్రి వరూథినికిఁ దమ్ముఁడగుటఁ జేసి స్వరోచియు దానును మేనత్త మేనమామ బిడ్డలు. కావున స్వరోచిని బెండ్లియాడుటకు పుట్టుకవలననే వావి కుదిరినది. తన తండ్రి యతిగారాబమున చతుష్షష్టికళలను నేర్పించుటచే నీమెకు మనోరమ యను నామము సార్థకమైనది. మఱియు 'అస్త్రహృదయ'మను విద్య నీమె ప్రత్యేకముగాఁ దండ్రియొద్దఁ నేర్చికొనెను.

ఒకనాఁ డామెసఖులగు కళావతీ విభావసులతో వనకేళికిఁ బోయి, యట పుట్టలు బట్టి బూచివలెనున్న వృద్ధతాపసి నొకనినిఁ జూచి బాల్యచాపల్యమున నాతని మొఖము బట్టి నొక్కుచుండ నాతఁడుఁ దెలివొంది యీమెను బెత్తముతోఁ గొట్టుము నసురునకుఁ దిండి యౌనట్లు శపించెను. తరువాత నిష్ఠురోక్తులాడుచున్న యీమె చెలికత్తెలనుగూడ క్షయరోగపీడిత లగున ట్లాతఁడే శపించెను.

అటుతర్వాత మనోరమ తనతండ్రి కొండొక కారణమునరాక్షసుఁడై తన్నుభక్షించుటకు వెంటాడఁగ నామె యార్తనాదముఁ జేయుచు బరుగెత్తుచుండ యామె మొఱలువిని సామీప్యముననున్న స్వరోచి స్త్రీరక్షణార్థ మామెదగ్గరకు వచ్చెను. అప్పు డామె యాతనితో నిజవృత్తాంతము దెలిపి యస్త్రహృదయ మాతనికి నేర్పి రక్కసుని వధింపగోరెను. వెంటనే రాక్షసుఁడు రాఁగా స్వరోచియతనిపై క్రూరాస్త్రములనేయ నాతఁడు రాక్షసరూపమునదలి గంధర్వరాజయ్యెను. అంతఁ దండ్రికూతులొకరి నొకరు దెలిసికొని, స్వరోచిమెడలఁ గృతజ్ఞతవెలిబుచ్చిరి. తర్వాత నిందీవరాక్షుఁడు దన పూర్వవృత్తాంత మంతయు స్వరోచి కెఱిఁగించి మనోరమ నాతనికి బెండ్లిచేయ వాగ్దానము జేసెను. మనోరమ తన చెలి

కత్తెలు పడుచున్న బాధనుఁ గడువిచారించుచున్నను అప్పు డేమియు మాటాడక యూఱకుండెను. విధ్యుక్తముగా వివాహమయినఁ బిదప కేళీగృహమున బతిచెంతను జేరి తన మనస్సులోని దుఃఖమును వెలిబుచ్చ వెంటనే యుభయులు నా చెలికత్తెలయొద్దకుఁ బోయి వారి రుజ నాయుర్వేద సాహాయ్యమున బాగుపఱచిరి. అంత మనోరమ చాల సంతోషించెను.

ఈమె బహుసాధ్వి. తండ్రిమాటను జవదాటలేని వినయశీల. పతితోనైనను నిర్భయముగ మాటాడనేరక యేకాంతమున నున్నతఱి జనువెక్కుడుగ నున్నసమయము చూచి చెలికత్తెలస్థితి నాతనికి నివేదించినట్టి ముగ్ధ. నిజసౌఖ్యముకంటె సఖులసౌఖ్యమే యెక్కుడ యని తలంచినట్టి కరుణాన్విత మఱియు వారియెడ సాపత్న్యముఁ గనుపఱచక వారినిగూడ తనపతి వివాహమాడినవెనుక తనతోసమానలుగఁ జూచుకొనిన యుదారహృదయ. ఆంధ్రవాఙ్మయమందలి యుత్తమనాయికలలోఁ జేరదగిన సాధ్వీలలామ.

## స్వారోచిష మనువు.

స్వారోచిష మనువుయొక్క జననము దేవతల కోరికవలనఁ గలిగినది. దేవతలందరు వనదేవత యొద్దకుఁ బోయి స్వరోచివలన మనువును గనుమని వేఁడికొనిరి. అప్పు డావనదేవత స్వరోచినిఁ బెండ్లియాడి యితనిని గనెను. ఇట్లు దివ్యజాతుఁడగుటచే ద్యుతిమంతుఁ డనుపేరున నీతఁడు విలసిల్లి పుట్టుకనుండియే విష్ణుభక్తుఁడై శాంతి, దాంతి, దయాశౌచనిరతుఁడై యచ్యుతునిఁ గూర్చి చిరకాలము తపం బొనర్చెను. అంత విష్ణుడు కృపార్ద్రచిత్తుఁ డగుచు నాతని దీవించి యనేక దివ్యహాయనములు పృథ్విని బాలించి తుదకు సాలోక్యము నొందునట్లు వరంబిచ్చెను. కావున నితఁడుఁ దండ్రివలె గాక యాజన్మతః భగవద్భక్తుఁడై నిర్లిప్తమనస్కుఁడై, త్రిభువనవిఖ్యాతులగు సప్తమనువులలో నొకఁ డయ్యెను.

## మనుచరిత్ర కావ్యప్రాధాన్యము.

ఉదయగిరి రాజ్యమేలిన ఘూనసాటి బసవభూపాలుఁడు "మనుచరిత్ర సంతతానందుఁ"డని యతని యాస్థానకవియగు దూబగుంట నారాయణకవి ప్రత్యేకముగఁ జెప్పినాఁడు. భారత రామాయణములను తెనిఁగించిన మహాకవులును, అపార వాక్ప్రౌఢిమ గనుపఱచిన శ్రీనాథుఁడును, ఆంధ్రవాఙ్మయమున ననవరత కావ్యమరీచులఁ దేజరిల్లుచుండ, ఘూనసాటి బసవరాజు ప్రత్యేకముగా మనుచరిత్రసంతతానందుఁ డని చెప్పించుకొనుటకుఁ గారణమేద్ది? తన సార్వభౌముఁడగు శ్రీకృష్ణదేవరాయ లాకావ్యమును గ్రహింపించెనని ప్రభువిధేయత సూచించుట కాగ్రంథమందభిమానముఁ గనుపఱచెనా? లేక యాగ్రంథమందలి ప్రాశస్త్యమును బట్టి యట్టి యభిమానము గనుపఱచెనా? అని యాలోచింపఁదగినది. ప్రభుభక్తి సూచనకొఱకు కృష్ణదేవరాయ లంకిత మొందిన మనుచరిత్రమునం దభిమానము జూపినయెడల కృష్ణదేవరాయలు స్వయముగా రచించిన యాముక్తమాల్యదయం దభిమానముఁ జూపిన సంతకంటెఁ బ్రభుభక్తి వెల్లడియగునే! అట్లుచేయక మనుచరిత్రయందే ప్రత్యేకాభిమానమున్నట్లు నారాయణకవిద్వారా చెప్పించుకొనుటచే నానాటి యాంధ్రగ్రంథములకంటెను, పత్పూర్వపు ఆంధ్రగ్రంథములకంటెను, పెద్దన్న మనుచరిత్రమం దేదోయొక యుత్తమ గుణవిశేషమును గనిపెట్టినట్లు దీర్మానించుకొన నవకాశ మున్నది. ఆవిశేష మేది?

శృంగారము నతిక్రమించిన యాధ్యాత్మిక జీవితమును దెలుపుచున్న మనుచరిత్రమందలి కథయగునా? అదియును గొంతవఱకుఁ గారణము గావచ్చు. అయిన నట్టి కథలు మనపురాణములయందుఁ జాలచోట్లఁ గాన్పించుచున్నవి. శ్రీశుకులు, ఋష్యశృంగుఁడు మున్నగు తాపసోత్తముల కథ లిట్టివియే గదా? మఱియుఁ గథాకల్పనమందలి యద్భుత

చాకచక్యమగునా? అదియుఁ గొంతకారణము కావచ్చు. కాని యీ కథాకల్పన చాలవరకు మార్కండేయ పురాణోక్తమని చూపితిమికదా! అట్లయుఁ నింతయెక్కుడు ప్రతిష్ఠఁదెచ్చిన ప్రత్యేకగుణవిశేషమేది? అది యీప్రబంధమందలి కవనశైలియని నాతలంపు. ఆశైలి నిరూపమానము, నిరతిశయము. శైలియనగా రసపోషణము, భావప్రకాశనము, వర్ణనాచమత్కృతి, పదవిన్యాసము,—వీనియన్నిటి సాముదాయికము. ఈసాముదాయిక మైనశైలియందుఁ బెద్దన్న యద్వితీయుఁ డను ప్రఖ్యాతి నొందినవాఁడు.

క. పెద్దనవలెఁ గృతిచెప్పినఁ
బెద్దనవలె నల్పకవిని బెద్దనవలెనా?
యెద్దనవలె, మొద్దనవలె,
గ్రద్దనవలెఁ గుందవరపు కవిచౌడప్పా.

అనినట్లు అత్యద్భుతముగా రసపోషితమైనశైలిని రచించుటలో నల్లసాని పెద్దన్న వెనుకటికవులకంటెను దరువాతికవులకంటెను నెక్కుడైనవాఁడు.

ఈరసోన్మేషణమైన శైలినిఁ బ్రప్రథమమునఁ దిక్కనసోమయాజి చూపించెను. ఆమహానుభావుని లేఖని యపారమగు భారత పారావారమును మథించవలసిన కారణమున నేయొక్క శైలికిని దీర్ఘకాల విహారమున కవకాశ మీయలేకపోయెను. అటుతర్వాత నాచనసోముఁ డాయుత్తేజితశయ్యను బ్రయోగించెను. కాని యాకవివరుఁడు బహుముఖప్రావీణ్యమున సాహంకారుఁడై జ్యోతిర్లతలవలెఁ దఱచు మెరయుచుండెను. గాని విశేషకాలమేశయ్యను నడపియుండలేదు. శ్రీనాధునకు రసానుభవ శక్తి యున్నదికాని రసావిర్భావశక్తి తక్కువ. కాఁబట్టి యీతనిశైలి రసో

త్సుకము నెక్కువగా కలిగింప నేరదయ్యె. మఱి పినవీరభద్రుఁడును బోతనయు నీశక్తిని కొంచెము కొంచెముగాఁ జూపఁగలిగిరి.

శ్లో. "కవి ర్దండీ కవి ర్దండీ భవభూతి స్తు పండితః
కోఽహం రండే? త్వమేవాహం, త్వమేవాహం నసంశయః"

అని కాళిదాసుని లోకోత్తరకవిత్వముఁ గూర్చి మహాకాళి పల్కిన శ్లోకగాథ యున్నది. దండి కవియనియు, భవభూతి పండితుఁ డనియు మనవారు వేరు పఱిచినట్టుల మన యాంధ్రకవులలో శ్రీనాథుఁడు పండితుఁ డనియుఁ బెద్దనకవి యనియు వేరుపఱచుట యుచితముగ నాకుఁ దోఁచుచున్నది. శ్రీనాథుఁడు దఱచుగా ననుకరించిన శిష్యుఁడయ్యె, బెద్దన సహజసుకవి. అనగా స్వయముగా రసోద్రేకమును బొంది తద్రసానుభవమును రసభూయిష్ఠమయిన పదజాలముతోను, నైసర్గిక భావసందోహములతోను బాఠకునిహృదయమునఁ దటాలున నుద్భవింపఁ జేయగల సమర్థుఁడు ఇట్టిశక్తికి సహకారిగా భాషాపరిచితియెక్కువగా నుండుటయేగాక రసాత్మకశబ్దప్రయోగకౌశలముగూడ నుండవలెను. అంతియగాక యాయుచితశబ్దప్రయోగము సద్యఃస్ఫురణముగా నుండవలెను. ఇన్నిలక్షణములుండినఁగాని కావ్యశైలివలన విస్ఫుటరసోదయము కలుగ నేరదు. పెద్దనార్యునివలెనే యాతనికి బూర్వులును దరువాతి వారును కూడ శృంగారరసకథలను ప్రబంధములుగా వ్రాసిరి. కాని పెద్దన నోటను వచ్చినట్లు శృంగారరసమాధుర్య మెవరికి సాధ్య మైనది? ఔచిత్యముమించకుండ, భావగాంభీర్యము చెడకుండ రసికులు దలలూచి మెచ్చునట్లుగా నీతివంతులు శహబాసని సంతసించునట్లుగా వైరాగ్యశృంగారములను దేనికదే మనోహరముగానున్నట్లు నిరుపమానపద్యపరంపరలలో వ్రాయగలిగిన వాఁడు మఱియొకఁడు పేర్కొనుట కాంధ్రవాఙ్మయమునఁ గానిపింపఁడు. ఇదియే పెద్దనయందలి సర్వోత్కృష్టత ఈతనిశైలియందు

రసోత్కర్షయు, దాని కనువగు భాషామాధుర్యమును, వీనితో సరియగు భావగాంభీర్యమును యీ మూఁడుగొప్పలక్షణములు ముప్పిరిగొని యున్నవి.

ఈవిధమగు శైలిని రామరాజభూషణుఁడు రచింప నుద్యోగించి గురువుకంటె నెవ్వియో కొన్నివన్నెలు బెట్టుటకు సంకల్పించుకొనెను. ఆసంకల్పముప్రకారము మధురభాష వాడుటలోఁ బ్రత్యేకసంగీతమాధుర్యమే కావ్యములో నెలకొల్పుటకుఁ దిప్పలుపడెను. ఈ విధాన మెటులున్నదనఁగా సహజముగా మధురమైన దేనె యొకించుక కటువుగానుండునని దానియందు పంచదార కలిపినట్లుండెను. ఆమిశ్రితవస్తువు పంచదార కాదు, తేనెకాదు, ఒకవిధమగు ముఖముమొత్తని దీపిగల విలక్షణవస్తువు. అట్టివిధముగా రామరాజభూషణుఁడు వసుచరిత్రశైలిని అతిమాధుర్యముగాఁ జేసిపెట్టెను.

పెద్దనశైలి యట్లుగాక మాధుర్యముతో పుష్టి, బిగువు, గాంభీర్యము-ఇత్యాది ఓజోగుణములు, అనఁగా పౌరుషలక్షణములు కలిసినవి. భాగవత వసుచరిత్రలవలె నతిమాత్రములుగ మృదుత్వమాధుర్యములు గలదిగాక, కాశీఖండము ఆముక్తమాల్యదలవలె నత్యంతముగ కాఠిన్యకటుత్వములు గలదిగాక పెద్దనార్యుని కావ్యపాకము వ్యావహారిక సారళ్యమునకుఁ బాండిత్యప్రౌఢిమ గలిపి నాతికఠినముగ, నాతిసులభముగ నుండి సహజమైనకవితాభిరుచి గలిగిన ప్రతివానికి మనోహరముగాను హృదయంగమముగాను నుండును. ఈయుత్కృష్టగుణమే ముఖ్యముగాఁ బెద్దన్నకు ఇంత గొప్పపేరు దెచ్చినది.

శ్రీకృష్ణదేవరాయలవంటి మహాకవియు, కవితాభిమానియు దనయాస్థానమున ననేకమహాకవులుండ ఆంధ్రకవితాపితామహుఁ డని బిరుదమునిచ్చి స్వయముగా కవిగండపెండేర మను బిరుదచిహ్నమగు

యొత్తులు మున్నగు శ్రావ్య పఠనసాధనములు ఉచితజ్ఞతతో నానాస్థానములకు మార్చుచుండెను. ఆకారణము ననేకస్వరగతి గాని, యేకశ్రుతి గాని యెచ్చటను లేదు. ఈనేర్పు సామాన్యముగా ప్రతి కవియందును, కొద్దిగనో గొప్పగనో యుండకతప్పదు. గాని పెద్దనార్యునియందు నిది ప్రత్యేక చాతుర్య విశేషముగా నేర్పడుచున్నది. ఈశైలీ నైపుణ్యమును గుర్తించుటకు నేతద్గ్రంథమందే యొక్కభాగమునందలి వరుసను నాలుగైదు పద్యములు జదివినచో నీ నిలుపు నిరుపులయందలి మార్పుల నేర్పులు విస్పష్టమగును. ఈక్రింది యుదాహరణము దిఙ్మాత్రముగా నీయఁబడినది.

ఉ. అబ్బురపాటుతోడ నయనాంబుజముల్ వికసింపఁ గాంతి పె
ల్లుబ్బ కనీనికల్ వికసితోత్పలపంక్తులఁ గ్రుమ్మరింపఁగా
గుబ్బమెఱుంగుఁ జన్గవ నగుంగవ మీఁదికి మాటిమాటికిన్
గుబ్బటిలంగఁ జూచె నలకూబరుఁ గన్నులు [illegible].

ఉ. చూచి [illegible] [illegible]
[illegible] మల్లె [illegible]
[illegible] బోఁదయఁ [illegible]
[illegible] వల్లకొల్పుమా.

ఉ. ఎక్కడివాఁడొ యక్షతనయేందు జయంత వసంత కంతులన్
జక్కఁదనంబునన్ గెలువఁజాలెడువాఁడు మహీసురాన్వయం
బెక్కడ యీతనూవిభవ మెక్కడ [illegible] గా [illegible]
డక్కఁగఁ [illegible] యకటా! [illegible] [illegible]న్.

కావున శైలీ ప్రాశస్త్యమును [illegible]యే ముఖ్యముగా మనుచరిత్రముయొక్క యున్నతప్రశస్తి యేర్పడినది శైలీప్రాయికముగా భాషావిషయకముగాని భావవిషయకము గాదు. కాబట్టి భాషాప్రాధాన్యము గల కవులందరు ముఖ్యముగా మనుచరిత్ర ననుకరించుట కవకాశము

గలిగినది అందులో బెద్దన శిష్యుఁడైన రామరాజభూషణుఁడు మొదటివాఁడని తెలిసినదే. అతఁడు మనుచరిత్రశైలి ననుకరించుచు దానిలోఁ దక్కువగానున్న కొన్ని లక్షణములను బెంచియు లేనివి కొన్నిటిని జేర్చియు వసుచరిత్రను మధురతరముగ రచించి పెద్దన్న మనుచరిత్రమునకు పోటీగా మఱియొక శైలి ప్రధానగ్రంథమును తయారుచేసెను. తత్కారణమున మనుచరిత్రము, వసుచరిత్రయు, ప్రబంధశైలికాదర్శములైనవి. శైలీప్రాధాన్యములు కాని ఆముక్తమాల్యద, కళాపూర్ణోదయము, ప్రభావతీప్రద్యుమ్నము,— ఇత్యాది మహాప్రబంధములు మనువసుచరిత్రలతో సమానములయ్యును వాని ననుకరింప సౌలభ్యములేని కారణమునను, వానియందంత భాషావిన్యాస చతురతలు లేనికారణమునను తరువాతి ప్రబంధకవులు వానిని లక్ష్యముసేయక మనుచరిత్ర, వసుచరిత్రలనే యనుకరింపఁ జొచ్చిరి. కావుననే పిల్లమనుచరిత్రములు, పిల్లవసుచరిత్రలు ననేకములు పుట్టనారంభించినవి. ఈసంతాన బృందమునకు ముఖ్యమాతృక మనుచరిత్రమని యాంధ్రకవియభిజ్ఞులకెల్లరకు సువిదితమైన విషయమే. ఈమాతృకతనే మనుచరిత్రకును, పెద్దనార్యునకును నాంధ్రకవితా ప్రపంచమందు శాశ్వతకీర్తిని యున్నత స్థానమును దెచ్చినది.

పలుకుల నెవ్వరైన నామోదించెదరా? యని నేనే సందేహింపవలసి యున్నది. కాని నిక్కుమారయ నృసింహకవి యెంతవైరాగ్యవృత్తి నవలంబించియున్నను ఆతని సహజస్వభావము మాత్రము తామసగుణప్రధానమైనదని యాతని కావ్యమామూలచూడముగ నిర్ఘోషించుచున్నది. ట్లు కవుల మానస ప్రవృత్తులు త్రివిధగుణములయందైన దేనినో యొకదానిని ప్రధానగుణముగ చూపుచున్నట్లు వారిచే రచింపఁబడిన గ్రంథములుఁగూడ నవరసభరితములైనను ఏకగుణ ప్రాధాన్యమునొంది నట్లే పరిగణింపఁ బడఁగలవు.

నందితిమ్మన్న స్వభావముచే సాత్త్వికుఁడు, నిరహంకారుఁడు, మృదుల హృదయకలితుఁడు, మంజుల భాషావిలసితుఁడు. ఆతని స్వభావము తద్రచితమైన పారిజాతాపహరణ కావ్యమున నన్నిసందర్భములలో నేతాదృశముగానే పొడసూపుచున్నది.

నంది తిమ్మన్న శ్రీకృష్ణదేవరాయల యాస్థానమందున్న మహాకవులలో నొకఁడు. అల్లసాని పెద్దన్న తరువాతి రాయల మన్ననకుఁ బాత్రుఁడైనవాఁ డితఁడే. ఈతనికి ముక్కు తిమ్మన్న యనిగూడ నామాంతరము గలదు. ఈపేరు ముక్కునుగూర్చి యొక మనోజ్ఞకల్పనముగల పద్యము రచించిన కారణమున వచ్చెనని కొందరూహించినారు.

శా. నానాసూన వితానవాసనల నానందించు సారంగమే
లా నన్నొల్లదటంచు గంధఫలి బల్కాకన్ దపంబంది యో
షానాసాకృతి బూని సర్వసుమనస్సౌరభ్యసంవాసియై
పూనెం బ్రేక్షణమాలికా మధుకరీపుంజంబు నిర్వంకలన్.

(వసుచరిత్రము—ఆశ్వా. 2)

అను పద్యమున నీతఁడు నాసికను కడుంగడు సొగసుగ వర్ణించి యాపద్యమును రామరాజభూషణున కొసంగెననియు దానంజేసి యాకవికి 'ముక్కు' అనుపేరు సార్థకనామముగ వచ్చినదనియు నొక లోక

పరివాదము గలదు. ఈపద్యము వసుచరిత్రయందు గానబడుచున్నది. రామరాజభూషణుఁ డీపద్యమును తిమ్మన్నయొద్దనుండి యెఱువు తెచ్చి కొనెనని తలంచుట హాస్యాస్పదము. ♦ కావున నీ 'ముక్కు' అను ఇంటిపేరు మఱియొక కారణముగ వచ్చియుండనోపు. రోమనుకవులలో 'ఓవిదు' అను మహాకవికి 'ఓవిడియస్ నాసస్' అనఁగా 'ముక్కు-ఓవిదు' అను ప్రసిద్ధనామము గలదు. ఆతనికి పొడుగాటి ముక్కు యుండుటచే నాపేరు వచ్చినదని పాశ్చాత్త్యాభిప్రాయము. అట్లే మన తిమ్మనకుఁగూడ నొకవిలక్షణమైన ముక్కు యుండుటకతన నీపేరు వచ్చియుండవచ్చును. 'ముక్కు' అను ఇంటిపేరుగలవా రిప్పటికిని యాజ్ఞవల్క్య నియోగులలో నున్నారు.

నంది తిమ్మన్న ఆర్వేలవంశపు బ్రాహ్మణుఁడు. కౌశిక గోత్రుఁడు, ఆపస్తంబసూత్రుఁడు. నంది సింగయ్యకును దిమ్మాంబకును బుత్రుఁడు. మలయమారుతకవి యను బిరుదుగలిగి ప్రబోధచంద్రోదయ వరాహపురాణములను రచించిన జంటకవులలో నొకఁడగు ఘంట సింగయార్యకు మేనల్లుఁడు. ఇతని మేనమామయును మాదయ్యగారి మల్లన్నయును నేగురుప్రోక్త సారస్వతదీక్ష నొందిరో యట్టి మహాపూజ్యుఁడగు అఘోరశివాచార్యులయొద్దఁ దానును సారస్వతదీక్ష నొందినవాఁడు. కావున శైవ మతావలంబి.

♦ ఈపద్యము నిజముగా ముక్కుతిమ్మన్న కల్పించినది కాదు. ఇది విద్యానాథ పరనామకుడును ఓరుగంటి చక్రవర్తి రెండవప్రతాప రుద్రదేవుని యాస్థాన గీర్వాణకవియును ప్రతాపరుద్రీయమను ఆలంకారిక గ్రంథమును రచించినవాడును అగు అగస్త్యమహాకవి తన "నలకీర్తి కౌముది" యను సంస్కృత కావ్యమున రచించిన శ్లోకమున కాంధ్రానువాదము,

శ్లో॥ భృంగానవాప్తి ప్రతిపన్న ఖేదాత్ కృత్వాపనే గంధఫలీ తపోలం
తన్నాసికాభూదను భూతగంధా స్వపార్శ్వ నేత్రీ కృతభృంగ సేవ్యా.

ఈయనువాదము రామరాజ భూషణుడు స్వయముగానే చేసియుండవచ్చును.

కాఁబట్టి నందితిమ్మన్నను నందిమల్లయ్యకును నేదోయొక విధమైన రక్తసంబంధ ముండితీరవలెను. నంది తిమ్మన్న నందిమల్లయ్యకుఁ బౌత్రుఁడని యొక జనశ్రుతియున్నట్లు వీరేశలింగముగారు తమ కవుల చరిత్రలో సూచించినారు; గాని తిమ్మన్న తన గ్రంథమందు తన మేనమామయగు ఘంట సింగయ్యను, తన తలిదండ్రులను మాత్రము చెప్పెఁగాని మల్లయ్యతోఁ దనకుఁగల సంబంధము జెప్పియుండలేదు. మహాకవియైన మల్లయ్య తనకు పితామహుఁడైనయెడలఁ దన కావ్యమునఁ దిమ్మన్న యట్టి ప్రసిద్ధుఁడైన వంశప్రతిష్ఠాపకుని తిక్కన శ్రీనాథుల వలెఁ జెప్పకయుండకపోవునా? యని సంశయింపవలసియున్నది.

తిమ్మన్నకు మలయమారుతకవి మేనమామయగుటచే నతనికంటెఁ బెద్దవాఁడైనపుడు మల్లయ్యకూడ తిమ్మన్నకంటెఁ బెద్దవాఁడై యుండవలెను. నందిమల్లయ్య నందితిమ్మన్నకు స్వకీయ పితామహుఁడని చెప్పుటకంటె జ్ఞాతికుటుంబములోఁ జేరిన పెదతండ్రియో పినతండ్రికుమారుఁడో యై యుండునని చెప్పుట యొక్కువ సమంజసమని నాకుఁ దోఁచుచున్నది. ఏలయనఁ దమ కుటుంబములలోనున్న జ్ఞాతిత్వవైషమ్యములచే నతనియెడల నిట్టి యనిష్టత జూపించెనని యూహించుట మానవస్వభావమునకు నంత విరుద్ధముగా నుండదు.

ఇట్లుండ గురుజాడ శ్రీరామమూర్తి పంతులుగారు తమ కవిజీవితములలో వీరిద్దరకు నొక విపరీత బంధుత్వమూహించి నంది మల్లయ్యను తిమ్మయ్యకు సమవయస్కునిగాను ఘంట సింగయ్యను వారిద్దరికంటెఁ జిన్నవానిగానుఁ జూపించియున్నారు. ఈకల్పన మేమాత్రమును నాకు సందర్భయుక్తముగా నున్నట్లు గాన్పించదు. తండ్రియగు నరసరాయలకు గ్రంథాంకితముచేసిన మల్లయ్య సింగన్నకవులు కొడుకగు కృష్ణదేవరాయలకు గ్రంథాంకితము చేసిన తిమ్మన్నకవికంటె వయస్సునఁ బెద్దలై

యుండుట లోకానుభవమునకు సరిపోవును. అట్లు తలంపమి శ్రీరామమూర్తిగారి వాదములో ముఖ్యమైన పెద్దలోపము. తిమ్మయ్య తండ్రిపేరును మల్లయ్య తండ్రిపేరును నొకటియే యగుటచే వీరిట్టి విచిత్రకల్పన చేయుట కవకాశము గలిగిన దని నాకుఁ దోఁచుచున్నది. నామసామ్యమాత్రముల నేదో యొక విలక్షణ బంధుత్వ మేర్పఱచుట ప్రశంసనీయమైన పని గాదు. *

కృష్ణదేవరాయల భార్యలలో నొకామె తనపుట్టింటినుండి యరణముగ నీకవినిఁ దెచ్చికొనెనని మఱియొక ప్రతీతిగలదు. ఇది నిజమైనచో నారాణి యన్నపూర్ణాదేవి కావలసియున్నది. ఏలయన నామెయే కళింగదేశపు రాజుకూఁతురు. ఈకవి యాశ్వలాయనసూత్రుఁడగుటచే గుంటూరుజిల్లావాఁడయి యుండును. కళింగరాజులు గుంటూరుజిల్లా భాగమును కొండవీటిరాజ్యములోని దగుటచేఁ బాలించుచు వచ్చిరి. కృష్ణదేవరాయలు కొండవీటి యుద్ధములో కళింగరాజు నోడించి, గుంటూరు, నెల్లూరు

* ప్రబోధచంద్రోదయ పారిజాతాపహరణకావ్యములను బట్టి యాకవుల వంశవృక్ష మిట్లేర్పడుచున్నది.



జిల్లాలుగలసిన దేశమును స్వాధీనముచేసికొని గజపతికూఁతురగు అన్నపూర్ణాదేవిని వివాహమాడెను. కావున నాజిల్లాలవాఁడైన నీకవియు నాదేశముతోఁబాటు రాజకుమారియొక్క కట్నపుసామగ్రితోఁ గృష్ణదేవరాయల యధీనములోనికి మారెనని యూహింపవలసియున్నది.

కృష్ణదేవరాయలును తనరాణియు నొకానొకసమయమునందుఁ బ్రణయకలహమున నెడబాటునొందియుండఁగా నాసంగతి యీకవీశ్వరునకు దెలిసి తనప్రభ్వికి పునః భర్తృసమావేశ మొనఁగూర్చుటకుఁగాను వేవేగముగ నీగ్రంథమును రచించి దానియందు సత్యభామా శ్రీకృష్ణుల పాలయలుకను రసవత్తరముగఁ జిత్రించి సత్యభామచే శిరఃస్థలమునఁ బాదతాడనము నొందినను శ్రీకృష్ణుఁడు కినియక మృదులభావమున నామెననునయించె నని చూపి రాయలకును విప్రలబ్ధ యయిన యామహిషికిని పునః సంయోగము గలిగించెనని మఱియొక యైతిహ్యము. ఈకథ కేవలము రసికజన కల్పితమే గాని నిజముకాదని రూఢిగఁ జెప్పవచ్చును.

ఏలయన రాయవాచకములోఁ గృష్ణదేవరాయలు కళింగదేశమును జయించి తదుపరి సమస్త తీర్థయాత్రలను సేవించి విద్యానగరమునకు మరలి వచ్చిన తరువాత నిండుకొలువున నుండగా సాళువ తిమ్మరసు, బాచరసు, తిప్పరసు, అయ్యమరసు మున్నగు మహామంత్రులు శ్రీరాయలవారి కీర్తి ప్రతాపములు శాశ్వతముగా భువియందు నిలుచునట్లుగాను కవీశ్వరులవల్లఁ గృతులనందుకొనుమని మనవిచేయగా రాయలవారు ముక్కు తిమ్మయ్య అల్లసాని పెద్దయ్య మాదయ్యగారి మల్లయ్యను పిలిపించి వారికి బహుమానములు చేసి పారిజాతాపహరణమును మనుచరిత్రను జెప్పు మని యాజ్ఞాపించినారట. * కుమార ధూర్జటి రచించిన

" * మరునాడు కొలువులోపల యిష్టకథావినోదమైన నగరినియోగులున్ను కవీశ్వరులు విద్వాంసులు మొదలైన నిండుసభలోన సాళువ తిమ్మరసయ్యగారున్ను,

కృష్ణరాయ విజయములో గూడ కృష్ణరాయలు కళింగ దండయాత్రి బూర్తిగావించి తుక్కాదేవిని బరిణయమాడి విద్యానగరమునకు దిరిగివచ్చి

గీ॥ "బంధుర కవీంద్రకృతులలోఁ బ్రౌఢిగన్న
మనుచరిత్రాది కృతులంది మహిమ చెలఁగి
సకలసామ్రాజ్య వైభవ సరణి వెలయ
ధరణియేలుచునుండె నద్ధరణి విభుఁడు".

అని చెప్పుటచే నీపారిజాత కృతిని మనుచరిత్ర కృతితోఁ గృష్ణరాయ లందుకొనె నని తెలుచున్నది. కావున నీపారిజాతాపహరణముఁ దన రాజదంపతుల ప్రణయ కలహ సాంత్వనమునకుఁ గాక తన జేని యశోవిస్తృతికై వారి ముదలందుకొని యిక్కృతి రచించెనని స్పష్టమగు చున్నది. అనఁగా నీకావ్యము క్రీ॥ వె॥ 1515–1519 మధ్యను వ్రాయఁబడినట్లు స్థిరపడినది.

మ॥రా॥శ్రీ॥ కందూరి ఈశ్వరదత్తు బి.ఎ.గారు భారతి 1925 జూలై సంచికలో నీకావ్యమందున్న చరిత్రాంశములను సాకల్యముగ సూక్ష్మ పరిశీలన గావించి పారిజాతాపహరణ ప్రబంధము ఆముక్త

---

రాయసం కొండమరుసయ్య మొదలైన వార్లున్ను ప్రసంగంవెంబ్బడిని అందరున్ను యెంచినట్లు 'కవితాచాతుర్యము' గలవార్లున్ను రాయలవారిని మాచి ప్రసంగ్గం వెంబడిని నీదుకీర్తి శాశ్వతముగా నిలిచే టందులకు ఆదియందు అవనీపతులు కృతు లందుచు రాంగా వార్ల ప్రతాపములున్ను కీర్తిన్ని అంపెరున్ను యెంచినట్లు స్వామి వారు కృతు లందుకొంట్టె కీర్తిప్రతాపములు శాశ్వతముగా నిలుచును. గనుక తిమ్మరుసయ్య......దెలుపగా రాయలవారున్ను చాల సంతోషబడి ముక్కు తింమయ్య అల్లసాని పెద్దయ్య మాదన గారి మల్లయ్య మొదలైన కవీశ్వరులతో కృతు లందుకొవలె నని కవితానాయకులతో ప్రసంగించి...... పారిజాతాపహరణమున్ను మనుచరిత్రను చెప్పమని ఆనతిచ్చినారు ......"

రాయవాచకము-పుట 115–116.

మాల్యద మనుచరిత్రలకంటె ముందుగానే వ్రాయఁబడిన దనియు క్రీ॥ వె॥ 1515 అక్టోబరు నాఁటికే పూర్తి నొంది కృష్ణరాయని కంకితము జేయఁబడిన దనియు వాకుృచ్చిరి.

మ॥రా॥శ్రీ॥ ఈశ్వరదత్తుగారు పారిజాతాపహరణమునఁ గృష్ణ రాయలు కటకమును జయించినట్లు జెప్పఁబడియుండనందున నీవిధముగ నభిప్రాయపడిరి. కృష్ణరాయలు కొండవీడుయుద్ధముఁజేసి గజపతుల నోడించి అమరావతిలో రత్నతులాపురుషమహాదానము చేసిన కాలము ననే అనఁగా యువ సం॥ ఆషాఢ బహుళ ద్వాదశి (క్రీ॥వె॥ 1515 అక్టోబరు)నాఁటికే యీగ్రంథము రచింపఁబడి యాతనికంకితముఁ జేయ బడినట్లు వారియభిప్రాయమై యున్నది. సింహాచలము, పొట్నూరుల ప్రశంస యాగ్రంథమున లేకపోయినను కటకాధిపతిని జయించినట్లు వి స్పష్టముగా నున్నది. కొండవీడువద్దతప్ప గజపతులతో కృష్ణరాయనికి ఘోరసంగ్రామము మరియొకచోటను జరిగినట్లు చరిత్రయందు గాన్పిం చదు. కావున కటకాధీశుని జయించిన ట్లీక్రింద నుదహరింపఁబడిన పారి జాతాపహరణములోని వాక్యములు, మనుచరిత్రాముక్తామాల్యదలలోని యంశముల వలెనే కృష్ణరాయని కళింగ దిగ్విజయయాత్రల నన్నిటికి నన్వయింపవచ్చునని నాయాశయము (1) "ఉత్కల భూమీధవ దర్ప హరణ భుజసారా" (2) "కటకేశసింధు మంధరకుధరా" ఇంక—

గీ॥ "బలనికాయము కాలిమట్టుల నడంచుఁ
గటకమును గినిక ననుచు నుత్కలమహీశుఁ
డనుదినంబును వెఱచు నెవ్వనికి నతఁడు
రాజమాత్రుండె శ్రీకృష్ణరాయ విభుఁడు"

అను పద్యమును బట్టి శ్రీకృష్ణరాయలు కటకమును స్వాధీనము చేసికొనలేదని యున్నదిగాన యాతఁడు రెండవసారి యనఁగా క్రీ॥వె॥

1516 లో సింహాద్రివరకు వెళ్లకపూర్వమే యీగ్రంధము రచింపఁబడిన దని శ్రీ దత్తుగారు వెలువరచిన యభిప్రాయమున కీక్రింది సమాధాన మాలోచింపఁదగినది. కృష్ణరాయలు కటకపురివర కెన్నడును దండయాత్రసాగించలేదు. రాజధానియగు కటకము నెన్నడును లోఁబఱచుకొనలేదు. సింహాచల ప్రాంతములకుఁ బోవుసరికే గజపతులువచ్చి కృష్ణరాయనితో సంధిచేసికొనిరి. కావుననే సింహాచలమున కించుకదూరముననున్న గోస్తనీ నదీతీరమందలి పొట్నూరువద్ద తనవిజయ కంబమును నాటి వెనుకకు మరలెను. కటకమునఱకు దాడిసాగించినయెడల యేమహేంద్రగిరిపైననో తనవిజయ చిహ్నము స్థాపింపవలసినవాఁడే. కావున కటకమును జయించలే దన్న యంశ మంత ముఖ్యాధారముగాదు. పైఁగా ఈపద్యమున శ్లేషరూపముగ వర్ణనము జేయఁబడినది. కటకమను సంస్కృతపదమునకు కాలిమట్టియ యను విశేషార్థముండుటచే నాయర్థమునకు సరిపోవునట్లు కటకవిషయము తక్కినవానితో గూర్పఁబడినదని తోచుచున్నది. కావున నీవాక్యములు ఈశ్వరదత్తుగారి వాదమునకు నిర్ధారణమగు సహాయము నివ్వజాలవని నాయభిప్రాయము. అయినను సింహాచలము పొట్నూరు ప్రశంశలు పారిజాతాపహారణమున లేకపోవుట ముఖ్యమగు విషయము. పైగా యవనులతో జరిగెన పోరు సంగతియే మెచ్చటను ముచ్చటింపఁబడలేదు. కావున కళింగ విజిగీషామనీషను రాయలు రెండవసారి దండెత్తిన యాత్రకు పూర్వ మీగ్రంధము గ్రంధకర్త చేతులలోపూర్ణాకృతి నొంది యుండినదేమో యను సంశయము పొడముచున్నది. అట్లైన 1516 కు పూర్వమే వ్రాయఁబడి తదనంతరము మనుచరిత్రతోఁ బాటు రాయలకుఁ గృతిసమర్పణము గావింపఁబడియుండవచ్చును. అయినచో రాయవాచకమందు సూచింపఁబడిన కృష్ణరాయని యాదేశము సమర్థనీయముకాదు. కృష్ణరాయలే పారిజాతకథనుఁ

బ్రబంధరూపముగా వ్రాయుమని కవికాజ్ఞాపించినచోఁ బెద్దనార్యుఁడు మనుచరిత్రలోఁ జెప్పికొనినట్లు తిమ్మన్న యేల తనగ్రంథమందు బ్రశంసించియుండఁడు? కావున కృష్ణరాయ విజయములో నున్నట్లుగా కళింగ రాజ్య విజయానంతరమున కృష్ణరాయలు పై రెండుకృతులను ఒకేకాలమున స్వీకరించెననియే మన మూహింప వలసినదిగాని కృష్ణరాయ లానతిచ్చిన వఱకు నీప్రబంధము రచింపఁబడలేదని యూహించుట కవకాశము గాన్పింపదు. కావున మనుచరిత్ర ఆముక్తమాల్యదలకంటె ముందుగానే యిది రచింపఁబడినది గాని మనుచరిత్రతోనే రాయలకుఁ గృతియీయఁ బడినది.

కృతిపతియగు కృష్ణదేవరాయలను గుఱించి ప్రత్యేకముగా నిచ్చుట వ్రాయవలసినది లేదు. అతని జీవిత చరిత్రములోనున్న యంశముల నన్నిటిని బెద్దనార్యుఁడు మనుచరిత్రములో స్పృశించినట్లుగాను నాముక్తమాల్యదలో కృష్ణదేవరాయలు స్వయముగాఁ జెప్పికొనినట్లు ఈకవియుఁ దన గ్రంథమందుఁ బేర్కొనినాఁడు.

ఉమ్మత్తూరు, శివసముద్రములను జయించుటయు, నుదయగిరి, బెల్లముకొండ. కొండవీడు, కొండపల్లి మున్నగు దుర్గములను సాధించుటయు, నిత్యాది చరిత్రాంశములను దిమ్మన్నయు సూచించినాఁడు. పెద్దనార్యుని మనుచరిత్రలో నున్నట్లే యీగ్రంథమందును కృష్ణరాయని భార్యలలో నిద్దరుమాత్రమే పేర్కొనఁబడిరి. 'చిన్నమదేవీ జీవితనాయక' 'తిరుమలదేవీ వల్లభ' యని కృష్ణరాయని సంబోధించి యాయిద్దరు భార్యలనే యీకవి పేర్కొనెను. కాని, కృష్ణరాయలు తన యాముక్తమాల్యదలో ' తిరుమలదేవియు అన్నపూర్ణాదేవియు కమలాబ్జముఖులు దేవేరులుగన్ ' అని చెప్పి, చిన్నాదేవిపేరు విడిచిపెట్టి క్రొత్తగా అన్నపూర్ణాదేవిపేరు చేర్చినాఁడు. ఈఅన్నపూర్ణాదేవి తాను పరిగ్రహించిన

కళింగరాజతనయ యై యుండనోపు నని నేను వెనుకటియధ్యాయము లలోఁ జూపఁగలిగితిని. కావున కళింగరాజపుత్రికను పరిణయమాడిన తరువాత ననఁగా కళింగదండయాత్రలు సమాప్తి నొందిన పిదప ఆముక్త మాల్యద రచింపఁబడినది. తత్పరిణయమునకుఁ బూర్వమే మనుచరిత్రము, పారిజాతాపహరణమును రచింపఁబడినట్లు విశద మగుచున్నది.

కృష్ణరాయలు కవితాపరిజ్ఞ కలవాఁ డని పెద్దన్న గాని, రాయలు స్వయముగాఁ గాని చెప్పియుండలేదు. ఆనొప్పువిషయము ముక్కు తి మ్మన్నమూలముగా మనకుఁ దెలిసినది. 'కవితాప్రావీణ్యఫణీశా' యని కృష్ణరాయని వర్ణించుటచే నీవిషయము లోకమునకు సువ్యక్త మైనది.

మఱియు కృష్ణదేవరాయల విద్వత్సభలనుగుఱించియు, కవిసంభా వనోత్సవములను గుఱించియుఁ గూడ నీకవియే మనకు స్పష్టపఱచెను.

క. ప్రతివర్షవసంతోత్సవ
కుతుకాగత సుకవినికరగుంభిత కావ్య
స్తుతి రోమాంచవిశంకిత
చతురాంతఃపుర సభాపరిసాదన రసికా !

అని వర్ణించుటచే రాయలకుఁ గల యపారకావ్యగోష్ఠికౌతూహ లమును, విద్వజ్జనపరితోషణోత్సాహమును నాంధ్రలోకమునకుఁ దెల్లము చేయఁబడినవి. 'భువనవిజయాఖ్య సదనస్థ వరత్న విభాప్రభాత నలినాక్ష' అని కృష్ణదేవరాయల పేరోలగమందిరమును వర్ణించి యాతని సభా స్థానము భువనవిజయ మని తెలుపుడు జేసెను. ఇట్లుఁ గొన్నివిశేషాంశ ములను జేర్చినను మొత్తముమీఁద నంశవర్ణనములలోను, దండయా త్రాదివర్ణనములలోను పెద్దన్నయు, కృష్ణరాయలును యుగ్గడించినవానినే యీకవియు వివరించె నని నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

అయినను ఏతద్వర్ణనములలోఁ దిమ్మనమహాకవి యితరకవులకంటె నెక్కువగ చమత్కరించినట్లు గన్పట్టుచున్నది. అనవరతవిజయశీలుఁ డగు శ్రీకృష్ణదేవరాయలు మహాచక్రవర్తియై దక్షిణహిందూస్థాన మంతయుఁ బరిపాలించుచు భగవంతుఁ డగు శ్రీకృష్ణునినామము ధరించినకారణమున కవీశ్వరుల భావనాపథములలో నెట్టి సాదృశ్యము వహించెనో యాకవి విపులముగా వ్యక్తీకరించినాఁడు. కృతిపతివర్ణనములలో ననేకచోట్ల శ్రీకృష్ణదేవరాయలను శ్రీకృష్ణునితో సరిపోల్చి యా కృష్ణుఁడే యీకృష్ణునిగా నవతరించినాఁ డని యా కాలపుకవు లూహించి చేసిన కల్పన లన్నియు నీకావ్యమున మిన్నుముట్టి చెన్ను వహించియున్నవి.

సీ. యాదవత్వమున సింహాసనస్థుఁడు గామి
సింహాసనస్థుఁడై చెన్ను మెఱయ
గొల్లయిల్లాండ్రతోఁ గ్రీడించుటఁ జేసి
పరకామినీసహోదరతఁ జూప
మఱి జరాసుతునకై మఱుఁగుడించుటఁ జేసి
పరదుర్గదుర్గము ల్బలిమిఁ గొనఁగఁ
పారిజాతము నాసపడి పట్టితెచ్చుట
నౌదార్యమున దాని నడుగుపఱుపఁ

తే. గోరి తొలుమేనఁ దనకైన కొదువ లెల్ల
మాన్పుకొన వచ్చి ధరనైకమాన్యలీల
నవతరించిన కృష్ణుఁడౌ ననఁగ మించె
నరసవిభుకృష్ణరాయభూనాయకుండు.

సీ. చక్రవర్తిమహాప్రశస్తి నాఁడును నేఁడు
చెలఁగి ధర్మక్రమస్థితి ఘటించె
భూభృదుద్ధరణవిస్ఫూర్తి నాఁడును నేఁడు
గోరక్షణఖ్యాతిఁ గుదురుపఱిచె

సాధుబృందావనసరణి నాఁడును నేఁడు
వంశానురాగంబు వదలఁ డయ్యె
సత్యభామాభోగసక్తి నాఁడును నేఁడు
నాకల్ప మవని నింపార నిలిపె
తే. నాఁడు నేఁడును యాదవాన్వయమునందు
జనన మందెను వసుదేవ మనుజవిభుని
కృష్ణుఁ డనుపేర నరసేంద్రు కృష్ణదేవ
రాయఁ డనుపేర నాదినారాయణుండు.

పై పద్యములలో తిమ్మన్న శ్రీకృష్ణదేవరాయలను భగవంతుఁడగు శ్రీకృష్ణునితో సరిపోల్చి సామ్యాతిశయములు నిరూపించినట్లు ఆకాలమందలి మఱియొక కవివరుఁడగు చింతలపూఁడి ఎల్లనార్యుఁడు భగవంతుఁడగు శ్రీకృష్ణునే శ్రీకృష్ణదేవరాయనిగ నభివర్ణించి యీసామ్యమును రెండవ విధముగఁ జూపినాఁడు.

క॥ మఱచిరి గృహకృత్యంబులు
మఱచిరి లజ్జాభయములు మఱచిరి మగలన్
మఱచిరి సర్వము గోపిక
లఱిముఱి శ్రీకృష్ణరాయఁ డాత్మఁ గలంపన్.

[శ్రీరాధా మాధవము]

ఈవృత్తాంతమునకు భావనా సమాధానమొక్క యాంధ్రకవులలోనే కాక తత్కాలమందలి కన్నడ కవులలోఁ గూడఁ జూడఁ సచ్చెలువగుచున్నది.

శ్రీకృష్ణదేవరాయల యాజ్ఞానుసారము భారతమందలి పదునొకండవ పర్వము మొదలు సర్వమును కన్నడమునఁ బద్యరూపముగ భాషాంతరీకరించిన కర్ణాటకవి సార్వభౌముఁడగు తిమ్మన్న, శ్రీకృష్ణదేవరాయల యాస్థాన కర్ణాట కవిగానుండి తన గ్రంథావతారికయందు కృష్ణ

రాయుల వంశాభివర్ణనము చేయుచు నాతనిని మహావిష్ణువుతో సమానముగాఁ గీర్తించుచుఁ జెప్పిన పద్యములలో రెంటినిమాత్ర మిటఁ బొందుపఱచెద.

1 మిఱుగుతీవ వరసింధువసనద సెరగ విష్ణు గవసి భూవధు
వొరగిదళుభుజవల్లి నరసయ కృష్ణ భూవర నా
ఎరకవొబ్బిర మేలెయిరలద నరియదే కామినిగె మోసన
నని వరాహాని యప్పుదనె యభిన్నై సిడును చక్రి

2 జనపనరసయా కృష్ణరాయన ఘనజగ్రహానచ్చిగలు సిరహాది
నవరతహారి సిరియు హారలాణె యెనుత శంఖునను
ఘనజఘన చక్రక్కె చక్రవ మిసుగుతిహపంతకె కౌస్తుభ
వను భుజాలింగనకె వనమాలె యను నరిశే వమా.

ముక్కుతిమ్మన్న "వాణీవిలాస" మను వేఱొక ప్రబంధమును రచించినట్లు కూచిమంచి వెంకటాద్రియకవి తన కవిమనోరంజని లేక అప్పకవీయ విమర్శనము, అను గ్రంథమం దుదాహరించెను.

# కథాసంగ్రహము

జనమేజయమహీవల్లభుఁడు హరికథాసుధాస్వాదనపరుఁడై వైశంపాయనముని తోనిట్లు పలికెను. "మునిసత్తమా! మీకృపచే హరివంశకథల నన్నింటిని విని కృతార్థుఁడనైతి. కాని దేవతల బ్రోచుటకు యదువంశమున జనించిన శ్రీకృష్ణుఁడు బృందారకుల కాధారమైన పారిజాతభూరుహమును వారియధీనమునుండి యెట్లు తెచ్చెను? నిలింపులు స్వబుద్ధి నిచ్చిరో, లేక, కేశవుఁడు వారిని బరిభవించి బలవంతముగ దెచ్చెనో యీవిషయము నాకుఁ దేటతెల్లముగఁ జెప్పవే" యని వేఁడుకొనెను. అంత వైశంపాయనుఁ డిట్లని చెప్పఁదొడంగెను.

శ్రీకృష్ణుఁడు నరకాసురుని గెలిచి యూతనిచేలనఁ జెఱలోఁ బెట్టఁబడిన పదునారువేలయప్సరసజాతికన్యలను విడిపించి వారి కోరికపైని వారినందరిని వివాహమాడి తనయెనమండ్రుపట్టమహిషులతో సమానముగఁ బ్రేమించి యుపలాలించుచుం

డెను. ఇట్లయ్యు రుక్మిణీసత్యభామలయెడ యాదవసింహుఁ డెక్కుడనురాగమును గౌరవము నభిమానమును గన్పఱచుచుండినకారణమున వా రిరువురియందును సాపత్న్యభావము హెచ్చి యసహిష్ణుతతో వారొండొరుల నీసడించుకొనుచుండిరి.

ఇట్లుండ నొకనాఁడు శ్రీకృష్ణుఁడు రుక్మిణీగృహమం దామెతో వినోదమున జూదమాడుచుండఁగా నారదమహాముని యాతనినిఁ జూచుటకు నాకలోకమునుండి దిగివచ్చి, సందర్శించి తన చేతనున్న పారిజాతపుష్పము నాతనికిఁ గానుకగా నొసంగెను. అప్పుడు గోవిందుఁ డాకుసుమ మెవ్వరికి నివ్వదగినదో యని కొంచెము యోచించి నారదుని కన్నుసన్నల నగ్గఱనున్న రుక్మిణి చేతిలో నుంచెను. ఆమెయు దానిని కన్నుల నద్దికొని తనకబరీభారంబున ధరించెను. అంత నొక నూతనకాంతి యామె ముఖారవిందమున నావహింప నారదుఁ డాదివ్యకుసుమపు చెలువమును గొనియాడుచు, నదియెన్నఁడును వాడదనియు, సువాసన చెడదనియు రతికాలమున నుల్లాసము గలిగించుననియు, సరసాన్నములను గోరినవెంటనే సమకూర్చుననియు నింక నెన్నియో సుగుణములు గలిగినదనియు చెప్పి, కలహభోజనుఁడు గాన నితరసవతులు విని కోపించుకొనునట్లుగా నామెయొక్క సౌందర్యాతిశయమును వర్ణించి, యెల్లప్పుడును పట్టుపీగుచుండు సత్యభామ యామె కింక సదా లొంగియుండవలసినదే కాని యతిశయింప నోపదని చెప్పి దామోదరునియొద్ద నకలంకభక్తితో నిలచియుండెను. ఈప్రసంగ మంతయు తక్కిన దేవేరుల చెలికత్తెలందఱును విని తమతమ రాణులకు విన్నవించిరి. వారిలో సౌందర్యవతియు మానవతియునైన సత్యభామ తనచెలి చెప్పిన వృత్తాంత మంతయు విని మండిపడి యసూయాపరవశురాలై భూషణములఁ బాఱవైచి, మాసినచీరగట్టి కోపగృహమునఁ బ్రవేశించెను. ఈవిధమగు పర్యవసానముఁ గాఁబోవునని శ్రీకృష్ణుఁడు భావించి యుండుటచే వేవేగమే సత్యభామను శాంతింపఁ జేయుటకుగాను నామె మందిరమునకు రయంబున బోయెను. అచ్చటనున్న దాసదాసీజనముల వైఖరినిబట్టి సత్యభామ కినుక వహించినదని నిశ్చయించుకొని యామెకొఱకు వెతకగా, నలకమందిరముననున్నట్లు కనిపెట్టి, యామెకుఁ దెలియకుండ వెనుకవైపునఁ జేరి, దగ్గఱనున్న తాళవృంతమును గైకొని వీవసాగెను. అంత వాయుసంచలనమున రేగిన పారిజాతకుసుమసౌరభ్యము నాస్వాదించి సత్యవతి కనుదెరచి యిటునటుజూడ ధూర్తగోపాలుఁడు గంటఁబడెను. వెంటనే

నిర్భరమగు యీర్ష్యావేశముచే నామె యేడువసాగెను. కేశవుఁ డామె ననేకవిధముల ననునయించినను ననూయాపిశాచగ్రస్తురాలైన యామె యూరట బొందక తననాథునికి సన్నఁదచ్చి తీవ్రభాషణములనాడి తన సహజచండీస్వభావమును వెడలఁ గ్రక్కెను. ఆ మెమాటలన్నియు విని పారిజాతప్రసూనమే యాకలఁత కంతకుఁ గారణమని తెలిసికొని దామోదరుఁ డామెను పారిజాతవృక్షమును సమూలముగ దేవేంద్రలోకమునుండి తెచ్చి యామె పెరటియందు నాటించెద నని ప్రతిజ్ఞ చేసెను. అంత నామె సంతసించి పతిని గాఢాలింగనసౌఖ్యమునఁ దేల్చి ప్రసన్నురాలయ్యెను. అటుపైన యదునాథుఁడు మజ్జనమాడి నారదుని సహపంక్తిని విందారగించెను. తరువాత నారదుఁడు సెలవుఁ గైకొని నాకలోకమునకుఁ బోవనాయత్తపడుచుండ నరకాసురవిమథనుఁ డాయునిపుంగవునితో నిట్లు పలికెను. "నేను నరకాసురుఁడు హరించిన యదితికుండలములను దాని తిరిగి యాదేవమాత కిచ్చుటకు స్వర్గలోకమునకు రాఁబోవుచున్నాను. ఈవిషయమును దేవేంద్రునకుఁ దెల్పు" డని నారదుని వేఁడికొనెను.

మఱుచటిదినమున సత్యాకృష్ణులు కాలోచితములు దీర్చుకొని గరుత్మంతునిపై నెక్కి దేవేంద్రపురమునకుఁ బ్రయాణమైరి. వీరు రాక మునుపే నారదునివలన నెఱిఁగినవాఁడై సహస్రాక్షుఁడు శచీసమేతుఁడై యెదురేఁగి యుచితసంపత్తుల నర్ఘ్యపాద్యములతో సత్కరించి తనపురమునకుఁ దోడ్కొనిపోయెను. అచ్చట నుపేంద్రుఁ డదితిమహాదేవికి నరకాసురుఁడు హరించిన కుండలములను తిరిగి సమర్పించి ప్రణామము నాచరించి యామె దీవనలఁ బొందెను. తరువాత సాత్రాజితీవాసుదేవులు మజ్జనభోజనాదుల నేడఁదేరి యూర్వశీ రంభా తిలోత్తమాది దేవకామినీపరివృతులై నందనవిహారమునకుఁ బయలుదేఱిరి. ఆనిర్జరోద్యానముననున్న పారిజాతపాదపమునుఁ బొడఁగాంచినతక్షణమే సంతోషముఁ బట్టఁజాలక సత్రాజిత్తనయ యాభూజమునుఁ బెకలించి తమవాహనమున బెట్టికొని ద్వారకకు గొంపోవ భర్తను తొందరపెట్టెను; కాని యదువీరుఁడు వనవిహారాతురుఁడై యామెను వారించి యాదివస మంతయుఁ గ్రీడావినోదములఁ గడపెను. మఱునాఁ డుదయమున దేవేంద్రుని కెఱిఁగింపకయే వనమునకుఁ బోయి వాసుదేవుఁడు పారిజాతమహీరుహమును వేళ్లతోఁగూడఁ బెఱికి గరుత్మంతునిపై నిడి ద్వారవతికి బ్రయాణ మయ్యెఁ.

ను. ఈదుర్ణయమునుఁ జూచి వెరగందిన వనపాలకులు త్వరితగతిని పరువులెత్తి యావద్వృత్తాంతము నమరపతి కెఱిగించిరి. అంత పాకశాసనుఁడు కటకటంబడి, యితరదిక్పాలురను వెంట నిడికొని సమరమునకు డీకొనెను; కాని మురాంతకుని నిర్జింపలేక సమాధానముఁ జేసికొన నంగీకరించి సాగిలపడి శౌరిని వేఁడుకొనెను. అప్పుడు కృపాయత్తచిత్తుఁడై చిత్తజజనకుఁడు వాసవుని తనహస్తములతో లేవదీసి గారవించెను. తరువాత పారిజాతమును పెకొని ద్వారకకు వచ్చి యావృక్షమును సత్యభామపూలతోఁటలోఁ బ్రతిష్ఠించెను.

ఈవృత్తాంతమంతయు నెఱిఁగి నారదుఁడు సత్యాకృష్ణులనుఁ జూడ వేడుక బొడముఁ గ్రమ్మర నేతెంచి సత్యభామతో నిట్లనియె. "నీవీపారిజాతముఁ దెచ్చికొని నీసవతులకంటెను మఱి త్రిభువనేశ్వరియగు శచీదేవికంటెను మహిమోన్నతి నొందినదానవైతివి. కావున నీవు నవితరసాధ్యమును లోకోత్తమమును నగు పుణ్యకవ్రతమును జేయఁదగియున్నదానవు" అని యావ్రతవిధానమును సాకల్యముగ నామెకు నివేదించెను. అంత సత్యాపతి ముని యుపదేశించినరీతినిఁ జేయఁదలంచి వలసినసంభారముల నన్నిటిని దెప్పించి తనతోడిసతులను సవినయముగ నాహ్వానించి సమస్తవైభవములతో యథావిధిగ వ్రతమాచరించెను. తద్వ్రతోద్యాపనఫలముగ తననాథుని నారదమునికి ధారవోసిన నామునిశ్రేష్ఠుఁడు దామోదరునిచే లీలావినోదముగఁ గొన్ని పరిచారికాకృత్యములు చేయించుకొనుచుండ నందఱును యాజగన్నాటకసూత్రధారుని దుర్దశను జూచి నవ్వుచు కేరుచు కేకిసలు గొట్టుచుండిరి. ఇట్లు గొంతసేపానందించినతరువాత సత్యభామ తనసమస్తభూషణములను నారదునకు క్రయమూల్యముగ నిచ్చి శ్రీకృష్ణుని విడిచిపుచ్చుకొనెను. అటు తర్వాత సత్యాకృష్ణులాయుత్సవమునకై వచ్చినవారి నెల్లరను నర్హరీతిని సత్కరించి వారివారి నిలయములకుఁ బంపివేసిరి.

## —• మూ ల క థ. •—

( సంస్కృత హరివంశమునుండి యాంధ్రీకరణము )

పారిజాతాపహరణకథ వ్యాసర్షి రచితమైన మహాభారతమున కనుబంధమగు హరివంశమునందు సంపూర్ణముగ నున్నది. ఇది సుమారు పదునెనిమిదియధ్యాయ

ములలో విపులముగ వర్ణింపఁబడియున్నది. ముక్కుతిమ్మనార్యప్రణీతమైన ప్రబంధకథ హరివంశమందలి మూలకథను భావములయందును భాషయందును నెంతచేరికగా ననుసంధించియున్నదో తెలియుటకుఁగాను మూలకథను సంస్కృతమునుండి సాధ్యమైనంతవఱకు వ్యాసోక్తములున్నట్లే తెనిఁగించి యిటఁ బొందుపఱచుచున్నాను. పాఠకమహాశయులు ఈమూలకథతో ప్రబంధకథను సరిపోల్చి సామ్యభేదముల నన్నిటిని తామె గుర్తించుకొనఁగలుగుటకు మూలకథయందలి ముఖ్యభాగములను ఇంచుకయైనను విడువకుండ యథోక్తముగ ననువదించియున్నాను. విమర్శనకార్యములందు విపులవిచారములు పనికిరావు. విషయము యథాన్యాయముగ పరిశీలించినఁగాని యభిప్రాయముల నిచ్చుట సక్రమమైనకార్యము గాదు. కావునఁ జాలవఱకు శ్రమపడి దీర్ఘమైన మూలకథాభాగమునంతను నిచ్చోటఁ జేర్చవలసిన కారణము కలిగినది. పండితలోకము నిర్దుష్టమగు మత్ప్రస్తుత మదీయ ననువాదమునఁ దప్పు దలంపకుందురుగాక !

** నరకాసురుని బరిమార్చిన తరువాత నాతనిచే బంధీకృతులైన పదునారు వేల అప్సరసకన్యలను చెఱనుండి శ్రీకృష్ణుఁడు విడిపించెను. వారు పద్మలోచనునిఁ జూచినతక్షణమే మోహించి వానియందు బద్ధానురాగులైరి. శౌరియు వారినిఁ జూచి సుముఖుఁడుగా నుండెను. అప్పుడు వారందరుఁ బూర్వము నారదమహాముని చెప్పిన వచనములను జ్ఞాపకము తెచ్చుకొని వాసుదేవునితో నిట్లనిరి. 'పూర్వము నారదుఁడు మహామునుల యెదుట మాతో నిట్లు చెప్పెను. శంఖచక్రగదాధరుఁడైన నారాయణుఁడు నరకాసురుని వధించి మీకు భర్త యగును.' అప్రియకార్య మిప్పుడు మేము కన్నులారఁ జూచుచున్నాము. మిమ్ములను జూడఁగానే మేము కృతార్థులమైతిమి. ఈమాటలను శ్రీకృష్ణుఁడు విని వారి నందఱిని ప్రియవాక్యములతో సాంత్వనముఁజేసి వారి వారి యథోచితప్రకారము పూజించి, శిబికాందోళికలలో వారి నెక్కించి ద్వారకకుఁ బంపెను. * అటుతర్వాత సత్యభామాసమేతుఁడై శ్రీకృష్ణుఁడు దేవేంద్రునివీటి కరిగెను. శచీసహితముగ దేవేంద్రుఁడు వారి నెదుర్కొని

* ఈ పదునారువేలకన్యలను శ్రీకృష్ణుఁడు వివాహము చేసికొనినట్లు మూలగ్రంథములలో నిచ్చట సూచింపబడలేదు. ఆయన వారి నందఱిని ప్రీతివాక్యములతో బంపినట్లు మాత్రమేయున్నది.

తనపట్టణములోనికిఁ బ్రవేశింపఁజేసెను. అచ్చట సత్యభామాశ్రీకృష్ణులు అదితిమహాదేవిని దర్శించి తాము నరకాసురుని జంపి తీసికొనివచ్చిన మకరకుండలములను తిరిగి యామెకు సమర్పించిరి. ఆమె చాల సంతసించి దేవేంద్రోపేంద్రులను దీవించి సత్యభామ నాశీర్వదించెను. అటుతర్వాత సత్యాకృష్ణులు దేవేంద్రుని క్రీడోద్యానమైన నందనవనములోని మూలఁ జూడఁగా యందున్న పారిజాతభూరుహమును పెకలించి గరుడునిపై నిడి ద్వారకకు ప్రయాణము సాగించిరి. ఆవిషయము దేవేంద్రుఁడు విని కార్యము జరిగినది గదాయని యనుమతించెను. సత్యభామాకృష్ణులు ద్వారకలోనికిఁ బ్రవేశించిరి. (ఇది మహాభారతమునందలి ఖిలములలోని హరివంశమందలి విష్ణుపర్వమున పారిజాతాపహరణ ద్వారకాప్రవేశ మనఁబడు యధ్యాయము ముగిసినది.)

జనమేజయుఁ డిట్లనుచున్నాఁడు "ఓ వైశంపాయనా! మునుదానగరము లోని శ్రీకృష్ణునిచర్య లన్నిటిని విని సంతోషించితిని. ద్వారకయందు కృతోద్వాహుఁడైన శ్రీకృష్ణునిచరితమును వినఁగోరెదను. కనుకంతయుఁ దెలియునుగాన నాకు నివేదింపఁ బ్రార్థించుచున్నాను." వైశంపాయనుఁ డిట్లుఁ జెప్పఁదొడంగెను. "జనమేజయా! కృతదారుఁడైన దామోదరుఁ డొకనాఁడు రుక్మిణీదేవితోఁగూడ రైవతకాద్రికిఁ బోయి యచ్చట వారిద్దఱు నుపవాసదీక్షఁ బూనిరి. ఉపవాసానంతరము వారు తమ బంధుమిత్రపరివారమును, పదునాఱువేల స్త్రీలను ద్వారకనుండి రావించి ద్విజు లందఱికిని బుష్కలముగా సమారాధనముఁ జేసిరి. ఆసమయమున నారదుఁడు వారియొద్దకేతెంచఁగా కృష్ణుఁ డాతనిని శ్రేష్ఠముగ యథాశాస్త్రముగ నర్చించెను. అప్పు డాముని శ్రీకృష్ణునిచేతిలో నొక పారిజాతపుష్పమును బెట్టెను. ఆసమయమున రుక్మిణీదేవి పక్కనుండుటచే నాపుష్పము నామెకొసంగుట యోగ్యకరా లయినది గాన దాని నామె చేతిలో శ్రీకృష్ణుఁ డిడెను. సపత్నియొక్క ఆధిక్యము గాంచి సాగముగ నామె కూపస్నానమును విని తెలియుంగుఁ దాల్చెను. త్రైలోక్యమోహనస్వామిలోను నారాయణుని మనోహారిణియైన యామె యాపుష్పధారణచే ద్విగుణీకృతశోభఁ బొందినది. అంతట బ్రహ్మమానసపుత్రుఁడగు నారదుఁడు పుష్పమహిమ నీవిధముగ వర్ణించెను.

"ఓ పతివ్రతా ! ఈపువ్వు నీకుమాత్రమే యోగ్యమైనది. నీసంసర్గమువలన యిది యొక యలంకారమైనది. ఓ కల్యాణీ ! ఓ భర్తృవత్సలా! ఈపూవు నీయొక్క ఆదరణకు అర్హమైన దని నా తలంపు. ఇది యొక సంవత్సరమువఱకు వాడిపోవక వికసించియే యుండును. నీవు కోరినపరిమళముల నిచ్చును శీతోష్ణములను నీయిష్టానుసారముగా నిచ్చును. మనకుఁ గావలసిన ప్రశస్తమైన రసములను స్రవించుచుండును. ధరించినప్పుడు సౌభాగ్యములు గలిగించి ప్రతిష్ఠనీయులైన సుగంధములను బ్రసవించును. నీవు ఏయేపుష్పములను గోరుదువో యాయాపుష్పముల నొసఁగూర్చును. దీనిని ధరించుటచేత నైశ్వర్యము, పుత్రోదయము, శుచియైన మతియుఁ గలుగును. ఏయేరంగులను గోరుదువో యాయారంగులను నీవు ధరించఁగలవు. చిన్నవియు పెద్దవియు నీవు గోరినట్లు నీకుఁ గలుగును. అనిష్టగంధహారకమును, సుగంధవర్ధనమును, రాత్రియందుఁ బ్రదీపనమును నీపుష్పము చేయును. సంతానకకుసుమమాలలను, పుష్పవస్త్రాదులను, పరిమళాభరణములను వలఁచినయాకారముగల నివ్వఁగలదు. ఆఁకలియు, దప్పియు, నలఁటయు, ముదిమియు దేవతలకువలెనే దీనిమూలమున నీవును స్వేచ్ఛగా భరింపఁగలవు. అనుగీతములను, గీతములను, మధురమైన సువాదిత్రములనుగూడ నీయిష్టప్రకారము పొందఁగలవు. ఒకసంవత్సరమైనతరువాత నీపుష్పములు తిరిగి స్వస్థానమునకుఁ బోఁగలవు. ఆగడువులోపల మాత్రము నిన్ను వీడవు. ఇట్టిదియే దీనిమంగళప్రదములైన కార్యములు. ఇది దేవతలకు సమస్తమైన సత్కారములను నైసర్గికముగానే యిచ్చును. పరమేశ్వరి యగు ఉమాదేవియు నిత్యమీ పూవులను ధరించును. అట్లే యదితియు, శచియు, సావిత్రియు, లక్ష్మియు యితరదేవపత్నులును దేవతలును, వసుదేవతలును [illegible] వఱకు మిఱియే. పదునారువేలస్త్రీలమధ్య నీవు నిశ్చయముగ కృష్ణుని ప్రియురాలవుగాఁ దెలుసుకొనుచున్నాను. నీసపత్నులందఱు నవమానమునఁ బూర్తిగా మునిఁగియుందురు. ఈమందారకుసుమమును మధుసూదనుఁడు నీకిచ్చుటచే నసమానమైన సౌభాగ్యమున నీకీర్తి ప్రకాశించుచున్నది. ఈలోకమున సత్యభామయు నీయితరసవతులును నీసౌభాగ్యకాంతులై యుండియు నిష్ప్రభు లగుదురు. సౌభాగ్యమున నీయొక్క తేనే చైత్రరథముగ నడచుచుందువు. ముల్లోకములలోను ప్రశస్తమైన యీపూవును నీకిచ్చినకతన నీవు శ్రీకృష్ణునిద్వితీయాత్మ యని యిప్పుడు నేను దెలిసికొంటిని. జీవితముయొక్క యతిశయమును నీవు నొందఁగలిగితివి."

ఇట్లు నారదుఁడు బలికినవాక్యములను సత్యభామ పంపిన చెలికత్తెలు వినిరి. అట్లే యితరమహిషుల పరిచారికలును, స్త్రీస్వభావప్రకారము, విని కనిన విషయముల నన్నిటిని అంతఃపురమందు వెల్లడిచేసిరి. కర్ణాకర్ణిగ నీవిషయములను దెలిసికొని దేవేరులందఱు వారిలో వారు రుక్మిణీదేవి జ్యేష్ఠురాలగుటచేతను, పుత్రవతి యగుటచేతను యిట్టి యనన్యసౌభాగ్యమున కర్హురాలని నిశ్చయించుకొని యూరకుండిరి. సత్యభామమాత్రము తనరూపయౌవనసంపన్నతకును సౌభాగ్యాతిశయమునకు గర్వితురాలై యభిమానాతిష్ఠురాలగుటచే నీవృత్తాంతములు విని యీర్ష్యావేశమును బొందినది. కుంకుమవర్ణముగల తనచీరను విడచిపెట్టి తెలివెన్నెలవలె శుద్ధధావళ్యమునకొప్పు యొక తెల్లనిమడుపునుగట్టి, యింధనములవల్ల మండుచుండిన యగ్నివలె కోపాకులితచేతస్కురాలై ప్రజ్వరిల్లుచుండిన పావకజ్వాలవలె మాత్సర్యసమృద్ధికారణమున దందహ్యమానురాలై, సజలమగు మేఘమందు ప్రవేశించెడు తారవలె వివిక్తమైన కోపగృహములోఁ బ్రవేశించెను. ప్రియునిమీద కోపచిహ్నమైనదియు హిమచంద్రునివలె తెల్లనైనదియునగు దుకూలపట్టమును లలాటమందు ధరించి తనమట్టును ఆర్ద్రాలోహితచందనముతో నలికి ముహుర్ముహుఃకోపశమనాలోచనములతోఁ బలవరించుచుఁ గూర్చొని, కొప్పు ముడివేసికొని, ఆభరణములను బిస్కిచుట్టును విసరివేసి పరిచారికల నకారణముగ కసరి కొట్టుచుఁ దనచేతనున్న తామరపుష్పమునుఁ దుత్తునియలుగఁ జిదిపివేయుచు, దీర్ఘమగు నిట్టూర్పులను విడుచుచు నామె పాన్పుపైని పవ్వళించియుండెను.

రుక్మిణీదేవి ప్రాంగణమున నారదముని సమాసీనుఁడైయుండఁ శ్రీకృష్ణుఁ డొకనెపముఁ గల్పించుకొని యచ్చటినుండి బయలువెడలెను. సత్వరముగ సత్యభామగృహముఁ జేరి భీతభీతముగ మెల్లమెల్లగ లోనికి బ్రవేశించి, సేవకుని ద్వారమందు నిలిపి, నారదునికి సపర్యలు చేయుటకు ప్రద్యుమ్నుని నియోగించి క్రోధఘూర్ణితురాలైన ప్రియురాలినిఁ జూచెను. ఆమె వేషమున దాసివలెయుండి కోపమునఁ దఱచు నిట్టూర్పు లెగయుచుఁ, జేతనున్న పద్మమును ముఖపద్మమున నదుముకొనుచు, నప్పుడప్పుడు తనలోఁదాను నవ్వుకొనుచు, కాలివ్రేళ్ళతో నేలమీఁద వ్రాయుచు ముఖము వెనుకకుఁ ద్రిప్పి నడచుచు, ఒకప్పుడు ముఖపద్మము హస్తపద్మమం దిడికొనుచు, పరిచారికచేతినుండి రక్తచందనరసమును దీసికొని వినోద

లును, మహారాజతేవసనములుమాత్రమే యిష్టము గదా! శ్వేతవస్త్రములను స్త్రీలు దేవతార్చనసమయమునందు తప్ప కట్టనొల్లరు. నీ శరీర మేల యనలంకృతముగా నున్నది? ఓ శోభనహీనగాత్రీ! నీవేల చిత్రికస్థాన మాక్రమించి యున్నావు? (అనఁగాఁ గన్నీళ్ళచే శరీరమంతయుఁ జాలువడి యున్నది.) ఏల ధవళాచ్ఛాదిత పాదపద్మయోమనోహరీ! నీలలాటమునందు పరిమళమిళితచందనమును ధరించియున్నావు? ఏల సాంద్రమైన కాంతిచే నీముఖము ప్రభాయుతముగాక యున్నది? నన్ను పరీక్షించుటకో లేక నామనస్సునకు శ్రమ గలిగించుటకో యిట్లుఁ జేయుచున్నావా? నీ కపోలయుగ్మమునుండి జాఱుచుండిన చందనరసము పత్త్రలేఖనాచాపల్యమును జూపుచున్నదగాని శోభిల్లుటలేదు. నగలను రత్నాభరణములులేక యున్ననీ గ్రహనక్షత్రరహితమైన యస్తమితచంద్రమండలి గగనమువలె కళావిహీనముగ నున్నది. ఓయుత్పలగంధి ప్రార్థించుచున్నను ఉపేక్షింతువు నీమోము మొలకనవ్వు వహించి యేల నన్ను పలుకరించవు? అర్ధక్షణమైనను యేల నన్ను చూడవు? ఏల నిశ్వాససహితమైన కాటుకనీటిని సతతము కార్చుచున్నావు? ఓ ఇందీవరశ్యామా! నీవేడ్చుచుండుట యిక చాలును. ఇంక నంజనకల్మషమైనదియు ముఖకాంతికి శత్రువైనదియు నగు కంటినీటిని కార్చవద్దు. నేను నీకింకరుఁడనని జగతియందుఁ బ్రఖ్యాతినొందియే యున్నానుగదా. ఆసంగతి ముందుగనే నాకేల జ్ఞాపకము చేసితివిగావు? నీకేమి యప్రియమైనపని నేను చేసితినో? ఏల యతిమాత్రముగ నిన్నిట్లాయాసము పెట్టుకొనుచున్నావు? మనోవాక్కర్మలచే నేనెన్నఁడును నిన్నతిక్రమింపను గదా! ఇట్లు సత్యమునే బలుకుచున్నాను. మదాదరణయోగ్యులగు స్త్రీలందఱిలోను నీయందు తప్ప స్నేహమును, బహుమానమును తక్కినవారియందు లేవు. నేను మరణించినను నీమీఁద యాతురత నన్ను విడచిపెట్టదు. ఇది నానిశ్చితాభిప్రాయము. మేదినియందు క్షమాదిగుణములును, ఆకాశమందు శబ్దాదిగుణములును యెట్లు సహజములో యట్లే నీయందు నాప్రేమయు సహజమే. ఇది ధ్రువము. అగ్నియందు కాంతియు, దివాకరునియందు దివ్యప్రభయు, చంద్రునియందు శాశ్వతమైనచంద్రిక జ్యోతియు నెట్లు సహజములో యట్లే నీయందు నాప్రేమయు.''

ఈవిధముగఁ బలుకుచున్న తనప్రియుఁడగు జనార్దనునితో, గన్నులు కార్చుచునే మెల్లమెల్లగ నామానిని మాట్లాడ మొదలిడెను. ''ఓప్రభో! నీవు నావాఁడ

వనియే యిదివరలో నెల్లప్పుడును తలంచుచుంటిని గాని యిప్పుడుమాత్రము నీయం దలి సాధారణమైనస్నేహమునే పొందగలిగితిని. ఇట్టి నీస్నేహ మనిత్యమనియు కాల విపర్యయముతోఁ గూడినదనియు నేను వెనుక నెఱిఁగియుండలేదు. ఇప్పుడు మాత్ర ము లోకగతి నమ్మదగినదిగాదని సంపూర్ణముగాఁ దెలిసికొంటిని. నిన్నుతప్ప వేఱు విషయము నేనెట్లెఱుఁగనో యట్లే నీవును నన్నుతప్ప వేఱుయువతిని యెఱుగవని యూహించుకొంటిని. ఇప్పుడు నీనిజహృదయము తెలిసినది. నీది వాఙ్మాత్రమాధు ర్యమని చూడఁగలిగితిని. నామీఁదిప్రేమ కృత్రిమము. ఇతరత్రప్రేమ కృత్రిమము కాదు. నీవు కైతవవృత్తియందుంటివి. అయినను నేను ఋజుస్వభావముకలదాన ననియు భక్తురాలననియు నెఱిఁగియేయున్నావు. ఇప్పటికిగదా చూడవలసినదంత యు పూర్తిగాఁ జూచితిని, వినవలసినదానిని బూర్తిగా వింటిని. నాస్నేహము యొక్క ఫలోదయముకూడ యిప్పటికి గాన్పించినది. నీవు నన్ననుగ్రహించదలచిన యనుగ్రహింపుము నేను తపస్సుచేయుటకు నిశ్చయముగా వెడలనైయున్నాను. భర్తయొక్క యాజ్ఞతోనే స్త్రీలకు తపోవ్రతాచరణమునకు నర్హతయున్నది. అట్టి యాజ్ఞలేనియెడల నాయాక్రియలువారికి నిష్ఫలములు" ఈవిధముగ బలికి యాదేవి మిగిడి కన్నీళ్లు ధారలుగా విడుచుచు శ్రీహరియొక్క పీతాంబరపుకొంగుబట్టికొని ముఖము కప్పుకొనినది. అటుపైన శ్రీకృష్ణుఁ డాప్రియకోపనగూర్చి యిట్లు భా షించెను. "ఓకమలలోచనా! నీశోకము నాసర్వాంగములను దహించుచున్నది. నిన్నిట్లు వేధించుచున్న కారణ మెద్దియో జెప్పుము. నాప్రాణములతోడు. నీకు సుఖము గలిగించునదియు నగుదానిని నాకుఁ జెప్పుము." అంతట సత్యభామ రోద నము చేయుచుఁ దలవాల్చి గద్గదస్వరముతో భర్త కిట్లు బ్రత్యుత్తర మొసఁగెను. "ముల్లోకములందును నాసౌభాగ్యము నీచేతనే నాటబడినది నేను సమస్తస్త్రీజనమందు ను తలయెత్తుకొని గణనీయత బొందియున్నాను. అట్టి నే నిప్పుడు సవతులందఱిమధ్యను జనులందఱిమధ్యను అపహాస్యమునకు గుఱియైతిని. ఇది యెంతయు నాచెలికత్తెలు జెప్పుకొనుచుండఁగా వింటిని. అది నిజమే. ఏలయనఁగా నారదుఁ డిచ్చిన పారి జాతకుసుమమును నన్ను విడచి నీయిష్టజనుల కిచ్చితివిగాన నవరత్నములకంటె నెక్కుడైనవస్తువు నామె కిచ్చితివి సరే! అట్లుచేసి నీస్నేహమును బహుమానమును స్పష్టపరచితివి. నీయెదుట నారదుఁడు నీప్రియురాలినిఁ బొగడినాఁడు. సరే!

అది యంతయు నీవు చూచియు వినియు యానందించితివి, సరే! నీసమక్షమున నా మెప్పొగడ్తను నారదుఁడు వినిపించెను. కాని యచ్చట యీదౌర్భాగ్యురాలి విషయ మెందుకు వచ్చినది? ప్రణయగసము మొదట యిచ్చి తరువాత మనస్సునకు తాపము గలుగఁజేయుటకంటె నాకు తపస్సు చేసికొనుట కధికారము ప్రసాదింపుము. స్వప్నమందైన నిట్లు జరుగునని యూహింపనైతిని. అది యంతయు నిప్పుడు నీవు జూచుచుండఁగానే జరిగినది, నేనును వింటిని. నారదుఁడామెను దన యిష్టము వచ్చినట్లు స్తుతింపవచ్చును. నీ పచ్చటనుండి వినుచుండుట నాకు విచారము కలుగఁజేయుచున్నది. సజ్జనులు పరార్థమే యీలోకమున జీవింతురని నీవు చెప్పినమాటయేగదా. కావున మానవర్జితమైన జీవితమును జీవింపనొల్లను. ఎవరు నాకు రక్షకులో వారె నాకు భయంకారకులైనారు. పుట్టుకనుండియు నన్ను రక్షించినవారు యిప్పుడు నన్ను కాపాడుటకు లేరుగదా! నీవు నన్ను త్యజించుటచే నా గతి యిటుపైని యేమి కాఁగలదో నాకుఁ దెలియకున్నది. నిశ్చయముగ కుముద్వతి గతినే నేనును పొందఁబోవుచున్నాను. నీకుఁ బ్రియురాలిగానుండి యిప్పుడప్రియురాలి నగుటకు నజ్ఞానమున దేవతల కెగ్గేమి యొనరించితినో? నీప్రియురాలిగానుండి యాప్రేమగోల్పోయిన నేను వసంతకుసుమచిత్రితమైన రైవతకాద్రి నెట్లు చూడఁగలను? పరిపుష్పితవనమిళితపుష్పగంధవాహుఁడగు మలయమారుతమును నీకు ద్వేషినైదౌర్భాగ్యురాలనైన నే నెట్లాస్వాదింపఁగలను? నీయంకస్థలమునుండి మహోదధియందు జలక్రీడలాడిన నేను యీదౌర్భాగ్యస్థితిలో మరల సాగరము నెట్లుఁ జూడఁగలను? ఓసాత్రాజితీ! నీవుతప్ప నాకు ప్రియతరమైనవారు లేరని తెలిసికొనుమా యని యెన్నిసారులో జెప్పియుంటివి. ఆమాట లిప్పు డెచ్చటికిఁ బోయినవి? ఎవరు జ్ఞాపక ముంచుకొందురు? అత్తమామలచే మన్ననలొందిననేను నీయవజ్ఞకారణమున దౌర్భాగ్యదశలోనున్న రాజ్ఞినై యుందును. ఓమానదాతయైన ప్రియుఁడా! నీవు నన్ను నిత్యము జనులయెదుట నభిమానమున జూడనియెడల నా గూఢమైనదియు సుస్నిగ్ధమైనదియునగు ప్రేమ యేమిలాభము? ఇదివరలో నిన్ను ధూర్తుఁడనియుఁ గపటియనియుఁ దెలిసికొనియుండలేదు. ఇప్పుడు చంచలుఁడవనియు జనవంచకుఁడవనియు నెఱిఁగియుంటిని. స్వరవర్ణేంగితాకారములయందు సప్రి

యత్నముగ నిగూఢుఁడైయున్న నీవు చోరుఁడవనియు, వాఙ్మాత్రధుర్యమాత్రుఁడ వనియు, శఠుఁడవనియుఁ దెలిసికొంటిని."

ఇట్లు ఈర్ష్యాకులరాలై యభిమానవతియునై ప్రలాపించుచున్న సత్రాజిత్తనయను శ్రీకృష్ణుఁడు సాంత్వనము చేయుటకై యిట్లు పలుకఁదొడంగెను.

"ఓ ప్రాణేశ్వరి! ఓ పద్మదళాక్షీ! ఏల యింత యెక్కువగా మాట్లాడె దవు? నేను నీవాఁడ నగుచే నేఁగియుందును. అక్లిష్టకర్మకర్తయగు నారదమునీశ్వరుఁడు తెచ్చియిచ్చిన పారిజాతసుమమును భోజకన్య నా ప్రోల నుండుటచేత దాక్షిణ్యమునను దానామె కొసంగినమాట నిజమే. ఇది క్షంతవ్యమైన యపరాధముగాన దీనిని మన్నింపుము. నీకు పారిజాతసుమములు కావలసినయెడల తప్పక నీ కిచ్చెదను. నామాటలు సత్యమే యని గ్రహింపుము. స్వర్గమునుండి పారిజాతవృక్షమును దెచ్చి నీగృహమున నీచిత్తము వచ్చినంతకాలము నాటియుంచెదను." ఇట్లు శ్రీహరి పలుకఁగా హరివల్లభ యాయనతో నిట్లు వచించెను. పారిజాతతరువు నిచ్చుటకుఁ దెచ్చుటకు శక్యమైనయెడల నాకోప ముజ్జగించి యనేకరెట్లు సంతోషమును బొందెదను. సమస్తమైన సీమంతినులలోను నేనే యధికురాలుగా నుండెదను. ఆమాటలకు మురారి "ఈముఖ్యమైన సాంత్వనోపాయము నెఱవేఱు గాక!" యని యాశీర్వదించెను.

ఈ ప్రసంగము పూర్తియైనతర్వాత సత్యభామ నారదునికి దధిస్నానమును, నవిభునకు జలస్నానమును చేయించి యుభయులను పరమాన్నమృష్టాన్నములతో సంతృప్తిపఱచెను. భోజనానంతరమున నారదునికామె సాష్టాంగదండప్రణామము నాచరించిన నామునిప్రవరుఁ డామెను నిత్యసౌభాగ్యవతిగా నుండుమని దీవించెను. టుతర్వాత నారదదామోదరుల యాజ్ఞలఁగైకొని యామె యంతర్గృహమునకుఁ బోయెను. నారదుఁడు మాధవునిపార్శ్వమం దుండి తాను దేవలోకమున కరుగుచున్నా ననియు, వెనుకటిదినముననే పారిజాతపుష్పప్రదానానంతరమున నామహాపురుషుని యాజ్ఞ ప్రతిప్రయాణమునకుఁ గైకొనినా ననియుఁ దెల్పెను. అంతటఁ బ్రాసంగిక

చర్చింపఁబట్టెను. అతఁడు స్త్రీలంపటుఁ డని మూఁడులోకములు నెఱిఁగిన విషయమే. అల్పమైన స్త్రీవాంఛితము నెఱవేర్చుటకుగాను పారిజాతమును భూలోకమునకుఁ గొంపోయినయెడల మనుష్యు లందరు స్వర్గసుఖము లనుభవించి యజ్ఞాదికర్మలను చేయక దేవతలతో సమాను లగుదురు. విరించిసృష్టికి చాలవిపర్యయము సంభవించును. అది యొకకారణము. రెండవవిషయము; శ్రీకృష్ణుఁడు నాకుఁ దమ్ముఁ డగుటచే యాతని కోరిక నీడేర్పఁదగిన దని చెప్పినహేతువు. ఇదివఱలో ననేకసారు లాతనిని కరుణించి సహాయము చేసితిని. కాని యాతనియతిశయము హెచ్చుచునే యున్నది. ఖాండవదహనమందును, గోవర్ధనోద్ధరణమందును యింకెన్నియో సమయములం దాతనికి నేను బాసటనై యమితమైన మేలు గావించితిని. కాని యాతఁ డెప్పుడును నాకు వెనుకవెనుక నవమానమునే చేయుచుండెను. కాఁబట్టి నారదా! నీవు పోయి యాతఁడు యుద్ధమునకు రాఁ దలఁచుకొనిన రావచ్చు నని ఖండితముగాఁ జెప్పుము. పారిజాతమును దేవేంద్రుఁ డెన్నఁడును విడిచిపెట్టఁడు" అను నాసీరుని యాగ్రహపూరితమైన మాటలు విని నారదుఁడు "అమరవల్లభా! నీ కేమోహిలాషమైన నే నప్రియమైనను హితమైనవాక్యమునే చెప్పవలసియున్నది. కేశవుఁడు విష్ణ్వంశసంభూతుఁడు. అనేకావతారము లెత్తి ముల్లోకములను బాలించుచున్నాఁడు. మీ సోదరులద్దతికిని కయ్యము న్యాయము కాదు. ఎట్లయినను మురాంతకుఁడు పారిజాతము నవశ్య మెత్తుకొని పోఁగలఁడు." అనెను. అంతట బలారి "స్వల్పకారణమునకు సురభూరుహమును త్రిదశేంద్రుఁ డొసఁగరా దని మునుపు పెద్దలచే శాసింపఁబడినదిగాన, దానికి విరుద్ధముగ నాచేఁ జేయఁ జెల్లఁ దని కృష్ణునకు నివేదింపుడు." అనెను. ఆపలుకులు విని నారదుఁడు కుశస్థలియందు నివసించియున్న కృష్ణునియొద్ద కేతెంచి దేవేంద్రుఁడు పలికినపలుకులన్నియు తేటతెల్లముగాఁ దెల్పెను. ఆమాట లన్నిటిని విని కేశవుఁడు నారదునితో సముపస్థితమునకుఁ బోయి యచ్చటఁ గొంతతడవు విహరించి, "ఎల్లి నమరావతికిఁ బయన మేర్పాటు చేయుచున్నా" నని యింద్రునికిఁ దెలియఁజేయు డని ముని కానతిచ్చెను.

అచ్చట నమరపురమున శక్రనారదసంభాషణము ముగిసిన తర్వాత బృహస్పతి వచ్చి యమరనాయకుని దర్శింపగ నాతఁడు నారదదౌత్యమునంతయు నాదేవమంత్రి.

కరిగించెను. బృహస్పతియుఁ గొండొకసేపు విచారించి గతకార్యమునకు జాల వగచి దేవేంద్రుడు తొందరపడి నిర్ణయించిన కార్యము శ్రేయస్కరము గాదని నిమకుకొని, అయినను యిప్పుడన్నివిధముల కృష్ణునితోఁ బోరుటయే లెస్సయని సలహా యిచ్చి తాను క్షీరసముద్రములో తపస్సు చేయుచున్న కశ్యపమహాముని యొద్దకు బోయి ఇంద్రోపేంద్రులకుఁ జరుగనై యున్న రణకారణము నివేదించెను. అంత కశ్యపుడు తా నదితిమహాదేవిని వెంటదీసికొని యుద్ధనివారణార్థము వచ్చెదనని ఖరారు చేసెను.

మరునాఁ డుదయాత్పూర్వమే శ్రీకృష్ణుడు లేచి మ్రాగ్పూర్వప్రదేశమున రైవతకాద్రికిఁ బోయి దారుకునితో రథమాయత్తపరుపుమని చెప్పి తానును సాత్యకియు గరుడునిపైఁ గూర్చుని ప్రద్యుమ్నుని దారుకుని రథముపై వెనువెంటరమ్మని నియోగించి అమరావతికిఁ బ్రయాణమయ్యెను. దేవేంద్రోపేంద్రుల కనేకదినములు ఘోరసంగ్రామము సంఘటిల్లెను. అన్యోన్యవిజిగీషులై యనేకాస్త్రముల ప్రయోగించిరి గాని యొకరినొకరు జయింపలేకపోయిరి. ముల్లోకములు గడగడ వడంకసాగినవి. ప్రజలు హాహాకారమున యథాయగలగుచుండిరి. అట్టి దుస్థితిఁ జూచి బ్రహ్మదేవుడు కశ్యప మహర్షి యొద్దకేఁగి ప్రశాంతిపన కారణముఁ జెప్పి సన్నివారణము జేయుమని వేడికొనెను. కశ్యపుడు అదితిని తోడ్కొని అమరావతికి వచ్చి యుద్ధము జేయుచున్న పుత్రులం జూచెను. దేవమాతయగు అదితి వారిద్దరి మధ్యను నిలచి తనరెండు చేతులతో వారిద్దరిని పట్టుకొని "తనయులారా! మీ కీతగవు తగినది కాదు. నాకిద్దరు కుమారులే యున్నారు. వారిద్దరును ఒకరినొకరు చంపుటకు కృతనిశ్చయులై పోరుచుండిన నాకేమిగతి? కావున నే జెప్పినట్లు మీరిద్దరు నడచుకొనుట ధర్మపద్ధతియగు" నని శాంతపరచి "నా చిన్నకోడలగు సత్యాభామామణి పుణ్యకవ్రత మాచరింపనై యున్నది గాన తద్వ్రతసమారాధనమునకై పారిజాతము ప్రతిష్ఠగలుగునట్లు అనగా ఒక సంవత్సరమువరకు ఆమెయొద్ద నుండుటకును తదుపరి యావృక్షము తిరిగి దేవేంద్రుని వీటికే వచ్చుటకును నేను శాసించితిని గాన నట్లు జరుగవలెనని యాజ్ఞాపించెను. తల్లిమాట శిరసా వహించి యిద్దరును యుద్ధము విరమించిరి. పారిజాతమును కృష్ణుడు ద్వారకకు గొంపోయి సత్యభామయింట నిల్పెను.

అటుతర్వాత పుణ్యకవ్రతాచరణమునకు శ్రీహరి నారదుని తలచిన మాత్రమున నామునితల్లజుఁడు ప్రత్యక్షమయ్యెను. అతఁడు ప్రతిగ్రహార్థము వేడికొనబడి

చరించుచున్నది. కథాకథనమందలి రసికత మూలానుసరణమున విదితమగుచున్నది.

మూలగ్రంథమున పారిజాతాపహరణకథ రెండువిధములుగా నున్నట్లు నేనిచ్చిన కథాసంగ్రహమును జదివిన స్పష్టమగును:—

i. నరకాసురుని వధానంతరము సత్యభామా శ్రీకృష్ణులు సూటిగ నింద్రపురమునకుబోయి తాము దెచ్చిన మకరకుండలములను అదితి మహాదేవికి సమర్పించి నందనవనములోనున్న పారిజాతవృక్షమును స్వాతంత్రించి పెకలించుకొని ద్వారకకు గొనిపోవుచుండగా వాసవు డాసంగతి వినినను యంగీకరించి యూరకుండెను.

ii. నరకాసురుని వధానంతరము ద్వారకలోనున్న శ్రీకృష్ణుం డొకనాడు రుక్మిణీ సహితముగా రైవతకపర్వతమున నుపవాసదీక్ష నుండిన యవసరమున నారదుడటకు జనుదెంచి పారిజాత కుసుమమును శ్రీకృష్ణున కిచ్చుటయు, యద్దానిని కృష్ణుడు రుక్మిణీదేవి కిచ్చుటయు, యీ విషయమును సత్యభామ తెలిసికొని కోపించుటయు, శ్రీహరి యామెను సమాశ్వాసించుటకై పారిజాతవృక్షమును దెత్తునని ప్రతిజ్ఞచేయుటయు, తత్ప్రతిజ్ఞానుసారము శ్రీకృష్ణుడు ప్రద్యుమ్న సాత్యకులతో దేవేంద్రునివద్దకుబోయి యాతనితో యుద్ధముచేసి పారిజాత వృక్షమును దీసుకొని వచ్చుటయు, అటుతర్వాత సత్యభామ పుణ్యక వ్రతమాచరించుటయు—ఇట్లున్నది. ఈవిధముగ మూలమునందే యీకథ ద్వైవిధ్యము చూపించుటచేగాబోలు ముక్కుతిమ్మన్న మొట్టమొదటనే తన ప్రబంధమున "అనుమతినిచ్చికో యీవేల్పులొండేని బలిమిచేకొని యెనో పాడిదొరగి" యని రెండువిధములైన మార్గములను సూచింపవలసివచ్చెను. కాని తా నేయొక్కదానిని ప్రత్యేకముగా ననుసరింపక రెంటిని సమన్వయముచేసి మధ్యమార్గమున బోయి తన గ్రంథ

మును రచించెను. మొదటి విధానమందలి సత్యభామానునయనమును, మకరికాంచెల సమర్పణమును తీసికొని, రెండవ విధానమందలి నారద కుసుమప్రదానమును, దేవేంద్రుని కదనమును దీసికొని వీనిని సమన్వయ పరచి తన ప్రబంధమునను శృంగార వీరరసముల యద్భుత సమ్మేళనము సమకూర్పఁగలిగెను. ఇట్లు చేయుటచే నీకవివర్యుడు కథానిర్మాణమున రసజ్ఞతయు శిల్పనా కౌశలమును, మహాకవి స్వాతంత్ర్యమును విశదముగాఁ గనుపఱచెను.

(2) కథాకల్పనమందలి రెండవ విశేషము:— తిమ్మనార్యుఁడు తన ప్రబంధమున మూలకథలోనున్న ఇతివృత్తమునుమాత్రమే కైకొని తక్కినదంతయు స్వకపోలకల్పనలతో నలవేయుక, ఇచ్చటఁగూడ మహాకవులు జేయునట్టి కొంత స్వాతంత్ర్యమును, కొంత యనుకరణమును జూపి రసగ్రహణపారీణుఁ డనిపించుకొనెను.

తన గ్రంథమందలి ప్రథమాశ్వాసమున రుక్మిణీకృష్ణులయొద్దకు నారదుఁడు వచ్చినదాదిగ సత్యభామాసాంత్వనమువఱకు నున్న కథయంతయు హరివంశములోనున్నది యున్నట్లు రచించి యందలి సంవాదక్రమమును, సరసంపు వాక్యములును, హావభావచేష్టితములును పాత్రపోషణాది నైపుణ్యములును, ఇట్టివి యన్నియు మాతృకనుండియే సంగ్రహించి ముక్కుతిమ్మన్న వాడుకచేసికొనెను. తక్కిన యాశ్వాసములలో కథాభాగమును విస్తరించుటయందు ప్రబంధమున కవసరమైన వర్ణనములన్నియు మూలములో లేకపోయినను, సందర్భములను గల్పించి యావర్ణనములఁ జేర్చి పెంచుటయు, మూలములోనున్న నారద దౌత్యమును సంపూర్ణముగా విసర్జించి కథాసరణికి నవిలంబితగతిఁ జేకూర్చుటయు మున్నుగా ననేకములగు మార్పులనుజేసి, యొకపట్టునఁ బెంచియు,

యింకొకచోట నూతనముగాఁ గల్పించియు, నిట్లు తన సర్వస్వాతంత్ర్యమును జూపింపఁగల్గెను.

గ్రంథమం దన్నిభాగములయందును స్వాతంత్ర్యము వహించిన యీమహాకవి సత్యాకృష్ణుల ప్రణయకలహ ప్రవర్ణనములో మూల గ్రంథములోనున్న హావభావలీలా విలాసములను యథామాతృకగా నిరూపించుటయేగాక తద్భాషా వైదగ్ధ్యమునుగూడ జాలవర కనుకరించుట కేల నియ్యకొనెనని సందేహము పుట్టకమానదు. శృంగార రసజ్ఞతయందును, శృంగార నిరూపణమందును లోకోత్తర ప్రభావములు జూపించుచున్న ఈకృశ్యముఁ దిమ్మనార్యుఁడు మూలానుసరణమేల ముఖ్యకర్తవ్యముగా యోచించుకొనెనని సంశయింపవచ్చును.

మహాకవులు తమ యుద్గ్రంథములను రసపోషణచేసి రచించుటలో నప్పుడప్పుడు మూలములోనున్న భాగములను భాషా సహితముగ పుడికితెచ్చుకొందురని యందఱకు దెలిసిన విషయమే. పాశ్చాత్యకవులలో షేక్స్పియరు మున్నగు మహాకవు లట్లేచేసిరి. షేక్స్పియరు రచించిన మహానాటకములలో 'జూలియసు సీజరు' 'కోరియొలానసు' మొదలగునవి మూలకథలను ప్లూటార్కు రచించిన మహాపురుష జీవితములలోనున్న కొన్ని భాగములకు సనువాదములే యయినట్లు విమర్శకులు నిర్ణయించినారు. కాళిదాసమహాకవి రచించిన రఘువంశము కొన్నిచోట్ల వాల్మీకిరామాయణమందలి ఇతివృత్తమునేగాక వాక్యచయమునుగూడ ననుసరించుచున్నదని విమర్శకులు కనిపెట్టినదే గదా! మన యాంధ్ర ప్రబంధములలో పెద్దనార్యుఁడు వ్రాసిన మనుచరిత్రము మార్కండేయ పురాణములోనున్న మూలకథను గొన్నిస్థలముల శబ్దానుసరణము జేసి వట్లు వెనుకటి నావిమర్శనలో జూపితిని. ఇట్లు ప్రపంచమందలి మహాకవులందఱు నొకానొకప్పుడు పూర్వకవుల మార్గమున బోవుటయేగాక

(2) మూలకథయందు శ్రీకృష్ణుఁడు సత్యభామకు వీవనచే వీచినట్లుగాను, యింక సరసంపుమాటలచే ననునయింపసాగినట్లుగాను చిత్రింపబడినది. కాని తిమ్మనార్యుని కృతియందు కృష్ణుఁ డామెకాళ్లకు మ్రొక్కి శిరమునందామె వామపాదతాడనము నొందెనని యున్నది. ఈ మార్పసభ్యము, నసహ్యమునని నాతలంపు.

(3) మూలకథలో కృష్ణుఁడు దేవేంద్రుని మీఁదకు దండెత్తినపుడు సాత్యకిప్రద్యుమ్నులు మాత్రమే వానివెంట వెళ్లిరి. తిమ్మన్న కావ్యమున నాసందర్భమున సత్యభామమాత్రమే కృష్ణుని యనుగమించినట్లు చూపింపఁబడినది. ఇది పారిజాతకథయొక్క యుభయవిధసమన్వయ ఫలితము.

(4) నారదమాహాత్మ్యము మూలగ్రంథమందు బహుదీర్ఘముగా వర్ణింపబడినది. తిమ్మన్న దానినంతయుఁ ద్యజించి నారదుని వార్తాహరునిగ మాత్రమే చేసెను. ఈమార్పువలన నిర్వహణమునకు శీఘ్రగతి యేర్పడి కథాకథనము రసవంతమై నవనవోన్మేషమున నొప్పుచున్నది.

(5) మూలకథయందు దేవేంద్రోపేంద్రులు సమానముగానే పోరి యొకరినొకరు జయించలేకపోయిరి. కావునఁ దల్లిదండ్రులగు నదితి కశ్యపులువచ్చి వారి కలహము వారించి సఖ్యపరచిరి. తిమ్మన్న ప్రబంధమున శ్రీకృష్ణుఁడు దేవేంద్రుని జయించినట్లును, ఓడిపోయిన దేవేంద్రుఁ డుపేంద్రునకు నాగిలబడి నమస్కరించినట్లు నున్నది. ఈ మార్పనపసరమనియు విరసమనియు నాయభిప్రాయము. తిమ్మన్నగావించిన మార్పుకంటె మూలకథయందలిసంగతి యెంతయో యుచితముగాను స్వాభావికముగాను ఆనందకరముగా నున్నది. బహుశః యీమార్పు నిత్యజయశీలుఁడైన శ్రీకృష్ణుని యవతారముగా బరిగణింపఁబడిన శ్రీకృష్ణదేవరాయచక్రవర్తినిఁ బ్రీతిపఱచుటకుఁ జేయఁబడినదని నాయూహ.

(6) మూలకథలో పుణ్యకవ్రతాంతమున శ్రీకృష్ణుని తిరిగి గొనుటకు నారదునికి సత్యభామ, దూడతోనున్న కపిలగోవును, తిలలు, బంగారముతో కృష్ణాజినమును యిచ్చెనని యున్నది. తిమ్మనార్యుని కృతిలో సత్యభామ తన సర్వాభరణములను మాత్రమే నాజడదారి కిచ్చెనని యున్నది. తిమ్మన్న చేసిన మార్పుకంటె మూలములోనున్నదియే యుచితముగానున్నదని వేరే చెప్పనవసరములేదని నాయాశయము.

ఇంక తిమ్మనార్యుని కావ్యనిర్మాణమందలి ప్రతిభాతిశయము జూపించెడు నూతనవిశేషము లెవ్వియని యోచింపదగినది. ఈ మహాకవి యీకావ్యము రచించుటలోఁ దనకు పూర్వులును, సమకాలీనులు నగు యాంధ్రమహాకవుల మార్గమును బోవక యొక నూతన మార్గమును గనిపెట్టెను. అది యేదన, తన ప్రబంధమున ప్రబంధలక్షణములన్నిటిని చూపించుచు నాటకవిధానమునకుగూడ ననుసరించుచు నిట్లు శ్రవ్యదృశ్యకావ్యముల సమ్మేళనము గలుగునట్లుఁ జేయయత్నించెను. ఈవిధానము శ్రీనాథాదిపూర్వకవులకుగాని పెద్దనాది సమకాలపు కవులకుగాని పొడకట్టి యుండలేదు. దీనిని కేవలము తన యప్రతిమ ప్రతిభచే భావించి కొని తాను నూతనముగా సృజించెను. శ్రీనాథపెద్దనాదులు తమ ప్రబంధములలో పురవర్ణనలఁ బ్రారంభించి క్రమక్రమముగఁ గథాంశములకు బోయిరి. శృంగారనైషధమందును మనుచరిత్రమందును నిట్లే యున్నది. మన పారిజాతాపహరణములో నట్లుగాక ప్రథమమున రంగప్రవేశమునట్లు రుక్మిణీకృష్ణుల ద్యూతక్రీడాదృశ్యముతో మొదలుపెట్టి నారదునిరాక వెంటనే కవి కనుపరచెను. వారి సంభాషణమునఁ గథాబీజమగు పారిజాతపుష్పప్రదానమును నిరూపించినాడు. ఈదృశ్యమునుండి సత్యభామాంతఃపురదృశ్యమునకు శీఘ్రముగాఁ గొంపోయి యచ్చటి యితివృత్తమునంతను నాటకవిధానమగు పాత్రసంభాషణ పూర్వకముగ

జిత్రించినాడు. ఆపైని వెంటనే గరుడారోహణమును స్వర్గప్రయాణము ను గావించి మరియొక దృశ్యమునకు దీసికొనిపోయెను. నందనవనవిహార మును, ఇంద్రోపేంద్ర సమరమును జూపినవెంటనే, ద్వారకలోఁ బుణ్యక వ్రత శాంతరంగములో కథ ముగించెను. ఈలాగున నొకరంగము నుండి మరియొక రంగమునకు తొందర తొందరగా దృశ్యములు మార్చి కథనాకౌతుకమును తగ్గకుండ నిలువబెట్టినాఁడు.

ఇట్లు నాటకఫక్కి కనుకూలమగు దృశ్యక్రమమును మనమునం దిడికొనినను గ్రంథనిర్మాణముమాత్రము ప్రబంధముగా నుండవలెను గాన తదావశ్యకములగు నష్టాదశవర్ణనలను నాయా సందర్భముల నైమిత్తికముగా నుంచుటకై కవి కథను గొంచెమించుక మార్చెను. సత్యభామా కృష్ణులు వెంటనే యమరావతికిఁబోవక యారాత్రి తమ స్వస్థానమునఁ గడ పుటచే నిశావర్ణనము, సూర్యోదయాది వర్ణనములకు నవకాశము గలి గినది. అమరావతిలో [illegible]సను జేసినవెంటనే మూలకథయందున్నట్లు సత్య భామ పురికొల్పినను పారిజాతముఁ బెకలించుకొని వెనువెంటనే సత్యా కృష్ణులు తమ వీటికి రాకుండఁజేసి యుద్యానవిహార జలక్రీడాది వర్ణనలకు సమయమును కల్పించుకొనెను. ఇట్టి వర్ణనలు లేనియెడల నీగ్రంథము మహా ప్రబంధమనిపించుకొనదుగదా! కావున నవి యన్నిటిని యెట్లో చేర్చ వలెను. ఈవర్ణనలెవ్వియు మూలగ్రంథములో లేకపోయినను గ్రొత్త గా కల్పింపవలసి వచ్చినది. ఇట్లు నాటకక్రమ మొకవంక లాగుచుండగా ప్రబంధలక్షణములు మఱియొకవంక లాగుచుండగా, ఈమహాకవి మధ్య మార్గమున నిలచి యెంతయో సమర్థతతో రెంటికిని సమన్వయము జే సెను. ఈతని తర్వాతవచ్చిన పింగళి సూరనార్యుఁడీపద్ధతినే తన ప్రభా వతీప్రద్యుమ్నమున ననుసరించెను. అనుసరించుటయేగాక యీనమ్మి శ్రితనాటకవిధానము మరింత మనోహరముగ నుండునట్లు విష్కంభము

లను, అంతర్నాటికలను గూడఁ గల్పించి తన ప్రబంధమును నాటక కల్పముగా నిర్మించెను. ముక్కుతిమ్మన్న సమకాలికుడును నతనికంటె జిన్నవాడునగు చింతలపూఁడి ఎల్లన్న సయితము నీమార్గమునే తన రాధామాధవమందును, మరింత విచిత్రముగాఁ దన విష్ణుమాయానాటకమందును ననుకరించెను. ఆయా గ్రంధముల యుపక్రమణముఁజూచిన నీవిధాన మెంతసరసముగా నాకవులచే ననుకరింపబడినదో ద్యోతకము కాగలదు.

కథాకథనము : శైలి.

విపులవనాంతరసీమలయందు నొకచోట మేఘగర్జితమును బురుడించు సింహనాదములును, మఱియొకచోటఁ బ్రచండ వాతాహతినిఁ బెల్లుబ్బు జలపాతముల లురదభంగతరంగ నిర్ఘోషములును, వేఱొకచక్కి మలయానిలచుంబనముల సన్నసికంఠములు నేర్చుపాడు సెలయేటివీచికల నినాదమును, నింకొకతట్టు సరోజినీపుంజముల పొంది నిరంతర కేళీవినోదమున నెగయు చిరపుష్టపారావతముల మధురాలాపములును, కేలరేఁగి ప్రకృతిలలన నానావిధవాక్ సౌష్ఠవములను నేర్పుచున్నదో యనునట్లు ఆంధ్ర వాఙ్మయమున గమకశోభాసహిత యనేకవిధములగు జృంభితారావముల తోడను, నృత్యగీతవాద్యములతోడను నిండుకొని సమ్మిళిత స్వరసందోహమున సంతతహృదయాహ్లాదము కలుగఁజేయుచుండును శ్రీనాథుని యుద్దండ వాగ్డంబరములును, పెద్దనాదుల రసస్ఫూర్జితస్వరప్రస్థితియు, రామరాజభూషణుని వాణీవీణావాక్సుధాసారమును, వాఙ్మయారామముల పరితృప్తిని లేమిచుండ ముక్కుతిమ్మనార్యుని కలకంఠవధూకల కాకలీధ్వనులు నిత్యవసంతకాలమును నెలకొల్పుచున్నవి.

"ముక్కుతిమ్మనార్యు ముద్దుపలుకు" అని కవిత్వరస విచారమున తిమ్మనార్యుని వాఙ్మాధుర్యము లోకైక ప్రసిద్ధి బొందియున్నది.

మార్దవము, కమనీయత, మాధుర్యము ఇత్యాది సౌకుమార్యగుణము లన్నియు నీతని కవిత్వమందు మూర్తీభవించియున్నవి. వసంతకాలమునఁ గ్రొంగ్రొత్తగఁ జిగిర్చిన చెట్ల చివురుఁదొంపములు నిగనిగలాడు సద్యఃప్రకాంతులతోను, పసిపాపల హాస్యములఁబోలు ఎఱ్ఱని లేఁజాయలతోడ నెల్లచూపరులనెట్లాకర్షించి వారిని హర్షపులకితగాత్రులఁ జేయుచుండునో, యట్లే యీకవివర్యుని మృదుల పదరచనలు పాఠకుల వీనులకు విందొనరించుచు వారిడెందముల నానందరసాప్లుతి నోలలాడించుచుండును.

వెనుక నాముక్తమాల్యదను, మనుచరిత్రమును విమర్శించునపుడు ఆయా కవీశ్వరుల రచనలలో శైలీప్రామాణ్యము వారికి సిద్ధించలేదని వాకొనవలసివచ్చినది. కృష్ణరాయలు కొన్నిచోట్ల కఠినపాకమును కొన్నిచోట్ల మృదులరచనలను సంఘటించి శైలియందస్థిరత్వ దోషమునకు లోనయ్యెను. అట్లే పెద్దనార్యుఁడు ప్రథమమున రసస్నిగ్ధమగు శైలీపేశలత్వముఁ జూపియును పోనుఁబోను కఠినపదగ్రథితదీర్ఘ సమాసముల నాశ్రయించి శైలియందు సమత్వము నిలుపుకొనలేకపోయెను. నంది తిమ్మన్న యట్లుగాక మొదటినుండి తుదవఱకును హెచ్చుతగ్గులులేక యొకేవిధమగు యుత్కృష్టశైలిని వినియోగించి స్థిరప్రభావుఁ డనిపించుకొనెను. ప్రథమాశ్వాసమున సత్యభామాశ్రీకృష్ణుల ప్రణయకలహము నెంత మనోజ్ఞముగ రసాత్మకమున వర్ణించెనో యట్లే పంచమాశ్వాసమునఁ బుణ్యకవ్రతమునుగూడ నంత మృదుమధురపదవిన్యాసమున వర్ణించెను.

ఆంగ్లేయభాషలో "The style is the man" అని యొక ప్రాచీన సూక్తి యున్నది. అనగా, మహామతుల రచనాశైలి జూచినయెడల వారి మానసికస్వభావమును గుర్తింపవచ్చునని. ఈలోకోక్తిప్రకారము మనము తిమ్మనార్యుని సహజమనశ్శక్తుల భావించుకొనుయెడల నాతఁడు

నపారమగు సాత్త్విక స్వభావముఁగలవాఁడనియు, నాతని హృదయాలవాలమున సౌమ్యరసభావములకుఁ బెంపుఁగలిగినట్లు తదితర భావములకుఁ గలుగలేదనియు నిర్ణయింపవచ్చును. ఆతని శైలీసౌమ్యత, పదలాలిత్యము, భావసౌకుమార్యము యివన్నియు నాతని మృదుల స్వభావమునకు చిహ్నములుగా నున్నవి. ఆతని కావ్యమందు సామాన్యముగ శృంగారశాంతకరుణారసములు మెండుకొని యున్నను, అచ్చటచ్చట వీరరౌద్రాదులుగూడ సందర్భవశమునఁ దటస్థించుచున్నవి. అట్టివానిని బోషించుటలోఁ దన నిజస్వభావమైన సాత్త్విక గుణమునే పదను బెట్టి, వాని కార్కశ్యపారుష్యముల నుపశమింపుచుండును. కావున నీతని కావ్యశైలి సర్వత్ర మాధుర్యముగలదై వేణుస్వరమువలె సంతత శ్రవణానందము నొసగూర్చుచున్నది.

ఉ. నా కని సత్యభామ పదనంబున నేవగ నంటుచుంప నే
మే పదియింపఁ బూను హృషీకేశ్వరునిం గని సంజ్ఞ నాతి కే
స్నేహలజారుకొంగు నవరించుము నీకిక నొప్పఁ బత్త్రమంచు
దీపెడ గోప్రచుం బకెకెఁ గెంగొపచూపులు క్రేగ్లు దాఁటఁగన్.

మ. అని పౌలోమి ముఖంబు జూచి వినుమో యబ్జాక్షి కింతనా
ప్రతన విన్నంబడ నేల సోదరునకై సత్రాజితీభామినిన్
ప్రసగంగా న్నిశిపించితిస్తు నని సాహంకారపుం బ్రేమచే
త్యజసత్పుష్పంబు గ్రహింపు చల్లనిడి సుధాత్రస్థానములన్ మురారిచేన్.

మానవ స్వభావము నామూలచూడముగ గ్రహించినవాఁడయ్యు నీతని విశేషతః స్త్రీస్వభావపరిజ్ఞానమునందు నద్వితీయుఁడని చెప్పవలసియున్నది. ఆకాలమున నీతనివలె స్త్రీల యాంతరంగిక భావసంక్షోభములు సూక్ష్మదృష్టిని బరిశీలించి వర్ణించిన మఱియొకకవి పింగళి సూరనార్యుఁడు. ఆతఁడైనను స్త్రీస్వభావ వర్ణనలో ముక్కు తిమ్మన్నకంటె

శ్లేషకవిత్వప్రావీణ్యమును కొలదిమాత్రముగ నవతారిక భాగమునందున్న కృతిపతిసంస్తవనమునందు జూపి కథాశరీరమందు కథాకథన కౌతుకమంతయు దీనిని తరువాత గ్రంథాంతమున తన చతుర్విధ కవితా నైపుణ్యమును జూపనుద్దేశించి చిత్రకవిత్వమునను, బంధకవిత్వమునను గోష్ఠపద్యములను రచించినాఁడు. ఇట్లు రచించుటచే వరాహపురాణ కర్తలకు సంబంధియగుట స్పష్టమైనది. వారును తమపురాణమందు కేవల మప్రసక్తముగఁ జిత్రకవిత్వ పద్యములనుఁజేర్చి తమ చతుర్విధ కవితా కౌశలమునుఁ బ్రకటించుకొనిరి.

కథాశరీరమున శబ్దాలంకారములజోలికి బోని యీకవి, రసపుష్టి కొఱకు అర్థాలంకారములను మెఱుచు వాడుచువచ్చెను. కథాకథనమందు ఉపమానోపమేయములను, సర్వనామికములలో నుత్ప్రేక్షాతిశయోక్తుల నెక్కువగా వాడెను. ఈకవి వాడిన యుపమలు రెండువిధములు:

i కొన్ని స్వకీయ కల్పితములు.

ii కొన్ని మాతృకనుండి యుద్ధృతములు. అన్నిటికిని సమానముగానె తన సరసమూలమగునవి కలితకమనీయమాధుర్యగుంఫనమునఁ దొడిగి పదార్థమున్న బంగారమునఁ బొదిగిన యింద్రనీల మాణిక్యముల వగిది చల్లని కాంతులు నిగుడునట్లు జేసెను.

౧ 'వలిగుబ్బలి ముద్దుపట్టి లేతనవ్వు ఘనించినట్లమరె.' (స్వకీయము)

౨ 'పులుగడిగిన ముత్తియంపు పోలుపొందంగా' (స్వకీయము)

3 'బ్రేమ నడ్డ యురగాంగనయుఁ బలె, నేయివోయ దరికొన్న భీషణ పావకశిఖల యనంగ (మాతృకనుండి యుద్ధృతమును, అనుప్రాణితము)

నవి. అట్టిదియే నందనోద్యానమున వనవిహారమును; కాని నిదాఘవర్ణ నము స్వర్గమందు చేయుటకు కారణము కేవలము మృగ్యము. ఏలయన శీతలాతపబాధలు స్వర్గమందుండవని జ్ఞానకోవిదుల తీర్మానము. అట్లయ్యు జలక్రీడా వర్ణనము కొఱకు దుర్భరమగు వేసవి స్వర్గమందు కల్పింప వలసి వచ్చినది. ఈలాగున కథాసందర్భములను బట్టియో లేక యట్టివి కల్పించియో యీకవివరుఁడు చక్కని వర్ణనలను గ్రంథమందిమిడ్చెను.

తిమ్మకవిచేసిన వర్ణనలతి దీర్ఘములు కావు. ఏవిషయమైనను వర్ణింపవలసివచ్చినపుడు ముఖ్యాంశములను నిర్ణయించుకొని వానిని కొద్ది పద్యములలో బొందికగా సమిడ్చి యంతటితో ముగింపుచు వచ్చెను. పెద్దన్నవలెను కృష్ణరాయనివలెను యొక్కొక్కవర్ణన మొక్కొక్క యాశ్వాసమునకు సరిపోవునట్లుగా పద్యపరంపరలువ్రాసి విసుగుపుట్టించుట లేదు. దైర్ఘ్యవిషయములోనేగాక యింక మఱికొన్ని విషయములలో గూడ తిమ్మకవి వర్ణనలు పెద్దనాదికవుల వర్ణనలకంటె భిన్నములుగా నున్నవి.

సామాన్యముగా నాంధ్రకావ్యములలో వచ్చెడు వర్ణనము లన్నిటిని స్థూలదృష్టిని రెండు పెద్దతెగలుగ విభజింపవచ్చును. మానవ జీవితమునకుఁ గొన్నియు, మానవేతర జీవితమునకు మిగిలినవియుఁ జెంది యున్నట్లు నిర్ణయింపవచ్చును. మానవేతరజీవితమునకే ప్రకృతి జీవిత మని నామాంతరము. కాబట్టి మనుజుని గుఱించియుఁ బ్రకృతిని గురించియు మనుజ ప్రకృతుల యితరేతర సంబంధమును గుఱించియు కావ్య వర్ణనలు జేయఁబడుచున్నవి. ఈవర్ణనలు చేయుటలోఁగూడ రెండు విధములు గాన్పించుచున్నవి. వస్తువును యథారూపముగాను యథాస్థితిగాను వర్ణించుట యొకవిధము. దీనిని స్వభావోక్తియందురు. వస్తువును తన మనోవికారములద్వారా భావించుకొని విలక్షణాంశములను కల్పిం

చుకొని వర్ణించుట రెండవ విధము, దీనిని యుత్ప్రేక్షయందురు. ఈ రీతిగఁ గవులందఱు మానవజీవితమును ప్రకృతి జీవితమును వారివారి యభిరుచిగ వర్ణించుచు వచ్చిరి. కొందఱు కవులు స్వభావోక్తిని యుక్కువగఁ బాటించుచుండఁగ మఱికొంద ఱుత్ప్రేక్ష నెక్కువగా బాటించుటయుఁ గలదు. కాన్పించుచున్నది కృష్ణరాయలకు స్వభావోక్తియం దభిలాష యుండినను నుత్ప్రేక్షయందెక్కువ యభిమాన ముండినట్లు దోచుచున్నది. పెద్దన్న స్వభావోక్త్యుత్ప్రేక్షలను సమానముగానే మన్నించెనని స్థూలదృష్టిని జెప్పవచ్చును. కాని ముక్కుతిమ్మనార్యుని పారిజాతాపహరణమున స్వభావోక్తివర్ణనలు చాల యరుదుగానుండి యుత్ప్రేక్షణములే సర్వసామాన్యముగఁ గాన్పించుచున్నవి. వసుచరిత్రమునను నీకవి ముఖ్యముగ నుత్ప్రేక్షనే యుపయోగించెనని నిర్వివాదముగఁ జెప్పవచ్చును. మనువర్ణనములలో స్వభావోక్తియే యెక్కువగాఁ గోచరించుచున్నది. కావున కథాపాత్రముల చర్యలన్నియు జీవితమునకు యథార్థముగా సరిపోవునట్లు చిత్రింపఁబడినవి. స్త్రీపాత్రములగు రుక్మిణీసత్యభామలును, పురుషపాత్రములగు శ్రీకృష్ణనారదులును క్రమముగను స్వాభావికముగాను, రసికోచితముగాను నభివర్ణింపఁబడిరని నిస్సంకోచముగాఁ జెప్పవచ్చునుగదా. అట్లు మనుష్యవ్యాపారములఁ బ్రత్యక్షముగఁ జూచినట్లు చిత్రించిన యీకవి సృష్టియందలి లెక్కన వస్తుస్వరూపములను, వాని నైసర్గికరీతులప్రకారము వర్ణింపకపోవుట యొక గొప్ప లోపము. పురముగాని, పర్వతముగాని, నదిగాని, ఉద్యానవనముగాని, యింతయేల సముద్రమైనను సహజస్వరూపమున నింద్రియములకు గోచరించునట్లు వర్ణింపఁబడలేదు. వీనియన్నిటియందు కవిసమయభావములును, ఊహాకల్పితములగు చేష్టితములును జొప్పించి నిరూపించుటచే నుత్ప్రేక్షారూపములగు వర్ణనలుగ నేర్పడినవి.

డియున్నవి. అట్లగుటచేఁ గావ్యమంతయు నొకేరసమున సిక్తమై రసావకర్ష హేతువులు లేక అత్యంత మనోహరముగా నున్నది.

ఉదాహరణములు:—

(1) అంధకారవర్ణనము.

మ. ఒకభృంగంబు పరాళినీ ముకుళతంత్రోన్ముద్రితప్రాణేశ్వరిన్
మకరందాసవమత్తసద్గృహిణిఁ బంచెట్టి తాఁబోయి సం
జకడన్వచ్చి తదానమున్ముకుళమేజాడం దొరఁగ్రాక యూ
మికుడో నాఁ డిఁకెరం గొలందుమకు న్మేకంతహీనంబుకో. (ఆ. 2)

(2) చంద్రికా వర్ణనము.

సీ. విరహులకై సోకి వేడియై వెన్నెలఁ
బచ్చివెన్నెల నులివెచ్చనేఁగ
కలువపుష్పాళిచేఁ గసరైన వెన్నెల
పలిప వెన్నెలలోన పడిచితేర్చి
చంద్రకాంతపునీట జాఱైనవెన్నెల
మురుకువెన్నెల పిఱ్ఱఁబడినచేసి
సతులమైపూఁతం గ్రాలించు వెన్నెలఁ
పనుపు వెన్నెల రసాయనముగూర్చి

తే. చిగురువిలుకాని జాతక చేయబూని
గొలముసాములసందుఁ గూడఁబెట్టి
పంతుగలయుంగ బుట్టంపు బంతివిందు
పెట్టి రెలమిఁ జకోరపుఁ బేరెలాండ్రు. (ఆ. 2.)

మచ్చునకై యీ రెండును చేర్చితిని. నాయకవర్ణనమందును, ఉద్యాన వర్ణనాదులయందును నిట్టివియే చాలకలవు.

తిమ్మకవి వర్ణనలయందు మరియొకవిశేషము గాన్పించుచున్నది. పెద్దన్న మొదలగువారు తమ స్వానుభూతమైన ప్రపంచవిజ్ఞానము ననేక

సందర్భములఁ జేర్చుచు వచ్చిరి. వారును పౌరాణిక కథలనే యెత్తుకొని ప్రబంధములు వ్రాసినను యెట్లో తమ గ్రంథములయందు తమ కాలపు రాజకీయ సాంఘిక భౌతిక విజ్ఞానము నచ్చటచ్చటఁ జొప్పించుచు తమయొక్కయు, తమకాలముయొక్కయు చరిత్రముల లక్షణములను చూచాయగ దెలిసికొనుట కవకాశము కలిగించుచుండిరి. ఇట్లాత్మీయానుభవమును జేర్చుటలో కృష్ణరాయ లందరికంటె మిన్న. అటువంటి మహారాజు కాలములోనుండి [illegible] చేయఁబడిన గ్రంథమగు పారిజాతాపహరణములో సమకాలపుచరిత్రాంశములు కథాభాగములో తరచితరచి వెతికినను గానరావు. ఎలకో ముక్కుతిమ్మన్న తనదేశకాల పరిచితిఁ దనగ్రంథమునఁ జేర్పఁడయ్యె. అతఁడు చూపట్టినవిజ్ఞాన మంతయు పురాణములనుండియు కావ్యములనుండియు సంగ్రహించుకొనినదే. స్వయముగఁ దా ననుభవించి సంపాదించిన ప్రాపంచిక తనజ్ఞానము రచనలలో నుపయోగించుటలేదు. ఈ వైలక్షణ్యమున కొండుకారణము సూచింపవచ్చును. ఈ కావ్యమందలి కథ ద్వారకకును అమరావతికిని సంబధించియున్నది. ద్వారకాపురము భూలోకమందలిదైనను దేవేంద్రునిష్పన్నమగు నమరావతికివలె కేవలము పౌరాణికలక్షణములు కలిగి దేవలోకమునకు సంబధించినట్లుగానే యున్నది. కావున కథాభాగ మంతయు సామాన్యమానవజీవితమునకు సంబంధింపక దైవతము అధిదైవతములకు స్త్రీపురుషుల జీవితములకు సంబంధించియున్నది. ఆకారణమున తనభౌతికప్రపంచానుభవము జూపించుట కవకాశములేక పౌరాణికజ్ఞానమునే విరివిగా జూపవచ్చినది.

ద్వారకనుండి బయలుదేరి అమరావతికి బోవునరికి దారిలోఁ గనిపించిన దృశ్యము లన్నియు పౌరాణికములే. మేరుపర్వతము, గంధర్వులు, విద్యాధరులు, యక్షులు, కిన్నరులు మున్నగు వారందఱు

పురాణములలోనున్నజనులే. అట్లే నందనోద్యానములోనున్న వృక్షకుల నులును. కావున నడుగడుగున నీ కవీశ్వరునకుఁ బురాణవిచారణ మత్యవసరమైనది. ఆపాండిత్యముఁ జూపుటలో నీతఁ డప్రతిముఁడుగఁ బరిఢవిల్లెను. ప్రత్యేకముగా నిచ్చట దృష్టాంతముల నిచ్చుట యనవసరమని యుజ్జగించెదను. వలయువారు శ్రీకృష్ణుని యాత్రవర్ణనము జదివినఁ దెలిసికొనగలరు.

### రసము—నీతి.

ఈకావ్యమందు శృంగారరసము అంగి. శాంతవీరములు అంగములు. ఇందలి శృంగారరసము రెండువిధములుగా నున్నది ప్రథమమున విప్రలంభము. అది క్రమముగా సంభోగమునకు మాఱినది. నాయకియగు సత్యభామ ఖండిత. నాయకుఁడగు శ్రీకృష్ణుఁడు దక్షిణనాయకుఁడు. కావున వీ రిద్దరికి భావభేదములు నైసర్గికములు, ఎప్పటికిని కలుగుచునే యుండును. కాన వానిసమన్వయమందలి నేర్పరితనమే యీ కావ్యమున శృంగారరసమునకు జీవిక మైనది.

విప్రలంభమునగాని, సంభోగమునగాని శృంగారరసమును వర్ణించుటలో ముక్కుతిమ్మన్న సమకాలీను లగుకవులవలె గాక స్వాప్రత్యేకతముఁ జూపి తనవ్యక్తిత్వము నిల్పుకొనెను. తెలుఁగుకవులగు పెద్దనాదులుచేసిన శృంగారరసవర్ణనములకును, నీతనివర్ణనములకును స్పష్టమగుభేదము గాన్పించుచున్నది. పెద్దన్న కచకుచాదివర్ణనములు చేయుచు నసభ్యశృంగారమునుగూడ వర్ణించెను. అతఁడు ముఖ్యముగ బాహ్యావయవవర్ణనలతోనే రసభావములు వర్ణించియుండెను. ముక్కుతిమ్మన్న యట్లు గాక కేవలము మానసికభావవికారములును తదనుగుణచేష్టితములును తత్సంబంధికాభినయమును తద్ద్యోతకసంభాషణములును యిట్టి యాంతరంగికసాధనసంపత్తిచేత శృంగారరసమందలి యుద్రేకాది

వివిధావస్థల నభివర్ణించినాఁడు. శుకపికకేకిభృంగములను విరహావర్ణన పరికరములుగ నితరకవులు తలఁచువాఁడిరి. తిమ్మన్న వాని నొకమూలకుఁ ద్రోసివేసి హృదయనిర్గతములగు భావానుభావములమూలమున విరహాద్యవస్థలను చిత్రించెను.

తిమ్మకవియు సంభోగశృంగారమును రెండుసారులు వర్ణింపవలసి వచ్చెను. మొదట ద్వారకయందును, రెండవసారి యింద్రపురమందును సత్యాకృష్ణులసంభోగము వర్ణింపవలసియుండెను. ఈ రెండుసారులు తిమ్మకవి రతివర్ణనముఁ జేయకయే బహుమృదువుగాను బహుసభ్యముగాను తద్విషయమును సూచించి విడిచిపెట్టెను. పెద్దన్న, నృసింహకవి, సూరన్న, రామరాజభూషణుఁడు మొదలగు మహాకవులు రతివర్ణనమెంతపిచ్చిపిచ్చిగాఁ జేసియుండిరో మనకు తెలిసియున్నది. అట్టికాలమున నీకవిపుంగవుఁడు శృంగారరసప్రధానమగు కావ్యమున సంభోగరతివర్ణనము జేయకుండుట గొప్పసాహసకార్యమే. అట్టి ధైర్యమును బూని తనస్వాతంత్ర్యమును తనశీలమును గాపాడుకొనెను. ఈవిధముగ విశుద్ధవర్ణనలు శృంగారమునఁ జేసిన మహాకవులు మఱికొంద ఱాకాలమునగూడ నుండిరి. కృష్ణదేవరాయ లట్టివాఁడే. *మాదయ్యగారి మల్లన్నయు నందిమల్లన్న, ఘంటసింగన్నలునుగూడ తమకావ్యములం దశ్లీలశృంగారవర్ణనలు జేయరైరి.

---

* నంది తిమ్మనార్యుని శృంగారరస వర్ణన సందర్భములో నొకచిత్రమైన సంగతి గమనింపదగియున్నది. తనసమకాలికులలో తనవలె విశుద్ధశృంగారమును వర్ణించిన యితరకవులు నందిమల్లయ్య ఘంటసింగయ్య ద్వయములు, మాదయ్యగారి మల్లన్నయును, అని పైనఁ జెప్పితిని. వీరిలో సింగయ్యయు, మాదయ్యగారిమల్లన్నయు మన నంది తిమ్మన్నవలెనే శైవాగమదేశికుడగు అఘోరశివాచార్యులశిష్యులు. కావున నీముగ్వురు శిష్యులు తమగురువుయొక్క యుపదేశముచేతను విశుద్ధశృంగారవర్ణనము నవలంబించిరాయని యూహ బొడముచున్నది.

ఒక్క విషయములో మాత్రి మీకవి పొరపడ తప్పటడుగు వేసెనని చింతింపవలసియున్నది. ఆకళంకము లేసియెడల నీప్రబంధ మంతయు సర్వవిధముల సంతృప్తి పొందించినదే ఈమెచ్చు మొకలేశమాత్రమైనను విమర్శన విషయములోఁ జేర్పక తప్పదు. అది యేదన బ్రహ్మమానస పుత్రుడును, ఆజన్మబ్రహ్మచారియు, సంయమీశ్వరుడు నగు, నారదుడు పారిజాతకుసుమ మహిమను వర్ణించుచు యిట్లుజెప్పెను.

మ. అళినీలాలక నీవు నీపతి రహస్యక్రీడ వర్తించువే
ళ లతాంతాయుధ సంగరంబునకు నుల్లాసంబుగల్పించు ను
జ్జ్వల దీపాంకురమై రతిశ్రమ తిరస్సంజాతధారాళఘ
ర్మలవంబు ల్దొలఁగింపఁగా నుటియై సందిల్లు నిచ్చాగతిన్.

ఈవర్ణనమందలి సురతప్రసంగము తాపస బ్రహ్మచారినోట ననుచితమని కొందరాక్షేపించినారు. ఈయాక్షేపణము న్యాయమేయని నా యభిప్రాయము. ఇట్టి మాటలు నారదమహర్షి వచింపఁదగినవికావు. రసాధిక్యమును సిద్ధి చేయునుద్దేశముతో చక్కఁగా చిత్రించిన నీకవిరసికుఁ డియశ్లీలప్రశంస నేలజేసెనని విచారింపఁ దానికొండు కారణము గాన్పించుచున్నది. హరివంశమందలి మూలకథలోనే యీసందర్భమున రతి ప్రశంస చేయఁబడి యున్నది. ఆశ్లోకముల నీక్రింద కూర్చుచున్నాను.

1. రతిశ్రమ స్వేదవినాశహేతు
ర్ణవోదభారాసయ నేవ హేతుః
సమారుత న్యాద్యది చారుగాత్రి
సమేఘకాలో మమ వల్లభస్స్యాత్.

2. ఏవంవిధేషు ప్రియసంగమేషు
రతావసానే యదుపైతి వాయుః

రతిశ్రమ స్వేదహరస్సుగంధి
స్వతఃపరమ్ కిమ్ సుఖమస్తి లోకే.

ఈపై శ్లోకముల సారాంశమే తిమ్మకవి తన పద్యమునందిమిడ్చె నని విశదమగుచున్నది. మూలములో నున్నదానిని తాననుకరించెనను నటులు కొంతవఱకు నుపశమన కారణమైనను యీమహాకవి యిట్టి ప్రసంగము స్పృశింపకుండ బొత్తిగా విడిచినయెడల మరింత బాగుండునని రసజ్ఞులకుఁ దోపకమానదు.

## పాత్రవిచారణ.

ఈప్రబంధమందలి ముఖ్యపాత్రలు శ్రీకృష్ణుడు, నారదుడు, సత్యభామ, రుక్మిణి. దేవేంద్రుడు మున్నగువారు కొలదిమాత్రముగఁ బ్రవక్తులు. వీరి పాత్రపోషణ మీకవిచే నతి రమ్యముగను, స్వాభావికముగను నిర్వర్తింపబడినది. ఈకథ పౌరాణిక జీవితచరిత్రమందలి యొక శకలము. ఇందలి యితివృత్తము మానవజీవిత సంబంధమగు స్త్రీపురుషభావవికాసజన్యమైన యొక కిరణముచే జ్వలితమగుచున్నది. ఈభావకిరణము నిస్తంపక తిన్ననైన ప్రభచే మాణిక్యకోరకమువలె ప్రత్యేకముగ భాసిల్లుచున్నది. రసవికాసమునందు పైపైని తక్కిన ప్రబంధములందు వలె దీనికి నానాముఖత్వము చెల్లదు. స్వల్పమైన కథతో, అల్పసంఖ్యాకమైన పాత్రసంపుటితో, నాతివిస్తృతమైన రసభావవికాసముతో నున్న యీగ్రంథము యితరాంధ్రగ్రంథములకంటె గాఢతరమైన వస్త్వైక్యమును రసైక్యమును గలిగి యేకముఖముగా వరలుచున్నది. కావున నాలంకారికులేర్పరచిన వస్త్వైక్యనియమము దీనికి సుప్రసిద్ధముగా సరిపోవుచున్నది. ఈ చిన్నకథయందు కొద్దిమంది పాత్రలుండుటచే పాత్రవిచారణ మెక్కువ ప్రయాసము కలుగఁజేయదు. కవికిమాత్ర మట్లు కాదు. ఈ కొద్దిపాత్రలతో నీచిన్నికథను ప్రబంధపరిమాణమునకు

విస్తరింపవలసియుండుటచే నాతనికీర్తి చాలయెక్కువగా నుండనోపునని యూహింపవచ్చును. ఇటువంటి కష్టసాధ్యమైనపనిని, విత్తునుండి మొక్క మొలచి వృక్షమగునట్లు, సునాయాసముగాను స్వభావానుసారముగాను నిర్వహించిన కవికంఠీరవుని ప్రజ్ఞాప్రతిభల నెంతయుఁ గొనియాడఁ దగి యున్నది. చెట్టెంతవిస్తరించినను ప్రతివేరుయందును, ప్రతిఆకుయందును తద్వృక్షలక్షణము లెట్లు కాన్పించుచుండునో అట్లే యీ కావ్యమందలి ప్రతిపాత్రయందును, వారివారి ప్రతివాక్యమందును, ప్రతిసంజ్ఞయందును, కావ్యస్వభావము రసభావమాధుర్యము గాన్పించుచునే యున్నది. ఇట్లద్భుతావహముగ నేర్దక్షతతో ప్రతిపాత్రయందును భావోన్మీలనము గావించిన యాంధ్రకవి మఱియొకఁడు గానరాఁడు.

ఈ పౌరాణికకథయందు వచ్చిన పాత్రలన్నియు పౌరాణికులే. వారి గుణవిశేషములు పురాణప్రసిద్ధములయి యున్నవి. ఆ ప్రఖ్యాత గుణములను చక్కఁగఁ బోషించుచు కథాప్రణాళిక నీకవివరుఁడు కొన సాగించెను. భగవద్భక్తాగ్రగణ్యుఁడును కలహప్రియుఁడునగు, నారదుఁడు; దక్షిణనాయకుఁడును, లీలానాటకసూత్రధారుఁడు నగు, శ్రీకృష్ణుఁడు ; సపత్నీదుస్సహాయు, ఖండితనాయికయు నగుసత్యభామ : పరమసాధ్వీ లలామయు, సాత్వికగుణోపేతయు నగురుక్మిణి — ఇట్లు వారివారిప్రసిద్ధ గుణములను నిరూపించుచూ, ప్రత్యంశమందును, ప్రతిపదమందును నాయా గుణరూపములు ప్రతిబింబించునట్లు చిత్రించిన మహాకవి యీ తిమ్మనార్యుఁడు. ఈతనిపాత్రపోషణ మాకాలపుమహాకవుల ప్రతిష్ఠ కెంతమాత్రము తీసిపోవదు. కాని కొన్నిపాత్రలవిషయములో మాతృకలో లేని నూతనకల్పనము చేసి వారిశీల్యమునకుఁ గొంత న్యూనత దెచ్చిపెట్టెను. ఆమార్పు లన్నియుఁ దత్తత్సందర్భములలోఁ జూపింపఁబడును.

రంపుమధురరవంబులు గిలకరించెడు మహాగాయకునిపగిది తిమ్మనార్యుని కావ్యాలాపము లమృతంపుసోనలనుఁ జిలుకరించినవి. ఇదియంతయు జగన్నాటకసూత్రధారుని విలాసకృత్యమే.

చ. మన మరయందలంచి యొకమార్గము పన్నితొ నవ్వుటాలకో
నను వెఱపించెదో యకట నాయెడ నిక్కము దప్పు గల్గెనో
వనజదళాయతాక్షి పగవాడనె నన్నిటు లేల చూడ వా
క్కునిమిషమైన నీవు దయగన్గొనకుండిన నిల్వనేర్తునే.

యని యాత్మగోపనము చేసి జగన్మోహనము చేయుచుండును.

ఇట్లనేకవిధములం నోదార్చియు లంభము లేక యామెపాదద్వయమునకు తనశిరస్సును జేర్చి మ్రొక్కి నామె వామపాదమున నాతనిశిరస్సును దన్నెను. అంత రసికశిఖామణి యగుగోవిందుఁడు సంతసించి యీతాకుడువలన నామెపాదము లేమి నొచ్చెనో యని విచారము దెలుప నామె కొంతవఱకు క్రోధము నవలించుకొని యాతనితో మాఱు బలుక నియ్యకొనెను. ఇట్లు క్రమక్రమముగా నామెకోపాగ్నులను చల్లార్చి పారిజాతవృక్షమును స్వర్గమునుండి తెచ్చి యామెపెరటియందే నాఁటెద నని యామెకు మాటనిచ్చి యాదినమున నామెయింట నారదునితో భుజించెను.

మఱునా డామెతో నింద్రపురమునకుఁ బోయి దేవేంద్రునితోఁ బోరు సలిపి పారిజాతభూరుహమును పెకలించుకొని దెచ్చి యామె యింట నుంచెను.

అటుతర్వాత పుణ్యకవ్రతమును సత్యభామచేఁ జేయించి యామెచే ధారాపూర్వకముగా నారదునికి దానొసంగఁబడి యామునీశ్వరుఁడు చెప్పినయూడిగములను లీలావినోదమునఁ జేసి, తానును చూడవచ్చినవారును కేళీసంభరితమానసులైరి.

నెట్లో యట్లే యామె విషయములోను స్వతంత్ర దృక్పథమున వీరిశీలములను దీసికొని కవి తారుమారుజేసినాడని నాయాశయము.

రుక్మిణి.

సత్యాకృష్ణుల పాత్రలను గొంతవఱకుఁ జెడగొట్టిన యీకవి రుక్మిణియొక్కయు నారదునియొక్కయు పాత్రములను బహుచక్కఁగఁ బోషించెను. రుక్మిణి ప్రథమాశ్వాసమందును పంచమాశ్వాసమందును మాత్రమే ప్రసక్తగలిగియున్నది. ఆమెయొద్ద శ్రీహరియుండగా నారదుడు వచ్చి పారిజాతకుసుమమునిచ్చిన నాకుసుమమును శ్రీహరి యామె చేతిలోనుంచినప్పటి యామెయొక్క శీలాభివర్ణన మనిర్వచనీయమగు నానందమును బుట్టించుచున్నది. ఆనందమును, విస్మయము, పతిభక్తి, గురుభక్తి, సాధుశీలత, సౌందర్యాతిశయము, శృంగారాభినయము, ఇవి యన్నియు స్వచ్ఛములు అమృతోపమానములు నగు పలుకులతో వర్ణింపబడినవి.

చ. కనుఁగవ కన్నసన్నఁ బొలుపన్ స్మితసనాథుని కృష్ణుఁ డొసఁగ ని
చ్చినఁ దగ భోజనందనయుఁ గేకొని మౌళికి మ్రొక్కి యవ్విరిన్
దన నెఱిగొప్పునం దునిచె నవ్వలిగుబ్బలి ముద్దుపట్టి లేఁ
తనెల ధరించినట్లు మదిఁ దద్దయు మోహనకాంతిసంపదన్.

ఈ శౌరిరాణి యగు మహాసాధ్వి తనకు నాథుఁడిచ్చిన కుసుమమును సాదరముగా గైకొని మౌళికి మ్రొక్కి తనధమ్మిల్లమున దాల్చెనట! అప్పుడొక నూతనతేజస్సాహిల్ల నామె 'వలిగుబ్బలి ముద్దుపట్టి లేతనెల ధరించినట్లు' శోభిల్లెనట! ఆహా యీవర్ణనమందలి మృదుత్వము, స్వారస్యము నెంతెంతనుగోచరముగా నున్నది! మందాకినీ నది యందలి యమృతోదకమును మకరందబిందువుల నాహరించి మందమారుత మీకవిశిఖామణి జిహ్వాగ్రమునఁ జిలికెనో యనునట్లీకవిపుంగవుఁడీ పుణ్యసాధ్వీ సుగుణచారిత్రముతోయు చల్లని, తియ్యని మాటలతో దె

డి నరకాసురుడు హరించిన కుండలముల నిచ్చుటకే తాను దేవలోకమునకు వచ్చుచున్నానని కపటవాక్యముల నుడివెను. దేవేంద్రుడు నమ్మి సత్యాకృష్ణులను సాదరముగా తోడితెచ్చి తననగరియందు బ్రవేశింపజేయుటకు శచీసహితుడై తానెదురేగి వారిని కలుసుకొని తగిన విడిదియందు వారిని నిలిపెను. ఆ దినమంతయు సరససల్లాపములతోను నందనవనవిహారములతోను దేవేంద్రోపేంద్రులు గడిపిరి. ఆ మరునాడు శ్రీకృష్ణుడు దేవేంద్రుని కెరుకలేకయే నందనవనమునుండి పారిజాతవృక్షమును పెకలించుకొని బలాత్కారముగా తెచ్చుకొని పోవుచుండగా వనపాలకులద్వారా యీదుర్నయమును విని కోపోద్రిక్తుడై యమరవల్లభుడు సమరసన్నాహము, చేసికొని కేశవునితో ఘోరముగా బోరెను. అయినను చక్రధరుని మగటిమి కోర్చలేక నోడిపోయి యాతనికి సాష్టాంగపడి రక్షణవేడికొనెను. అంతట గోపాలుడు ప్రసన్నుడై యాతనిని లేవదీసి కౌగలించి ప్రియవాక్యములను బలికెను. దేవేంద్రుడు ఏమియును చేయలేక పారిజాతాపహరణమున కియ్యకొనెను. దేవేంద్రుని [illegible] యీప్రసంగమంతయు తిమ్మకవి కల్పితమే. తిమ్మకవి దేవేంద్రుని పాత్రమును చాలవఱకు చెరిచెను. మూలకథలోనున్నదానిని తన యిచ్చవచ్చినట్లు మార్చి కృష్ణునికి కుత్సితబుద్ధియు ఇంద్రునికపకీర్తియు గలుగునట్లు జేసెను.

మూలకథలో దేవేంద్రునికిని శ్రీకృష్ణునికిని పారిజాత వృక్షహరణవిషయమున చాలకాలము నారదునిద్వారా రాయబారములు జరిగెను. దేవేంద్రుడెన్ని చెప్పినను వృక్షవిసర్జనమున కియ్యకొనడయ్యె. ఉపేంద్రునకు వేరుమార్గములేక దండోపాయమే శరణ్యమయ్యెను. ఆకారణముచే నారదునిద్వారా "పారిజాతము నిచ్చుట తప్పదు. యుద్ధము తప్పదని" వర్తమానము బంపెను. కావున శ్రీకృష్ణు డింద్రపురమునకు వెళ్లిన

కవితాప్రావీణ్యఫణీశుఁడగు రాజపోషకుని కొలువులోనున్న మహాకవిసమాజమున కవితాగ్రతాంబూలమునకుఁ బెనగులాడిన యీ యిద్దఱు కవిగంధసామజముల తారతమ్యము నిర్ణయించుట యాంధ్రసారస్వతపీయూషపిపాసకుల కొక నిత్యసమస్యయైయున్నది. మనుచరిత్ర వసుచరిత్రలను సరిపోల్చి యీరెండుకృతుల యన్యోన్యాతిశయముల నిర్ణయించుట కనేకులగు నాంధ్రవిద్వాంసులు తమయపారవిమర్శనా వైశద్యమును దెలుచు నుపయోగించుచున్నారు. అంతకంటె నెక్కుడు స్వారస్యముగలిగియు గుణగ్రహణమునకు నెక్కువ సూక్ష్మమైన విమర్శనాకౌశలమునుఁ గోరెడు నీరెండవ సమస్య విద్వన్మహనీయుల దృష్టినిఁ దగినంతవరకెందు కాకర్షింపలేదో చెప్పసాహసించలేను. ఇటీవల గొందఱు పండితోత్తము లీవిషయమునుఁ బరీక్షించి యాదార్థ్యమును గనుంగొనుట కుద్యమించిరి. విశేషశేముషీసంపన్నులగు నాగపూడి కుప్పుస్వామిఅయ్యగారు తమ పరిమళోల్లాస నామకవ్యాఖ్యానమున నంది తిమ్మన్నయె యెక్కుడయు, అల్లసానిపెద్దన్నయె యెక్కుడయు, కావ్యరచనాతారతమ్యములను నిర్ణయింపఁగడంగి యిట్లు వాకొనిరి. "ఈ రెండు కావ్యములును (పారిజాతాపహరణము, మనుచరిత్రము) నిష్పక్షపాతబుద్ధితో సహృదయులు పోల్చిచూతురేని యెల్లవిధంబులను మనుచరిత్రకంటె పారిజాతాపహరణమహాకావ్యము కరంబు రసవంతమని గోచరించును." ఇట్టి యభిప్రాయమిచ్చి మనుచరిత్రమందలి దోషంబులను వారు [illegible]సిరి. కావ్యస్మృతితీర్థులగు జనమంచి శేషాద్రి శర్మగారు ప్రమోదూతసంవత్సర మాఘమాసమందలి భారతి సంచికయందుఁ బారిజాతాపహరణ ప్రబంధముగూర్చి వ్రాయుచు నిట్లు వాక్రుచ్చిరి. "భారతి యభిప్రాయమెట్లున్నను పై రెండు కావ్యముల లోను సర్వవిధముల మనుచరిత్రకంటెఁ బారిజాతాపహరణమె రసవత్తర

కావ్యంబని నాయభిప్రాయము; ననేకపండితవతంసుల యభిప్రాయము నై యున్నది.''

ఆంధ్రసారస్వతజిజ్ఞాస దీక్షాపరులలో నొకరగు అంద్ర శేషగిరి రావుగారు కొన్నివత్సరముల క్రిందట ''ఆంధ్రసర్వస్వమను బత్రికలోఁ బ్రకటించిన పారిజాతాపహరణ విమర్శనవ్యాసమున వారును నంది తిమ్మన్నకే దమ యగ్రతాంబూలము నిచ్చిరి. ఇట్లు విబుధవరేణ్యులు గొందఱు తిమ్మనార్యుని కవిత్వము బరిశీలించి పెద్దనార్యుని కవితకంటె నెక్కుడ రసవంతమని నిర్ణయించిరి. ఈవిషయమును నేనుగూడఁ గొంత విమర్శింప సాహసించెదను. సారస్వత సమస్యలు భౌతికసమస్యలుగాక యాధ్యాత్మిక సమస్యలుగా నుండును. భౌతికసమస్య లింద్రియ గోచరములై యంత్రసాహాయ్యమున భేద్యవేద్యములగును. అధ్యాత్మిక సమస్యలట్లుగాక అంతఃకరణ గోచరములై యంతరింద్రియగ్రాహ్యములుగా నుండును. సారస్వతసమస్యలు గూడ నట్లే యంతర్బుద్ధిప్రమాణములచే నిర్ణేయములగుచుండును. మానవుల బుద్ధివికాసములెట్లో యట్లే సారస్వత సమస్యల పరిష్కృతియులును. వీని నిర్ణయమునకు బ్రమాణము భావుకుల యంతరసమే. విభిన్న యనుభవాభిరుచులెట్లో కావ్యగౌరవము నట్లు. కావున క్లిష్టకావ్యసమస్యలపట్ల కవులును బండితులును బరాభిప్రాయముల నాదరించి మన్నింపదగియున్నది. కావ్యవిషయములలోఁ బ్రతిమనుజుఁడును స్వాతంత్ర్యర్తియే. అట్లయ్యు నాతని నొకశృంఖలముమాత్రము బంధించుచున్నది. అదియేదన నిష్పక్షపాతబుద్ధి. నిర్మలాంతఃకరణముతో వాఙ్మయ విమర్శనకావ్యములకుఁ బూనుకొని చేసిన విమర్శనము లేకైక భిన్నములైనను సమానాదరణార్హములే.

ఇట్లు నంశుద్ధచేతస్కుఁడనై యీయిద్దరకవుల తారతమ్యముల ను గుణదోషములను దెలుపనుద్దేశించితిని. అనుషంగికముగ వసుచరిత్ర

ఇంక నీకవిపుంగవుల సహజశక్తుల స్వరూప పరిమాణములను దె లిసికొని వారితారతమ్యములను నిర్ణయించి యానన్యత్వభేదములను స్థిర పరచుటకా కవులయందలి ముఖ్యకావ్యలక్షణమును పరికించుట ప్రధాన కార్యము. కవితావనితకు బ్రాణాధారములైనవి రసప్రాధాన్యము, భావప్రకటనము, కల్పనాసామర్థ్యము, శైలీరమ్యత, పాత్రపోషణము, ప్రకృతివిజ్ఞానసమృద్ధి మున్నగునవియని యెల్లరకు దెలిసినవిషయమే. వీనిని సాకల్యముగా విచారించినయెడల నీకవీశ్వరుల కావ్యకళా ప్రావీణ్యమును, వ్యక్తివిశిష్టత్వమును యేర్పడును.

I రసప్రాధాన్యము.

రసప్రాధాన్యమున నీమూడు గ్రంథములు నుత్తమశ్రేణిలో నుండదగినవి. వీనియందలి ముఖ్యరసము శృంగారరసము. మనుచరిత్రమును, పారిజాతాపహరణమును కేవల వ్యంగ్యకావ్యములు. వసుచరిత్రము పెక్కుతావుల శ్లేషకవిత్వముచే ననుప్రాణితమైనది. ఆకారణమున రసవిషయములో మొదటి రెండుకావ్యములకంటె నొకవాసి తక్కువయని యాధునిక విమర్శకుల యభిప్రాయము. ప్రధానరసమగు శృంగార రసమును బోషించుటలో ముక్కుతిమ్మనన్న మిన్న. అతని కావ్యమంతయు శృంగార రసావరణమున బొబ్బిల్లియున్నను, ఆశృంగారమున నశ్లీలతాదోషము కానము. పెద్దన్న శృంగారము కొన్నిచోట్ల కటువుగాను, అతిచాపల్యముగా నున్నది. రామరాజభూషణుడు రసోత్కర్షకంటె భావచమత్కృతియు, రసవికాసముకంటె శబ్దవైదగ్ధ్యమును బాటించెను.

II భావప్రకటనము, III కల్పనాసామర్థ్యము.

ఈవిషయములలో నీకువ్వురు నుత్తమములు. ఒకరినొకరు మీదుటీయని యమోఘ ప్రజ్ఞాధురంధరులు. ఒకేజాతికి చెందిన కవులగుటచే,

నైంద్రియక సౌభాగ్యము, సాభినయ భావప్రకటనము, మృదుల రసార్థ సంయోగము మున్నగు బాహ్యప్రకటనలక్షణములను ముఖ్యముగా నిరూపించిరి. శ్రీకృష్ణ సత్యభామల సంయోగ వియోగవిలాసములును, వరూథినీప్రవరుల క్రీడాప్రీడా నిరూపణములును— ఇవి యొకే తరగతిలోఁజేరిన కావ్యకళలకు దృష్టాంతములు. వీనియందు భావము, శబ్దము, అభినయము, ధ్వని— ఇవియన్నియు నింద్రియసుఖమునకు సంబంధించియున్నవి. వసుచరిత్రయోఁగూడ నీదృశమగు కళాభిరుచియే యున్నది గాని శ్లేషకారణమున నది యీరెండు కావ్యములంతవలెను తేటతెల్లముగాను, సువేద్యముగా నుండలేదు. ఉదాహరణములు:—

(1) పారిజాతాపహరణము:—

చ. అని [illegible] కనుమన్న [illegible]
డిన కచపంక్తి [illegible] చేతులు [illegible]
[illegible] మొగంబున [illegible] జం
కెన [illegible] పల్లవాగ్రగయై

(పారిజాత. ఆ. ౧)

(2) మనుచరిత్రము :—

మ. పగలెల్లం బట్టబయలింక నన్ను మునిపై బంధమూడన్ [illegible]
[illegible]
[illegible] గులకింపగా నను [illegible] నాస్యమై
[illegible] ముఖ [illegible] పైపాటునన్.

(మనుచరిత్ర. ఆ. ౧)

(3) వసుచరిత్రము :—

శా. ఆ [illegible] ల్లి వెలుంగు వల్లికలు డాయంబోక రాకానిశా
రాజశ్రీసఖమైన మోమునఁ [illegible] జొత్తు గొల్లెత్తియా
రాజీవాననయెత్తెఁ గిన్నెరపయిం బ్రాజత్కరాంభోజకాం
* భోజీమేళవిపంచికారవ సుధాపూరంబు తోరంబుగన్.

* ఈ విరహసందర్భమున కాంభోజీరాగాలాపనఁ జేయుట యేమియొప్పిదమనియు, ముఖారి, సావేరి మొదలగు శోకరసమును తెల్పెడి రాగములుండగాఁ కాంభోజీరాగము నేల కవి నిర్ణయించెనో యనియు గొందరాక్షేపించినారు.

IV శైలీరమ్యత:—

ఈవిషయమునం దీమూఁడుప్రబంధములు చాలవఱకు సరిసమానముగానే యున్నవి. వ్యక్తిభేదముచే వాచ్యలక్షణమున భేదము కాన్పించుచున్నను శ్రవణీయతారమణీయతలలో నించుకయైనను తేడా కాన్పించుట లేదు. శబ్దవిన్యాసమునను, శ్రవణయోగ్యతయందును, ఈముగ్గురుకవులును బ్రత్యేకమార్గములబోయి తమతమప్రతిభను జూపిరి.

సరళాక్షరములును, దీర్ఘస్వరములును గలశబ్దజాలము నతిబహుళముగా గలిగియున్న శయ్యను వాఁడుటలో పెద్దన్నయే మొదటివాఁడని నాకు సాధ్యమైనకావ్యపరిచయముబట్టి నమ్మకమున్నాను. ఇతనికి వెనుకటికవులు సందర్భములనుబట్టి యప్పుడప్పుడట్టి శైలిని వాఁడుచు వచ్చిరిగాని ప్రత్యేకముగా నట్టి శైలియే కవితామాధుర్యమున కనుగుణమని తలంచినవారు కారని నాయూహ. పెద్దన్నయుఁబలెగాక దీర్ఘస్వరయుతసరళాక్షరసంధాన మొకముఖ్యలక్షణముగా గారవించుటచే నట్టి శైలిని

---

రామరాజభూషణుఁడు మహాకవియేగాక గొప్ప సంగీతవిద్వాంసుఁడును. వీణాసాధనమునఁ గొన్ని నూతన కల్పనలు చేసినవాఁడని ప్రతీతికలదు. అట్టి మహావిద్వాంసుఁడు రాగవిషయములో నసందర్భపు సూచనజేయుట యెంతమాత్రము పొసఁగదు. కావున కాంభోజీరాగాలాపనము గిరికచే నీసమయమున జేయించుటకు తగినంతకారణముండితీరును. అదియేదనిన సంగీతప్రియులకు ముఖ్యముగా తెల్లముకాగలదు. ముఖారి, సావేరి మొదలగురాగములు శుద్ధశోకరసమునుఁ దెలిపెడివి. కాంభోజీరాగమట్లుగాక సంతుష్టస్వాంతమునందు శోకవికారమును తెలిపెడిరాగము. గిరిక కేవలము దుఃఖితురాలగుటకు కారణములేదు. తనప్రియుడు తన్ను వలచినసంగతి తెలిసి సంతుష్టురాలై యాతనికొఱకెదురు చూచుచు విరహాతురతచే శోకించుచున్నది. ప్రమోదమునోత్సుకత ప్రియపరిత్యాగమువంటిది కాదు కదా. కావున సంతోషమిశ్రితమైన శోకమును దెలియఁజేసెడి రాగమే యిక్కడ సమయోచితము. అట్టిది కాంభోజిరాగమే. దీనికే 'కీట్సు' మహాకవి "Pleasing sadness" అని పేరు పెట్టినాడు.

వ్రాసినపద్యములవరుస లనేకములు మనుచరిత్రమందు చాలాస్థలము లలో గాన్పించుచున్నవి. అట్లయినను ప్రతిభాశాలియగు నిజమైన కళాభిజ్ఞుఁ డగుటచే నీశైలీరహస్యమును గుర్తించినను ఆచరణమందుఁ గొంత నైపుణ్యమును, సయమమును, బాటించినవాఁ డయ్యెను. ఆకారణమున స్వరమధురిమ మతిమాత్రము గాక తదితరలక్షణములతో నొకటియై వినుగుపుట్టింపకుండును.

రామభూషణుఁ డీశైలీరహస్యమును పెద్దన్నయందు కనిపెట్టి దాని ననుకరించుచు తాను స్వయముగా గొప్పసంగీతవిద్వాంసుఁ డగుటచే మరియొక మెట్టు పైకిఁ బోయెను. పెద్దన్న కవిత్వమునకును సంగీతమునకును దగ్గరసంబంధము గుర్తించినను తారుమారు చేయలేదు. భూషణుఁ డట్లుగాక తనకవిత్వము సంగీతముగానే యుండునట్లు బహువిధముల శ్రమపడి పద్యములను రాగాలాపమునకు కుదురునట్లు చేయుటకై యనుకూలశబ్దములకొఱకై యప్రస్తుతాంశములను జేర్చి కొంచెము హెచ్చుతక్కువగా దీక్షితులవారు కృతులు రచించినట్లు పద్యములను రచించెను. ఇట్లు సంగీతప్రక్రియచేఁ దనకవిత్వమును మేళవించుచు. సర్వేసర్వత్ర దీర్ఘస్వరయుతపదకలితమగు శయ్యనే వాడుచు వచ్చెను. ఆకారణమున నీతని శైలియందు శ్రుతిచాపల్యమునకుఁ దగిన నానారుచిత్వములేక యతిమాధుర్యమువలనఁ బుట్టెడు యరుచి శీఘ్రముగా జనించును.

ముక్కుతిమ్మన్న యట్లుగాక నైసర్గికముగానే శ్రుతిమాధుర్యమగు శైలిని నుపయోగింపగలిగెను. మృదుత్వము, మాధుర్యము, కమనీయత, ఈతనివాజ్ఞానసములకు సహజములు. వానికొఱకీతఁడు ప్రయత్నములు సలుప నవసరములేదు. అరవిందమునం దామోదము, మకరందమందు మాధుర్యము, ఎట్లు ప్రకృతిజనితములో యట్లే యీతని కవి

మృదుభాషియైన జాలునా? వాఙ్మాధుర్యము కొంతవఱకు నుపకరించును గాని సమస్తావస్థలలోను స్వతస్సిద్ధముగా సరిపోవునా? కావున ముక్కు తిమ్మన్నకవితాశైలి మృదువైనను మధురమైనను మానవహృదయవికాసములగు భావతరంగము లన్నిటిని సమగ్రముగను సమార్థముగను జూపగల వైవిధ్యమును, దార్ఢ్యమును గలిగియుండ లేదని నాతలంపు. రామరాజభూషణుడు పెద్దన్నవలెనే యన్నిభావములయందును యథార్థముగ నుదాత్తానుదాత్తస్వరితశైలి పొసగునట్లు చేయగలిగినదిట్ట.

V పాత్రపోషణము:—

పాత్రపోషణమున నీరెండు కావ్యములు— పారిజాతాపహరణమును, మనుచరిత్రమును, సమానస్థాయి నలంకరించుచున్నవి. మానవప్రకృతిలో స్త్రీపురుషుల శృంగారరససంబంధమగు భావవికారములు-ముఖ్యముగా స్త్రీజాతియొక్క హృదయరంగమునఁ దాండవమాడు ప్రేమేర్ష్యాదిగుణావగుణములు స్వభావసిద్ధముగా స్త్రీ యుచితమైన పరిభాషతో జాతీయముగా సుకుమారపదసంఘటనమున నీరెండుకావ్యముల యందు నభివర్ణింపఁబడినవి. మనుచరిత్రమందలి పాత్రావళి పారిజాతమునందుకంటె నెక్కువ సహజముగానుండి నానావిధగుణరూపములు గలిగి యున్నవి. పెద్దన్న కూడ తనపాత్రములను లోకస్వభావమున కనుగుణముగానే చిత్రించెను గాని తిమ్మన్న చూపఁగలిగిన జాతీయతను ప్రకృత్యనుకరణమును సాధింప లేకపోయెను. పెద్దన్న వాడినభాష కావ్యసంప్రదాయమున నాడంబరముగు గౌరవస్థానమును బొందినది; కావున నది జీవితప్రకృతికి భావమునఁ గాకపోయినను భాషయందు దూరమైనది. తిమ్మన్న యట్లుగాక స్త్రీజల్పితములను యథారూపముగా జిత్రించుటచే మానవస్వభావమునకు మరింత దగ్గరగా తనకవిత్వమును జేర్ప గలిగెను.

వసుచరిత్రకారుఁడు తన పాత్రలను లక్షణగ్రంథములకు సరిపోవునట్లు జిత్రించెను. భావము, భాష, రసనిర్వహణము, అనల్పకల్పనా-చాతుర్యము లన్నియు ప్రబంధలక్షణములకు సరియైనలక్ష్యములుగా నున్నవో లేవో యని పరిశీలించుకొని వ్రాసినట్లు. పాండిత్యప్రాగల్భ్యత నీతని విషయమునను జూపినాఁడు.

VI ప్రకృతివిజ్ఞాన సంపత్తి:—

మనుచరిత్రమందు ప్రకృతివిజ్ఞానము స్వాభావికముగాను, అధికముగాను జేర్పఁబడినది. గిరిగహనసరోవరాదివర్ణనములలోను, సముద్రాఘాటప్రవాహాదివర్ణనములలోను, ఉత్ప్రేక్షలకంటె స్వభావోక్తులో యెక్కువ తెలియ గోచరించుచున్నది. పెద్దన్న తనజీవితములో కనినవియు వినినవియు యథాతథముగాఁ జిత్రించినట్లు భావింపవలసియున్నది. ఈవిషయములో నీతఁడు యాంగ్లేయమహాకవులగు వర్డ్సువర్తు టెన్నిసనువంటి మహాకవులతో సరిపోల్పఁదగినవాఁడని నిస్సందేహముగా ననవచ్చును. ముక్కుతిమ్మన్న యట్లుగాక సాధారణముగాఁ గావ్యపురాణాదిగ్రంథములనుండి తాను నేర్చినవిజ్ఞానమునే తెలుపువాఁడెను. అతఁడు రచించిన కథ ముఖ్యముగా దేవతలతోను, స్వర్గముతోను సంబంధించిన దగుటచే పౌరాణికవిజ్ఞాన మెక్కుడవసరమైనదని యొకసమాధానము చెప్పవచ్చును. ఈసమాధానమందు యథార్థము లేకపోలేదు. అయినను స్వర్గముతోను దివౌకసులతోను సంబంధములేని భాగములు కొన్ని కలవు. వానియందైనను స్వకీయానుభవములు చేర్చుట కవకాశము చేసికొనవచ్చును. సత్యభామాశ్రీకృష్ణుల స్వర్గప్రయాణమున మేరుగిరివర్ణనము చేయుచు గంధర్వవిద్యాధరకిన్నరాదిజనులవర్ణనములు పురాణములనుండి తీసికొనుట సహజమే; గాని ద్వారకాపురమందలి నిశావర్ణనముగూడ కావ్యములందున్న కవిసాంకేతికవర్ణనములతోనే నింపుట కేమి యగత్యము కలి

గనుక ఋతువర్ణనముల యందైనను ప్రకృత్యనుభవము ముఖ్యముగా నున్నది. స్వీయానుభవము లుపయోగించని కారణమున నీకవీశ్వరుఁడు స్వభావోక్తికంటె నుత్ప్రేక్షయే యెక్కువ తఱచుగా వాడుకొనెను. ఉత్ప్రేక్షయందనుభవముకంటె ననుభావనయే యెక్కువగా నుపచరించును; కావున ప్రత్యక్షానుభవములు కూర్చుకొనలేని కవిపుంగవున కుత్ప్రేక్షయే శరణ్యము.

వసుచరిత్రయందలి ప్రకృతివర్ణనములలో చాలచోట్ల స్వాభావిక విషయములు చూపట్టుచున్నవి. అయినను నాయా సందర్భములలో భూషణుఁడు యుత్ప్రేక్షాకల్పితములగు శ్లేషలను చొప్పించుటచే నావర్ణనములు నిర్వక్రగతిని హృదయంగమము లగుటలేదు. శుక్తిముక్తికోలాహలాదుల పరస్పరసంశ్లేషమున మాత్రము శ్లేషాశ్రితవర్ణనము సమయోచితము నుపోద్బలితమైనను తదితరములగు పెక్కుతావుల శ్లేషస్థానములును, అనవసరములును, కావున నీకావ్యమందు ప్రకృతివర్ణనమునకు స్వచ్ఛమగు ప్రతిఫలనము కవి యొసంగలేదు.

ఇట్లీ ముగ్గురు కవుల నుత్తమకవి కావ్యమూలములను విమర్శింపఁగఁ దేలిన సారాంశము:—

(1) పస్తైవేశ్వరనాభాసములలో నొకరికంటె నొకరెక్కువ తక్కువ యని నిర్ణయింప వీలులేదు.

(2) రసపోషణమున ముగ్గురు నుత్తమశ్రేణియందున్నను రాజభూషణుఁ డొకవాసి పెద్దనకంటెఁ దగ్గును.

(3) భావప్రకటనము కల్పనాశక్తియందును నీయిద్దరు కావ్యములును సమానముగానే యున్నను, శ్లేషకారణమున వసుచరిత్రము కొంచెము తగ్గును.

యాయావస్తువుల నామూలపరీక్షచేసి గుణాతిశయములను గుర్తించి సహేతుకజ్ఞానమున శాశ్వతానంద మనుభవించును. ఈవిధమున నవిమర్శదృష్టిని పారిజాతాపహరణకావ్యమును బరికించి గుణదోషములను వేరుపరచి హెచ్చుతగ్గులను నిర్ణయించుట కేవల కావ్యామృతపిపాసువులకు జుగుప్సాకరముగ నుండవచ్చును. అయిన నిట్టియాహ్లాదభంజకవివేచనకార్యము చేయుట విమర్శకుని విస్పష్టధర్మమని నాయాశయము. అట్లు చేయుటచే నామహాప్రబంధము దభిమానముగాని యామహాకవియం దాదరణముగాని కొఱవడిన ట్లూహింపవగదు.

తిమ్మరసువంటి మహామంత్రులును, రామలింగనాయకునివంటి మహాయోధులును నిలచిల్లి యాంధ్రపౌరుషములు ప్రాంతవచరిత్రమం దచలరూపము దాల్చునట్లు చేసిన శ్రీకృష్ణదేవరాయల కాలములో మహాకవులుకూడ నాంధ్రసారస్వతము నాచంద్రార్క విఖ్యాతి గలుగునట్లు చేయగలిగిరి. ఆంధ్రసైన్యములు దేశమంతటను వ్యాపించి విజయధ్వానములతో దిక్కులు పిక్కటిల్లునట్లు చేసెనో, అట్లే యాంధ్రవాణియు మహాప్రబంధములను నిర్మించి "దేశభాషలందుఁ దెనుగులెస్స" యని సువర్ణాక్షరములతో లిఖించెను. ఆపవిత్ర భాషామతల్లి యాస్వర్ణయుగమునం దన గారాపుబిడ్డలగు నాంధ్రులకుఁ బ్రసాదించిన దివ్యప్రబంధరత్నములలో నొకటి యీ పారిజాతము.

నంది తిమ్మన్న కవి బ్రహ్మాండప్రౌఢసరస్వతికి ముద్దుబిడ్డడు. ఆ దేవమాత యతనికి తియ్యనిపాలను, మున్నని వెన్నను, కమ్మని తేనెనుఁ బెట్టి పెంచి పెద్దచేసి దేవతలారగించె డమృతరసమునుకూడ నాతని జిహ్వాగ్రమున నించుక చిలుకరించెను. మధురరసాస్వాదనపరుడైన తిమ్మకవిచంద్రునినోటను మధురభాషలు తప్ప మరి యితరపలుకులెట్లు వచ్చును? బాలరసాలనవపల్లవఖాదియైన కోకిలము మంజులరవములు

తప్ప మరియొండువిధముగఁ బలుకఁగలదా? నవ్యనవనీతమువలె మృదువై చల్లనై, మకరందబిందుసందోహమువలె మధురమై, ద్రవమై, యతని వాక్కు కవితాలాలసుల హృదయసీమల నిర్మలానందమొదవించు చుండును. సమకాలీనుడగు నొక భట్టుకవి తిమ్మకవిఁగూర్చి యిట్లు పలికెనట:—

క॥ మాకొలదిజానపదులకు
నీకవితాశైలి యబ్బునే కూపనట
ద్భేకములకు గగనధునీ
శీకరముల చెమ్మ ? నందిసింగయతిమ్మా ?

ఈస్తుతికి సర్వవిధముల నీమహాకవి యర్హుఁడే !

చల్లని పిల్లవాయువులు వీచుచుండ, అల్లనవిచ్చు క్రొన్ననవిరుల నెత్తావులు గ్రమ్ముచుండ, తేనియందాసక్తి యింతెఱిగములు ముసురుచుండ, హస్తమున హస్తమునిడి, మందమందగమనమున నొయ్యారంపునడకలనడచు నిలింపదంపతుల నొకచోట పొలయలుకల యకలంక భాషణములతోను, వేఱొకచోట నెయ్యంపు సయ్యాటమున తమిరేఁగిన ప్రణయకూజితములతోను నిండి నిండుసోయగమున మెఱుఁగుకొనియుండు నుద్యానవనముభోలె నీతని ప్రబంధము సంగీతసాహిత్యసౌందర్యములతో నలరారుచూ, కమనీయగంభీరశైలీయుతంబై యెసలారుచు, వీనులకువిందై, హృదయమునకు పొందై, ఆంధ్రభాషావధూటి కెనలేని యందమై, యెల్లకాలములయందు విరాజిల్లుచుండును. పెద్దన్న తనకన్న పెద్దయైనను తనవలె మృదుభాషణముల ముచ్చటలాడఁగలిగెనా? మల్లన్న తనవలె మృదువుగ మాట్లాడనేర్చినను, ముద్దులొలుకు మురిపెంపు పలుకులు పలుకరింపఁగలిగెనా? ఇంక నితరకవులమాటలేల? ఆంధ్రవాగ్దేవి తన యసమాన రసమును మృదుత్వమును తిమ్మననోటఁ జెప్పింపఁగలిగినట్లు, ఇతరకవులచేఁ జెప్పింపలేదు. అదియే యీతిమ్మకవియందలి యప్రతిమ ప్రతిభాగౌరవవిశేషము!

# ఆఱవ అధ్యాయము



## మాదయ్యగారిమల్లన్న—రాజశేఖరచరిత్రము.

శ్రీకృష్ణదేవరాయుల యాస్థానమందలి కవులలో మాదయ్యగారి మల్లన్న యను కవివరుఁడుండెను. ఆతఁడు రాజశేఖరచరిత్రమను నొక చక్కని ప్రబంధమును రచించి కృష్ణదేవరాయని మహాప్రధాని యగు సాళువ తిమ్మరుసుయొక్క మేనల్లుఁడు నల్లుఁడు నగు నాదెండ్ల అప్పయ మంత్రి కంకిత మిచ్చెను.

మల్లనకవి కృష్ణదేవరాయుల యాస్థానమం దున్నట్లును, ఆచక్రవర్తి కొకప్రబంధ మంకితము చేసినట్లును రాయవాచకమందలి యీక్రింది వృత్తాంతమువలనఁ దెలియవచ్చుచున్నది.

"రాయలవారున్ను చాలా సంతోషపడి, ముక్కు తిమ్మయ్య, అల్లసాని పెద్దయ్య, మాదన్నగారి మల్లయ్య మొదలైన కవీశ్వరులతో కృతులందుకోవలెనని కవితానాయకులతో పలుకరించ్చి, ఆతీరున అయ్యాని అనంగా, కుళ్లాయి, కబ్బాయి, తాళి చొకట్లు, చేసరిపేరులు, కొకతాకలు యిచ్చి పారిజాతాపహరణమున్ను, మనుచరిత్రాను, చెప్పుమని ఆనతిచ్చినారు." (రాయవాచకము-116 పుట)

కాని, మాదయ్యగారిమల్లన్నవల్ల నేగ్రంథము కృతిపొందిరో రాయవాచకముంబట్టిగాని, తదితరాధారములంబట్టిగాని తెలియరాలేదు. ఈకవి వ్రాసిన గ్రంథ మొక్కటియే- అనఁగా, రాజశేఖరచరిత్రము మాత్రమే కాన్పించుచున్నది. దీనిని కృష్ణదేవరాయలకుఁగాక నాదెండ్ల అప్పయమంత్రి కంకితముఁ జేసినాఁడు. బహుశః మఱియొకగ్రంథము

రచించి కృష్ణరాయనికిఁ గృతియిచ్చి యుండవచ్చును. అది కాలప్రవాహములో మునిఁగి యదృశ్యమైన దేమో !

అల్లసానిపెద్దన్న, ముక్కుతిమ్మన్న మున్నగు కవులతో నీకవియుఁ గృష్ణదేవరాయలు దిగ్విజయదండయాత్రలకుఁ బోయినపు డాతని శిబిరములోనే రాజసాన్నిధ్యమున నుండుచుండెను. ఈవిషయమునుఁ గూడ రాయవాచకమువల్లనే తెలియవచ్చుచున్నది.

(రాయవాచకము: 89 పుట.)

కుమారధూర్జటియు నీవిషయమును దన కృష్ణరాయవిజయము నం దుదాహరించెను. విజయపుర మహమ్మదీయ నవాబులను జయించిన వెంటనే యాశిబిరములో నుండఁగానే యీముగ్గురుకవులును విజయ స్తోత్రములతో శ్రీకృష్ణదేవరాయలను గొనియాడిరంట !

(కృష్ణరాయవిజయము. ఆ. 3.)

గీ. సరసాహిత్యరచన విస్ఫురణమెరయ
సాధుముఖసూక్తి మాదయగారి మల్ల
నార్యుఁడల యల్లసాని పెద్దార్యవరుఁడు
ముక్కుతిమ్మన మొదలైన ముఖ్యకవులు.

క. వినుతించిరపుడు వారికిఁ
గనకాంబర భూషణములు ఘనతనొసఁగియా
జనపతి డప్పాజిఁ గనుం
గొని యిట్లని పలికె నపుడు కుతుకంబలరన్.

(కృష్ణరాయవిజయము ఆ. 3 ప. 48, 49.)

## కృతికర్త వంశము.

మాదయామాత్యునిపుత్రుఁడగు మల్లన్న శైవబ్రాహ్మణుఁడు. ఈతనిది శౌనకసగోత్రము. అయ్యంకిపురమునకు నధికారి. ప్రస్తుతము

కృష్ణాజిల్లా దివి తాలూకాలో నున్న అయ్యంకి గ్రామమే యిది కావచ్చును.

ఉ. శంకరపాదసేవనవశంవదమానసపంకజాత ని
శ్శంకవచోవిలాసరుచిసాగరనిర్జితపూర్ణపూర్ణిమై
ణాంక దురక్షరాననభయంకర శౌనకగోత్రపాత్ర య
య్యంకిపురాగ్రహారవిభవాకర మాదయమల్లసత్కవీ ?

(రాజశేఖర చరిత్రము.)

ఈ కవి శైవమతావలంబకుఁడయి యఘోరశివాచార్యుని శిష్యుఁడుగా నుండెను. ఈ యఘోరశివాచార్యుఁడే ముక్కు తిమ్మనకు నతని మేనమామయైన ఘంట సింగన్నకునుగూడ దీక్షాగురువుగా నుండినట్లు వారిగ్రంథములవలనఁ దెలియవచ్చుచున్నది. మల్లనకవి శైవదీక్షయేగాక సారస్వత ప్రజ్ఞగూడ నీగురువునుండి నేర్చికొనిన ట్లీగ్రంథమందలి యాశ్వాసాంతగద్యములవలనఁ దెలియవచ్చుచున్నది. "ఇది శ్రీమదఘోరశివాచార్య గురుకరుణావిశేషలబ్ధసారస్వత మాదయామాత్య పుత్రమల్లయ్యానామధేయప్రణీతం బైన రాజశేఖరచరిత్రంబు—".

కృతిపతి వంశము.

కృతిపతియగు నాదెండ్ల అప్పయ్యమంత్రి యాకాలమున ననఁగా ౧౫ వ శతాబ్దాంతమునను, ౧౬ వ శతాబ్దప్రారంభమునను- ప్రసిద్ధకుటుంబమునకుఁ జెందినవాఁడై తాను గొప్ప యుద్యోగమును జేసి ప్రఖ్యాతపురుషుఁడుగా నుండెను. ఈతనిది యాఱువేలవంశము. విశ్వామిత్రగోత్రము. ఈతని యింటిపేరగు నాదెండ్ల యొక గ్రామనామము. నాదెండ్ల యనెడుగ్రామము గుంటూరుజిల్లా, నరసారావుపేఁట తాలూకాలో నున్నది. కాఁబట్టి వీరివంశము మొదటినుండియు గుంటూరుసీమయందే వెలసియుండెనని చెప్పవచ్చును. ఈయప్పయమంత్రి విజయనగర

సామ్రాజ్యచక్రవర్తి యగు కృష్ణదేవరాయల శిరఃప్రధానియైన సాళువ తిమ్మరసునకు మేనల్లుఁ డని చెప్పినమాత్రముననే యాతని వంశప్రతిష్ఠ స్పష్టమగుచున్నది. అయినను నాదెండ్ల అప్పయమంత్రి ప్రసిద్ధి తిమ్మరసుమూలముననుం, నాతని సంబంధమువలననే గాక స్వకీయవంశపారంపర్యమునఁ గూడ వచ్చినదని చెప్పుటకుఁ జాల నాధారములు గలవు. ఈతనివంశవృక్షము రాజశేఖరచరిత్రమం దిట్లు గాన్పించుచున్నది.

నామనమంత్రి — సింగాంబ.

అమలమ్మ × నాదెండయ్య

గంగన్న

చిట్టిగంగన్న
(సాళువ నృసింహరాయని ముఖ్యమంత్రి)

ప్ప

నాథన

రామచంద్రుఁడు

గోపమ్మ × పెదయ్య

కృష్ణమాంబ × తిమ్మన్న
వ
త్ర రసు
రి)

చిన్నతిమ్మన్న

కొండయ్య

అప్పయ్య × తిరుమలమ్మ
(సాళువతిమ్మరసుకూఁతురు)

గోపయ్య

కావున నీయప్పయ్యవంశములోఁ బూర్వులుఁ గొండఱు విజయనగరరాజ్యమందున దండనాథులుగాను, మహాప్రధానులుగాను నుండుటచే, అప్పయ్యకుఁ బూర్వమే యీనాదెండ్లకుటుంబము బహుళవిఖ్యాతిఁ బొందెనని విశదమగుచున్నది. అప్పయ్య తాతయుఁ, దండ్రియును దండనాథులుగా నుండినట్లును అప్పయ్య ముత్తాతయగు చిట్టిగంగన్న

సాళువనృసింహరాయలయొద్ద మంత్రిశేఖరుఁడుగా నుండినట్లును నీగ్రంథమందలి వంశవర్ణనవలనఁ దెలియుచున్నది. చిట్టిగంగన్న మహాప్రభావవిషయ మీక్రిందిపద్యములలో విశదమగుచున్నది.

ఉ. సాళువనారసింహమనుజప్రభుకార్యకళాధురంధరుం
డై లవణాబ్ధివేష్టితధరాధిపదుర్మతమంత్రిమంత్రిగుం
డాలవితానకేసరి యనంగ ననంగసమానరూపరే
ఖాలలితాంగుఁ డిట్టిచిటిగంగన యొప్పు గుణానుషంగుఁడై.

శా. అంగాధీశకళింగరాజమగధాన్యక్షాదిభూభృత్సభా
రంగాభంగవిహారముల్ ఘనశిలాగ్రాగస్థలీసంగస
ద్గంగోత్తుంగతరంగనిర్గతనిధ్యానోద్భవప్రక్రియా
సాంగత్యంబులు చిట్టిగంగవిభురాజాసంగ్రమారంభముల్.

ఇట్లీయప్పయ్య వంశస్థులు చాలకాలము నుండియు విజయనగర రాజుల కొలువులో గొప్పయుద్యోగములు చేసి విస్తారమగు కీర్తి గడించినవారే. ఇట్లుండఁగా అప్పయ్యమంత్రి తండ్రి యగు తిమ్మన్న కృష్ణదేవరాయల మహామంత్రి సాళువ తిమ్మరసు సోదరి, కృష్ణమాంబను వివాహ మాడుటచే నటుకుఁ బూర్వమే పేరుప్రతిష్ఠలుఁ బొందిన యీ కుటుంబము మఱింత ప్రఖ్యాతి నహించినది. ''నాదెండ్ల అప్పయామంత్రి తిమ్మనకగు గోపమంత్రి సంస్కృత ప్రబోధచంద్రోదయమునకుఁ దానురచించిన చంద్రికయను వ్యాఖ్యానమునఁ దన వంశక్రమమును జెప్పుకొని తా మిద్దఱు సాళువ తిమ్మరసు యొక్క భాగినేయులని చెప్పెను.''

''తస్య శ్రీకృష్ణరాయనృపాన్విజ్యరాజ్య దురంధరః
కులక్రమాగతో మంత్రీ సాళ్వతిమ్మచమూపతిః
ఆపూర్వ పశ్చిమసముద్రమధత్త రాజ్యం

మైనవియే. ఈవిషయ మాతనివిశాలహృదయమును, శివకేశవాభేదతాత్పర్యమును విశదపఱుచుచున్నది.

ఆకాలపుమహాపురుషు లందఱవలెనే యప్పయ కేవలము మంత్రాలోచనయందే గాక దండనాథుఁడై ఘోరరణములనుగూడఁ జేసియుండెను. ఈవిషయ మనేకస్థలములలో నీగ్రంథమున సూచింపఁబడినది.

శా. స్వర్భామాజనకీర్తనీయగుణసంఘా తద్విట్ప్రతాపోగ్రమ
స్వర్భానూద్భటపారసీకఖరిచీసౌవీరఘోటీశ్వరా
విర్భూతోద్భలధాటిఘాటిధరణీవిర్భావఘాతార్జునా
గర్భస్థాపితభూర్భువప్రముఖలోకస్వచ్ఛకీర్తిచ్ఛటా !

నాదెండ్ల గోపమంత్రి రచించిన 'కృష్ణార్జునసంవాద' మనెడు నాంధ్రద్విపదకావ్యములోఁ దనయున్నయగు నప్పయమంత్రిని గుఱించి యిట్లు వర్ణించెను.

ద్విపద. "అంతు నప్పయమంత్రి యాచకలోక
మందారభూజసమాన వైభవుఁడు
రాజశేఖరచరిత్రకు నధినాథుఁ
డాజికిరీటి మహాభాగ్యయుతుఁడు
చింతామనోహర కాంతివిస్ఫురుఁడు
కంతుజయంతసంకాశుఁడై తవరి
శ్రీయశోనిత్యుండు శ్రీకృష్ణదేవ
రాయసామ్రాజ్యభారధురంధరుండు
బలవదరాతిభూపతినుతపాద
తలుఁడు సాళువ తిమ్మదండనాయకుఁడు
లక్ష్మమహాదేవిలాగున నొప్పు
లక్ష్మమ్మకు జనించి లాలితలీలఁ

బెరిఁగిన తిరుమలాంబికఁ బెండ్లియాడి
నిరుపమప్రాభవనిత్యుఁడై వెలసె.''

మల్లనకవి తనరాజశేఖరచరిత్రమును నప్పయమంత్రి కంకితముఁ జేసినను, గ్రంథమందుమాత్రము అప్పయకంటెఁ దమ్ముఁ డగు గోపయ్యనే యెక్కువగాఁ గీర్తించునట్లు గాన్పించుచున్నది. శిలాశాసనాదికములలోఁ గూడ నప్పయకంటె గోపయ్యయే యెక్కువసమర్థుఁడైనట్లు గోచరించుచున్నది. ఇంతయేల కృష్ణదేవరాయలు నూతనముగా జయించిన కళింగరాజ్యభాగమునకు మూలకంద మనియు, జీవస్థాన మనియుఁ జెప్పఁదగిన కొండవీటిదుర్గమున కితనినే పాలకునిగా నియమించినవిషయమాలోచించినయెడల గోపయ్య యధికతరప్రాభవము నిశ్శంకముగా ద్యోతక మగుచున్నది. గోపనమంత్రి చాణక్యప్రజ్ఞగలవాఁడై భట్టి యుగంధరులవలె రాజనీతియం దప్రతిమానుఁడై యుండెను. రాజశేఖరచరిత్రమందు గోపయ్యమంత్రి గుత్తిదుర్గపరిపాలకుఁడుగాఁ జెప్పఁబడినాఁడు. అట్లే మంగళగిరిశాసనములో నప్పయమంత్రి మొట్టమొదట కొండవీటిదుర్గమునకు నధికారిగా నిర్ణయింపఁబడినట్లున్నది. తరువాత గోపయ్య కొండవీటికిని, అప్పయ్య వినుకొండ మున్నగు దుర్గములకును నియమింపఁబడినట్లుఁ దెలియవచ్చుచున్నది. ఈ విషయము లన్నిటిని బరికించి చూడఁగాఁ దూర్పుదేశము పాలనాధౌరంధర్య మీయిద్ద అన్నదమ్ములకును నొప్పగింపఁబడి వారిలోవారే కగ్రీవముగఁ జక్రవర్తి యనుమతిని విభజించుకొని పరిపాలకదేశములు మార్చుకొనియు సామ్రాజ్యమునకు లోటులేకుండఁ గొనసాగించి రని చెప్పవచ్చును. వీ రిద్దఱును బరస్పరము ప్రేమవిశ్వాసపాత్రులై రామలక్ష్మణులవలె మెలఁగుచుండిరఁట—

క. అయనుఁగుందమ్ముఁడు విన
యాయతమతిఁ గొల్వ నప్పనార్యుఁడు నతఁడుం

దండ్రియాజ్ఞ శిరసావహించి, ధనుర్బాణములను గైకొని మంధరపర్వతప్రాంతమున నాపిశితాశనుని దార్కొని యాతనితో ఘోరయుద్ధమును జేసెను. రక్కసుఁ డాహవమున నిలువలేక, పాఱి, మహాకాళిపిఱుంద డాఁగెను. రాజశేఖరుఁడు వెన్నంటి దేవ్యాలయముఁ జొరఁగా మహాకాళి ప్రత్యక్షమై రాజశేఖరుని శౌర్యప్రతాపములను మెచ్చి, రక్కసుని క్షమింపుమని కోరి రాజకుమారున కొక దివ్యమణి నిచ్చెను.

కాళికాలయమున రాజశేఖరుఁ డుండఁగా నొకయోగిని వచ్చి యానికుమారిక యగుభానుమతిని దెచ్చి యాతని కొప్పగించి, యాతని కొక త్రికాలవేది యగు చిలుకను గానుకగా నిచ్చెను. రాజశేఖరుఁడు సముచితముగ సంతసము వెలిపుచ్చి యటనుండి మునిసహాయమునఁ బదరికాశ్రమమునకుఁ బోయి, యచ్చటనున్న తాపసులను సేవించి, వారిదీవన లొంది భానుమతినిఁ దల్లి కొప్పగించి తిరిగి వచ్చుచుండఁగా నిదాఘాతపశ్రమచే నొకసరోవరమునొద్ద విడిసెను. ఆసమయమునఁ గొలనిలో స్నానముఁ జేసి సఖీజనపరివృతయై వచ్చుచున్న యొకరాజకన్యను జూచి, తక్షణమే మోహించెను.

ఆమె యెవ్వతె యని చిలుక నడుగఁగా నాచిలుక యిట్లు చెప్పందొడంగెను. "ఈకన్య అరుణపురపురాజైన కీర్తిపాలునికూఁతురు. ఈమె కొండొకశాపకారణమున నిట్టిరాజునకు జనించినది. అది యెట్లనఁగా :— ఈ యరుణపురమందే యిద్దఱుబ్రాహ్మణు లిరుగుపొరుగుల వసించుచుండిరి. వారిలో ముకుందుఁ డనువాఁడు ధనికుఁడు. అరుణుఁడు నిర్ధనుఁడు. అరుణునిభార్య ధనార్జనమునకుఁ దనపతిని దేశాంతరము పంపెను. అతఁడు యమునానదీతీరమున విష్ణునిగూర్చి తప మాచరించుచుండఁగఁ బుష్పవతీపురరాజైన నందకుఁ డను గంధర్వనృపాలకునితనయ యగు లతయును, మహేంద్రనగరభూజాని యగు చిత్రవాహనుఁ డను యక్షునిపుత్రిక యగు కనకమంజరియును జలకమాడుటకు నదీతీరమునకుఁ బోయి యచ్చట నొకచెట్టునుండి వ్రేలాడుచున్న పూగుత్తియకొఱకుఁ దగవులాడి, యొకరినొకరు రాక్షేపించుకొనుచుఁ, గనకమంజరి తనచెచ్చెలియగు లతను జూచి, యదిగో దవ్వులఁ దప మాచరించుచున్న యామునిపుంగవునిఁ దపోభంగముఁ జేసి యాతని కుసుమాస్త్రవశునిగఁ జేయుఁగల సమర్థత మనలో నెవ్వరికున్నదో చూత మని పంతము వైచెను. అంత లత యాతాపసుని దగ్గఱకుఁ జేరి తనమోహనవిలాసములఁ జూపనారంభించెను. ఆజడదారి విష్ణునిగూర్చి

తప మాచరించుచున్న యరుణుఁడే. కావున నాభూసురోత్తముఁడు లతాకన్యయొక్క యౌవనోద్రిక్తనిర్హేతుకసాహసమునకుఁ గినిసి యామెను శపించెను. తచ్ఛాపవశమున నీసింధుపతి కామె పుత్రికయై జనించినది. ఈకన్యపేరు కాంతిమతి." అని శుకము చెప్పెను.

కాంతిమతికూడ రాజశేఖరుఁ జూచి వెంటనే మోహపాశమునఁ జిక్కెను. యువతీయువకు లిద్దఱు విరహాతురులై తమతమస్థానమున సోలుచుండిరి. కాంతిమతి తనచెలికత్తెను రాజశేఖరునియొద్దకు దూతికగాఁ బంపెను. రాజశేఖరుఁడు కాంతిమతియొద్దకుఁ జిలుకను పంజరమున నిడి యాదూతికద్వారా పంపెను. ఆచిలుక సింధుపతియొద్ద నిలిచి రాజశేఖరునికులగోత్రములను, గుణగణములను స్తుతించుచు నుపన్యసించెను. సింధుపతి సంతుష్టుఁడై రాజశేఖరునింటి రాజకుమారుఁడు అల్లుఁడు గాఁగలఁడని మానసమున నుప్పొంగి యాతనియొద్దకుఁ బురోహితులను బంపి తననగరమున కాతని రావించెను. వెంటనే వివాహప్రయత్నములఁ జేసి తనకూఁతు నాతని కిచ్చి పాణిగ్రహణోత్సవముఁ గావించెను. వధూవరు లిరువురు నావంచిపురమునకుఁ దిరిగి వచ్చిరి. అచ్చట హేమప్రభమహారాజును వసురాజ్ఞియుఁ గొడుకును గోడలిని సముచితముగ దీవించి, గారవించి, తమపురమునకుఁ గొనిపోయిరి. రాజశేఖరుఁడును, కాంతిమతియు సమస్తభోగముల ననుభవించుచు సుఖంబున నుండిరి.

## —• కథాకల్పనము •—

ఈగ్రంథమందలి కథేతివృత్త మేపురాణమునుండి గాని, యే కథాకోశమునుండి గాని తీసికొనఁబడినదో ప్రస్తుతము తెలియరాలేదు. అనేకపురాణములను, కథాసరిత్సాగరాది కథాగారములను బరిశోధించితిని. కాని, యీకథకు మాతృకను గనుఁగొనలేకపోతిని. బండారు తమ్మయ్యగారు సైతము దీనిమూలకథ యెచ్చటను గానఁబడ లేదనియే తెల్పిరి. కావున నీకథ కవికల్పిత మనియే యిప్పటివఱకు నూహింపవలసి యున్నది.

ఆయిన నీకథయందలి కల్పన మాత్రవిచిత్రమైనదిగాదు; అమృత

మైనదిగాదు. ఇది సామాన్యముగ మనదేశమందు వాడుకలో నున్న సాధారణకథలవలెనే యున్నదిగాని దీనియం దొకవిశేష మేదియుఁ గాన్పింపలేదు. ఇట్టికథలను వేడుకకథలు (Ramances or Romantic stories) అని ఐరోపాదేశీయులు పిలుతురు. అయినను వారికథలకును, మనకథలకు నితివృత్తమందుఁ గొంతభేదము గలదు.

వారికథలలో సాధారణముగ నొకయోధుఁడు (Knight) దీనజనరక్షణార్థమై దేశమందుఁ దిరుగుచు నొకానొకయరణ్యమున నార్తరవమును వినును. అది యేమని పరికించుటకుఁ బోవ నొకయువతీలలామ యొకానొక ముష్కరునిచే బాధలనొందుచు రక్షణముకొఱకు నేడ్చుచున్నట్లు కనుఁగొనును. అంత నాయోధుఁ డామోటుమానిసితో యుద్ధము జేసి వానిని జంపి యాకన్యకను విడిపించును. తరువాత నామెకు రక్షకభటుఁడుగా నుండుటకుఁ బ్రతిజ్ఞఁ జేసికొనును. ఆమె చిక్కులలోఁ బడినప్పుడెల్ల నామెను దప్పించును. అతఁడు కొన్నియుపద్రవములలోఁ దగులొన్న నామెయు నాతనిని విడిపించును. ఇట్లుభయులు ప్రేమపరీక్షలలో వచంచలులుగా నిలువఁబడి తుదకుఁ బరిణయముఁ జేసికొందురు. ఇటువంటి రసోల్లసితకథ లైరోపాదేశములందలి పూర్వపువాఙ్మయములలో వేలకువే లున్నవి.

మనదేశమందలి రసోల్లసితకథలు కొంత వేఱుగా నుండును. ఒక రాజకుమారుఁడు వేఁటనిమిత్తముగా గాని, విలాసార్థముగాఁ గాని యొక యడవికిఁ బోయి యచ్చట నొకసరోవరము చెంత విశ్రమింప నాకొలనిలో స్నానము చేయుచున్న యొకసుందరాంగిని జూచి తటాలున మోహపరవశుఁ డగును. ఆమెయు నారాకొమరునిఁ జూడఁగనే మదనుని వాఁడితూపులకు గుఱి యగును. అంత నామెచెలికత్తె యానూతనపురుషుని దగ్గఱి, వృత్తాంత మంతయుఁ దెలిసికొని తనచెలికిఁ జెప్పును.

ఆరాకొమరుని నర్మసఖుఁడుగూడ నత్తరుణియొద్దకుఁ బోయి విరహిణిగా నుండుటఁ జూచి యామెయుదంత మంతయుఁ దనస్నేహితునకు నివేదించును. ఇట్లిరువురి పరస్పరానురాగము నిశ్చితమైనతరువాత రాజకన్య తండ్రి యారాజకుమారునితండ్రికిఁ బెండ్లిసందేశముఁ బంపును. తరువాత రాజకుమారుఁడు బంధుమిత్రసహితముగాఁ బెండ్లికొమార్త పట్టణమునకుఁ బోయి శాస్త్రోక్తముగ నామెను వివాహమాడి తనపురమునకుఁ దెచ్చుకొనును. అచ్చట నూతనదంపతులు సుఖముగానుండి పుత్రీపుత్రులంగని వృద్ధి నొందుదురు. ఇదియే సామాన్యముగ మనదేశమందలి రసవిలాసకథ యాకృతి.

ప్రస్తుతము రాజశేఖరచరిత్రలోనికథ దీనికిఁ దూచా తప్పకుండ సరిపోవుచున్నది. కావున నీకథయందుఁ బ్రత్యేకముగఁ జెప్పఁదగ్గ విశేషము లేవియుఁ గానరావు. ఈకథ నీకవి నూతనముగాఁ గల్పించినను బ్రశంసాపాత్ర మగునంశములు గోచరింపవు. మనదేశమందలి కాశీమజిలీకథలు, కథాసరిత్సాగరములోనికథలు కొంచె మెచ్చుతక్కువగ నీలాగే యున్నవి.

కాని, యితివృత్తములోఁ జమత్కృతి లేకపోయినను గథానిర్మాణములో నేమైనను గొప్పవిశేష మున్నదియా యని ప్రశ్నింపవచ్చును. దానికి సమాధాన మరయుదము. ఇతరకవుల కల్పనయందుకంటె నీకవి యొక్క కల్పనమం దొందురెం డద్భుతవిశేషములు గానఁబడుచున్నవి. అవి యేవన:—కథాకల్పనమందలి యౌచితియుఁ బరిమితియు. ఈమహాకవియందలి యౌచితీపరిమితిజ్ఞానము సామాన్యముగ ననితరకవిదృశ్యమని నాతలంపు. ఈతనికల్పనలయందు విపులీకరణముకంటె సంయమన మెక్కుడుగాఁ జూపట్టును. మహాబుద్ధిశాలి యగు నీకవి తనప్రతిభను నియమనిగళములలో నిమిడ్చి విశృంఖలవ్యాపారములలో విహరింప

నీయక నిరోధించుటయే యొక గొప్పవిశేషము. ఇదియే నిజమైన కళాభిజ్ఞుని ముఖ్యలక్షణము. ఈలక్షణ మీకవియందు విస్ఫుటముగా గోచరించుచున్నది. రసమందును, నీతియందును నౌచితియు, వర్ణనములయందలి పరిమితియు నీగ్రంథమం దన్నితావులఁ జూడనగును. కావున నిమ్మహాకవి రెండువిధముల సమర్థుఁడు. కవితాశిల్పములోఁ బ్రత్యవయవమును యథామితముగాఁ గుదుర్చుకొనుటయు రసాద్యలంక్రియలలో నౌచితీపరిజ్ఞానమునకు దోసిలి యొగ్గుటయు నీయనయందు ముఖ్యలక్షణములు.

ఈగ్రంథమును కవికర్ణరసాయనముతోను, వసుచరిత్రతోను పరిచూచినయెడల మనకు ముఖ్యముగ రెండుసంగతులు స్ఫురించును. ఈ గ్రంథమందలి కథయు, నారెండుగ్రంథముల కథలు నితివృత్తభాగమున సమానముగానే యున్నవి. వానియందలి కథాశరీరము దీనికంటె నెంత మాత్రముఁ బెద్దది కాదు. అటులయినను నీకావ్యముకంటె నవి రెండును సుమారు రెండింతలుగాఁ బెంచి వ్రాయఁబడినవి. ఈపెంపు కథేతివృత్తములలోని దైర్ఘ్యమునఁ గాక కేవలము వర్ణనలయందలి దైర్ఘ్యమువలనఁ గలిగిన దని సమిమర్శనముగాఁ జూచినఁ దెలియఁగలదు. కాని, మల్లనకవి ప్రబంధవర్ణితము లైన వర్ణన లన్నిటినిఁ జేయలేదా యని యోచించినను నీచిన్నగ్రంథమందు సైతము నష్టాదశవర్ణనములు యథావిధిగా నున్న వని తెలియవచ్చుచున్నది. కావున వలయు వర్ణన లన్నిటినిఁ జేసియుఁ గథాప్రణాళిక కేలోటును రానీయక, నవనవోన్మేషముగా రచించియు, నీగ్రంథమును వానికంటె సగముపాలులోఁ బూర్తిగావించెను. ఇట్టి పరిమితిజ్ఞానచోదితమైన సంయమన మీకవియందు మొదటివిశేషము.

ఇంక రెండవవిశేష మౌచితీజ్ఞాన మని చెప్పితినిగదా. అది రస

మందును, నీతియందును బ్రత్యేకముగాఁ గాన్పించుచున్నది. ఈకవీశ్వరుని శృంగారవర్ణనము లెంతసుశ్లీలముగాను, లజ్జాయుతముగాను నున్నవో యాయాఘట్టములఁ జదివిన స్పష్టమగును. పెద్దనాదులవలె వెఱ్ఱివెఱ్ఱికల్పనలను గాని, విపరీతచేష్టితములను గాని చేర్చక నాయికానాయకుల శృంగారాభివర్ణన మొంతియో మర్యాదాభావములతో నలంకరించినాఁడు. తుదకు నాయికానాయకులు వివాహానంతరము కేళీగృహమునఁ బ్రవేశించిన తరువాతఁ దెర దింపివేసినాఁడు. పెద్దన్న, నృసింహకవి, రామరాజభూషణుఁడు, పింగళి సూరన్న మున్నగు మహాకవులవలె తెరమఱుఁగున జరుగవలసిన క్రియాకలాప మంతయు బట్టబయలుగాఁ జూపలేదు. కృష్ణదేవరాయలకాలములో శృంగారవిషయమం దింతనియమము బాటించుట కెంతి ధైర్యశాలియు, విద్యాగరిష్ఠుఁడు నై యుండవలయునో యోచింపవలయును. కాఁబట్టి కథాశరీరమున జీవగ్రంథులవలె నున్నవర్ణనవిషయములలోను, రసాదినియమములలోను మల్లనకవి యత్యున్నతమైన వివేకమును జూపి కావ్యశిల్పమున నసదృశస్వాతంత్ర్యముఁ గనఁబఱిచినాఁడు.

కథాకథనము సామాన్యముగా నున్నది. కాని, యెక్కువ నైపుణ్యముఁ జూపుచుండుట లేదు. కథాసందర్భములలో నీకవి సంధానించిన భావములు గూడ సర్వసాధారణములే. అటులయినను గథాపరిణాళిక రుచిహీనముగా నుండక, నవనవోన్మేషరుచిరముగా నుండును. దీనికిఁ గారణము :— ఈకవి విషయములను నిరర్థకముగాఁ బెంచకుండుటయు వర్ణనలయందు ననవసరశబ్దవైచిత్ర్యముగాని యస్థానవిషయప్రవేశము గాని చేయకుండటయే. కథ చక్కఁగ సాగుచున్న చొక్కపుటీఁగవలె మెఱువు లీనుచు వడివడి నడచుచుండును. ప్రతిసందర్భమున నైసర్గికభావములే కదురుచుండును. హృదయమునఁ బుట్టినరసభావములు ముకుర

మందు ముఖము ప్రతిబింబించినట్లు పద్యములందు సులభముగా గోచరించుచుండును ఈమహాకవి బుద్ధియందు కవిత్వము నిసర్గజన్యమైన కళగా నున్నదిగాని మనస్సును పిసికి, పిండి, యోడ్చి, కార్చినరసము నుండి పుట్టినపద్యబంధము గాదని తెలియుచున్నది.

ఇతివృత్తసంఘటనము చాలఁ బొందికగాను, సరళముగాను జేయఁబడినది. మానవప్రకృతికి మించిన కార్యసంచయముఁ జూపఁబడలేదు. మునికుమారికథ హృదయశకలమువలె నిసర్గభావోన్మీలనముఁ జూపుచున్నది. లతాకనకమంజరులకథ గూడ నట్లే యుండఁదగినదియే. కాని, సశ్లేషికముగా బ్రాహ్మణమునితపోభంగము ముడిపెట్టుటచేఁ గొంత సందర్భశుచిత్వము తగ్గినది. అఁబోతులు పోట్లాడి లేఁగదూడ మీఁదఁబడినట్లు పెద్దఱును, బుష్పగుచ్ఛముకొఱకుఁ బెనఁగులాడి దూరమునఁ దపమాచరించుచున్న యరుణునిమీఁదఁ దమమోహనవిలాసములఁ బ్రయోగింప నుద్దేశించుటకుఁ దగినకారణము కవి ముందుగఁ జూపలేదు. ఈయంశ మసంభావ్యముగా నున్నది. శాపముకొఱకుఁ దెచ్చిపెట్టిన సంగతి కాని సహజమైన కారణము గలదిగా నుండలేదు. కాంతిమతీరాజశేఖరుల ప్రణయకథ మొత్తముమీఁద సత్యుత్తముగాఁ గూర్పఁబడినది. అయినను దీనియందును గొన్నిదోసఁగులు గాననగును. కాంతిమతి స్వయముగాఁ దనచెలికత్తెను దనప్రియునియొద్దకుఁ బంపుట యనుచితమనితోఁచుచున్నది. పూర్వకవు లిట్లునాయికకు స్వాతంత్ర్యమిచ్చి యుండలేదు. తనప్రియవయస్య తన విరహబాధను జూచి యోర్వలేక స్వయముగా దౌత్యమునకుఁ బోవుటయో లేక నాయికతలిదండ్రులు తమప్రియతనూజ విరహతాపశమనముకొఱకు రాజకుమారునియొద్దకు సందేశముఁ బంపుటయో యున్నది గాని యీగ్రంథమం దున్నట్లు నాయిక స్వయముగా నాయకునియొద్దకుఁ జెలికత్తెను బంపి తనహృదయనివేద

నివేదనముఁ జేసికొనుట యపూర్వము. ఇట్టివి స్వల్పదోషములు. ముత్తముమీఁదఁ గథాకల్పనము మనోహరముగాను, స్వాభావికముగాను, నుచితజ్ఞముగా నుండి సర్వత్ర రసవంతముగా నున్నది.

## — శైలి —

కథాసంవిధానముకంటె నీకావ్యమందలి కవిత్వశైలి యెక్కువ రమణీయముగా నుండి, యీమహాకవి కెక్కువప్రతిష్ఠఁ గలుగఁజేయుచున్నది. ఈతని శైలి చాలఁ గోమలముగాను, మంజులముగాను, శ్రవణపేయముగా నుండును. పదగుంఫనము జాలువారి చక్కనిరుచులను బుట్టించుచుండును. కమనీయము లగుపలుకులను గుచ్చుటలో నీకవికి సమానమైనవాఁ డాకాలమున ముక్కుతిమ్మన్న తప్ప మఱియొకఁడు గానరాఁడు.

క. చెప్పఁదగుఁ గవితరసముల్
చిప్పిల నప్పప్ప బళిబళీ యన; లేదా
యెప్పుడుఁ జేయక యుండుట
యొప్పుఁగుమీ సుకవి యెంతయుచితజ్ఞుఁ డౌరా !

అని యాతఁడు తనకావ్యమునకుఁ బరిశోధనగాఁ జెప్పికొనెను. తాను జెప్పినమాటలు తనకుఁ జక్కఁగా వర్తించునట్లే కవిత్వమును జెప్పి ప్రతిపద్యమునను రసము చిప్పిలుచుండునట్లు చేసెను. ఈసార్ద్రత చాలవఱకు శబ్దసాధిత మైనను గొన్నిపట్టుల నైసర్గికభావసంజనితమై యొప్పుచున్నది. కథామార్గవశమునఁ గలిగిన ప్రతిసందర్భమునందును వర్తనుచితమైన భావములను స్ఫురణకుఁ దెచ్చికొనివానిని మృదుమధురశబ్దజాలములఁ బోషించి, వీనులకు విందగు నట్లు నాతిమాత్రముగ విస్తరించి, కావ్యము నంతను మిగులఁ బొందికగను, నిమిడికగను రచించెను. కవిత్వమందు ధారాశుద్ధి యెక్కువ. పెద్దనయందలి పెళపెళధ్వని ఝూంకారములు

లేవు. నృసింహకవి యందలి గడుసుపోకడలు గాన్పింపవు. ముక్కు-తిమ్మన్నయందలి పలుకుల నెరతనంపుఁగిటుకులు గానరావు. అట్లయినను మల్లనకవిత్వము వీరికబ్బములకు వెనుదీయక యాకవివరులతో సమాన గౌరవముఁ దెచ్చుచున్నది. దానికిఁ గారణములు ధారాశుచిత్వము, పదలాలిత్యము, భావసారళ్యము, రసార్ద్రిత. శబ్దాడంబరముకొఱకును, శబ్దచమత్కృతికొఱకును నీకవి యెన్నఁడుఁ బెనఁగులాడలేదు. శ్లేషయమకాదులతట్టు, కన్నెత్తి చూడలేదు. పెద్దసమాసములతోఁ బద్యములను నింపుటకుఁ బ్రయత్నింపలేదు. రసనిరూపణమే ముఖ్యకర్తవ్య మని యోజించుకొనినాఁడు. కావున నీప్రబంధమం దేపద్యముఁ జదివినను వెంటనే యందలిభావము హృదయంగమ మగుచున్నది. రసాస్వాదనమున కంతరాయము లెచ్చటను గలుగనీయలేదు. కథయంతయు నరఁటిపం డొలిచినట్లు సుబోధ్యమై, సుగ్రాహ్యమై హృదయాహ్లాదముఁ గలుగఁజేయుచున్నది.

పుత్రునికలిమికిఁ దలిదండ్రులు బొందెడియానంద మెట్లు వర్ణింపఁబడినదో చూడుఁడు:—

ఉ. చందురువంటి నెమ్మొగము చక్కటిఁ మాలఁగఁబట్టు పెంపకల్
గొందలిరాకఁ బాదములఁ గిల్కొనఁ జేసిన పట్టి చిన్నిపైఁ
దండెలు గల్లుగల్లు మన వాడుచు నల్లన చేరవచ్చి నా
ముందఱ వాడ నెన్నఁడొకొ ముద్దియ ముద్దుఁగుమారుఁ గాంచుటల్.

ఈవిషయమునే నృసింహకవి మఱింత గడుసుగ నెట్లు పెంచెనో చూడుఁడు:—

ఉ. ముంగిటవాడు పుత్రుఁ డతిమోదమునం దవుదౌలఁ గాంచి వే
డ్కం గరయుగ్మమెత్తి చిఱుగంటలతో పెనయేడ్పుతోడ దా
యంగఁ జెలంగి యెత్తికొని యక్కునఁ జెక్కుఁగఁ జేర్చి ముద్దుమో
ముం గనియార ముద్దిడుట ముజ్జగమేలుటగాక యుండునే.

మంథరనగరవర్ణన మీాకవియందును, బెద్దనయందును సరిపోల్చి చూచిన నీయిరువురి శైలీభేదము తెలియఁగలదు. మల్లనయందలి మందయానమణిమంజీరనిక్వణమును, నల్లసానివాని ఘనాఘనగర్జితగంభీరనిర్ఘోషమును విశదముగాఁ గన్పట్టుచున్నవి.

సీ. వామదేవునిమాఱి వాదనిక్రొవ్విరిఁ
బూజగావించిన పుణ్యుఁ డితఁడు
సకలాగమశ్రేణి సంప్రీతిఁ బొందంగ
దాన మిచ్చిన మహాధర్మి యితఁడు
తులసిఁ గల్పించి మర్త్యులఁ బావనంబుగఁ
జేసిన యుపకారజీవి యితఁడు
దేఁష్టులకుఁ గామధేనువుఁ గల్గించి
తలఁపు లీడేర్చిన ధన్యుఁ డితఁడు
పాసతరిదాత్రిటఁ ద్రిచ్చు నిర్బంధమునకు
నోర్చి త్రిప్పట నొందిన యుత్తముండు
ఇతఁడు సర్వప్రదానైకహేతు వగుట
గలశవార్ధికిఁ గల్పనాగౌరవంబు.

సీ. జనితకచ్ఛపరాజచరమాంగగృహమేధి
భోగివేష్టనరేఖఁ బొలుచుజాణ
కులములోఁ దరితీపు గలిగి మించినమేటి
మైనాకునోరసిన మాసటీఁడు
తొలువేలుపుల వేలుపులవనుల్ గొనుకోఁడు
కదలిరాయల లోఁతుగన్నగబ్బి
సురరాజునకుఁ బాండుకరిఁ జేర్చుమరకాఁడు
కల్పకంబులపంట కమ్మతీఁడు
గంటె మథితసుధాధారకటకజాత
చంపకవనప్రకంపనాకంపవిసర

దఖురముఖరవమధుకరముఖరశిఖర
నందరసమందిరం బగు మందరంబు.

(మనుచరిత్ర)

భావములయం దద్భుతకల్పనావైచిత్ర్యము గాని, భావనాశక్తి యందు నిర్భయాఖర్వగర్వసంచారవిహారగతులు గాని కన్పడవు. వర్ణనలు కృష్ణరాయ పెద్దనల యత్యధికలోకజ్ఞానసంపత్తిని జూపింపవు. ఏవేని కొఱవడినను సమ్మోహనశక్తిగల భాషామాధుర్య మన్నిటిని గప్పి, యానందపారవశ్యముఁ గలుగఁజేయుచుండును. మచ్చున కీమూఁడు పద్యములును జేర్చితిని.

ఉ. పుత్తడిబొమ్మయో చిలుకబోదయొ కెంజిగురాకుగుత్తియో
ముత్తెఁపుఁగోవయో మదనమోహనబాణమొ నా వనీవిహా
రాత్తమతిఁ సఖీజనసహస్రము గొల్వఁగ వచ్చిపోయె నేఁ
డిత్తతి నొక్కచిత్తరి యహీనవచోరచనావిశారదా !

ఉ. ప్రన్ననిపాదముల్ చిలుకవారినఁ గందెడు మేనుదీఁగయుఁ
వెన్నెలవాలు నెమ్మొగము నిద్దపుముద్దు మెఱుంగుఁజెక్కులుం
గ్రొన్నెలవంటి నెన్నుదురుఁ గోమలబాహుమృణాలయుగ్మముం
గన్నులఁగట్టినట్లు పొడఁగానఁగనయ్యెడు నాకు నెచ్చెలీ !

గీ. అల్లనల్లన సఖి నడయాడెనేని
కలికిపలుకుల వాల్గంటి పలికెనేని
యంచలంచల వచ్చురాయంచకదుపు
కూడ నేతెంచుఁగీరంపుఁగొదమపదువు.

శా. శీలం దామరతీవ్వరిఁ బిరబిరఁ గేలీగతిం ద్రిప్పుచుఁ
వాలారుం గొనగోళ్ళ ఘర్మకణికాసారంబు పో మీటుచుం
గ్రాలుంగన్నుల ముద్దురేవగ విగుర్పఁ దెప్పలల్లాప్ప క
వ్వాలుంగంటి. నసుం గనుంగొనిన భావం బెన్నఁడుం బాయునే.

మహాకాళిని వర్ణించుటలో నామెభయంకరమూర్తిత్వముఁ జూపక మనోజ్ఞాకృతిని వర్ణించినపద్యము కడుంగడు శ్లాఘనీయము. ఇది యీకవీశ్వరుని భావనాసౌకుమార్యమునకుఁ గొప్పదృష్టాంతము.

సీ. కొప్పుపై నొప్పెడు కొదమచందురునితోడఁ
గస్తూరికాతిలకంబుతోడ
సీమంతవిరచితసిందూరరుచితోడఁ
గ్రొత్తముత్తియపుఁజేర్చుక్కతోడఁ
దళతళ మను దంతతాటంకములతోడ
రమణీయనాగహారములతోడ
గల్లుగల్లను రత్నకంకణంబులతోడఁ
జిలుఁగైన చెంగావివలువతోడ
ముద్దుమోమున లేనవ్వు మొలకతోడఁ
జల్లచూపులఁ గరుణారసంబుతోడ
శాంతరూపంబుఁ గైకొన్న శంభురాణి
యమ్మహాకాళి ప్రత్యక్ష మయ్యె నపుడు.

ఆకాలపుకవీశ్వరుల యన్యోన్యానుకరణసామనస్యమునకు నిదర్శనముగా వా రుపయోగించిన పక్షిదూతల ప్రజ్ఞావర్ణనములఁ దిలకింపుఁడు.

1. శ్రీనాథుఁడు :—

మ. స్మరవాత్స్యాయనకూచిమారకృతశాస్త్రగ్రంథసందర్భముల్
పరిశీలించినవాఁడ దంపతుల కుత్పాదింతు సారస్యముల్
మురిపెం బొప్పఁగ మందమందగమనంబుల్ నేర్పుదు న్మేదినీ
శ్వరశుద్ధాంతనితంబినీజనులకున్ సంపూర్ణచంద్రాననా!

వ. భామినీజనంబులకు భావభవదివ్యజ్ఞానవిశ్వాసముద్రానిక్షేపభూమి నైయుండుదుఁ; దిర్యగ్జాతిమాత్రుండుగాఁ దలంపవలదు. విరించివదనకమలవినిర్గతవివిధశాస్త్రవాసనాపూర్ణకర్ణుండ నైన యేను.

2. సూరన్న :—

చ. నలినజరాణివాస మొకనాఁడు ననుం దనచేతిప్రోదిరా
చిలుకను వాదుకుం గవిత చెప్పఁగఁ దా నియమించి యందు నా
పలుకులఁ గొంత వాసిఁ గని భావమునం గడు మెచ్చుచున్నఖాం
చలమున నాదుటెక్కెఁ నులిచక్కఁగ దువ్వుచు గారవించుచున్.

చ. ప్రబలములైన కౌతుకకృపారసవత్సలతాదరంబులన్
కబలితచిత్తయై యపుడు నా కుపమాతిశయోక్తి కామధే
ను బిరుద మిచ్చి తల్లిఖితనూపురము న్భువనైకమాత య
య్యబల మదంఘ్రిఁ దాఁ దొడిగె నా బిరుదం బిది చూడు మేర్పడన్.

శా. కాణాదంబును గౌతమీయమును సాంఖ్యంబున్ భుజంగాగ్రణీ
వాణీమార్గము జైమినీయమతమున్ వ్యాసోక్తశాస్త్రంబు వ
క్కాణించెం గడుఁ బూర్వపక్షములు. జోకం బెంచుచు న్బెంచి య
క్షీణప్రౌఢిఁ దిరస్కరించుచుఁ దుదన్ సిద్ధాంతము ల్నిల్పుచున్.

3. మల్లన్న :—

శా. రామప్రాభవమైంధవాధిపకుమారా సింగభూపాల న
న్నేమోకా మదిలోఁ దలంపకు వచోహేవాకకాకోదర
స్వామి న్నాకుఁ ద్రికాలవేది యని భాషాదేవి పేరిచ్చె నా
రామారత్నము చేతి రాచిలుక నేర్పన్ నేర్చితిన్ సర్వమున్.

శా. వాదింతున్ బహువేదశాస్త్రకలనావైయాత్యసంసిద్ధి న
వ్వేదవ్యాసులతోడ నైన మది సంవీక్షించి యెచ్చోట నేఁ
గాదన్నన్ మది నిర్వహింపఁగ నశక్యం బేరి కస్మద్వచ
శ్శ్రీదాంపత్యము నాకనాక యనుచో సిగ్గయ్యెడున్ భూవరా.

ఇట్లు వర్ణనావిషయములలోను గల్పనావిషయములలోను శ్రీకృష్ణదేవరాయలకాలపుఁ గవులకు శ్రీనాథుని శృంగారనైషధము మేలుబంతి యైనది. దానియందలి క్రమమును సామాన్యముగఁ దప్పినవారు లేరు.

—, రసము — నీతి ,—

ఈప్రబంధమందలి శృంగారరసమునుగుఱించియు,నీతివివేకమును గుఱించియు వెనుకటిభాగములోఁ గొంతవఱకుఁ జెప్పఁబడినది. ఆకాలమందలి యితరమహాకవులవలె నీతఁడును జేసినశృంగారరసవర్ణన లుద్రేకపూరితములై యుండక యౌచిత్యమర్యాదలలో నిమిడియున్నవి. శృంగారరసవిషయములో నీతని యుచితజ్ఞతను నుద్వేగనిగ్రహమును జూపునట్టి యీక్రిందిపద్య మీకవితల్లజునిచిత్తశుద్ధికి నిదర్శనముగా నూహింపవచ్చును.

క. తననగరి కరిగె నపుడ
జనపతినందనుఁడు గేళిసౌధస్థితిపై
వనితామణిఁ దలపోయుచు
ననువేలదృఢానురాగుఁడై యుండుతఱిన్.

ఇందు నాయకుఁ డగు రాజశేఖరునిప్రేమానురాగమును వర్ణించుచు నాయనురాగము దృఢముగా నుండియు, ననువేలముగా నున్నదియే గాని, యుద్వేలముగా నుండలే దని, యీచిన్నమాటలోఁ గవితన శృంగారరసనిరూపణ విధానరహస్య మంతయుఁ దెలియఁజెప్పెను. ఈకావ్యమందలి శృంగారరసము స్త్రీపురుషులును, బాలబాలికలును గూడ సిగ్గుఁబొంద నవసరములేకుండఁ జదువఁదగినంత మర్యాదయుతముగ నిరూపింపఁబడినది. ఆనాఁటియాంధ్రప్రబంధములలో రసౌచిత్యమున నీగ్రంథమే ప్రశస్తమని నిరాక్షేపణముగాఁ జెప్పవచ్చును.

"అనౌచిత్యాదృతే నాన్య ద్రసభంగస్య కారణం"

అని క్షేమేంద్రకవి చెప్పినాఁడు గదా ! ఆసూక్తి కిది తార్కాణము. అట్లయినను నొకచోటమాత్ర మీకవి యనౌచిత్యదోషమునకుఁ దా విచ్చె నని చెప్ప సాహసించుచున్నాను.

వామనభట్టబాణుఁడు దాను రచించిన పార్వతీపరిణయ మను సంస్కృతనాటకములో హిమవంతుఁడు తనభార్య యగు మేనకతోఁ గూఁతు రగుపార్వతినిగూర్చి :—

"ఆభోగశాలికుచకుట్మల మాయతాక్ష్యాః
వక్షోవకాశ మభివాంఛతి సన్నివేష్టుం
అప్యస్తినాస్తి వచసాం విషయే వలగ్నే
తన్వీ భవతి కాచన రోమరేఖా"

అనినట్లే యీగ్రంథమందును సింధురాజు తనకుమార్తయగు కాంతిమతి యౌవనసౌందర్యము విలోకించి రోమాంచముఁ బొందిన ట్లభివర్ణింపఁబడినది.

శా. ఆకీలిక్షా సఖు లొయ్యఁ దేర వసుధాధ్యక్షుండు తా నక్కుమా
రీరత్నం బతిమానమానసదృఢప్రీతిన్ విలోకించి పై
పై రోమాంచము లంగకంబకములై ప్రాపింపఁ బెల్లుబ్బె జం
భారాతిప్రథమానవైభవకళాహంకారసంక్రాంతుఁడై.

(రాజశేఖర. ఆ 3.)

ఇందు తండ్రిపొందిన గగుర్పాటు హర్షపులకాంకుర మైనను నాసందర్భమున న ట్లభివర్ణించుట యనుచిత మనియు, నవ్రిశస్త మని యు నా తలంపు.

శృంగారరసమును మృదులముగాఁ బోషించినట్లు తక్కినరసము లను నాయాపట్టుల సహజోపజ్ఞతో నీకవివరుఁడు నిరూపించినాఁడు. భానుమతీహరణవిషయమునఁ గరుణారసమును, యోగినీవృత్తాంతమున శాంతరసమును, విశంకటదైత్యభండనమున వీరరసమును సజీవముగా వర్ణించి తనరచనానైపుణిని వికసింపఁజేసెను. కావున నేయేభాగములు జదివినను నాయాసందర్భముల నుచితమైనరసము చిప్పిలి తాను గ్రంథా

దిని జేసినప్రతిజ్ఞ నీమహాకవి నిర్వహించుకొనినట్లు నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

—• ఏతత్కావ్యప్రాశస్త్యము •—

శ్రీకృష్ణదేవరాయల యాస్థానమం దున్న ప్రశస్తకవులలో మాదయ్యగారిమల్లన్న యొకఁడని గ్రంథస్థము లగునాధారములంబట్టియుఁ, బాడితసంప్రదాయగాథలనుబట్టియుఁ దెలియవచ్చుచున్నది. ఈతఁడు పెద్దన, తిమ్మనలతో సమానమైన కవిగానే యన్నిస్థలములలోను వర్ణింపఁబడినాఁడు. కుమారధూర్జటి రచించిన కృష్ణరాయవిజయములోను, శ్రీ కృష్ణరాయజీతచరిత్రమైన రాయవాచకములోనుగూడ మల్లనకవి పెద్దన, తిమ్మనలతోఁ గలిసి ప్రశంసింపఁబడినాఁడని ప్రథమములోనే చెప్పితిని. కాఁబట్టి పూర్వకాలమునుండియు నీకవికి నామహాకవులతోపాటగ్రస్థాన మీయఁబడినది. ఇట్టియగ్రస్థానమున కీయన యొంతయు నర్హుఁడనియే తలంపవలసియున్నది. పెద్దన, తిమ్మనలతోనైనను, నాకాలపుటితరమహాకవులతో నయినను, నీతని నరిపోల్చునెడలఁ గొన్నికొన్ని విషయముల నీతఁడు తగ్గుచున్నను, మఱికొన్నిటియందు వారికంటె నధికుఁ డనియే చెప్పవచ్చును. పెద్దనవలె నిస్తులమగు ప్రతిభాగాంభీర్యములం జూపకున్నను, నాతనికంటె నెక్కుడైన మృదులమంజులభావలతోఁ గావ్యము నలరింపఁగలిగెను. ముక్కుతిమ్మనవలె ముద్దులొల్కు పాత్రసంభాషణములం జేయలేకపోయినను నాతనితో సమానముగఁ బదలాలిత్యరసనిరూపణలం జేయఁగల దిట్ట యని యనిపించుకొనియెను. ఇంక నాకాలపు టితరమహాకవు లగు నృసింహుఁడు, ధూర్జటి, కృష్ణరాయలు మున్నగువారికంటెఁ గవితామాధుర్యమునకుఁ బరిపోషకమైన భాషాసౌకుమార్యమున మిన్న యని చెప్పుటకు సంశయింపనక్కఱలేదు.

ఈవిధముగ వారికంటె నెక్కువతక్కువలలో సమానముగా నుండియు నొకవిషయములో వారిలోఁ గొందఱికంటె నెక్కువగాఁ బరిగణింపఁదగియున్నాఁ డని వెనుక సూచించితిని. అది యే దన : రసౌచిత్యము. అనఁగా శృంగారమును, నీతిని జక్కఁగా మేళవించి బాలబాలిక లైనను జదువుటకు సిగ్గుపడ నవసరము లేకుండ నౌచిత్యమును బాటించి గ్రంథము నామూలాగ్రముగా రచియించెను. ఈవిషయమునఁ గృష్ణరాయలును, ముక్కుతిమ్మన్నయు నీతనిదరి నుండఁదగి యున్నను, దక్కినవా రందఱు దూరముగా నుండవలసినవారే. ఇదియ యీకవీశ్వరునియందలి ముఖ్యవిశేషము. ఋష్యాశ్రమశృంగారమున దగ్గుబల్లి దుగ్గనకవి రచితమైన నాసికేతోపాఖ్యాన మెంతవర్ణనాతీత మగు ప్రాశస్త్యము నొందినదో, యట్లే రాజాంతఃపురశృంగారమున నీకవియు నంతయసమానరసౌచిత్యముఁ జూపుటచే నీరాజశేఖరచరిత్రమును నసాధారణగౌరవము నొందఁదగియున్నది.

కావున నీకవిపుంగవుఁడు మహాకవి యనఁబడుటకుఁ దగినవాఁడై యాతనిగ్రంథము మనయాంధ్రవాఙ్మయమున నున్న ప్రబంధరాజములలో నొకటి యని చెప్ప నర్హతగలదియై యున్నది.



# ఏడవ అధ్యాయము

## ధూర్జటి—కాళహస్తి మాహాత్మ్యము.



శ్రీకృష్ణదేవరాయల యాస్థానకవిపుంగవులలో నొకఁడగు ధూర్జటి 'కాళహస్తిమాహాత్మ్య'మను నొక మేలైన యాంధ్రప్రబంధమును రచించెను. ఆగ్రంథమును శ్రీకాళహస్తీశ్వరున కంకితము చేయుటచేత ను, గ్రంథమునందు దనవంశవర్ణనము లేకపోవుటచేతను కవియొక్క కాల నిర్ణయము చేయుట కాధారము లెవ్వియును దానియందుఁ గానరావు. ఆగ్రంథమందలి యాశ్వాసాంతగద్యములలోఁ దనతల్లిదండ్రులపేళ్లను, తాను కాళహస్తీశ్వరునిభక్తుఁడ ననియు, భవపరాఙ్ముఖుఁడ ననియు మా త్రము చెప్పికొనెను. *

* ఇది శ్రీమత్కాళహస్తీశ్వరచరణకమలసేవాపరాయణ, సింగమరమానారా యణ జక్కయనారాయణతనూభవ భవపరాఙ్ముఖ ధూర్జటిప్రణీతంబైన శ్రీకాళహస్తి మాహాత్మ్యము" అని యున్నది. ఇందు సింగమరమానారాయణ యనుపేరు తల్లి దనియు, జక్కయనారాయణ యనుపేరు తండ్రి దనియు నే నూహించుచున్నాను. 'సింగమ'యనియు, 'రమా'యనియు నీరెండును స్త్రీవాచకములు. 'జక్కయ' యన్నది పురుషవాచకము. 'నారాయణ'శబ్దము రెండుపేర్లతోను జేర్పఁబడినది. బహుశః, ధూర్జటికవి తురీయాశ్రమము స్వీకరించినతరువాత నీగ్రంథాంకితము చేసియుండుటచే విప్రసన్యాసులు సర్వము నారాయణనామోచ్చారణతో సంబంధింపఁజేయవలసిన ధర్మముగానఁ దనపూర్వాశ్రమ మాతాపితృలనామములకు నారాయణ శబ్దముఁ జేర్చి యుండవచ్చును. ఈయూహకు 'భవపరాఙ్ముఖ' యనువాక్యము మఱింత బలముగా నున్నది. ఈనాయూహ సరియైనదియో కాదో పండితులు నిర్ణయింతురుగాక!

ధూర్జటిరచించిన కావ్యములో తనజీవితమునకు సంబంధించిన దేశకాలవిషయము లేవియుఁ గాన్పింపకున్నను, అతనివంశస్థులు కొందఱు వ్రాసిన గ్రంథములనుబట్టి యతనిగుఱించియు, నతనిగ్రంథమునుగుఱించియుఁ గొన్నివిశేషములు తెలియవచ్చుచున్నవి. కుమారధూర్జటియను బిరుదనామము గలవేంకటార్యుఁడు 'కృష్ణరాయవిజయ'మను నొక చారిత్రికప్రబంధము రచించెను. ఆప్రబంధమందుఁ గవిధూర్జటి తనపెద్దతాత యనియు, నాతఁడు కృష్ణదేవరాయల విద్వత్సభయందుండె ననియు నిత్యాదివిషయములను దెల్పుచు నిట్లు వ్రాసెను:—

సీ. నను భరద్వాజగోత్రుని సదాపస్తంబ
సూత్రుని బాంధవస్తోత్రపాత్రుఁ
బాకనాటార్వేలవంశప్రసిద్ధుని
ధూర్జటిపౌత్రు బంధురచరిత్రు
సద్గురుకారుణ్యసంప్రాప్తవిద్యావి
హారుని శ్రీకాళహస్తినిలయు
చిత్రపనూనాంబికా శ్రీకరానుగ్రహో
పాదిత కవితారసజ్ఞహృదయు

సారరచనాధురీణుఁ గుమారధూర్జ
టిప్రథాప్రాగ్రగణ్యుఁ బటీరహీర
మహితసత్కీర్తిఁ గాళియమాత్యపుత్రు
వేంకటార్యుని బిలిపించి వేడ్కనని యె.

ఉ. స్తుతమతి యైనయాంధ్రకవి ధూర్జటిపల్కుల కేల కల్గెనో
యతులితమాధురీమహిమ నా మును మీపెదతాత చాల స
మ్మతిఁ గని కృష్ణరాయలమనోజ్ఞసభ న్విను మీవు నట్ల మ
త్కృతబహుమానవైఖరులఁ గీర్తి వహింపుము ధాత్రిలోపలన్.

ఈకుమారధూర్జటిపుత్త్రుఁడైన లింగరాజకవియు కాళహస్తిమాహాత్మ్య మను మఱియొకప్రబంధము రచించి తద్గ్రంథమున నీవంశాంశముల నుడివెను:—

సీ. శ్రీకాళహస్తిగౌరీనాథపదపద్మ
సద్భక్తియుక్తి నిశ్చలతఁ గాంచి
సారసుధాసారసరసోక్తిగుంఫనఁ
గాళహస్తిమహత్త్వకథ నొనర్చి
కృష్ణరాయకిరీటకీలితమణిగణా
ర్చితపదాబ్జద్వయ శ్రీ వహించి
యాసేతుకాశితటావనీవిఖ్యాత
సత్కీర్తివిస్ఫూర్తిఁ జాల వెలసి
ధరణిఁ జెలువొందె నేకవీశ్వరవతంస
రత్న మమ్మహనీయు ధూర్జటిసుధీంద్రుఁ
డలఁతు జలనిధివీచికాకలకలాను
కారి భూరికవిత్వవాక్పటిమ గులుక.

మఱియు:—

సీ. శ్రీకాళహస్తీశసేవనాన్వితచిత్త
చిత్తజాకార లక్ష్మీవిహార
రమణీయశీల భారద్వాజగోత్రప
విత్రియాపస్తంబ సూత్రమహిత
ధూర్జటివంశపాథోధిచంద్రకుమార
ధూర్జటినామవిస్ఫూర్జితాంక
స్తుతమతి వేంకటపతితనూభవ లింగ
రాజకులేంద్ర ధైర్యాచలేంద్ర

* * *

* * *

ఇంక నీయిరువురుకవులు వ్రాసిన కాళహస్తిమాహాత్మ్యప్రబంధ

ముల మాతృకాగ్రంథముల గుఱించి యీ ముఖ్యవిషయములను విశద
పఱచెదను.

క. విను కాళహస్తిమహిమం
బనుపమమై వెలయు మును షడధ్యాయికథన్
దెనుఁగునఁ గావ్యముగ నొన
ర్చెను బెదధూర్జటికవీంద్రశేఖరుఁ డనఘా.

ఆ. బహుపురాణమథితభవ్యార్థశివతత్త్వ
సార మెల్ల నైక్యసరణిఁ బొదలి
జగతి శివరహస్యసంగ్రహ మను నితి
హాస మొనరు విబుధు లభినుతింప.

సీ. ఆయితిహాసంబునందలి యుత్తర
భాగంబునందు భాస్వన్నిరూఢిఁ
గాళహస్తిమహాత్మ్యకథ నూటయిర్వది
యధ్యాయములఁ జెలు వమరుచుండుఁ
దత్కథఁ దెనుఁగున ద్రాక్షరసోర్మికా
పరిపాకవిస్ఫూర్తిఁ బరిఢవిల్లఁ
గృతి యొనర్పుము మదంకితముగ శబ్దచ
మత్కృతిఁ బండితు ల్మది గణింప

* * *

* * *

లింగరాజుకుమారుఁ డగు వేంకటపతి యనుకవి రత్నావళి ము
న్నగుగ్రంథములను రచించి తనవంశసంబంధ మగువిషయములను గొన్ని
టిని బొందుపఱచెను.

మ. పటు గంగాలహరీతరంగసముజ్జృంభత్ప్రౌఢతాంచత్కళా
ఘటనున్ బాదవినమ్రకృష్ణనరరాడ్గంభీరకోటీర వి
స్ఫుటరత్నద్యుతిపాటలీకృతపదాంభోజాతు సర్వజ్ఞభూ
ర్జటినిం గొల్చెద నస్మదీయకులకర్తన్ భక్తిరంజిల్లఁగన్.



మ. ఘన గౌరీశకటాక్ష లబ్ధకవితాగాంభీర్యసంతుష్ట భూ
జనరాడ్దత్త సువర్ణచేల మణిభూషా గ్రామపల్యంకికా
ఘనదంతావళఘోటకాది బహుసత్కార ప్రతిష్ఠాత్మ్మ మ
జ్జనకున్ ధూర్జటిలింగరాజకవిరాజ శ్రేష్ఠుఁ గీర్తించెదన్.

ఈగ్రంథాధారముల నన్నిటిని సమన్వయించి చూచిన నీప్రసిద్ధ వంశముయొక్క చరిత్ర మిట్లున్నది. మహాకవి యగు మొదటిధూర్జటి తనకవితాగౌరవముచే గొప్పప్రతిష్ఠ సంపాదించి తనకుటుంబము వారికి ధనధాన్యసమృద్ధి గల మనుగడఁ జేర్చి కూర్చినకతన తా నావంశమునకు మూలపురుషుఁడై తనపేరును తద్వంశీకులు వంశనామముగా ధరింప మొదలిడిరి. కావున నీవంశమునకు ధూర్జటి యను పౌరుషనామము నాఁటినుండి నేఁటివఱకును కాలానుగతముగా వచ్చుచున్నది. వీరు పాక నాటి యార్వేల బ్రాహ్మణులు. శ్రీకాళహస్తిపురనివాసులు. భారద్వాజసగోత్రులు. ఆపస్తంబసూత్రులు. శ్రీకాళహస్తీశ్వరునిభక్తులు. ఆంధ్రగీర్వాణవిద్యలయం దధికప్రజ్ఞావంతులు. ఆంధ్రకవివృత్తి నవలంబించిన వారు. కాళహస్తిప్రభువుల పోషణములోఁ జాలకాల ముండినవారు. ఆకారణమునఁ గాళహస్తి రాజులదర్బారులో నిప్పటికి ధూర్జటివారి కొక కవితాస్థాన మీయఁబడియున్నది. *

ధూర్జటిమహాకవి తరువాత నాతనివంశస్థులు కొన్నియుద్గ్రంథములు వ్రాసినకారణమున ధూర్జటివంశవృక్షము గొన్నితరములవఱకుఁ

---

* ధూర్జటివంశమువారు తెనుఁగుదేశములో ననేకచోట్ల నున్నారు. కవిధూర్జటినుండి సరాసరిగా నవతరించినకుటుంబము నెల్లూరుజిల్లా వెంకటగిరిసంస్థానములోఁ జేరిన కారూరు, ధూర్జటి అమ్మపాలెము అనుగ్రామములలో నిప్పటికి నున్నారు. కారూరు గ్రామకరణముగా రగు ధూర్జటి పిచ్చయ్యగారు తా మనుభవించుచున్న గ్రామమొఖాసాలు శ్రీకృష్ణదేవరాయలు మొదటిధూర్జటికవికి ఇచ్చిన అగ్రహారము లని చెప్పుచున్నా రఁట.

గూర్చి చూపుట కవకాశము కలిగినది. దాని నిచ్చట విశదముగాఁ గనపఱచుచున్నాను.

[సింగమరమానారాయణ]　　జక్కయనారాయణ

(కాళహస్తిమాహాత్మ్యకర్త)　ధూర్జటి

పేరు లేదు
|
కాళియామాత్య
|
వేంకటార్య
|
లింగరాజు
|
వేంకటరాయ

1. కృష్ణరాయవిజయము
2. ఇందుమతీపరిణయము
3. సావిత్రీచరిత్రము }

కాళహస్తిమాహాత్మ్యము

1. ఆంధ్రనామలింగానుశాసనము
2. రత్నావళీప్రబంధము }

ధూర్జటి కృష్ణరాయక్షితీంద్రుని యాస్థానమున కవియై యుండినట్లును, ఆతనిచే బహువిధములుగా బహూకృతుఁడైనట్లును తెలియవచ్చుచున్నది. 'కృష్ణరాయకిరీటకీలితమణిగణార్చితపదాబ్జద్వయ శ్రీవహించిన వాఁడ' నని ప్రపౌత్రుఁ డగు లింగరాజు చేసినవర్ణనమునఁ గొంత యతిశయోక్తి కలదని చెప్పవచ్చును. వీరవైష్ణవుఁ డగు కృష్ణరాయలు వీరశైవుఁ డగుధూర్జటికి సాష్టాంగదండప్రణామము లాచరించుట యసంభవ మేమోకాని యీమహాకవికి బహువిధసత్కారములు చేసినమాట వాస్తవము.

మహాకవిధూర్జటినిగుఱించి యొకానొకపండితగాథ కర్ణాకర్ణికగా వినవచ్చుచున్నది.

ఒకనాఁడు కృష్ణరాయభూధవుఁడు పేరోలగమున నుండి యీక్రిందిసమస్య నిచ్చెనఁట.

"స్తుతమతి యైనయాంధ్రకవి ధూర్జటిపల్కులకేల గల్గెనో
యతులితమాధురీమహిమ"

ఈసమస్యను బూరించుటకుఁ దక్కినవారందఱు మిన్నకయుండఁగ గొంటుకవి యగు తెనాలి రామకృష్ణుఁడుమాత్రము లేచి యాశువుగా నిట్లు పూరించె నఁట!

చ. స్తుతమతి యైనయాంధ్రకవి ధూర్జటిపల్కులకేల గల్గెనో
యతులితమాధురీమహిమ! హా తెలిసెన్ భువనైకమోహనో
ద్ధత సుకుమారవారవనితాజనతాఘనతాపహారి సంత
తత మధురాధరోదితసుధారసధారలు గ్రోలుటం జుమీ!

ఈసమస్యాప్రస్తావనము కేవలము కల్పితమని చెప్పుటకు వలను పడదు. ఏలయన: పౌత్రుఁడగు కుమారధూర్జటి తన 'కృష్ణరాయవిజయము'న దీని నుదహరించెను. ఆకవి సమస్యాభాగముమాత్రము సూచించి పూరణభాగమును వచింపలేదు. తనతాతయశస్సునకుఁ గళంకముగా నుండునని మానెనో, మఱి యేకారణముననో చెప్ప సాహసింపలేము. మహాకవులకు వారవనితాసక్తి నారోపించుట మనవాఙ్మయమునఁ గ్రొత్త విషయము కాదు. శ్రీనాథుఁడు, పినవీరభద్రుఁడు మున్నగువారిట్టియారోపణములకుఁ బాల్పడిరి. శ్రీనాథుఁ డట్టిచాపల్యమునకు వశుఁడైనట్లు తనగ్రంథములవల్లనే ప్రకటించుకొనెను. కాన నాతనిగుఱించి మనము కాదని చెప్పలేకపోయినను పినవీరభద్రుఁడు, ధూర్జటి మున్నగువారినిగుఱించి లోకములోఁ జాటఁబడిన వేశ్యాసంపర్కములు మహారసికులగు పండితవతంసులచేఁ గల్పింపఁబడిన వని యూహింపవచ్చును. ఈ విషయముగుఱించి యింతకంటె నెక్కువగాఁ జర్చించుట యనవసరము.

మహాకవిధూర్జటి గొప్పశివభక్తుఁడు. ఈతనిశివభక్తి నందితిమ్మన మాదయ్యగారి మల్లనల శివభక్తి వలెఁగాదు. "శివాత్పరతరం నాస్తి"

యని దృఢముగాను, నిర్భయముగాను నమ్మినవాఁడు. తనగ్రంథాదిఁ చేసిన దేవతాస్తవమున దక్షిణ కైలాసవాసుఁ డగు శ్రీకాళహస్తీశ్వరు గూర్చియు, నాతనిదేవేరి యగు జ్ఞానప్రసూనాంబికను గూర్చియు సంస్త వించుటయే గాక తదితర శైవగణాధిపతులను గూడఁ బ్రత్యేకముగ స్తుతించి శివేతరు లగుసరస్వతీబ్రహ్మల నైనను బేర్కొనఁ డాయెను. ఇం విష్ణునామస్మరణ మెట్లు పొసఁగును? అత్యంతపరమశివభక్తుఁ డైనను ఈమహాకవి విష్ణుసేవాపరుఁ డైన కృష్ణదేవరాయల యాదరాభిమానము లకుఁ బాత్రుఁ డగుట యాచక్రవర్తియొక్క సర్వమతసహిష్ణుతను ఉదారసౌహార్దమును వేనోళ్ళఁ జాటుచున్నది.

ధూర్జటి సంస్కృతాంధ్రములయందు సమాన మగుపరిజ్ఞానముగల గొప్పవిద్వాంసుఁడు. ఆతనికవిత్వమందు సంస్కృతశబ్దములును, సంస్కృతసమాసములును తఱచు గానంబడుటచే నాతనికి గీర్వాణమం దెక్కువప్రీతియు, నభిమానము నుండవచ్చు నని తలంపవచ్చును. ఈ యూహ కుపబలముగా నున్న యొకచిత్రమైన ప్రసంగవిశేషము, ఈతని పౌత్రుఁ డగు వేంకటార్యునిగ్రంథమునఁ గన్పట్టుచున్నది. వేంకటార్యుఁడు 'కృష్ణరాయవిజయము'లోఁ దన్నుగూర్చి సభాస్తారు లగు పండితులు చూపినమన్ననను వర్ణింపుచు, నిట్లు నుడివెను.

> గీ. వితతకవితాప్రసంగసంగతుల నతుల
> మతులఁ గృతు లయి కృతులు సంస్కృతపదాను
> బంధబంధురరుచిరాంధ్రపదము లెసఁగ
> రచన ఘటియించు సత్కవుల్ ప్రణుతి సేయ.

అనఁగాఁ, దనను సమ్మానించినకవు లందఱు సంస్కృతపదబంధురరుచిర మైన యాంధ్రకవిత్వముఁ జెప్పినవారే యని స్పష్టీకరించెను. ఇతనికవిత్వమును దనపెదతాతయగు ధూర్జటికవిత్వమువలె సంస్కృతపద

భూయిష్ఠ మైనదియే. తనకొడుకు లింగరాజును తద్వత్కవిత్వమునే చె
ప్పెను. కాఁబట్టి ధూర్జటికవియందును, నతనివంశజులయందును గీర్వాణ
పదసంభృత మైనకవిత్వము ప్రాఁబడి తనులోఁ దా మైనను తమయభి
మానులైనను తద్విధమైన కవిత్వమునే పొగడ్తకుఁ దగిన దని తలంచిరి.
ప్రతికుటుంబమునందును విద్యాసంప్రదాయము సామాన్యముగ నొకే
తీరున ననుపలబ్ధ మగుచుండును గదా !

## కథాసారము.

ఒకనాఁడు శ్రీకాళహస్తీశ్వరుఁడు ♦ నారాయణవనమను పట్టణములోఁ దత్పు
రాధీశుఁడైన వీరనృసింహయాదవభూపతియొక్క భక్తిని పరీక్షించుటకు మాయాజంగ
మవేషముఁదాల్చి తన్నగరవీథులలోఁ బోవుచుండ శివభక్తిపరాయణురాలగు నొక
దాసి యాజంగమమునినిఁజూచి నమస్కరించి తన యింట నాతిథ్యముఁ గైకొనమని
వేడగా నాతఁడు నామెయింట నంగీకరించి యారాత్రి గడపెను. జంగమశ్రేష్ఠుని
సేవలలో నుండుటచే దాసిపడతి తానానాఁడు రాజగృహమునఁ జేయవలసిన కృత్య
ములు చేయనందున నానృపాలుఁడామె శిరోజములను గొరిగించవలెనని దారుణము
గా శాసించెను. అట్లు ముండితకేశియై యామె తిరిగిబోయి తన యింటనున్న జంగ
మపుంగవుని పాదపద్మములమీదఁబడి మొఱపెట్టెను. అప్పుడు జంగమదేవర కృపా
ళుఁడై తన హస్తముతో నామె శిరస్సును స్పృశింప నామె తలవెండ్రుకలు యథా
పూర్వముగా మొలచినవి. సంపూర్ణనీలవేణియైన యామె వెంటనే కోటలోని కొలు
వునకు మగిడిపోవ యాదవనృపాలుఁడామెనుఁ జూచి నివ్వెరపడి కుంతలము లెట్లు పున
రుద్భవించెనని యామెనడుగఁ దనయుదంతమంతయు రాజునకామె నివేదించెను.
అంత నాభూజాని జంగమమునియొక మహాత్ముఁడని యోచించి తత్క్షణమే యాతనిని
దర్శించుటకు దాసియింటికిఁ బోయెను. అచటనున్న జంగమేశ్వరుని పాదముల
కెఱఁగి క్షమార్పణవేడగా నాకుహనాజంగముడగు మహాశివుఁడు తానొక సామాన్యజం
గముడనియు, శ్రీకాళహస్తిలోనున్న చోద్యములు చూడవచ్చి యచ్చటనున్న శివలిం
గమున కాలయము లేకుండుటఁజూచి యారాజునకు భక్తిగలిగించి దత్కార్యము నెర

♦ ఇది ప్రస్తుతము చిత్తూరు జిల్లాలో నున్నది.

వేర్పుటకుఁ జేసిన యాక్తియానియు సెలవిచ్చెను. అంతట నారాజట్లాలయముఁ గట్టుట కియ్యకొని కాళహస్తీశ్వరుని మహాత్మ్య మెట్టిదియో యానతీయుఁడని యాకైతవజంగమమునిని వేఁడ నాజంగమ మీడిట్లు చెప్పఁదొడంగెను.

మున్ను వసిష్ఠుఁడు విశ్వామిత్రుని దారుణకోపానల కారణంబునఁ దన సుతశతంబునుఁ గోల్పోయి పుత్రశోకంబున దుఃఖింపుచు భృగుపాతము చేయ నుద్యోగించిన దేవి వసుంధర యాతని ప్రాణములను రక్షించి పరమేశ్వరునిగూర్చి తపంబుసేయుమని యుపదేశించిన నాసంయమివరేణ్యుఁ డుగ్రతపం బాచరించెను. ఆతపంబునకుఁ జంద్రశేఖరుఁడు సంప్రీతుఁడై లింగాకారమున వసిష్ఠునకు సాక్షాత్కరించి వరంబు వేఁడుమని యామునీంద్రుని కోరెను. అంత వసిష్ఠుఁడు తనకు బ్రహ్మవిద్యోపదేశముఁ జేయుమనియుఁ లోకకల్యాణముకొఱకు పూజనీయమగు దేవతాస్వరూపంబున స్థిరాకారము ధరింపుఁడనియుఁ బ్రార్థించినఁ బురారి ప్రసన్నుఁడై యారెండువరముల ననుగ్రహించుటచే ఫాలలోచనుఁడు శ్రీకాళహస్తీశ్వరు లింగాకారమున నెలకొనెను.

అంత కొంతకాలమునకు సదాశివుని యానతిని నగస్త్యుఁడు దక్షిణాపథమునకు వచ్చి శ్రీకాళహస్తీశ్వరుని దర్శించి యచ్చటఁ బార్వతీవల్లభునకు స్నానాద్యుపస్థానములకుఁ బ్రవాహోదకము లేకపోవుటఁ జూచి వియద్గంగను భూలోకమునకుఁ దెచ్చుటకు దీర్ఘతపం బాచరించెను. ఆకారణమున గంగాధరుఁడు తన జటాజూటమునుండి యాకాశగంగనుఁ బంపెను. అదియే సువర్ణముఖీనామమునఁ గాళహస్తీశ్వరుని పొంతిలఁ బ్రవహించుచున్నది.

కొండొకకాలమున విరించి శతరూపిణియైన సరస్వతితో రమింప ముప్పదివేల రక్కసు లుద్భవిల్లిరి. వారి దుండగములచే ముల్లోకములు తల్లడించుచుండ వారిని సంహరించుటకుఁ బద్మసూతి యుగ్రుఁడను పుత్రునిగనెను. ఆయుగ్రుఁడు కదనరంగమున తన యగ్రజాలనుఁ బరిమార్పఁ గమలభవుఁడు పుత్రనాశనమునకుఁ గనలి తనకోపానలమునకు నుగ్రుని నింధనముగావించెను. పుత్రవిహీనుఁడైన పితామహుఁడు పార్వతీరమణునిగూర్చి తపమాచరించి ఋభుఁడను నాజన్మవిరాగినిఁ బడసెను.

అటుతర్వాత యాదవమేదినీధవుడు శ్రీకాళహస్తీశ్వరనామ మెట్లు విశ్వేశ్వరునకుఁ గలిగెనని పృచ్ఛింప నామిథ్యాజంగమ మిట్లు వివరణముగాఁ బల్కెను.

కృతయుగమున నొక చెలదిపురుగు తన తంతు వితానముచే ననేక గృహములను ఆలయములను నిర్మించి సమస్త దేవతలకుఁ గాపలసిన నిలయములనుఁ గల్పించెను. అంత శశిశేఖరుఁడు దాని భక్తిని పరీక్షించుటకుఁ దన యాలయములోనున్న దివ్యజ్యోతిచే నాకట్టడముల నన్నిటిని గాల్పించెను. అంత నాయూర్ణనాభము మిక్కిలిఁ గోపించి యాదీపశిఖను మ్రింగ దుముక సదాశివుఁడు తన కరాగ్రముచే దాని యత్నము వారించి కైవల్యమొసగి దానిని తన లింగమునఁ జేర్చికొనెను. అదియే శ్రీ యైనది.

త్రేతాయుగమున నొక కాళసర్పము ప్రతిదినమును పాతాళమునుండివచ్చి నవరత్నములనుఁ దెచ్చి శంభులింగమునుఁ బూజించుచుండెను. ఇట్లు జరుగుచుండ ద్వాపరమున నొక హస్తి తానును యీశ్వరలింగమున కర్చనలుజేయఁ బూనుకొని నానావిధ పుష్ప ఫలాశములదెచ్చి తన తొండమునఁ బీల్చియుండిన నీరముల నాలింగము నభిషేకముఁజేసి, మణులను ద్రోసిపుచ్చి, ప్రసూనపర్ణములతోఁ బూజింపుచుండెను. మరునాడు పాముల ఱేఁడువచ్చి యాయాకులను పూవులను పాఱవైచి తానుదెచ్చిన రత్నములతో నలంకరించుచుండెను ఇట్లు కొంతకాలము జరుగగా వీరిద్దరికిని స్పర్థలు వృద్ధియయ్యెను. ఒకనాడు భుజంగము దంతావళముకొఱకు కాచికొని యది చేసినపనిచూచి కినిసి దాని తొండములోనికి తటాలునఁ బ్రవేశించి మూర్ధమున కెగఁబ్రాకి పొడువసాగెను. ఆబాధ సహింపఁజాలక ద్విరదము కుంభములతో గిరిసానువులను గ్రుద్దుచూ పరువులిడెను. ఆదెబ్బల తాకుడుమూలమున నేనుగును సర్పమును ఏకకాలమున మరణించినవి వానిభక్తికి మెచ్చి యుమాపతి వానికిఁ దనలో సాయుజ్యమిచ్చెను. కావున మహేశుఁడు శ్రీ కాళహస్తీశ్వరుఁడయ్యెనని కైతవ జంగ మా రాజచంద్రునకుఁ జెప్పెను.

పొత్తపినాటిలో వుడుమూరను పక్కణమున నాథనాథుఁడను చెంచు ఱేనికిని యతని భార్యయగు తందెమ్మకును తిన్నడను పుత్రుఁడుదయించెను. ఆతిన్నఁడు పూర్వజన్మవాసనావిలాసమున జాతప్రభృతి శివపూజాధురంధరుఁడై చేరువ కాననమున నున్న నొక శివలింగమును బూజించుచూ వన్యమృగములను వేటాడి వానిమాంసములను నంజుళ్లను దొప్పలతోఁదెచ్చి తన పుక్కిటఁ దెచ్చిన యుదకములతో శివలింగమునకు మజ్జనమాడించి దొప్పలలోనున్న యామిషములను నైవేద్యముపెట్టి, యిట్లు నిత్యము మహేశ్వరుని కొలుచుచుండెను. ఆగుడిలింగమునకుఁ బ్రతిదినము ధూపదీపనివేదన

కైంకర్యములు జేయుచున్న శివబ్రాహ్మణుఁడీ రోతవస్తువులను జూడనోల్లక సాంబశివుని ననేకవిధముల బ్రతిమాలుకొనుచుండెను. ఒకనాఁడీశ్వరుఁడా పూజారికిఁ దిన్నని నిర్మలభక్తిఁ జూపనుద్దేశించి యాబ్రాహ్మణుని పొంచియుండి తిన్నని వర్తనమంతయుఁ బరికింప నియమించెను. తిన్నఁడు యథావిధిగావచ్చి నిత్యకృత్యములు నెఱవేర్చుచుండ శివలింగమున కొక కంటినుండి రక్తము కాఱుట చూచెను. తిన్నఁడనేక వైద్యక్రియలు చేసినను రక్తబిందుచ్యుతి కట్టలేదు. అప్పుడు తన పొదిలోనున్న కోలతోఁ దన కన్ను నూడఁబెరికి ఈశ్వరుని కంటియొద్ద బెట్టెను. ఆకన్ను చక్కఁగ నమరి ఫాలాక్షుని కంటికాఱుపు వెంటనే కట్టెను. అటుతర్వాత ముక్కంటి రెండవ కంటి నుండిగూడ శోణితము స్రవింపఁజొచ్చెను. దానికై తన రెండవ కన్నుఁగూడ నూడఁ బెరుకుటకు సిద్ధముగా నుండగా మహానటుఁడు ప్రత్యక్షమై తిన్నని యవ్యాజభక్తిని మెచ్చి యతనికిని బ్రాహ్మణునకును మోక్షమిచ్చెను.

మధురాపురమున నత్కీరుఁడను నొక ద్రావిడ మహాకవి యుండెను. కొండొక కాలమున నాదేశమంతయు దురంతమగు ననావృష్టిమూలమున దుర్భిక్షకుఁ బాలయ్యెను. అనేకమంది ప్రజలు దేశమువిడిచి పరదేశములకుఁ బోయిరి. అట్టి తఱి యాపట్టణమందలి శివాలయమునన్ను పూజారికూడ క్షామబాధనోర్వలేక దేశాంతరమునకుఁ బోవ నుద్యుక్తుఁడయ్యెను. మహాశివుడు ప్రత్యక్షమై యాతని ప్రయత్నము నిరోధించి యాతనికొక శ్లోకము నిచ్చి దాని నాదేశపురాజునకుఁ జూపిన భూరిధనము నొసంగునని చెప్పెను. అట్లా శివార్చకుఁడా పద్దెమును దీసికొని పాండ్యరాజుకడకుఁ బోయి చూపగాఁ దదాస్థానమునన్ను నత్కీరుఁడు పద్యమందున్న వర్ణనము నాక్షేపించెను. బ్రాహ్మణుఁడా యాక్షేపణమునకుఁ దగు సమాధానముఁ జెప్ప నేరక ఖిన్నుఁడై తిరిగివచ్చి శివలింగమెదుట దుఃఖింపసాగెను. అప్పుడు నిటలాక్షుడు కోపించి కుష్ఠరోగమునఁ గృశింపుమని నత్కీరుని శపించెను. నత్కీరుఁడు శోకసాగరమున మునిగి పశ్చాత్తప్తుఁడై మహాదేవుని వేడికొనగాఁ గైలాసపర్వత దర్శనమున రోగబాధ నివారణమగునని శాపముక్తి సాధనముఁ దెల్పెను. నత్కీరుఁడా ప్రకారము తీర్థయాత్రలకుఁబోయి క్రమక్రమముగాఁ బుణ్యతీర్థములన్నిటిని సేవించి వారణాసిఁజేరి విశ్వనాథుని దర్శించి, యచటనుండి హిమశైల

ప్రాంతములఁజేరి యొక గహనారణ్యమునఁ జిక్కుకొని ముందుపోవ తెన్ను దెలియక యొక కొలనియొద్దనున్న వటవృక్షచ్ఛాయను విశ్రమించెను. అచ్చట నొక మహాభూత మాతనిని మ్రింగఁదొరకొనిన నామహాకవి సుబ్రహ్మణ్యస్వామినిగూర్చి స్తోత్రము చేయుగా నాషడాననుడు చెచ్చెర సాక్షాత్కరించి యాతనినిఁ గాపాడెను. అప్పుడాస్వామి దక్షిణ కైలాసమగు కాళహస్తీశ్వరుని గిరిని దర్శించిన కైలాసదర్శనఫలము లభించి రుజయుదృశ్యమగునని యానతిచ్చిన నత్కీరుఁడా కాసారమున స్నానము చేయుటకు మునుగగా జగదీశ్వరుని కరుణా కటాక్షమునఁ దత్క్షణమే శ్రీకాళహస్తిలో నిలిచినవాఁడయ్యెను. ఆవెంటనే విశుద్ధదేహుఁడైన నత్కీరుఁడు కాళహస్తీశ్వరునిగూర్చి స్తుతిశతకము జెప్పి శంకరుని తేజంబున లీనమయ్యెను.

మధురానగరంబున మాణిక్యవల్లియను గాణిక్యాంగన యుండెను. ఆమెకిద్దరు కుమార్తెలుండిరి. వారిద్దరు జననాదిగ శివపూజాప్రపన్నులయి కులవృత్తిని రోయుచూ తమతల్లి దుర్బోధనలను చెవిని సోకనీయక నిత్యము శైవారాధన తత్పరులుగా నుండిరి. శ్రీకాళహస్తీశ్వరుని దర్శించుటకు వారెక్కువగా నుత్సాహపడుచుండఁగాఁ గొందరు దొంగలు జంగమవేషములదాల్చి వచ్చి వారిని కాళహస్తిపురమునకుఁ దోడ్కొనిపోయెదమని నమ్మించి వారిని వెంటఁబెట్టికొని ప్రయాణమైరి. దారిలో నెంతఁ బ్రయత్నించినను, ఆవేశ్యకన్యలను దోఁచుకొనుటకు వీలుకలుగక, కాళహస్తి సమీపముననున్న కాఱడవియందొక నిర్జనప్రదేశమున ధనాపహరణయత్నముఁ జేయుచుండిరి. అప్పుడు కాళహస్తీశ్వరుఁడు జంగమవేషమునఁ దటాలున గోచరించిన ధూర్తులు భయపడి పారిపోయిరి. కన్యలిద్దరును జంగమవేషధారియగు చంద్రకళాధరుని సాహాయ్యమున కాళహస్తిపురముఁజేరి శ్రీకాళహస్తీశ్వర జ్ఞాన ప్రసూనాంబికలను నిత్యము గొలుచుచూ తుదకు శివసాయుజ్యముఁ బొందిరి.

ఇట్లాజంగమ మహాదేవర చెప్పిన యుదంతమంతయు, సావధానముగ విని యాదవనృపాలుఁడు పులకితాంతరంగుఁడై వెండియు నాజంగమ వతంసము నిట్లు ప్రశ్నించెను. "ఓమహాదేవర మీరు చెప్పినదంతయు విని పూతచేతస్కుఁడనైతిని. లూతాకీటకమును, కాళసర్పమును, హస్తియు, తిన్నఁడును పూర్వజన్మములలో వారెవ్వరై యుండిరో తెలియఁగోరుచున్నాను గాన నానతీయుఁడు." ఆమాటల కాయోగీశ్వరుఁ డిట్లు చెప్పెను.

చెలదిపురుగు విశ్వకర్మ పుత్రుఁడగు ఊర్ణనాభుఁడు. అతను బ్రహ్మసృష్టికిఁ బ్రతిసృష్టి చేయుటచే భూలోకమున సాలెపురుగుగాఁ బుట్టుటకు శపింపఁబడెను. కాళసర్పమొక కాళుఁడను సర్పరాజు. ఒకానొకసమయమున నాతను క్రీడాపరాయణుఁడై పార్వతీపరమేశ్వరుల కొలువునకు రా నాలస్యముఁ జేసెను గాన నాదిదంపతులచేఁ గాళసర్పముగాఁ బుట్ట శపింపఁబడెను. కరీంద్రుఁడు వెనుకటి జన్మమున హస్తియను పేరుగల ప్రమథుఁడు, ఒకనాఁడు గిరీశుఁడు గిరిజాసమేతుఁడై యేకాంతంబునఁ గ్రీడించుచుండ నీప్రమథుఁడు ప్రమత్తుఁడై తద్రహస్యస్థలమునకుఁ బోవ నద్రిసుత కోపించి యతనిని భూలోకమునఁ గుంజరమై చరింపుమని శపించెను. కన్నప్ప యను నామాంతరముగల తిన్నఁడు మున్ను కిరాతవేషముననున్న పినాకపాణితో హిమవద్గిరి కాననమునఁ బోరాడిన యర్జునుఁడు. కాలకంఠుని కరుణచే నీశబరజన్మమున శివసాయుజ్యము నొందెను.

ఇట్లు వేఱువేఱుగా వారి పూర్వజన్మవృత్తాంతముల నెఱుకపఱచిన నాయాదవ భూధవుఁడు సంతుష్టాంతరంగుండై మాయాజంగమరూపుఁడైన ప్రమథాధిపునకుఁ బ్రణమిల్లి వాని యాజ్ఞచొప్పునఁ గాళహస్తీశ్వరున కాలయము వేవేగమ నిర్మించి యాలయ ప్రతిష్ఠనదితపూర్వముగ నొనరించెను.

## కావ్య నిర్మాణము.

స్థలపురాణములకెల్ల మూలకందమును స్కాందపురాణంబుననున్న కాళహస్తిక్షేత్ర మహాత్మ్యమను కథయే యీ ప్రబంధమందలి యితివృత్తము ♦ ఆకథను మూలాధారము చేసికొని యింక మరికొన్ని

♦ స్కాంధపురాణమందలి వైష్ణవ ఖండమున వెంకటాచలమహాత్మ్యమనుభాగమున్నది. దానియందు ముప్పది అధ్యాయము మొదలు ముప్పదియయిదవ అధ్యాయమువరకుఁ కాళహస్తిమహాత్మ్యము కథయు, సువర్ణముఖరీనది యుత్పత్తి కథయు యున్నవి. ఈభాగము ఆరధ్యాయములుగా నున్నది. కావున లింగరాజు చెప్పిన షడాధ్యాయీకథ యిదియే గాబోలు. వైష్ణవగ్రంథమధ్యముననున్న కారణమున గ్రంథము పేరును, సందర్భ నిర్దేశమును చెప్పమానెను ?

కథలను జేర్చి ధూర్జటికవి యీ ప్రబంధమునల్లెను.

ధూర్జటికవి ప్రపౌత్రుఁడగు లింగరాజు యీక్షేత్ర మహాత్మ్యమునే పండ్రెండాశ్వాసముల కావ్యముగాఁ బెంచి రచించి తాను రచించినదానికిని ధూర్జటి గ్రంథమునకును మాతృకల గురించి యిట్లు సూచించెను.

క. విను కాళహస్తిమహిమం
బనుపమమై వెలయ మనుపడధ్యాయికథన్
దెనుఁగునఁ గావ్యముగ నొన
ర్చెను బెదధూర్జటి కవీంద్రశేఖరుఁ డనఘా.

గీ. బహుపురాణమథిత భవ్యార్థ శివతత్త్వ
సారమెల్ల నైక్యసరణిఁ బొదలి
జగతి శివరహస్య సంగ్రహ మను నితి
హాస మొనరు విబుధు లభినుతింప.

సీ. ఆ యితిహాసంబు నందలి యుత్తర
భాగంబునందు భాస్వన్నిరూఢిఁ
గాళహస్తిమహత్త్వ కథ నూటయిర్వది
యధ్యాయములఁ జెలు వమరుచుండుఁ
దత్కథఁ దెనుఁగున ద్రాక్షరశోక్మికా
పరిపాకవిస్ఫూర్తిఁ బరిఢవిల్లఁ
గృతియొనర్పుము మదంకితముగ శబ్ద చ
మత్కృతిఁ బండితుల్మదిగణింప.

కావున ధూర్జటికవి స్కాందపురాణాంతర్గతమైన చిన్నకథను బెంచి నాలుగాశ్వాసముల గ్రంథముగా రచించెననియు, లింగరాజకవి బహుపురాణ మథిత శివతత్త్వసారమైన శివరహస్య సంగ్రహమను పురాణము నందలి యుత్తరభాగమును గ్రోడీకరించి పండ్రెండాశ్వాసముల ప్రబంధముగా రచించెననియుఁ దేలినది. స్కాందపురాణ స్థితమాతృక

భాగముతో ధూర్జటి రచనను బరిశీలించినయెడల కథావిషయమున గొన్ని ముఖ్యాంశములుదప్ప మరి యెవ్వియును దానినుండి గ్రహింప బడలేదని దెలియుచున్నది. కావున నీకవి పెద్దన్న మనుచరిత్రము రచించినట్లును, ముక్కుతిమ్మన్న పారిజాతాపహరణమును రచించినట్లును, గాక కేవల స్వతంత్ర కల్పనలతోను, స్వతంత్ర వర్ణనలతోను, నవీన గ్రంథముగ రచించినట్లు గాన్పించుచున్నది.

ఈకావ్యరచనను గురించియు, యీ కావ్యమందలి కథాసామగ్రిని గురించియు విచారించునపుడు రెండు విషయములు ముఖ్యముగా గోచరింపుచున్నవి. శ్రీనాథుఁడు భీమేశ్వర పురాణమందు ద్రాక్షారామ భీమేశ్వరుఁడగు మహాశివుని మహాత్మ్య కథను ప్రబంధరూపముగా ధూర్జటికిఁ బూర్వమే రచించియుండెను. అద్దానిని ధూర్జటి చదివియే యుండును. ఆగ్రంథమందలి కొన్ని గనుపింపులు ధూర్జటి కావ్యమందును గాన్పించుచున్నవి.

భీమేశ్వరపురాణమందు అగస్త్యుఁడును లోపాముద్రయు దక్షిణ కాశియని బేరొందిన ద్రాక్షారామమును జూడవచ్చిరి. ఈపుణ్యదంపతులు దక్షిణాపథమునకు వచ్చిన కారణమును వారి సంచారమును నీరెండు గ్రంథములలో నొకవిధముగానే గాన్పించుచున్నవి. ఉపక్రమణ పద్యములను బోలికకై చూడుఁడు.

సీ. ఎవ్వాఁడు వింధ్యాద్రి నిక్షేంకు లింకించె
గంభీర హుంకార గర్జనమునఁ
బ్రణవ పంచాక్షరోపనిషత్ప్రపంచంబు
లెవ్వాఁడు శివునిచే నెఱిఁగికొనియె
గడపిల్లి ధరయొద్ద గడపైన నెవ్వాఁడు
తానుపైఁ గట్టె ఛందమూనవంచె

నంభోధు లేడింటి నాపోశనంబెత్తి
కలిగించె నెవ్వాఁడు క్రమ్మఱంగ
తే. భీమనాథేశ్వరుఁడు గౌరిఁ బెండ్లియాడి
దక్షిణాముఖ కల్యాణదర్శనమున
వత్సరమువత్సరంబు నెవ్వానిఁ జూచు
నతఁడు గగనాగ్రమాణిక్య మరుగుదెంచె.
తే. మలయదర్దురగిరి మహామందిరుండు
తామ్రపర్ణీ జల స్నాన ధౌతమలుఁడు
కలుషితాంభః ప్రసాదైకకతకఫలము
కోమలియుఁ దాను నేతెంచెఁ గుంభభవుఁడు.

సీ. తన పెండ్లిఁ జూడంగ దక్షిణ దిక్చరా
చర భూతములు హిమశైలమునకుఁ
జను దేర నుత్తరాశాభూమి క్రుంకి ద
క్షిణభూమి కడు నొడ్డగెడవుగాఁగ
నెగసిన నిది మాన్పనీవైన నేనైనఁ
గాని సమర్థులఁ గాన మెందుఁ
బొమ్మన్న ఘటసూతి భూతేశ్వరునియాజ్ఞఁ
దలమోచి యిల్లాలుఁ దానుగదలి
తే. వింధ్యపర్వత గర్వంబు విఱుగఁ ద్రొక్కి
గౌతమీకృష్ణవేణ్యవగాహనములు
సేసి శ్రీశైలనాథుదర్శించి జ్యోతి
సిద్ధవటనాథుఁగొల్చి విచ్చేయునపుడు.

శ్రీకృష్ణదేవరాయలు రచించిన ఆముక్తమాల్యద యీకవి కంఠీరవమునకు ప్రతివస్తు నిరూపణమునందుఁ గొంత సహాయ్యము జేసినదని నాతలంపు. కృష్ణదేవరాయలు విశుద్ధ వైష్ణవ ప్రవత్తిని తన గ్రంథ

మందు నిరూపించెను. దానికిఁగాను మూలకథలో లేనిగాథలను గొన్నిం టిని బ్రత్యేకముగా నతికి తన గ్రంథమందు విష్ణుమహాత్మ్యమును స్థిరప ఱచెను. శివుని విషయము తడవినపుడెల్ల విష్ణువునకంటె తక్కువ దేవత గానే వర్ణించెను. విష్ణుమహిమఁ దెల్పుటకు చదువురాని గుడిపూజారి యగు విష్ణుచిత్తునిచే పాండ్యరాజుయొక్క మహాసభయందు మతసంబం ధమైన వాక్యార్థముచేయించి పండితుల నందఱిని గెల్పించెను. యాము నాచార్యుల వృత్తాంతము కథకు నిజముగా సంబంధములేకపోయినను వైష్ణవ మహత్త్వ నిర్ధారణకొఱకు ప్రత్యేకముగఁ జేర్చెను. అట్లే ధూ ర్జటియు నత్కీరుని యుదంతము మూలకథయందు లేకపోయినను శైవ మహిమను బ్రకటించుటకుఁ బ్రత్యేకముగఁ జేర్చినాఁడు. ఆసందర్భములో మహాశివుఁడు తన పూజారియగు చదువురాని శివబ్రాహ్మణుని చేతికి తాను రచించిన శ్లోకమిచ్చి పాండ్యరాజునొద్దకుఁ బంపెను. ఆశివబ్రా హ్మణుఁడు మహాకవియగు నత్కీరునివల్ల నవమానింపఁబడఁగా రుద్రుఁ డుగ్రుఁడై నత్కీరుని శపించెను. మహావిష్ణుని గుఱించి మాట్లాడినపుడెల్ల నతఁడు శివుని యుపవర్గములోఁ జేరిన దేవతలలోనివాఁడనియే ధూర్జటి చెప్పెనుగాని విష్ణువున కంతకంటె నెక్కువస్థాన మీయలేదు. ఇట్లు శివ ప్రాధాన్యముఁ జూపుటయు శివమహిమలు స్థిరపరచుటయుఁ జూడ, తన ప్రభువగు శ్రీకృష్ణదేవరాయ లెట్లు కేవల వైష్ణవగ్రంథము వ్రాసెనో యట్లె ధూర్జటియు ప్రతిపక్షముగ కేవల శైవ గ్రంథము వ్రాయఁ బూనెనని యోచింపవలసి యున్నది. ఇట్లు రచించుటచే శివదీక్షఁబొందిన తన తోడి కవులగు ముక్కుతిమ్మన్న, మాదయగారి మల్లన్న మున్నగు వారికంటె నద్భుతమైన స్వాతంత్ర్యమును, స్వమతాభినివేశమును కనుప ఱచెనని కొనియాడఁదగియున్నది. మతవిషయమునఁ దనకు కేవలము ప్ర త్యర్థిగానుండిన తన యాస్థాన కవియగు ధూర్జటిని సహించి గౌరవించిన

యీమహాకవియుఁ, జక్రవర్తియు నగు కృష్ణదేవరాయలను ఎంత స్తుతించినను జాలదు.

ఇట్లు మతవిషయమునఁ గాళహస్తి మాహాత్మ్యము, ఒకవంక శ్రీనాథుని భీమేశ్వర పురాణముతోఁ బొత్తు గూర్చుకొనియు, వేఱొకవంక కృష్ణదేవరాయల ఆముక్తమాల్యదతో ప్రత్యర్థిత్వముఁ జూపియున్నను, ఒక విషయములో మాత్రము మీ మూఁడు గ్రంథములు లోకదాని నొకటి సరిపోలియున్నవి.

స్థలమాహాత్మ్య కథను విషయముగా దీసికొని ప్రబంధము రచించిన యాంధ్రకవులలో మొదటివాఁడు ఎఱ్ఱాప్రగడ. ఆకవివరుఁడు అహోబల క్షేత్రపు నృసింహస్వామివారి చారిత్రమును తన నృసింహపురాణమున నభివర్ణించెను. కాని యాప్రబంధమున నహోబలపురము యొక్క నిజరూప వర్ణనముగాని, తత్పరిసరముల నైసర్గిక నిర్దేశముగాని మనకుఁ గానిపించదు. అహోబలక్షేత్రము వ్యక్తిత్వమేమియులేక సర్వసామాన్యమైన పౌరాణిక క్షేత్రముగా నభివర్ణింపఁబడినది. స్థలమాహాత్మ్యకథ ప్రబంధముగా వ్రాసిన రెండవకవి శ్రీనాథుఁడు. అతఁడు తన భీమేశ్వర పురాణములో, దక్షారామపురమును యథారూపముగా వర్ణించుటయేగాక ఆపట్టణము చుట్టునున్న పల్లెపక్కణములను, నదులను, పైరు పంటలను, పండ్లతోఁటలను పరిసర గ్రామముల సరిహద్దులను ఇత్యాది స్థలవిషయముల నెన్నియో యాగ్రంథమందు సూచించెను. అవియన్నియు నీకాలమందలి మన యనుభవమునకు సరిపోవుచున్నవి. కావున దక్షపురియందలి భూగోళ విషయములును, చరిత్ర విషయములును శ్రీనాథుఁడు స్వయముగా పరిశీలించియే రచించెనని చెప్పవలసియున్నది. ఇట్లాంధ్రకవిత్వములో స్థలనిర్దేశమును, ఏకదేశ నిరూపణమును (**Local Colour and Provincial touch**) చేసి

యాంధ్రుల కాంధ్రదేశాభిమానము కలుగఁజేసిన యాంధ్రకవులలో శ్రీనాథుఁడు ప్రథముఁ డని నా తలంపు. *

శ్రీనాథుఁడు చూపినచక్కనిమార్గమున కృష్ణదేవరాయ లనుగమించి, ఆముక్తమాల్యదయందు శ్రీవిల్లిపుత్తూరుక్షేత్రమును యథారూపముగా వర్ణించెను. ఆదేశపుజనులవృత్తులు, నచ్చటి యారామములు, పంటలు మున్నగునవి యాకాలమున నున్నవి యున్నట్లు వర్ణించి మన కెంతయో హృదయాహ్లాదము కలుగఁజేసెను. అమాదిరినే యథావద్వర్ణనము చేసి స్థలమాహాత్మ్యనిరూపణముఁ జూపిన మూఁడవకవివతంసుఁడు ధూర్జటి. కాళహస్తిపట్టణమును, చుట్టునున్న నదీపర్వతప్రదేశములును, వివిధదేవాలయప్రతిష్ఠాపనలను స్వాభావికముగా వర్ణించుటయే గాక, కన్నప్ప లేక తిన్నని నివాసస్థల మైన వూడుమూరును, తత్ప్రదేశ మగు పొత్తపినాఁటి చెంచులపవిపాట్లును, వేఁటజీవనమును, సురాపానము మున్నగు దురాచారములును, ఇంక నెన్నియో విషయములను యథార్థముగాను, జమత్కారముగాను వారు వాడుకొనుమాటలతోఁ జిత్రించినాఁడు. ఈవర్ణన మత్యంతము ఆశ్చర్యము కలుగఁజేయుచున్నది. ఈకవీశ్వరుఁ డెంతపరిశ్రమ చేసి యాయావృత్తాంతములను సేకరింపఁగల్గెనో వానిని బహుచమత్కారముగ నిరూపింపఁగల్గెనో యోచించినయెడల నిది యెంతయు వింతగాఁ దోఁచకమానదు. స్వభావోక్తివర్ణనలలో నీకవి కృష్ణరాయ, పెద్దన్నల కెంతమాత్రముఁ దీసిపోఁడు.

ప్రపంచవిజ్ఞానమునఁ గూడ నీకవి చాల గడుసరి. కేవలశబ్దవేత్త

* నన్నయ తిక్కనలు వేఁగిదేశమును గుఱించియు, ఆంధ్రావళిని గూర్చియు మాత్రమే యుగ్గడించిరి. అంతకంటె నెక్కువగాఁ బోలేదు. శ్రీనాథుఁడు ఆంధ్రదేశముయొక్కసంపూర్ణవ్యక్తిత్వమును దనదృష్టియందుంచుకొనెను. కావుననే కళింగమువకు, ఉత్తరాంధ్రమని పేరిడెను.

మై వ్యాకృతిక నైఘంటికమర్మములు మాత్రమే తనగ్రంథమందుఁ గను పఱచక లోకజ్ఞానము, వివిధవస్తుపరిచయముఁ జాలవిషయములలోఁ జూపించెను. ఈగ్రంథమందలి వేఁటవర్ణనము మనుచరిత్రమందలి వేఁటవర్ణనమున కెంతమాత్రము తగ్గదు. ఈవిషయమున ధూర్జటికవియే యెక్కువ ప్రశంసనీయుఁ డని నా తలంపు. పెద్దన్న వర్ణించినది రా జాడినవేఁట. పెద్దన్న రాయలయాస్థానమునందలి కవిశేఖరుఁడై కృష్ణరాయలతో నెల్లప్పుడు తోడునీడగనుండుటచే రాయలమృగయావినోదములను దఱచుగఁ జూడ నవకాశ ముండెడిది. కావున నాతనియాఖేటవర్ణనము సజీవముగా నున్న దనిన వింత లేదు. ధూర్జటి చేసిన వేఁటవర్ణనము చెంచులు మన్నగునాటవికు లాడినవేఁటలు. వానిని దిలకించుటకు ఆకవి నప్రయత్నముగ బోయపల్లెలకుఁ బోయి వారితో నరణ్యముల కేఁగి యట వారి జీవితములను జూచినఁగాని యింతస్వాభావికముగాను, మనోహరముగాను వర్ణించియుండలేఁడు. ఇప్పటికాలపుఁ గవులవలెఁగాక ప్రాచీనకవులు ప్రత్యక్షానుభవము లెల్లు సంపాదించి తమగ్రంథములయందుఁ జేర్చుచుండిరో యిట్టివిషయములనుబట్టి మనము గుర్తింపఁగలము. ఆధునికకవుల లోఁ గూడఁ గొందఱుంది సముద్రములుగాని, అరణ్యములుగాని, యెన్నఁడును జూడకయే దీర్ఘవర్ణనలు చేయుచుందురు. అట్టివర్ణనలు నిర్జీవములగు మాటలప్రోగులుమాత్రమే యని వేఱె చెప్పనక్కఱలేదు. ధూర్జటికవి చేసినస్వాభావికవర్ణనలకును, జూచినవస్తువిజ్ఞానమునకును గొన్ని యుదాహరణముల నిటఁ బొందుపఱచెద.

### —• జంగమదేవర వర్ణనము •—

సీ. అడుగుసెత్తమ్ముల నపరంజిపావాలు
కరమునఁ గేదారకంకణంబు

బంగారుపాత్రి చెఱుంగులగోణాము
గళమున రుద్రాక్షకంఠమాల
యొకకేల భసితభస్త్రికతోడి పెత్తంబు
సందిగట్టిన తరుణేందుధరుఁడు
మాణిక్యరుచుల యొడ్డాణంబు భూతిపైఁ
బెట్టిన కస్తూరిబిళ్ళ బొట్టు
సార్వకాలికతాంబూలచర్వణార్ద్రి
రాగసౌభాగ్యమునఁ బద్మరాగమణులఁ
దృణముగాఁ జూచు దంతపంక్తియును గలిగి
యంగజారాతి యొకమిండజంగ మగుచు.

— సాలిపురుగుపట్టులు —

శా. ప్రాతఃకాలతుషారశీకరచయప్రాప్తిన్ లసన్మౌక్తికో
పేతాగారములట్లు చెల్వెసఁగు తద్బిందుచ్ఛటాజాతఖ
ద్యోతచ్ఛాయలఁ గొంతసేపు బహురత్నోద్దీర్ణగేహంబులై
లూతాకల్పితతంతుసద్మములు వొల్చుం జెప్పఁ జిత్రంబులై.

— చెంచులమద్యపానవర్ణనము —

* * * * * * * *

సీ. మాటలాడఁ దలంచి మఱచిపోయెడువారు
నడవఁబోవుచుఁ దొట్రుపడెడువారు
నూరకుండెద మని యుండనోపనివారు
లేచెద మని లేవలేనివారుఁ
బనిలేనిపని బట్టబయలు దిట్టెడువారుఁ
బాడనేరకయును బాడువారు
ఎదురైనవారికి నెల్ల మ్రొక్కెడువారు
విఱ్ఱిదావిహీనులై యాడువారుఁ

జాలఁ ద్రావియు మగుడఁ జే సాఁచువారుఁ
దొడరి యుపదంశభాండంబు లొడ్డుకువారు
నైరి మృగయాదిదైవత యాత్రయందుఁ
పానములు చేసి శబరదంపతులు రతుల.

I వస్తువిజ్ఞానము :—

సీ. సంసారపారదోచ్చాటనానలకీల
కలుషసంచయతామ్రగంధకంబు
కామలతామూలకందకుద్దాలంబు
సంకల్పపాషాణటంకముఖము
రాగశాలివనాంకురకడంగరీయంబు
శంకాకళంకభుజంగనకులి
నవమనోగోరాజి నాసికారజ్జువు
కోపనేత్షణవిశిఖోపలంబు
దివ్యదేశికహంసోపదిష్టమార్గ
నిర్గుణధ్యానసంధాన నిరుపమాన
సౌఖ్యసంపన్న సాధకజననివాస
మమృతలింగాకరము కాళహస్తిపురము

II ఈశ్వరునికి నేత్రచికిత్స :—

సీ. కోకపాట్లం బావిఁ గొననూఁది యొత్తుచుఁ
గమణోష్ణకరభభాగమునఁ గాఁచి
నెత్తి తంగేడాకు మెత్తి రేచకి నిమ్మ
పంటిపుల్సున నూతి పట్టువెట్టి
తెల్లదింటెనపువ్వుఁ దెచ్చి తద్రస మిడి
కలివెపువ్వులు గోసి నిలిచి పిడిచి
పేరిననెయి వెట్టి పెరుఁగువత్తులు వైచి
చనుఁబాలతో రాచి సంకు చమిరి

విన్నమందులు తా సరి కన్నమందు
లడిగి తెచ్చినమందులు నడవిమందు
లెన్ని చేసిన మానక యిందుమౌళి
కన్ను తోడిఁ బడి నెత్తుటఁ గాఱుటయును.

మూఁడవయాశ్వాసమునందలి వేఁటవర్ణనమును, గ్రామవర్ణనము ను గొంచెము దీర్ఘములుగా నుండుటచే నిట నుదహరింప మానితి. వానిని జదివినయెడల నీమహాకవి యెంతయనుభవశాలియో యెంత యెక్కువగఁ బ్రపంచవిజ్ఞానమును సంపాదించుకొనెనో మనకు స్పష్టముగ బోధపడఁగలదు. ఇది భక్తిరసప్రధానమైన దివ్యక్షేత్రసంబంధ మగు గ్రంథమైనను దీనియందు ననేకరుచులును, ననేకరసములును ననేకవిధములగు లోకానుభవములను నీమహాకవి చేర్చి సుమనోమనోజ్ఞ మగు కావ్యముగ నొనరించినాఁడు.

## —• కావ్యశైలి •—

ధూర్జటికవి తన శైలి "నవ్యభాషా శతధా నిగుంభన రసస్థితి" నుండు నని ప్రారంభముననే చెప్పెను. తనపౌత్రుఁడగు లింగరాజకవి యాతని కవిత్వశైలినిగుఱించి "సాన సుధానూన సరసోక్తి గుంఫన" మని వర్ణించెను. కృష్ణరాయలసభయం దీతని శైలి "అతులిత మాధురీమహిమ" గలిగిన దని యుగ్గడింపఁబడినది. ఇట్లెవ్వరు కొనియాడినను ఈతని శైలియందు రసోద్ధతి గలదనియే నుడివిరి. ఈతని శైలియందు మాధుర్యగుణము ముఖ్యలక్షణముగ నుండిన ట్లగపడదు. మాధుర్య గుణ మేమనః—

తే. గీ. రసయుతం బగుమధురంబు రసమునూక్తు
లందునుఁ వస్తువునను బొల్పారుచుండు ;
మధువుచే మధువ్రతములమాడ్కి విబుధు
లలరుచుండు రెద్దానిచే నదియె రసము. (కావ్యాదర్శము)

మాధుర్యగుణము రసలక్షణములలో నొకటియై భాషయందును వస్తువునందును సమానముగ నుండును. అట్లు లేనిచో మాధుర్యగుణ లక్షణ మా గ్రంథమునకు వర్తించదు. ధూర్జటికావ్యమందు మాధుర్య గుణము భాషయందుఁ బ్రత్యేకముగఁ గానరాదు. వస్తువునం దెక్కువగఁ గానరాదు. కావున మాధుర్యగుణము దీనియందు ముఖ్యముగ నున్నదని చెప్పుట పొసఁగదు. పారిజాతాపహరణమున మాధుర్యగుణము భాషయందును, కథావస్తువునందును సమానముగ నున్నట్లు గాంచినాము. కావున ముక్కుతిమ్మన్నకవనమందు మాధుర్యము ముఖ్యలక్షణ మని చెప్పినను నొప్పును. ఈకావ్యమందుమాత్ర మది వర్తించ దని నా యభిప్రాయము. ఆకారణముననే కృష్ణరాయలసభయందలి ధూర్జటి విషయ మగు సమస్యాపూరణము కొంటెవాని పనిగాని కవియొక్క నిజ ప్రభావమును దెలుపునది కా దని నేను సిరసించితిని.

ఇంక ధూర్జటికవన శైలి యెట్టి దనినః— రసభరితమై, ధారాళమై, బలాఢ్యమై, నవ్యభాషాశతధా నికుంభితమై, తటాంచలముగఁ బ్రవహించెడు మహానదీప్రవాహమువలె మందము గాక, యుద్వేలము గాక సమాంతరయోద్ధతిని బరుగిడుచున్నది. భావములు, భాషయు, తూకము గలిగి సమానగౌరవమును బొందియున్నవి. మాధుర్యమును, ఓజస్సును సమానభాగములుగఁ బంచుకొనియున్నవి. సంస్కృతపదభార మెక్కుడుగా నుండుటచేఁ బాండితీప్రయాసకులకుఁ దప్పక మెప్పుఁ గలిగించుచుండును. అయినను నీతనిసంస్కృతభాష శ్రీనాథునియందువలెను తెనాలి రామకృష్ణునియందువలెను, నైఘంటికగహ్వరములనుండి యూడి రాలినదిగాక తఱచుగ సామాన్యపండితవర్గము వాడుచుండుటచే సులభ గ్రాహ్య మైనదిగ నున్నది. కావున విషయార్థము సుబోధ్యమై, శీఘ్రమవేద్యమై హృద్య మగుచున్నది. ఆకాలపు మహాకవు లందఱివలెనే యీ

తేఁడుగూడఁ దనకవితకుఁ బ్రత్యేకలక్షణ మివ్వఁగలిగెను. పెద్దన్న ప్రౌఢ మగు రసప్లుతిఁ గలుగఁజేసి చిత్రకారుఁడు ధగద్ధగితము లగు వర్ణముల తోఁ జిత్రపటములను వ్రాసినట్లు తననిరుపమానశబ్దమహిమచే చక్షు శ్శ్రోత్రములకు సమానసౌభాగ్యము గలుగఁజేసెడు శైలిని నేర్పఱచుకొ నెను. ముక్కుతిమ్మన్న సులలితమైన పదవిన్యాసముతో శ్రోత్రప్రియ మగు మృదుమధుర మైన శైలిని జూపించెను. నృసింహకవి అర్థగాంభీర్య మును, వచఃప్రాగల్భ్యమును జతపఱచి సమయోచితనైపుణ్యము గల శైలిని యుపయోగించెను. కృష్ణదేవరాయలు విషయప్రాధాన్యముఁ జేసి కొని రాచరికపుహృదయసంయమము నభ్యసించి రసగుంభితమై, నిబిడ మైన పదకూర్పు గల శైలిని ప్రకటించెను.

ఇంక ధూర్జటికవి వీరివలెఁ గాక రసస్ఫూర్తియు, శబ్దపటిమయు సమానముగ నుండునట్లును, విషయము సుగోచరముఁ జేయుచు ప్రౌఢ శబ్దప్రయోగము ఏకధాటిగ నడచునట్లును శబ్దార్థసమగౌరవము గల, రసవంతము గల శైలి నుపయోగించెను. ఈతని శైలియందు మాధుర్య ముతో నోజస్సును, సౌలభ్యముతోఁ బుష్టియు, వేగముతో గాంభీర్య మును జతపడి యున్నవి. ఏభాగ మెచ్చోట విప్పి చదివినను మై పులక రింతలు గలిగించు రసోద్రేకము తప్పక యనుభవమునకు వచ్చును. దీర్ఘవర్ణనలలోఁ దీటికగాఁ గూర్చొని పద్యముల నల్లుటయు, భావములఁ బెనఁచుటయు—నీతనిపని గాదు. కథాప్రణాళికను విద్యుల్లోక మెఱసినట్లు చకచక నడపించుచు మధ్యమధ్య వర్ణనభాగములను గూడ కథలోనున్న రసవేగముననే సంధానించి కథనోత్సాహము, అమందతరంగసంగతముగ నుప్పొంగినరీతిని నిర్వహించుకొనెను.

"సవ్యభాషా శతధా నిగుంభన రసస్థితి"

అని తన శైలినిగుఱించి కాళహస్తీశ్వరుఁ డన్నమాట లీతనికవిత

కెంతయుఁ దగియున్నవి. సంస్కృతశబ్దముల నింత హృద్యముగాను, జోద్యముగాను వాడినకవి యాకాలమందు చింతలపూఁడి ఎల్లనార్యుఁడు తప్ప మఱియొకఁడు కానరాఁడు. సమకాలికుఁ డగు తెనాలి రామకృష్ణుఁడు గూడ సంస్కృతపదభూయిష్ఠ మైన శైలిని యుపయోగించెను. కాని, యది శ్రీనాథునివలె కఠినపదగ్రథితమై తఱచు దుర్భేద్యముగ నున్నది. అంతియగాక, ధూర్జటియందలి రసవద్విసరణము గూడ రామకృష్ణునియందుఁ గాన్పించదు. బహుశః ఈ కారణముచేతనే గాఁబోలు కొంటెకవి యగురామకృష్ణుఁడు రాయలసభయందు ధూర్జటినిగుఱించి సమస్యాపూరణముఁ జేయుచు నాతనిమాధురీమహిమ సుకుమారవారవనితాసంగతివలనఁ గలిగె నని సపహాస్యగర్భితవ్యాజస్తుతిఁ జేసియుండును.

ధూర్జటియొక్క శైలిని దెలియఁజేయుటకు మచ్చునకై కొన్ని పద్యముల నిటఁ జూపుచున్నాను.

శా. ఓ వెఱ్ఱీ! సుతు లందఱుం దెగిన నయ్యో దుఃఖివై యీగతిన్
జావం బుట్టువుదీఱునే? మనుములో సంసారమున్ రోసినన్
దేవోత్తంసునిఁ బార్వతీరమణు భక్తింగొల్వుమీ చేకుఱున్
జీవన్ముక్తియ టంచు ధాత్రి యుపదేశింపం బ్రమోదంబునన్.

శా. తుండాలార్భకషండగండతలఘర్ఘాభర్జనోపార్జనా
ఖండగ్రావము చండకుండలివిశంకవ్యాప్తి కింపైన శ్రీ
ఖండస్థాణువు శారికా శుక విహంగవ్రాత పుంజేత్తు కో
దండక్రీడకు నీడమై తప మతిస్థైర్యంబునం జేయఁగన్.

సీ. వామాంగభామినీ శ్యామధామాళియుఁ
గంఠహాలాహలకాళిమంబు
కాకోళకేళపాకాసితచ్ఛాయయుఁ
జాళికాసింధుశైవాల రుచియుఁ

గరళకృష్ణసారాగ్ని ఘనధూమనీలిమ
శేషభూషణ ఫణాసీమ నలుపుఁ
గటితలకీలిత కరటిచర్మద్యుతి
మేచక శూలశోభాచయంబు
భువనలోచనుపై నెత్తిపోవు నంధ
కారబృందమునకుఁ దోడు గాఁగఁ గూర్చి
వెనుక నేతెంచు భూతేశువిధము దనరఁ
జంద్రుఁ డుదయాద్రిపై నొప్పె సాంద్రకాంతి.

మ. మదమాతంగము సింఘురార్భకముతో మార్కొంచుఁ జెర్లాడు పెం
పుదయింపన్ లయకాలతాండవకరుం డుష్ణాంగి గాండీవితోఁ
గదనం బిట్లొనరింప నాతఁడు భుజాగర్వంబు మాత్సర్యము
న్వదలం జాలమిఁ జాల మెచ్చి శివుఁ డంతన్ దివ్యతేజంబుతోన్.

అలంకారముల నచ్చటచ్చట కొలఁదిమాత్రముగ వాడి, రుచి చూపించెను. ఆయాస్థలములలో నవి సమయోచితముగ నుండి రసపోషకములుగా నున్నవి. ఈతని కావ్యరసము అలంకారములమీఁద నాధారపడి యుండలేదు. కాన, వానివాడుకకు నెక్కువ యవసరము లేకపోయెను. భావోద్రేకము సహజలక్షణముగ నున్నయీకవివరుఁడు స్వాభావిక రచనముచేతనే తా నిచ్ఛగించిన కావ్యశోభ యంతయుఁ జేకూర్పఁ గలిగెను. ఉపమారూపకములు కొలఁదిమాత్రముగఁ గాన్పించుచున్నవి. ఉత్ప్రేక్షలు తఱచు వర్ణనలభాగములందే గానవయ్యెడు. అవియుఁ జాల మితముగాను, సమయస్ఫూర్తిగాను వాడఁబడెను. శబ్దాలంకారములగు శ్లేషయమకానుప్రాసములు బహుకొద్దిగా నున్నవి. ఏ యలంకారములనైనను నతిచాపల్యముగ వాడియుండలేదు. కావున నితనికవిత్వము సహజమైన పుష్టియు, హృష్టియుఁ గలిగి యున్నవి. ఇది యుద్యానవనమువలె నానావర్ణద్రుమములును, కుసుమస్తబకములును, కీరశారికా

నిష్కాళితములును గలిగి నయనశ్రవణోత్సుకముగ నుండక, గంగా యమునా తరంగిణుల సంగమంబున, వీచికానినాదమధ్యంబున నవగాహముఁ జేయు యోగిపుంగవుని కెంతహృదయానందము గలుగునో యట్టి యపారసంతుష్టి యీ కావ్యమునఁ గలుగఁగలదు.

అలంకారములు దెలుప నొండు రెండు పద్యముల మాత్రము చేర్చెదను.

—: రూ ప క ము :—

చ. భయ మను తొల్లికన్ విమలభావ వసుంధరఁ బెల్లగించి భ
క్తి యనెడు విత్తుఁ బెట్టి ప్రతిధీనది సమ్మదవారిఁ జల్లఁగా
నయమున నంకురించుచు ననల్ గొనలై యెలమిం జెలంగి త
న్మయముగఁ బ్రాఁకె నం చనఁగ నారుల మై పులకంబు లేర్పడన్.

వెన్నెలవర్ణనఁ జేయునపుడు కృష్ణదేవరాయలకాలపునాఁటికవులు తత్పూర్వకవులవలె చకోరపుపేరంటాండ్రు గుజ్జనగూళ్ల క్రీడలను వర్ణించుట యొకయాచార మైనది. ఈవర్ణనమున నొకరినిమించున ట్లొకరు ప్రయత్నించుచుండిరి. బహుశః కావ్యసౌకుమార్యమున కిది గొప్పనిదర్శనముగా నుండి కవిప్రతిభను విశదము చేయఁగల దని యాకాలపుఁ గవు లీవర్ణనముగుఱించి యంతయభిమానముఁ జూపిరికాఁబోలు!

చ ం ద్రి కా వ ర్ణ న ము :—

I చ. వెన్నెలగుజ్జు నంజుకొని వెన్నెలప్రోవు భుజించి, వాలిక
న్వెన్నెలగ్రొజ్జుఁ జాలఁ గొని వెన్నెలతేటలఁ ద్రావి సేదుకన్
వెన్నెలక్రొను జుఱ్ఱుకొని వీధులయందుఁ జకోరదంపతుల్
మిన్నులు ముట్టి వెన్నెలలు మేపుచుఁ బిల్లలు దాము నాడఁగన్.

(కాళహస్తిమాహాత్మ్యము)

II సీ. విరహుల పైసోఁకి వేఁడియౌ వెన్నెలఁ
బచ్చివెన్నెల సలివచ్చఁ జేసి

కలువపుప్పొడులచేఁ గసటైన వెన్నెల
వలిపవెన్నెలలోన వడిచి తేర్చి
చంద్రకాంతపునీట జాలైనవెన్నెల
ముదురువెన్నెల జొబ్బఁ బదను చేసి
సతుల మైపూఁతం బిసాళించువెన్నెలఁ
దనుపువెన్నెల రసాయనముగూర్చి
చిగురువిలుకానిజాతర సేయఁ బూని
కొలముసాముల నందఱఁ గూడఁబెట్టి
వంతు గలయంగ బువ్వంపుబంతి విందు
పెట్టె రెలమిఁ జకోరపుఁ జేరఁటాండ్రు.

(పారిజాతాపహరణము)

III సీ. మొలకవెన్నెలచాలు గలపి నెచ్చెలులకు
నూడిదగా నిచ్చి యాడు నొకటి
గుజ్జువెన్నెలఁ గ్రొచ్చుకొని తెచ్చి చుట్టాలఁ
బిలిచి విందులువెట్టి మలయు నొకటి
తీఁగవెన్నెలతీఁగె దిగిచి వేతువకలు
సేసి వల్లభ కిచ్చి చెలఁగు నొకటి
చిగురువెన్నెలఁ ద్రుంచి మగనికుత్తుకఁ జేర్మిఁ
గూర్కొని కూర్కొని గునియు నొకటి
లప్పవెన్నెలకుప్ప బాలలకుఁ జూపి
మేఁత వెట్టించి కెలఁకుల మెలఁగు నొకటి
కేళిఁ జంద్రోదయోత్సవ శ్రీలఁ బొదలెఁ
గోరికలు మిన్నుముట్టఁ జకోరకములు.

(శ్రీరాధామాధవము)

ఈవిధమైన చంద్రికావర్ణనము అనంతామాత్యుని భోజరాజీయమునందును, జక్కన విక్రమార్కచరిత్రమందును గూడ నున్నది. గ్రంథవిస్తరభీతిచే వాని నిచ్చుటఁ జేర్చలేదు.

—* రసము — నీతి *—

నవరసభరితమగు నీకావ్యమందలి నీతిరసవిచార మించుక చేయ వలసియున్నది. ఈకావ్యమందు ముఖ్యముగ భక్తిరసము గాన్పించుచున్నది. ఈభక్తిరసమునకు · నంగిగా నున్న శృంగార వీర శాంతరసములు స్థాయిరసమున కుద్దీపకములుగ నున్నవి. ఆయారసము లన్నియు నెట్టి వికృతులు పొందినను సూత్రరూపముగ నున్న భక్తిరస మాయావికారములకు నింపుసొంపులు గలిగించుచున్నది.

శృంగారరసము మాయాదంగమరూపుఁ డగు పరమేశ్వరుఁడు సౌందర్యరాశి యైనదాసియింట విడియముచేసిన కథాసందర్భమున నావిర్భవించినది. ఈకథాభాగము నేఁటికాలపు భారతీయుల మగు మనకు మనోజ్ఞముగ నుండకపోవచ్చును. కాని, యిట్టి స్వైరశృంగారవిహారములు శివకేశవుల కిద్దరకును ధర్మాచరణములే యని మనపూర్వులు నమ్మియుండిరి. కావున వారియు దిట్టికార్యము లేహ్యములుగఁ గాన్పించియుండలేదు. కావున నిట్టిశృంగారగాథల నైతికవిచారముఁ జేయుట మన కప్రస్తుతవిషయము. పరమేశ్వరు లగు శివకేశవుల కాముకచర్యలు మనపురాణాంతర్గతములుగ నెన్నియో యున్నవి. వానివిగురించి కేల్మోగిడ్చి మిన్నకుండుటయే లెస్స యని నా తలంపు.

తరువాత శృంగారరసము తాపసమిథున మగు అగస్త్యలోపాముద్రల తీర్థయాత్రాసందర్భమునఁ గోచరించుచున్నది. మహామునియగు నగస్త్యుఁడు తనసహధర్మచారిణితో దేశసంచారముఁ జేయుచు నదీపర్వతముల దాఁటుచున్నప్పు డెట్టిపవిత్రప్రేమఁ జూపించెనో యాదృశ్యము వర్ణనాతీతము.

ఉ. చేరఁగఁబోయి యాత్మసరసీరుహాలోచన [illegible]వట్టి వ
క్షోరుహకుంభభారమున సూక్ష్మవలగ్నము పీడఁ బొంద బొం

దారయుఁవృత్తి ర మ్మనుచు నాదరణంబునఁ దోడుకొంచు విం
ధ్యారి తదగ్రభాగమున కల్లన నెక్కె ఝురాంబుధారలన్.

శృంగారరసమందలి మూఁడవపట్టు బ్రహ్మసరస్వతుల కేళీవిష యమునఁ జూపట్టుచున్నది. ఈయుపకథ యీపుణ్యక్షేత్రసంబంధము కాకపోవుటచేఁ గొంత యప్రసక్తమైనను గవి తత్కథావిలీనము లైన శృంగార వీర శాంత కరుణారసముల వర్ణనావకాశము గలుగుటకుఁగాను ఎట్లో కథకు నతికిపెట్టిన ట్లూహింపవలసియున్నది. ఆయాసందర్భముల వర్ణన లన్నియుఁ గవిచే బహుమనోహరముగను, బహుసంక్షేపముగను జేయఁబడియుండుటచే నీభాగ మెన్నిమారులు చదివినను దనివి తీరక యుండును. ఈ నాజూకుతనము లేక, మొరటుగా నున్న శృంగారము బోయపల్లెయందలి చెంచు, చెంచెతల మద్యపానాదేశ మదనక్రీడలలోఁ జాల హృద్యముగా నభివర్ణింపఁబడినది.

విపులశృంగారరస వర్ణనాసందర్భ మీకవికి శివభక్తిపరాయణ లగు వేశ్యకన్యల యుపాఖ్యానమునఁ గలిగినది. ఆయవకాశముఁ జిక్కించుకొని ధూర్జటిమహాకవి వారవనితల శృంగారక్రియలును, విటవిటీజన ముల సంచారములును, పణ్యస్త్రీల సంపర్కదోషములును మున్నగు వానిని తదిత రాంధ్రకవులు వారిగ్రంథములలో వర్ణించినట్లు తానును గొంత వివరించి వ్రాసెను. ఇచ్చోట నైనను ఈమహాకవి తనసహజ సంక్షేపకసౌశీల్యము తప్పలేదు ఈఘట్టములు బహుసంక్షిప్తముగఁ జెప్పి విడిచిపెట్టియున్నాఁడు. సుంకసాల నృసింహకవివంటివాఁ డైనయెడల రెండుమూఁడురెట్లు దీర్ఘముగ వర్ణించియుండవలసినది. ఇట్లు రసనిగ్రహ ముఁ జూపఁగలిగిన కవివంద్యునిగూర్చి వారవనితాసక్తుఁ డను సప ప్రథఁ గల్పించుట నాకెంతయు విచిత్రముగఁ గాన్పించుచున్నది. శృం గారరసవర్ణనములో నీకవి యసహ్యముగను, అవినీతికరముగను నుండు

న ల్లిచ్చుటను జవలద్భ్రుష్టిని దీర్ఘప్రసంగములు గావించినట్లు చూడము.

శృంగారరసవర్ణనముకంటె వీరరసవర్ణనమునం దీకవికి ఎక్కువ ప్రాభవ మున్నదని నా యభిప్రాయము. రామకృష్ణుని యారోపణ మన్యాయ మని చూపుట కిదియు నొకయుపపత్తియే. వీరరసము మొట్ట మొదట బ్రహ్మపుత్రుఁడైన యుగ్రుఁడు తనతమ్ములగు ముప్పదివేల రక్కసులతోఁ బోరుసలిపి వారిని సంహరించినసందర్భములోఁ బొడసూపినది. ఆయుద్ధవర్ణనము చాల రసోద్రేకముగ నుండుటయేగాక విరాటపర్వంబున నర్జునుఁ డొక్కరుఁడును కౌరవానీకముతోఁ బోరు సలిపినతెఱంగును గొంతవఱ కనుకరించుచున్నది.

క. విడువక పట్టిన మును మున్
గడతేఱిచి బలము రెండుగా నొనరించెన్
నడి నా రెంటికి నడుమున
నెడలేక మతి సోమసూర్యవీథులు గాఁగన్.

(కాళహస్తిమాహాత్మ్యము)

మ. ఇదిగో వర్గము సేరవచ్చితిమి పో నింకేల సైన్యంబులన్
గదియన్ వే చనుదెంచె రెంటినడుమం గాఁ జొచ్చి యీ వచ్చు న
న్మదవీరావలికిన్ భుజావిబలవిన్యాసంబుఁ గాన్పించి మా
న్పెద గర్వంబు మరల్చెదన్ బసుల నాచేఁ జిక్కరా దెమ్మెయిన్.

(తిక్కనభారతము-విరాటపర్వము)

అటుతరువాత శివపూజనోత్సాహమున సాలెపురుగు దీపకళికను వీరావేశమున మ్రింగఁబోవుటయు సర్పమును, హస్తియు నన్యోన్యసంహారముకొఱకు సరభసముగఁ బోరొనర్చుటయును వీరరసముఁ దెల్పుచున్నది. మృగవ్యాళముల పెనఁగులాటమైనను మహాయోధుల మల్లయుద్ధమువలె రోమభీషణోత్సాహములు ముప్పిరిగొనునట్లు వర్ణించి కథనాకౌతుక మక్షీణముగ సాగునట్లు చేయఁగలిగెను. ఇంత వీరరసాసారపుంజీకృత

జ్వాలాకీలయో యనునట్లు అభీలాహవకేళిని తిన్ననిపూర్వజన్మవృత్తా
మున నిక్కవి వర్ణించెను. తిన్నఁడు ప్రాగ్జన్మమున పాండవమధ్యమ
డని తెల్పు సందర్భమున కిరాతార్జునీయకథ నంతను అద్భుతసంగ్ర
ముగ నభివర్ణించెను. కైతవ కిరాతపురారాతియు, తపోనియమమునను
పాకశాసనియు నెట్లు దలపడి యన్యోన్య విజిగీషులై ససంభ్రమము
మార్కొనిరో యాయుదంతమును బ్రబంధాంతమున వర్ణించి యీ
వ్యభవనమునకు మిన్నుముట్టెడు మహాసౌధమును నిర్మించెను. ఈ ర
పాఖ్యానమును భారతమున నన్నయభట్టు రచించిన యాయుపాఖ్య
ముతో సరిచూచి చదివిన నీకవీశ్వరుని శైలీపటిమ తెల్లమగును. పట
రములగు పదమార్గణములను దన యత్నయతూణీరములనుండి యిరు
వల గురిపించుచున్నట్లు, ఈకవి సవ్యసాచి నభివర్ణించి యీచిన్న కి
నొక యద్వితీయ వీరకథానకముగా నొనరించెను.

ఉ. నూనశరారియు న్నమిచి నూదనపుత్రుఁడు దివ్యబాణ సం
ధానమున న్మహా హవము దర్పమెలర్ప నొనర్ప నొప్పి రిం
తైనఁ గొఱంతలేక తమ యందలి తేజము మిన్నుముట్టఁగా
భానుఁడు భానుఁడుం జటులభాను పరంపరఁ బోరుసైవడిన్.

శాంతకరుణారసములు భక్తిరసమునకు స్వాభావసంబంధము గలి
యుండుటచే గ్రంథమం దనేకచోట్ల ననుకూలముగఁ జూపఁబడిన
యాదవ భూపాలుని కఠినశాసనమున కేశములు గోల్పోయిన దాసిక
తురు కరుణారసమొలుకుచున్న పలుకులును, ఆజన్మవిరాగులగు తిన
డును వేశ్యకన్యలును జూపించిన యద్భుత శాంతస్వభావమును
కవి గ్రామణియొక్క కథనా నైపుణ్యమును విస్పష్టముగఁ బ్రదర్శిం
చుచున్నవి.

అశ్లీలములగు భావములను బెంచక నీతిమర్యాదల నతిక్రమింప
సదా రసోత్సేకమున రచించుచున్నను నీకవివర్యుఁడు మితభాషియై

మిత వర్ణనలతో సమస్తరస భావములఁ జిత్రించి తన గ్రంథమును ప్రతి పద్య హృద్యముగ రచించి యామూలాగ్రముగఁ బఠనాకౌతుకమును నిర్వహింపఁగలిగెను.

## పాత్రపోషణము.

ప్రపంచవిజ్ఞానమును, వివిధ మానవజీవిత పరిచయమును విశేషముగఁ గలిగిన యీకవి తన గ్రంథమందలి పాత్రపోషణ మెట్లు నిర్వహించెనో తెలిసికొనఁ గుతూహలము గలుగవచ్చును. ఈకావ్యమందలి పాత్రపోషణము ఆముక్తమాల్యదయందువలెనే భగవంతుని నిర్ణయముమీఁద నాధారపడి యున్నది. కాని కవియొక్క స్వాతంత్ర్యములో నుండలేదు. భగవద్భక్తిపూరితములగు నీయుభయ గ్రంథములయందును గథాపాత్రములుగానున్న స్త్రీపురుషులందరు భగవంతుని చేతిలో జంత్రపుబొమ్మలుగా నాడవలసినవారేగాని యంతకంటె వారికి వ్యక్తిస్వాతంత్ర్యము లేమియు నుండ వీలులేదు. ఆముక్తమందు కేశవుఁడును దీనియందు శివుఁడును దమ యద్భుత శక్తులను జూపుట కీపాత్రలను నిమిత్తమాత్రములుగా నుపయోగించినవారు. విష్ణుచిత్తునివలె శివబ్రాహ్మణుఁడును, మాలదాసరివలె వేశ్యాసోదరులును, గోదాదేవివలె తిన్నఁడును సదా దైవభక్తి ప్రేరితులై సామాన్య మానవజీవితమునకు విదూరులై యాజన్మ యోగులవలె ముముక్షుమార్గముననే పెరిగి కష్టములనన్నిఁటిని దైవసహాయమునఁ దొలగింపఁజేసికొని చిట్టచివరకు దైవసాయుజ్యమును బడసినవారైరి. ఇంక పశుకీటకములలోఁ జేరిన సాలిపురుగు, సర్పము, ఏనుఁగును గురించి వేరె చెప్పనవసరములేదు. ధర్మజ్ఞాన శూన్యమైన తిర్యగ్జన్మమున నుత్పన్నములైన యీజంతువులు దైవనియోగమున భగవదారాధన పరులై మోక్ష సామ్రాజ్యము నధిష్ఠించినవి. ఇట్లు కీట

కాది మనుష్య పర్యంతము భగవచ్చింతన తప్ప వేరొండు జీవితాశయము లేనికారణమున పాత్రపోషణమున కెట్టి యవకాశములేదు. కావు ననే యీగ్రంథము ఆముక్తమాల్యదకుఁ బోటీగా వ్రాయఁబడినట్లూహింప నచ్చునని మొదటనే సూచించితిని.

ఈగ్రంథమందలి పాత్రిలయొక్క సౌశీల్యాది గుణములు భగవంతునిచే నిర్ణీతములైనను వారికిఁగూభాషణముల విషయములలో నీకవి స్వభావసిద్ధమగు నిరూపణముఁజేసి పాత్రపోషణమునందు గొంతవఱకు అధికారము వహింపఁగల్గెను. జంగముదేవరను దన యింటి కాహ్వానము చేసినపుడు దాసిపకుచు తత్కార్యోచితమైన కన్నడభాషా పదములను జక్కగ వాడెను. జంగముదేవరలకుఁ గన్నడదేశమే పీఠస్థానముగాన వారి విషయమై యాభాషయే స్వభావోచితము. అట్లే తిన్నఁడు జననమొందిన బోయపల్లె యందలి చెంచు చేష్టితలను వర్ణించినపుడును, వారి వేఁటలను దేవతారాధనలను వర్ణించినపుడును వారాడెడు అపభ్రంశభాషనే సముచితముగా నుపయోగించెను. దానివలన నాటకీకుల పాత్రపోషణము గొంతవఱకు సాధింపఁబడినది.

ఇట్లవకాశము గలిగినపుడెల్ల నీకవి తన కావ్యమున యథావద్వర్ణనములుచేసి యాయాపాత్రలను వారివారి జీవితములకు సరిపోవునట్లు చూపింపఁ బ్రయత్నించుచుండెను.

—• కవి ప్రతిభ •—

ధూర్జటి కవిత్వమందు బలము, ఓజస్సు, కాంతియు స్వభావోక్తితోను మాధుర్యముతోను గలిసి యున్నవి. మార్దవమును, లాలిత్యమును కదాచిద్దృశ్యములు, భక్తిపారవశ్యము మెండైనను ఇతర రసము

లను యథార్థముగఁ జిత్రించెను. భాషావైదగ్ధ్య మపారమైనను పదవాక్యపరిమాణము సర్వత్ర నిలుపుకొనెను. రసోద్రేకము స్వభావలక్షణమైనను, ఔచిత్యజ్ఞానముచే దానిని యుద్వేలముగాకుండ జేసెను. ఐంద్రియ భోగవిలాసముల రుచి పూర్ణముగఁ దెలిసియున్నను ముక్తిమార్గసాధనచే దానిని నిర్జించెను. ఇట్లు భక్తాగ్రేసరుఁడుగాను కవీశ్వరుఁడుగాను తాను లోకోపకారముకొఱకు నిర్వహింపవలసిన విధులను శ్రద్ధతోను ఔచిత్యదృష్టితోను సామర్థ్యముతోను నెఱవేర్చి సమకాలికులగు కవులలో సర్వతోముఖ సౌమనస్యముఁ జూపఁగలిగెనని నాయభిప్రాయము.

# ఎనిమిదవ అధ్యాయము.

## వెన్నెలకంటి సూరన్న — విష్ణుపురాణము

కృష్ణదేవరాయల కాలములో నాతని సామ్రాజ్యమందు నొక చిన్న సంస్థానమునకుఁ బ్రభువుగా నుండిన రావూరి రాఘవరెడ్డి యను నతనికి నంకితముగ వెన్నెలకంటి సూరన్న యను కవివరుఁడు విష్ణుపురాణమును పద్యకావ్యముగాఁ దెనిగించెను. విష్ణుపురాణము వ్యాస రచితములగు అష్టాదశ పురాణములలోఁ జాల ముఖ్యమైనది. ఈ పురాణము కేవలము వైష్ణవ మతమునకు ముఖ్యాధారములలో నొకటి యగుటయే గాక హిందూదేశ చరిత్రమునకు నాధార భూతములైన గ్రంథములలోఁ గూడఁ బ్రాముఖ్యము నొంది యున్నది. దీని యందున్న పూర్వ హిందూరాజ వంశావళులు ప్రస్తుతము తామ్ర శిలా శాసనాదికముల సహాయమునఁ జరిత్ర పరిశోధకులచే నిర్ణయింపఁబడిన వంశావళులకుఁ జక్కగ సరిపోవుచున్నవి. కావున విష్ణుపురాణము మత విషయము నందును దేశ చరిత్ర విషయ మందును నగ్రస్థాన మలంకరింపఁ దగినది.

ఈ విష్ణుపురాణమును సూరన్నకుఁ బూర్వమును తరువాతను గొందఱు కవులు తెనిఁగించిరి. పశుపతి నాగనాథుఁ డను ప్రాచీనాంధ్ర కవి పదునాల్గవ శతాబ్దాంతమున దీనిఁ బ్రథమమునఁ బద్యకావ్యముగాఁ దెనిఁగించినట్లు గాన్పించుచున్నది. ఆ గ్రంథ ముత్సన్నమైనది. ఒండు రెండు పద్యములు మాత్రము లక్షణగ్రంథములలోఁ జొప్పడి యుండుటచే దక్కినవి. ఆ పద్యములను జూచిన నాతని కవిత్వము మన ప్రాచీనాంధ్ర కవుల మహత్తర శయ్యగల కవిత్వమునకుఁ దీసి పోదని చెప్ప

నచ్చును. ఈ క్రింది పద్యము నాగనాథుని విష్ణుపురాణము నందలి దని ప్రబంధ రత్నావళిలో నున్నది.

ఉ. మానవ మయ్యెనంత మధుమానము పాంథవిలాసినీ జన
తాపము పుష్పబాణనవరాజ్య విలాసము వల్లరీ వధూ
హాసము మత్తకోకిల సమంచిత పంచమనాద మంజిమ
న్యాసము జీవలోక హృదయంగమ సౌఖ్య వికాస మెంతయున్.

దీని తర్వాతఁ గాల క్రమమునఁ జూచిన మన వెన్నెలకంటి సూరన్నదే రెండవ భాషాంతరీకరణము. సూరన్నకు నించు మించుగ సమీప కాలమునను సమీప స్థలములోను నుండిన కలిదిండి భావ నారాయణ యను కవి యు విష్ణుపురాణమును గొంతవఱకు అనఁగా శ్రీకృష్ణ జననము వఱకుఁ బద్య ప్రబంధముగాఁ దెనిఁగించెను. పందొ మ్మిదవ శతాబ్దములో నిద్దరు కవు లీగ్రంథము నాంధ్రీకరించిరి. వా రిద్దరు కళ్లేపల్లి నరసింహమూర్తియు, తాడేపల్లి సీతారామస్వామియు. ఇవియుఁ బద్యకావ్యములే. వీరిలో సీతారామస్వామిగారు ఉత్తర భాగమును మాత్రము తెనిగించిరి. ఇంక విష్ణుపురాణమును వచన రూపముగ తుపాకుల అనంత భూపాలుఁడును, నోరి గురులింగశాస్త్రి యును రచించిరి. ప్రస్తుతము పద్యరూపమున ననువదించిన వానినే నేను విమర్శించుటచే నీ గద్యరూపాను వాదములను బరిశీలించుట లేదు.

ప్రకృతము నా యొద్ద పద్యకావ్యములగు ఆంధ్ర విష్ణుపురాణ ములలో సూరన్న, భావనారాయణ, సీతారామస్వామి కవులు రచించి నవి మాత్రమే యున్నవి.

సూరన్నయు, భావనారాయణయు నించు మించుగా నేక కాల ములో నీ గ్రంథమును రచించిన వారగుటచే వారి కృతుల తారతమ్య మునిరూపించుట న్యాయమును అవసరమును. ఈ విషయమును సమ్య క్పరిశీలనము చేసి కోరాడ రామ కృష్ణయ్యగారును, పింగళి లక్ష్మీకాం

తముగారును ఏక ముఖముగా మదరాసు విశ్వ విద్యాలయ ప్రచుర మగు భావనారాయణకవి కృతమైన విష్ణుపురాణమునకు వారు రచించి పీఠికలో నిట్లు నివేదించిరి. "ఈ పురాణము మూలము తోడను వెన్నెలకంటి సూరన్న విష్ణుపురాణము తోడను బోల్చి చూచితిమి తఱచి చూడఁగాఁ దెనుఁగు పురాణములలో నింత యథా మాతృకమై రచన యే గన్పట్టదు. వెన్నెలకంటి సూరన్న విష్ణుపురాణము భారత దుల వలె మూలమునకు యథోచితానుసరణమే గాని దీని వలె యథా మాతృకము గాదు. తనకుఁ బూర్వము సుప్రసిద్ధమైన యొక విష్ణుపు ణము తెనుఁగున నుండఁగా దానును నా గ్రంథమే రచింపఁ బూనుటలో నీ కవి సంకల్పము స్వార్థాహంకార ప్రేరితము గాక మూల విధేయతన సంపాదించు కోర్కెవలనఁ గలిగి యుండును. నేఁడు బ్రహ్మశ్రీ వే మూర్తులైన కవిరాజ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి భారత ర నా సంకల్పము వంటిదే యీ భావనారాయణ కవి సంకల్పమై యున్నది ఇం దీతఁడు కృతార్థుఁడయ్యె ననియే చెప్పవచ్చును. ఎచటెచట గొల మూలాతిక్రమణము లున్నను నవి యంతగాఁ బాటింపఁ దగినట్లుగా న పడవు." కావున వెన్నెలకంటి సూరన్న రచించిన విష్ణుపురాణముతో దృష్టి నొందక భావనారాయణ తన గ్రంథమును రచించినట్లు తే చున్నది. యథా మాతృకత్వమే యాతని కృతి యందలి ముఖ్యవి యము. మాతృకానుసరణమే ముఖ్యోద్దేశముగా నున్న భాషాంత కరణములందు సామాన్యముగ రసావిష్కరణమున కవకాశము తగ్గును రచనము కూడ నొకించుక గుంటు వడి యుండును. భావనారాయణ కవిత్వము నీరసమని చెప్పుటకు వీలులేదు గాని సూరన రచనకు మొత్త ము మీఁదఁ గొంచెము తగ్గునేమో యని నేను భావించుచున్నాను సూరన్న సుప్రసిద్ధ మహా కవి వంశములోఁ బుట్టిన కవియై సంప్రదాయ

సిద్ధముగ వచ్చిన కవిత్వసరసత్వమునం బరిఢవిల్లెను. కావున నీతని కవిత ధారాళమై నిరర్గళమై మృదు మధుర పదగుంఫితమై యొప్పుచున్నది. పురాణమును సహితము సుకుమార కావ్యముగానే యీ కవి యనువదించెను. అనగా స్వేచ్ఛానుసారముగం గుదించియు, బెంచియు, మార్చియు దాను స్వతంత్రముగ భాషా పరివర్తనము చేసెను. తన రచన యందు ముఖ్యముగ సౌలభ్యమును సౌకుమార్యమును స్వారస్యము నందునట్లు గ్రంథమంతయు సాగించెను. కావున నీతని గ్రంథముం జదివి యానందించుట కెక్కువ యవకాశమున్నది. భారత రామాయణముల యందలి తొలి యాంధ్ర కృతులన్నియు నిట్టివి యే కదా!

కృతి కర్త యగు వెన్నెలకంటి సూరన వంశమునకును కృతి భర్త యగు రావ్వూరి రాఘవరెడ్డి వంశమునకు ననేక పురుషాంతరముల నుండియు పోషక పోషితులగు నవినాభావ సంబంధ ముండినది. "కవిత పుట్టిల్లు వెన్నెలకంటి యిల్లు" అని 'శ్రీకృష్ణ విజయ కర్త' యగు వెన్నెలకంటి వెంకటాచల కవి నుడివి నట్లు వెన్నెలకంటివారు కొన్ని శతాబ్దముల నుండియు నాంధ్ర కవులుగా బేరొందిరి. మొదటివాడైన వెన్నెలకంటి సూరన్న అద్దంకి ప్రభువగు అనవేమారెడ్డి యాస్థానములో కవిగానుండి యాప్రభువువల్ల ననేకాగ్రహారములను బహుమానములుగా బొందెను.

చ. వెన్నెలకంటి సూరయడు వివేక గుణాఢ్యుడు వేదశాస్త్ర సం
పన్నుడు రెడ్డివేమన నృపాలకు చేత మహాగ్రహారముల్
గొన్న కవీంద్ర కుంజరు డకుంఠిత తేజముం బెద్దతండ్రిగా
నన్నుతిగన్న సిద్ధనకు సంతత దానకళావినోదికిన్.

అని జక్కనకవి తన విక్రమార్క చరిత్రమందుం జెప్పెను. ఆ వంశములోం బుట్టిన సిద్ధన మంత్రి విక్రమార్క చరిత్రమును గృతినొం

సీ. ... యిల కాకనాటిలో నీలకం
ఠేశ్వర స్థానమై యెసక మెసఁగు
గుడ్లూరు సెలవుగ గుణగరిష్ఠతనొప్పు
ధన్యుఁడు ధర్మాత్మ తత్పరాత్ముఁ
తే.గీ. డెఱ్ఱనార్యుండు.............. (భారతము అరణ్య 7 ఆశ్వాస 489)

వెన్నెలకంటి సూరన్న వానినే యిట్లు వర్ణించెను.

సీ. గౌరీసమేతుఁడై గరిమతో నేవీట
నేపారు నీలకంఠేశ్వరుండు
వారాశికన్యతో వర్తించు నేవీట
గిరిభేదినుతుఁడైన కేశవుండు
యోగినీ సహితయై యొప్పారు నేవీటఁ
బసిఁడి పోలేరమ్మ భవునికొమ్మ
పాపవినాశయై ప్రవహించు నేవీట
మిన్నేఱు మిన్నేటి మూరటగుచుఁ
ఆ. కుంజరములు వేయి గొలువంగ నేవీట
గాడుగు చక్రవర్తి పుడమియేలె
నట్టిరాజధానియై యొప్పు గుడ్లూరి
నొనర నేలుచుండి యొక్కనాఁడు. (అవతారిక. ప 16)

కావున వెన్నెలకంటివారికిని ఎఱ్ఱాప్రగడకు నెట్టి కుటుంబబాంధ వ్యముండియుండెనో దీనివలన స్పష్టమగుచున్నది. ఎఱ్ఱాప్రెగడయందీ కవికి గల పరమోత్కృష్టమగు భక్తిని సూచించెడు మఱియొక చిన్న నిదర్శన మీగ్రంథమందుఁ గాన్పించుచున్నది. సర్వసామాన్యముగ నాంధ్రకవులు కవిత్రయము వారిని స్తుతించినప్పుడు కాలక్రమ వ్యత్యాయముఁ జేయక నన్నయ, తిక్కన, ఎఱ్ఱాప్రెగడలను వరుస క్రమమునఁ గీర్తించుట యాచారము. ఈకవి యీ యాచారమునకు భిన్నముగా వారినిఁ జేర్కొని యీ క్రమమును దలక్రిందుఁ జేసెను.

ఉ. ... ... ... ... ... ... ... ...
సెన్నిక గాఁ బ్రబంధపరమేశ్వరుఁ దిక్కనసోమయాజినిన్
నన్నయభట్టు భాస్కరుని నాచనసోముని రంగనాథునిన్
వెన్నెలగంటి సూర్యుఁ బదివేలవిధంబులఁ గొల్చి భక్తితోన్.

(పీఠిక ౯)

ఈక్రమమును దప్పించుట నెట్టావ్రిగడను తెనుఁగు కవులందఱి కంటెఁ బ్రథమమునఁ జేర్కొనుటకే యని విస్పష్టమగుచున్నది. కావునఁ బ్రబంధ పరమేశ్వరుని పాదరేణువులతో బవిత్రితమైన సారస్వత సీమయగు గ్గూరియందుఁ గవులకుఁ బుట్టిన యిల్లైన వెన్నెలకంటికులము వాఁడైన సూరన్న యీ విష్ణుపురాణమును రచించి యీ యుభయ కవి వంశములకుఁ దొలుతనుండియు బ్రాపకులైన రెడ్డిరాజుల సంతతిలోని వాఁడైన రాఘవరెడ్డికి సంకితము సేయుట యెంతయో యొప్పిదముగా నున్నది. ఈసందర్భములో మరియొక వైచిత్ర్యము జూడఁదగియున్నది. తన పూర్వపు మేటియాంధ్రకవులనుఁ జేర్కొని స్తుతించి శ్రీనాథుని నామముఁ జేర్పకపోవుట విచిత్రముగా గన్పట్టకమానదు. శ్రీనాథుఁడు కేవలము శైవ గ్రంథములను రచించిన వాఁడగుటచే నీవైష్ణవ మతావలంబియగు రాఘవరెడ్డికి నిష్టము గాకుండుటచే గవి విడిచిపెట్టెనో లేక రాఘవరెడ్డి పూర్వులకును శ్రీనాథుని పోషకులగు కుమారగిరి పెదకోమటి వేమారెడ్లకును గల కుటుంబ వైషమ్యముచేత విడిచిపెట్టెనో మనము నిశ్చయముగాఁ జెప్పఁజాలము. శ్రీనాథుని పేరు విడుచుటమాత్రము నిర్హేతుకముగాదు.

రాఘవరెడ్డి వంశము అనవేమారెడ్డివంశమునకు సంబంధించినదని మాత్రము దెలియవచ్చుచున్నది. కాని ఆ సంబంధమెట్టిదియో గ్రంథమందు వ్యక్తపరుపఁబడలేదు. పుత్రపౌత్రాదికమా, లేక దుహితృ దా

హితాత్రిదికమాయది యని నిర్ణయించుట కాధారములు గాన్పింపవు. రాఘవరెడ్డి గోత్రము యానపాల గోత్రము. దేసటివారి గోత్రము తెలియరాకున్నది. వీరిదికూడ నదియే గోత్రమయినయెడల రాఘవరెడ్డి వేమారెడ్డియొక్క పుత్రసంతతిలోని వాడగును. రాఘవరెడ్డి తండ్రితాతలు శైవమతస్థులుగా నుండినట్లు గాన్పించుచున్నది. రాఘవరెడ్డి తండ్రియు బినతండ్రియు పంటలూరి యన్నయ్య యను శైవాచార్యుని శిష్యులు. రాఘవరెడ్డిమాత్రము శైవము విడిచి వైష్ణవమును స్వీకరించెను. ఈతడు తిరుమల తాతాచార్యుల వంశస్థుడగు సింగరాచార్యుని శిష్యుఁడు. రాఘవరెడ్డి వంశవృక్ష మిట్లున్నది.

అనవేమారెడ్డి
అతని వంశమున

లింగారెడ్డి

అనమారన (పాకనాటిలో) — పేరమరెడ్డి

అనమారన
|
పెమ్మ
|
అన్న వల్లభ చింత గంగ (అమలాంబ ×) బసవన్న

పేరమరెడ్డి
|
తమ్మారెడ్డి (× మాచమాంబ)
|
అన్నారెడ్డి లింగారెడ్డి

రాఘవరెడ్డి తమ్మారెడ్డి లక్ష్మారెడ్డి

రాఘవరెడ్డి కాలము నిర్ణయించుటకు రెండు శాసనములున్నవి. వానినిచ్చట చేర్చుచున్నాను. వానినిబట్టి చూడగా నతఁడు కృష్ణదేవ

— మొదటి శాసనము. —

1. శ్రీమతే రామానుజాయ
2. నమః॥ స్వస్తిశ్రీ జయాభ్యుదయ

గాయల కాలపువాఁడని స్పష్టమగుచున్నది. కావున వెన్నెలకంటి సూర న్నకూడ నాకాలపు వాఁడైయె యున్నాఁడు.

3. శాలివాహన శక వరుషంబులు
4. ౧౪౫౦ అగునేట్టి సర్వధారి సంవ్వ
5. త్సర ఆషాఢ శు ౧౧ ఆ॥ చతుర్భువ
6. నాధీశ్వర అఖిలాండ్డకోటి భ్రిహ్మాం
7. డ నాయకుండైన వెలిగొండ శ్రీ తిరువెం
8. గ్గళ్నాతన్కి మీదానులు రాపూరి రాగా
9 న రెడింగారంను విలిగోటి రంగ్గానా
10. యిని కొమారుండు తిమానాయి
11. నింగారును అనంత్తమైన (దం)డ్డముకు
12 సమర్పించి యిచ్చిన ధర్మశాస
13. నం॥ వుద్దగిరికిం జెల్లినూనయికా
14. శ్రిలోని కనకగిరి మునునూరి పోలచ
15. గకుం జెల్లిదానడిపలె, గామము
16. కొండ్డ మనుస్యువారికిని రాపూరి
17. బనువారెడింగారికిన్ని వెలిగోటిర
18. ంగా నాయునింగారికిన్ని పుణ్యము
19. గాను అంగ్గరంగ్గ వైభవాలకున్ను అమృ
20. దపళ్లకున్ను ఆచంద్రార్కస్తాయిగాను
21. యీ గ్రామంనుంకం చూపుటోయ
22. ం మొదలుగాను దేవునికి దారా
23. వోసి సమర్పించ్చి యిస్తిమి యీ
24. పుణ్యానకు యవ్వరు తప్పినడ
25. చినాను తమ మాతృపితృలా
26. మునంహారిని గోవును బ్రాంహ్మ

27. ని వారణాసిలో స్వహస్తవదకేసి
28. నదోషాన పోదురు మరిని తప్పి
29. నడిచిరామఖకేసినమున్ను గాడిద
30. సికెనమును కుడిచినవారు॥ శ్రీ
31. దానపాల యోర్మ్మధ్యేదానా
32. ఛ్ఛ్రేయ్యోనుపాలునందానాస్వర్గ
33. మవాప్నోతిపాలునానచ్యుతం
34. ఫలం॥ స్వదత్తాద్విగుణంపుణ్యం
35. పరదత్తానుపాలనం పద్దాప
36. హారేణ స్వదత్తం నిష్ఫలంభవే
37. త్తు॥ శ్రీ

## రెండవ శాసనము.

1. శుభమస్తు। స్వస్తిశ్రీ శకవర్షంబులు ౧౪౪౯ అగు
2. నేంటి పుష్యశుద్ధ ౧౫ గురువారమున్ను సోమగహ
3. ణమున్ను అయిన పుణ్యకాలం అందును జగనె
4. బ్బగండ్డ సంగ్రామ ధనంజయ। హేమాద్రి దాన
5. చింతామణి పట్టు లలాట రాయ బసు వశ
6. ంకర బిరుదాంకుండు అయిన రాపురి (రావూరి) రాఘవరెడ్డింగారు తమ
7. తండ్రి బస్వరెడ్డింగారికిన్ని తమ తల్లి అములాంబికకున్ను పుణ్యము
8. ఘువట్టుగాను లింగ్గాలకొండ సోమేశ్వరునికిన్ని బగాది గంగ్గకున్ను
9. పాప్టాంగ్గమున్ను దణ్నము పెట్టి సమర్పించిన ధర్మశాసనంము
10. కు కొండమర్సయ్యాంగారు మాకాయంకర్రాన్కు ఇచ్చిన కగిరిపోల
11. చెర్ల మునుందూరి పీమకో గంగ్గపట్నం సోమేశ్వరునికిన్ని బగాది గ
12. ంగ్గకును సోడసోపచారాలకున్ను సమర్పిస్తిమి గాని ఇ ధర్మను ఎ
13. వ్వరు తప్పివాను గంగకర్త గోవును బ్రాంహ్మణి చంపిన పాపాన పో
14. వుదారు

రాఘవరెడ్డి తండ్రితాతల సందర్భములో నొకచిత్రవిషయము గుర్తింపవలసియున్నది. తన తండ్రి బసవరాజనియు తన తాత తమ్మయ్య యనియుఁ జెప్పెను, తండ్రియగు బసవరాజు ఉదయగిరి రాజ్యము గజపతులచేతను కర్ణాట రాజులచేతను గౌరవ బిరుదములును బొందినట్లు చెప్పుకొనెను.

సీ. కటకాధిపతియైన గజపతిరాజుచేఁ
ప్రీతిలేని పల్లకిపదవి నొంద
మహిమచేఁ గర్ణాట మండలాధిపుచేతఁ
గడలేని రాజ్యభాగములు గాంచెఁ
బ్రౌఢపౌరుషమున రాజిల్లి మెఱయఁగా
మలకవజీర్ల కుమ్మరికఁ జేసెఁ
దలగాణభూములఁగల మన్నెవారిచే
బలవంతమునను గప్పములు గొనియెఁ
తే. ఘాటుధాటీ నిరాఘాటఘోటకావ
ళీఖురోద్ధూత నిబిడధూళీ విలిప్త
మండితాశాంగనాకుచమండలుండు
బాహుబలశాలి తమ్మయబసవవిభుఁడు. (అవతారిక ప. 41)

రాఘవరెడ్డి తండ్రి తాతలగు బసవయ, తమ్మయలవలెనే ఆ యా పేర్లతో నిద్దఱు తండ్రికొడుకులు ఉదయగిరిరాజ్యమందే యాకాలముననే రాజ్యము చేసి యుండిరి. వారును గజపతులవల్లను, కర్ణాటక రాజులవల్లను అనేకములగు గౌరవములను బొందియుండిరి. వా రిద్దఱు తమ్మభూపతియు బసవరాజును వీరును కృష్ణదేవరాయల కాలముననుఁ దత్పూర్వమునను ఉదయగిరిరాజ్యమేలిరి. వీరు క్షత్రియులు. వీరింటి పేరు కుంటముక్కలవారు. వీరిలో బసవరాజు దూబగుంట నారాయణ కవి రచించిన పంచతంత్రమును గృతినొందెను. కావున రెడ్డివంశస్థులగు

తెమ్మయ బసవయలను క్షత్రియవంశస్థులగు తెమ్మయ బసవయలుగా నూహించి పొరబడకూడదు. క్షత్రియులగు తమ్మయ బసవయలు ఉదయ గిరి రాజ్యమంతయు నేలిరి. వారిక్రింద రెడ్డివంశస్థులగు నీతమ్మయ బసవయలు సామంత సంస్థానాధిపతులుగానుండి పరిపాలించుచుండిరి.

—• కృతికర్త విషయము. •—

వెన్నెలగంటి సూరన్న ఆపస్తంబ సూత్రుఁడును హారితస గోత్రుఁడునగు బ్రాహ్మణుఁడు. అతని తండ్రి యమరమంత్రి. అతనికి చెఱుకూరి యమరమంత్రియని సూరన పేరుపెట్టినాఁడు. బహుశః యీ యమరమంత్రి గుంటూరుజిల్లాలోనున్న చెఱుకూరుగ్రామమునకుఁ గరణీకముఁ చేయుటచేతనో లేక ఆగ్రామమందు స్థిరనివాస మేర్పఱచు కొనుటచేతనో యీ విశేషణమును పేరునకుఁ జేర్చినాఁడు. సూరకవి తాత వెన్నెలకంటి సూరన్న. ఈ సూరన్న అనపోతారెడ్డికిఁ గృతులి చ్చిన వెన్నెలకంటి సూరన్న కెన్నవ తరమువాఁడో నిశ్చయముగాఁ జెప్పలేము. కృతికర్త తనతల్లిపేరు చెప్పుకొనలేదు. కృతినాయకుఁడగు రాఘవరెడ్డివలన బసవపురమను నగ్రహారమును గ్రహించి తద్గౌరవము నకుఁ బ్రీతిగౌరవముగఁ దన విష్ణుపురాణము నతని కంకితముఁ జేసెను. ఈవిషయములను గ్రంథప్రస్తావనయందు తాను చెప్పుకొనెను.

సీ. భవ్యచరిత్రు నాపస్తంబమునిసూత్రు
శుద్ధసారస్వత స్తోత్రపాత్రు
హారితగోత్రు కవిత్రు నాంధ్రభాషాకావ్య
రచనాభినయ విశారదుఁ బ్రబంధ
కర్తను వెన్నెలకంటి సూర్యుని మను
మని చెఱుకూరి యమరయమంత్రి

సత్ప్రతుష్టి నాకువిస్తారవిచిత్రమా
ధుర్య కవిత్వ చాతుర్యశీలు

తే. నిజకులాచార మార్గైక నిపుణుఁ బరమ
సాత్వికోదయ హృదయు వైష్ణవపురాణ
వేది సారస్య విద్యాప్రవీణు సుకవి
మాననీయుని సూరనామాత్యవరుని (పీఠిక. ప. 23)

ఈసూరన వంశములోనివాఁడగు వెన్నెలకంటి వెంకటాచలకవి శ్రీకృష్ణవిజయమను బ్రబంధము రచించి దానిలో నీసూరన్ననుగుఱించి కొంతప్రశంసచేసి తన వంశవృక్షము నిట్లుచూపెను.

సీ. సూరనకాంతిచే సూర్యప్రకాశుండు
వేదాది విద్యల వెలసినాఁడు
విష్ణుపురాణంబు వేడుకఁ దెనిఁగించి
విమలయశంబున వెలసినాఁడు
రావూరిబసవన్న రమణతో నిచ్చిన
యాలమెుగుళ్లూరగ్రహారమందె
వెలుగోటి తిమ్మభూవిభునిచేఁగొనియెాఁదా
నాందోళికాచ్ఛత్రమగు పదవిని

తే. కవితపుట్టిల్లు వెన్నెలకంటియిల్లు
ననెడు పౌరుషనామధేయంబు నిలిపె
సరసగుణములుగలిగిన సాధుసుకవి
మాననీయుండు సూరనామాత్యవరుఁడు.

ఈసూరన్న కుమారుఁడు లక్ష్మన్న. అతని కుమారుఁడు చక్రప్ప. వాని కొడుకు గంగయ్య. వానికొడుకు సూరపరాజు. అతని కొడుకు జగ్గన్న. అతని పుత్రుఁడు వెంకటాచలకవి. కావున విష్ణుపురాణపు సూరనార్యునకు వెంకటాచలకవి యాఱవ పురుషుఁడు. సూరన్న

బసవాపురమును రాఘవరెడ్డినుండి యగ్రహారముగాఁ బొందెనని చెప్పుకొ నెను. వెంకటాచలకవి రాఘవరెడ్డి తండ్రియగు బసవన్నయే కవికి మొ గుల్లూరు అగ్రహార మిచ్చినాఁడని చెప్పినాఁడు. బహుశః మొగుల్లూరు వకే బసవాపురమను నామాంతర మేర్పఱచినాఁడేమో.

## — గ్రంథవిషయము. —

హిందూమతమందలి త్రిమూర్తులలో రెండవ వాఁడగు మహా విష్ణుని చరిత్రమునుఁ దెల్పు నీగ్రంథము అష్టాదశ పురాణములలోనిదని మొదటనే చెప్పితిని. మహావిష్ణుని ప్రశంస విపులముగ హరివంశమునఁ గూడ నున్నది. దానిని సమగ్రముగ మొదట నాంధ్రీకరించినవాడు యెఱ్ఱాప్రెగడ. అతఁడు సూరన్నకు సమీపమాన్యుఁడు. కావున నీ విష్ణుపురా ణాంధ్రీకరణములో సూరన్న ఆంధ్ర హరివంశమును సూక్ష్మదృష్టితోఁ బఠించియే యుండును. విష్ణుని చరిత్రమును విపులముగా వర్ణించెడి మఱియొక గ్రంథముగలదు. అది శ్రీమద్భాగవతము. దానిని బమ్మెర పోతనామాత్యుఁడు సూరన్నకుముందే తెనిఁగించి ఆంధ్రుల కమృతప్రా యముగ సిద్ధపఱచి యుండెను. దానినిగూడ సూరన్న పఠించియేయుం డును. ఈగ్రంథత్రయమందలి రచనా తారతమ్యములను నిరూపింప ను ద్దేశము నాకు లేదు. అది యనవసరపుపనియని తలంచుచున్నాను. ఎఱ్ఱా ప్రెగడ కవిత్వమునకు సాటిగా సూరన్న వ్రాయఁగలుగుట "తగరు ధరాధరంబుతో ఢీకొనుట" యట్లుండును. పోతన్న కవిత్వము తక్కిన మేటియాంధ్రకవుల కవిత్వపుదారినిఁ బోలేదు. అతఁడు స్వతోభ్యస్తకవి గాని గురుశిక్షిత కవి గాఁడు. కావున భాషయందును భావములందును సర్వ స్వతంత్రుఁడుగా నుండెను. ఆంధ్రజనుల కొఱకు పవిత్ర గ్రంథమును దెనిఁగించుచు సంస్కృతభాషకు డు, ము, వులు మాత్రము చేర్చినట్లు

సామాన్యముగ గ్రంథమంతయును గీర్వాణభాషామయము గావించెను. ఆ గీర్వాణభాషమాత్రము మృదువైనదియు మధురమైనదియు శ్రవణానందమైనదియుఁ గావున నాతని రచనామార్గము చాలవఱకు విలక్షణముగాను సర్వస్వతంత్రముగానుండినను దానినిఁ బఠించుటయందాంధ్రులు తనివితీరని యానందము నొందుచుందురు. సూరనార్యుని రచనకును పోతన రచనకును ఎవ్విధమైన పోలికయుఁ గాన్పించదు. ఎఱ్ఱాప్రెగడ ననుకరించి వాని పటుత్వమును ఔన్నత్యమును బొందలేకపోయినను వానిలక్షణములను గొన్నిటిఁ గూర్పఁగలిగెను. బహుశః వెన్నెలకంటి వారి కవిత్వపు సొంపును ఎఱ్ఱాప్రెగడ కవితారీతియు గుడ్లూరియందలి సన్నికృష్ట సాహచర్యమున ననురూపత ఘటించినవేమో !

సూరనార్యుని యాంధ్రీకరణమును భావనారాయణుని యాంధ్రీకరణమును సంస్కృత మాతృకతో సరిచూచి శ్రీ కోరాడ రామకృష్ణయ్య పింగళి లక్ష్మీకాంతముగార్లు కలసి నిర్ణయించిన యభిప్రాయమును వెనుకనే కనఁబఱచితిని. భావనారాయణకవి మాతృకకు నత్యంతము చేరికగా నుండున ట్లనువదించినట్లును,సూరనార్యుఁ డట్టి నియమమును పాటింపక పెంపు కుదింపులలో తన యిష్టమువచ్చినట్లు సంప్రతించికొనినట్లును నిర్ణయింపఁబడినది.వీరిద్దఱు చేసిన సిద్ధాంతమును పునర్విమర్శనము చేయుట పిష్టపేషణమని విడిచిపెట్టుచున్నాను. వీరు తమ సిద్ధాంతమును మాత్రము దెల్పిరి కాని వారు చేసిన నిర్ణయమును జూపెడు దృష్టాంతము నొకదాని నైనను చేర్చుట లేదు. కావున విష్ణుపురాణమునందలి ముఖ్యకీలక మనఁదగు నారాయణుని సర్వాంతర్యామిత్వము, సర్వాధార భూతత్వము విశదపఱచెడు నీ క్రింది భాగములను సంస్కృత పురాణమునుండి యుద్ధరించి దాని నుభయకవు లెట్లు తెనింగించిరో చూపెదను.

తారామయం భాగవతః శింశుమారాకృతిః ప్రభోః ।

దివి రూపం హారే ర్యత్తు తస్యపుచ్ఛేస్థితోధ్రువః ।
సైవ భ్రమన్ భ్రామయతి చంద్రాదిత్యాదికాన్ గ్రహాన్ ।
భ్రమంత మను తయాంతి నక్షత్రాణిచ చక్రవత్ ।
సూర్యాచంద్రమసౌ తారా నక్షత్రాణి గ్రహైః సహ ।
వాతానీకమయై ర్బంధైర్ ధ్రువే బద్ధాని తానివై ।
శిశుమారాకృతిప్రోక్తమ్ యద్రూపం జ్యోతిషాం దివి ।
నారాయణోఽయనం ధామ్నాం తస్సాన్ధారః స్వయంహృది।
ఉత్తానపాదపుత్రస్తు త మారాధ్య జగత్పతిమ్ ।
సతార శ్శింశుమారస్య ధ్రువః పుచ్ఛేవ్యవస్థితః ।
ఆధారశింశుమారస్య సర్వాధ్యక్షోజనార్దనః ।
ధ్రువస్య శింశుమారస్తు ధ్రువే భానుర్ వ్యవస్థితః ।
తదాధారం జగచ్చేదం సదేవాసుర మానుషమ్ ।
యేన విప్ర విధానేన తన్మమైకమనాః శ్రుణు ।
వివస్వా నష్టభిర్ మాసై రాదాయాపో రసాత్మికాః।
వర్ష త్యంబు తత శ్చాన్నమన్నాద ప్యఖిలమ్ జగత్ ।
వివస్వానం శుచి స్తీక్ష్ణై రాదాయ జగతో జలం ।
సోమం పుష్ణా త్యథేందు శ్చవాయునాణుమయైర్దివి ।
వాలైర్విక్షిపతేఽభ్రేషు ధూమాగ్న్య నిలమూర్తిషు ।
న భ్రశ్యంతి యత స్తేభ్యో జలా న్యభ్రాణి తా న్యతః ।
అభ్రస్థాః ప్రపతంత్యాంపో వాయునా సముదీరితాః ।
సంస్కారం కాలచలితమ్ మైత్రేయాసాద్యనిర్మలాః ।

వెన్నెలకంటి సూరన్న :—

మ. అతులాకాశము సర్వముం దనమయంబై కాలచక్రంబుతో
నతతంబున్ హరిశాత్మలోనిడి యథేచ్ఛన్ శింశుమారవస్థిగా

పతి త్రైలోక్య సమున్నతిన్ మకరరూపవ్యక్తిమైయుండు వి
స్తృతుఁడై మీఁద ధ్రువుండు దా వెలుఁగుఁ దత్పుచ్ఛాగ్రదేశంబునన్.

తే. సతతమును శింశుమారాఖ్య చక్ర మెపుడు
చంద్ర సూర్యగ్రహాది నక్షత్రసమితిఁ
ద్రిప్పుచును దాను నొక్కటఁ దిరుగుచుండు
నన్నిటికిమీఁద ధ్రువుఁడున్నట్ల తిరుగు.

వ. సూర్య చంద్ర గ్రహ నక్షత్ర తారకా గణంబులు వాయు పాశంబులచేత ధ్రువునియందు దృఢంబులై యుండును.

క. మును శింశుమారుఁ డబ్జా
క్షునకుఁ దపం బాచరించి జ్యోతిశ్చక్రం
బున నిల్చె ధ్రువుఁడు నవ్విధ
మున గొల్చి తదీయపుచ్ఛమున విలసిల్లెన్.

వ. కావున సర్వాధ్యక్షుండైన పుండరీకాక్షుండు శింశుమార చక్రంబునకు నాధారంబు. శింశుమారుండు ధ్రువునకు నాధారంబు. ధ్రువుండు సూర్యునకు నాధారంబు. సూర్యుండు సదైవాసురమానుషంబైన లోకంబునకు నాధారంబై సమస్త భూతలంబుల నన్నపానాదులఁ బరితృప్తులం జేయు నెట్లనిన.

చ. ఎనిమిది మాసముల్ గని మహీవలయంబులఁ గ్రోలి తోయముల్
దన కిరణంబులందుఁ గొని తక్కిన మాసచతుష్టయంబునన్
ఘనతరవృష్టిరూపములుగా జలముల్ గురియించ లోకమె
ల్లను బరితృప్తిఁ బొందును జలంబును నన్నముఁ గల్గి పెంపుతోన్.

సీ. కాలాత్మకుఁడైన భాస్కరదేవుఁ డాత్మీయ
చండాంశువులచేత జగతియందుఁ
గలిగిన సకలోదకములుఁ గ్రోలి దెచ్చి
యమృతాంశుమండలమందు నునుచు

నాయబ్బైరియు వాయువాళంబుల
ఁనాకాశభాగంబునందు దాఁచు
మారుత సలిలధూమజ్యోతిసంయోగ
మునఁజేసి జలధరంబులు జనించి
తే. వృష్టిసంస్కారకాలప్రవృత్తివలన
వాయుబంధంబులెల్లను వదలి నింగి
నున్న జలములు చెందుఁ బయోధరముల
దానఁజేసియు జగతిని వానగురియు. (ఆ. 8 ప. 198—199)

కలిదిండి భావనారాయణ కవి :—

ఉ. ఆకమలాక్షురూపము నభోంతమున న్వెలుగొందు శింశుమా
రాకృతి తారకామయము నై మునివల్లభదాని తోఁకనై
నేకద, యాధ్రువుండువసియించుట, తారకల న్గ్రహంబులన్
గైకొని త్రిప్పుచుండు నతిగాఢసమీరణపాశబద్ధుఁడై.
ఉ. ఆరయశింశుమారతనుఁడైన జనార్దను మానసంబునన్
గోరిభజించు వాధ్రువునకున్నకలగ్రహ తారకాళికన్
పారసపత్రిగోచనుఁడు సర్వచరాచరభూతధారియా
ధారముగా నెఱుంగుము యథాకథనంబిది నీకుఁజెప్పితిన్.
క. ఇనుఁ డెనిమిదిమాసంబుల
తవకరముల నవనిరసముతగ గైకొని వా
ర్గ్రానెలల నొసంగునన్నం
బమరుగ జీవించు ప్రాణులన్నియుదానన్.
ఉ. దినమణి వాయునాడిమయతీక్ష్ణమయూఖచయంబుచే జలం
బావరగపోమునందు విడునుర్వర సర్వజలంబులీలగై
కొని ఘనపంక్తిపై విడుచు కూడుక కాలము నత్ప్రియుక్తతన్
ఘనములు భూమిపైవిడుచు గర్జిలుచున్నవవారి పూరముల్.

ఈ యిద్దరి కవుల యాంధ్రీకరణములలోను మాతృకానుసారణ మందలి భేదము మాత్రమేగాక మరికొన్ని విధములగు భేదములు గాన్పించుచున్నవి. శైలియందును రచనాదృష్టియందును చాల వఱకు భేదమున్నది. భావనారాయణ కవియు సూరన్నవలెనే కొన్ని తావులలో మూలమును సంక్షేపించుటయుఁ జూడగలము. కావున నీతని యనువాదము ఆంధ్రవాల్మీకి యని పేరువడసిన వావిలకొలను సుబ్బారావుగారి యాంధ్రరామాయణము వలెగాక అభినవ తిక్కన యని బిరుదుగాంచిన శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి యాంధ్ర భారతము వలె నున్నది. మాతృకలోని స్వల్పాంశమైనను త్యజించక యనువదించిన వారే వీ రిద్దరును. కాని భారతాంధ్రీకర్త యచ్చ టచ్చట రసపోషణము కొఱకు కొన్ని స్వకీయ భావములను జేర్చియు, కొన్ని వర్ణనలను బెంచియు తన కృతిఁ జదివెడు వారి యందుఁ గావ్యరసాస్వాదనోత్సాహమునుఁ బుట్టింప సమర్థుఁ డయ్యెను. అట్టి భాషాంతరీకరణమే యీ భావనారాయణ కవిదియు.

సూరనార్యుని శైలి మృదువుగాను, ధారాళముగాను, మధురముగాను నున్నదని వెనుకనే చెప్పితిని. సెలయేటిలో నీ రెట్లు నెమ్మదిగాను, చల్లగాను, నిరర్గళముగానుఁ బ్రవహించునో యట్లే యీ కవీశ్వరుని శైలీ ప్రవాహము అప్రయత్నముగాను స్వాభావికముగానున్నది. పద్యములు చదువం జదువ నా శుకవితముగా నీ ప్రబంధమునుఁ జెప్పెనేమో యని యూహ పొడముచుండును. ఎచ్చట నైనను నొక శబ్దచిత్రము కొఱకు గాని యొక శబ్దాలంకారము కొఱకు గాని యీ కవి నిలిచియుండలేదు. రసావిష్కరణము కొఱ కనుకూలించెడు కథలు వచ్చినప్పుడు వానిని సమగ్రముగా బరిశీలించుకొని చిన్నచిన్న నాటకలుగాఁ బెంచి వ్రచించెను. అనగా కథాముఖము నుండి కథాంతము

వఱకును క్రమక్రమముగా రసోన్మేషణము గావించుచు రసోద్రేక ము న్నతావస్థను బొందగానే క్రమక్రమముగా నుద్రేకమును తగ్గించుచు పాటకపక్కి నవలంబించెను. ఈ దృశంబగు రచనా విధానమునకు దృష్టాంతములు మారిచ చరిత్రము, సౌభరి చరిత్రము, తారా శశాంకము, ఊర్వసీ పురూరవ కథ యిత్యాదులు. వీనిలో దేనిని జదివినను రసాత్మకమైన కవిత్వము నవ నవోన్మేషముగాఁ బ్రవహించుచున్నది. సూరన్న విష్ణుపురాణమును రసాత్మక కావ్యసృష్టితోఁ జూచి కావ్యఫల రసాయనముగఁ దెనిఁగించెను. భావనారాయణ కవి ప్రియశిః విష్ణుపురాణమును ఆధ్యాత్మిక పుణ్యచరిత్రముగఁ గైకొని భక్తి ప్రతిపాదన కొఱకు ప్రయత్నించి యాంధ్రీకరించెను. కావుననే ప్రహ్లాద, జడ, భరతాది భక్తుల చరిత్రలను విరివిగ పెంచియు తారాశశాంకోర్వసీ పురూర వాది శృంగార కథలను గుప్త పఱచియు ననువదించెను. ఈ రెండు గ్రంథములయందు నివ్విధమగు రసభేద ముండుటయే గాక శైలి యందును భేదమున్నది. భావనారాయణుని కవిత్వము ముదురుపాకము గలిగి భాషార్భటిని శబ్దాలంకారములను గలిగి యున్నది. వెనుక దూబగుంట నారాయణ కవి పంచతంత్రమును సాధుశైలిని స్వామగా రచింపగా పర్వతరాజు వెంకటరాజు దానితోఁ దృప్తి నొందక యా గ్రంథమునే ప్రౌఢ శైలిని కష్టముగా నుండునట్లు తెలిగించెను గదా! అట్లే యీ భావనారాయణుఁడును.

సౌభరిముని ముదిమిని సూరన్న కొలది మాటలతో సూచించి విడిచి పెట్టెను, "జర్జరితమైన శరీరము తోఁడ దద్దయున్, ముదిసిన వాడ వీవు..." భావనారాయణుఁ డంతటితోఁ దృప్తి నొందక యా వృద్ధ మునీశ్వరుని యెంత రోతగా వర్ణించినాడో చూడుఁడు.

సీ. ఉచ్చూనతరసిరా ప్రచ్ఛాదిత శరీరుఁ
బరికింపమాన దుర్భరశిరస్కు-
నాలంబమానవళీ లక్ష్మ్రి తానను
శిథిలితని పతితాశేషదశను
సంచ్ఛన్నపటల దూసరితాక్షిగోళకు
శ్లేష్మఘుర్ఘుర రవాశ్లిష్టకంఠుఁ
గోదండ డండభంగుర విరుద్ధాకారుఁ
బలితలోమశ్మశ్రు బద్ధకేశు
గీ. భూరినిర్భరతర జరాభారజర్జ
రావయవు, నమ్మునీంద్రుఁ గన్నారఁ జూచి
చూచి "యే, మారుచెప్ప నీసునకపించు"
నంచు నెంచుచుఁ జింతించెనవనివిభుఁడు. (ఆశ్వా 4 ప 65)

సూరన్న మోనిముదిమిని యెక్కువగా వర్ణింపక కన్యల సౌందర్యము నెక్కువగా వర్ణించెను. భావనారాయణుఁడు తన స్వభావమునకుఁ దగినట్లు వ్యతిరేక కార్యమునుఁ జేసెను. సూరన్న జేసిన కన్యకా వర్ణనము.

ఉ. కాఱుమెఱుంగులో మెలపుఁగైకొన నేర్చిన పైఁడిబొమ్మలో
మారునిదీములో కలికిమాటల చంద్రికకలో చెలంగు శృం
గార రసాధిదేవతలొ కమ్మని క్రొవ్విరి తీఁగెలోయనన్
వారిజపత్రలోచనలు వచ్చిరి మోహవిలాసమూర్తులై. (ఆశ్వా 5. ప. 148)

భావనారాయణుఁడు వీరిని వర్ణించుట యే లేదు. ఇట్లు రసవిషయమునను శైలీ విషయమునను వీరిద్దఱికిని భేదము స్పష్టముగాఁ గాన్పించుచున్నది. సూరన్న కవితా ప్రియుఁడు, భావనారాయణుఁడు పాండితీ ప్రియుఁడు. సూరన్న యందు శృంగారరస మెక్కువ, భావనారాయణుని యందు భక్తిరస మెక్కువ. సూరన్న శైలి యందు సౌకు

మార్యమును, భావనారాయణ శైలి యందు ప్రౌఢిమయుఁ గన్పట్టుచున్నవి. తాడేపల్లి సీతారామస్వామి రచన నాతి సులభముగాను నాతి కఠినముగాను యున్నది. శైలియందు గాని కల్పనయందు గాని ప్రత్యేక విశేషమొద్దియుఁ గానిపింపదు. పైనఁ జూపిన సౌభరి వృత్తాంత విషయములో ముదుసలి యగు మౌని వర్ణనము గాని కన్యల లావణ్య వర్ణనము గాని లేకయే కథను సాగించి నాఁడు. దీనిని స్థాలీపులాకన్యాయమునఁ నిదర్శనముగా దీసికొనవచ్చును. కథా విషయములను తప్పకుండ నివేదించుట యే యీతని పని. అంతకంటెఁ గవితకు వేరె తొడవులు గన్పించుట లేదు.

సూరన్న కవిత్వము యింపు సొంపులు జూపెడు పట్టులు కొన్నిటి నగపఱచి యీ కావ్య విచారణ ముగించెద.

1. ప్రహ్లాదచరిత్రలో ప్రహ్లాదుని చదువును గుఱించి తండ్రియగు హిరణ్యకశిపుఁడుఁ బ్రశ్నించుట :—

ఉ. ఏమిసుభాషితంబు పఠియించితిపుత్రిక రాజనీతులే
యేమియెఱుంగఁజెప్పె గురుఁ డిప్పుడు నీదగు పుస్తకంబునం
దేమిలిఖించి యున్నయది యిప్పుడు పాఠకశక్తిఁజూచెదన్
మా మది కింపుగాఁ జదువుమా యొక పద్యము వీరి ముందఱన్.

(2 ఆశ్వా. 280 పద్యం)

ఈసందర్భములో పోతన్న భాగవతమందు వ్రాసినది యిట్లున్నది.

శా. ఉత్సాహప్రభుమంత్రశక్తియు తమే యుద్యోగమారూఢసం
విత్సంపన్నుఁడవైతి వే చదివితే వేదంబులన్ శాస్త్రముల్
వత్సా రమ్మని చేరఁ బిల్చి కొడుకున్ వాత్సల్య సంపూర్ణుఁడై
యుత్సంగాగ్రముఁ జేర్చి దానవవిభుం డుత్కంఠ దీపింపగన్.

(7 వ స్కంధం 189 పద్యం)

2. పారిజాతాపహరణ సమయమున సత్యభామ వనపాలకులతోఁ జెప్పిన మాటలు :—

క. ఎక్కడి దేవేంద్రుఁడు మఱి
యెక్కడి పౌలోమి వీరికీ భూజాతం
బెక్కడిదీ లోకములో
నెక్కుడు వీరలయిరి యెవ్వరికంటెన్.

తే. జలధిబుట్టిన యీపారిజాతవృక్ష
మఖిలలోకమ్ములకు సమ మదియుఁ గాక
నామగఁడు శౌరి మీ శచీనాథుకంటె
బల్లిదుండౌట యెఱుఁగరె యెల్లవారు.

క. నామగఁడు సత్యలోక
గ్రామణి దేవేంద్రుఁడాదిగాఁగల దివిజ
స్తోమములు గొలువనుండుట
యేమీ పౌలోమి యెఱుఁగదే మఱచెనో.

క. తన బాహువిక్రమ
ఘనుఁడయ్యెడు నేనిఁ గృష్ణుఁ గయ్యములో మా
ర్కొని గెలిచి పారిజాతము
గొనిపోవుంగాక యేఁటిగొణుఁగులు తనకున్. (8 ఆశ్వా. ప. 130-134)

ఈ పట్టున ముక్కు తిమ్మన్న సత్యభామచేఁ జెప్పించిన పలుకులు :—

సీ. వినుఁడు సురేశ్వర వనపాలకులు వార్ధి
బొడమిన యీదివ్యభూరుహమున
కింద్రాణి యెవ్వతె? యింద్రుఁ డెవ్వఁడు?
తోడి యిందిరను గౌస్తుభము నెవ్వఁ
డధిపుఁడై ధరియించె, నతఁడె చేకొనుఁగాక
తెరతెర యిది యేమి మీకు సొమ్ము?

యిదెవాడు విభునిచే నీవడాన్య నగంబు
నొడియించుకొని యేఁగుమన్న దానఁ;

తే. బలుకు లేటికిఁ బాపీరబత్నియేమి
మాళవీదేవి తనదు ప్రాణేశుఁడైన
మధువునిటఁబంపి సత్యభామా విధేయు
వలన మరలంగఁగొను మెపో పాపితనము. (ఆ. 4 ప. 58)

3 కేశిధ్వజ ఖాండిక్యో పాఖ్యానమున కేశిధ్వజుఁడు అడవికిఁ బారిపోయిన ఖాండిక్యుని కడకు వేరుఁపుడు సూరన్న యిట్లు వర్ణించెను.

మ. మన శత్రుండిట జోడుమైఁ బోదివి రణభీమంబైన ఖడ్గంబు గై
కొని తేరెక్కి రణంబు సేయ నిదె వైకొన్నాఁడు వీతోంటిపా
టున జిక్కెన్ వధియింతమంచుఁ గడు వాటోపంబు దీపింపఁబో
రున శస్త్రాస్త్రచయంబు గైకొని మహారోషంబునన్ జేరినన్.

క. వారలఁగముఁగొని వినయముఁ
తోరంబుగ నతఁడుపలుకు దోర్బలమున మీ
తో రణము సేవి గెలువం
గారాను విరోధమాత్మఁ గలుగదు మాకున్. (అశ్వా. 8 ప. 402)

ఈ విషయమునే శ్రీకృష్ణదేవరాయలు తన యాముక్తమాల్యదలో వర్ణించిన విధము :—

మ. ధనధాన్యద్విరదాశ్వగోధనసమేతంబెల్ల సామ్రాజ్యముం
గొనియుం జాలక తాటకేయపలభుక్కూటాకృతిం జింకతో
లున వాచ్ఛన్నుఁడవై ప్రశాంతగతి మాలోఁ జొచ్చి ప్రాణంబులున్
గొన చేరెంచితె దుర్మతీ గడపెద స్గాత్రంభ్రథల్లంబునన్.

మహాస్రగ్ధర. అనినం కేయెత్తిరా పాఁయలుగ కవి
మకాకారతాయిస్రవృమాదం

బున వైకల్యంబు యాగంబునకుఁ బొడము
నే భూసురశ్రేణి వేఁడ
న్నిను నావేదించి పంపెన్నృపయతిఁ డె
ఱుంగు న్నిష్కృతి ర్వేఁడు పోపా
మ్మని కోపమ్మైన రోపమ్మైన విడువు రొ
జ్జైన మేలింకనన్నన్. (రెండవ ఆశ్వాసము)

4. విద్యార్థి యగు శశాంకుని యెదుట తార జూపిన శృంగార క్రమము :—

సీ. బంగారు చెఱఁగుల పట్టుపుట్టముఁ గట్టి
కమ్మకస్తూరి తిలకంబుఁదీర్చి
ముత్యంపుసరులును మెఱుపుఁదీగెయుఁ బెట్టి
యవయవంబుల సొమ్ము లలవరించి
కలికి కన్నులయందుఁ గజ్జలంబమరించి
యరజారుకొప్పున విరులు దుఱిమి
తఱుచుగాఁ గర్పూర తాంబూలములు సేసి
పాలిండ్లఁ గుంకుమ పంకమలఁది
తే. పొసఁగ వజ్రంపుఁ బాపట బొట్టుపెట్టి
రవలిమెట్టెల మ్రోఁతలు రాయడింపఁ
బంచసాయకు మోహనబాణమనఁగ
నిందు బింబాస్య మెలఁగు సమ్మందిరమున (ఆ. 6 ప. 15)

5. ఊర్వశీ పురూరవ సమయ మందు పురూరవుని వన విహార వర్ణనము :—

సీ. మందారచందన మాకందశాఖోట
జంబీరనీ పకదంబ తరులు
మల్లికా మాధవీ మాలతీ చంపక
కుందాది సంఫుల్ల కుసుమలతలు

కలనాద కలహంసికా చక్రవాక వి
స్తార కాసార కాసారములును
గరపారావతకారి కామ్రదభంగ
పరిపుష్ప పరితుష్ట పరిచితంబు
తే. మందమలయానిలోద్ధూత మానను మరు
రాగధూసరితాకాశ భాగతలము
గలిగి వనదేవతా సముత్కర మనోభి
రామమై యొప్పుచున్న యారామములను. (6 ఆశ్వా. ప. 68)

పై యుదాహరణములఁ బట్టి యీ కవివర్యుని శైలి సరళముగాను స్వాభావికముగాను రసోదంచితముగాను యున్నదని తెలియఁగలదు. శ్రీకృష్ణదేవరాయల కాలమందుఁ గవిపుంగవులలో నీతని నొక మేటి కవిగ బరిగణింపవచ్చును.

పురాణమును నొక రసవంతమగు ప్రబంధముగ రచించిన యీ కవి ప్రౌఢ యాంధ్రుల యాదరణమునకు సర్వవిధముల పాత్రుఁడై యున్నాఁడు.

# అనుబంధము

## అల్లసాని పెద్దనార్యుని మనుచరిత్రము.



అల్లసాని పెద్దనార్యుని గుఱించియు నాతనిసుప్రసిద్ధగ్రంథ మగు మనుచరిత్రను గుఱించియుఁ జాలమంది విద్యాధికులును బండితులును విమర్శించియే యున్నారు. గ్రంథవిమర్శనమును నాధునికపద్ధతులలోఁ బ్రారంభించినది లగాయితు పెద్దన మనుచరిత్రయు దానికిఁ బోటీగా రామరాజభూషణుని వసుచరిత్రయు గ్రంథవిమర్శకుల దృష్టిని నాకర్షించియే యున్నవి. శ్రీ వెన్నేటి రామచంద్రరావు B. A., B. L. గారు "మనుచరిత్ర రచనా విమర్శన మ"ను నొక మేలైన విమర్శనమును 1899 సం॥రములోఁ బ్రకటించి యున్నారు. విమర్శకాగ్రేసరులగు బ్రహ్మశ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రులుగారు 'మనువసుప్రకాశిక'యను నొక చక్కని విమర్శనము నుపోద్ఘాతముగ 1902 సం॥లో రచించి దానినే తిరిగి యాంధ్రపరిషత్పత్రికలో ఆ 1922 సం॥లో "అల్లసాని పెద్దనార్య కవిత్వతత్త్వమను" నొక వ్యాసరూపమునఁ గ్రోడీకరించి సంపూర్ణముగను సంక్షేపముగను మనుచరిత్రమునుగుఱించి వారి యభిప్రాయములను జెప్పిరి.

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు మనుచరిత్రకుఁ జక్కని పీఠిక వ్రాసియున్నారు. ఇంక వఝుల చిన సీతారామశాస్త్రిగారు, వేదము వేంకటరాయశాస్త్రిగారు, కేసవరపు వేంకటశాస్త్రిగారు, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు మున్నగువారు తమ గ్రంథములలో మనుచరిత్రను గుఱించి యానుషంగికముగ రచించిరి. ఇట్లీ కవివరుని కావ్యవిషయ మాంధ్రలోకమునఁ జిరపరిచితమై యున్నది.

పైనఁ జేర్కొనిన విద్వాంసుల విమర్శనములను గొంతవఱకుఁ జదివితిని. శ్రీ॥ వె॥ రామచంద్రరావుగారు మనుచరిత్రను జక్కఁగా విమర్శించుచు వసుచరిత్రమునందలి కించిల్లోపముల నతిమాత్రముగ నుగ్గడించినకతన శ్రీబ్రహ్మయ్యశాస్త్రిగారు పై విమర్శనకుఁ బ్రతివిమర్శనముగ మనుచరిత్రములోని దోషలేశముల విస్తరించి వ్రాసిరి. వీరిద్ద ఱొకవిధముగ విమర్శన ద్వంద్వయుద్ధముఁ జేసిరని చెప్పవచ్చును. కాని రామచంద్రరావుగా రెచ్చటను గోపావేశమున మృదుత్వము తప్పి విరసోక్తుల దూషింపలేదు. బ్రహ్మయ్యశాస్త్రిగా రన్ననో విమర్శకున కుండవలసిన శాంతచిత్తతయు, నిష్పక్షపాతబుద్ధియు విడనాడి కేవలము పురోభాగి దృష్టిని రంధ్రాన్వేషణమే ముఖ్య కర్తవ్యముగ నెంచిరోయను సంశయము పొడమునట్లు నిజమైన స్వల్పలోపములఁ దెంచియు, ననేకములగు నపోహములు, నపార్థములు, నపవాదములుఁ గల్పించియుఁ దమ విమర్శనా చాతుర్యమున నొక్క విపరీతవిమర్శనము గావించియుండిరి. వీరివ్యాసమును సావధానముగఁ జూడఁగ నాకు వెనుకఁ జదివిన యొకచిన్న విచిత్రకథ జ్ఞప్తికి వచ్చినది.

'అరిస్టైడీసు' అను గ్రీసుమహాపురుషుఁడు నిత్య న్యాయైకశీలుఁ డగుటచే న్యాయమూర్తియని పిలువఁబడుచుండెడివాఁడఁట (Aristides the just) కొండొక కాలమున కీన్యాయమూర్తిని దేశమునుండి వెడలఁ గొట్టుటకు కాతని శాత్రవులు ప్రయత్నించి, యతనిపై నొక యభియోగముఁదెచ్చి ప్రజానుమోదముఁ బడయుటకై యెన్నికలు గావించిరి. అపు డొక చదువురాని పౌరుఁడు తన "యెన్నికచీటి' (vote) మీఁదఁ బేరువ్రాయలేక తనదగ్గఱఁ గూర్చుండియున్న పురుషునిఁజూచి "అయ్యా! దీనిపై నారిస్టైడీసుపేరును వ్రాయుఁడ''ని కోరెను. అంత నాపురుషుఁడు

"ఏమయ్యా! అరిస్టైడీసును బహిష్కరించుచున్నావు. అతఁడు నీకేమి యెగ్గొనరించె?" అన నాపౌరుఁడు "అయ్యా! అతఁడు నాకేమియు నపకారముఁ జేసి యుండలేదు. కాని సమస్తజనులు నాతని 'న్యాయమూర్తి'యని పిలుచుచుండుటచే నాకొకవిధమైన విసువును, నసూయయుఁ గలిగినవి. అందుచే నాతని బహిష్కరింపఁదలఁచితి" ననియెను. ఆపురుషుఁడే 'అరిస్టైడీసు' అని యాపౌరునికిఁ దెలియదు. అప్పుడు అరిస్టైడీసు చీటినిఁ దీసికొని తన పేరు దానిపై వ్రాసి పౌరున కిచ్చివేసెను.

బ్రహ్మయ్యశాస్త్రిగారి విమర్శన మీమాదిరిగా నుండనోపును! 'ఆంధ్ర ప్రపంచమంతయు ననేకవిధములఁ బెద్దనార్యుని మహత్తరకావ్యము నుగ్గడింప, వీరికి విసువుగలిగి యొక విలక్షణమైన విమర్శనవ్యాసము ను వ్రాయనెంచిరాయను సందేహము గలుగుచున్నది. లేనియెడల విమర్శకాగ్రేసర బిరుదాంకితులు, సునిశిత మేధావంతులు, నాంధ్రగీర్వాణ భాషాకోవిదులు, సూక్ష్మగ్రహణపారీణులు నగు శ్రీబ్రహ్మయ్యశాస్త్రి గారిట్టి జుగుప్సాకర మగుకార్యముఁ జేయుట కెట్లు గడంగిరో తెలియకున్నది.

ఇప్పటివఱకు నితరులు వ్రాసిన విమర్శనలఁ బరామర్శించి వారి వాదములను సిద్ధాంతములను బ్రత్యేకముగఁ బ్రతిఘటించి వారి విమర్శనములకుఁ బ్రతి విమర్శనములను రచియించి ద్వంద్వయుద్ధము సేయు నభ్యాసముఁ గలవాఁడనుగాను. ముందైనన ట్టినేర్పు కలిగించుకొనుట కుద్దేశముగూడ లేదు. అట్లైనచో బ్రహ్మయ్యశాస్త్రిగారి విమర్శనముఁ బ్రత్యేకముగాఁ బరిశీలించి తప్పొప్పులను విమర్శించుట కవసర మేమనిన నేను పైన సూచించినట్లు శ్రీ శాస్త్రిగారు వారియపారశేముషీవైభవమును బెద్దనార్యునియందు లోపములను గనిపెట్టుటకును గల్పించుటకు ను వినియోగించి, గోరంతలు కొండంతలు చేసియు నపార్థములఁ గల్పిం

చియు, నవవాదబాహుళ్యమున రోఁత గలుగునట్లు ప్రేరేపించియు ననే విధముల నిష్పాక్షికబుద్ధిని విడనాడి యన్యాయ మగువిమర్శనముఁ గావించిరి. కావున నేప్రత్వతి విమర్శనకార్యమున కేను బూనుకొనవలసి వచ్చినది. సుహృదయులు మన్నింతురుగాక !

శ్రీశాస్త్రిగారి విమర్శనము నాల్గు శీర్షికలక్రింద విభజింపవచ్చును
i. కథాసంవిధానము, ii. రసము, నీతి. iii. పాత్రపోషణము
iv. శైలి.

i. కథాసంవిధానము:— మనుచరిత్రమునందలి కథాసంవిధానము గుఱించి శ్రీ శాస్త్రిగారు వ్రాసిన విషయములు. ''స్వారోచిష మనుసంభవము రస సమంచితకథల నొప్పునది గానఁ దనరచన కనుకూలమఁట. 'సహజముగ రస సమంచితత్వము గల కథలేవో యెంచికొని వానిని దన రచనలోఁ బెట్టి రసము పుట్టించు సామర్థ్యము తనలో నంతగ లేదు.' ఈవిధముగాఁ బెద్దనార్యుని కథాసంవిధానముఁగూర్చి శ్రీ శాస్త్రిగారు వ్రాసిరి. మనుచరిత్రకథ నెంచికొనుటలోఁ బెద్దనార్యుని కింతమాత్రము నధికారము లేదనియు, నాపనిని శ్రీకృష్ణదేవరాయలవారే చేసి పెద్దన్ననుఁ బ్రబంధము రచియింపుఁడని యాజ్ఞాపించిరనియు మనుచరిత్రము జాగ్రత్తగాఁ జదివినవారికి స్పష్టమగును. అది యట్లుండ నీవాదమెంత నీరసముగా, నెంత విపరీతముగా నున్నదో యోజింపుఁడు. మహాకవులు రసవంతమైన కథల వెదకికొని కావ్యములు రచియించుటకుఁ గారణము వారు రసహీనము లగుకథలను రసవంతములుగఁ జేయలేకపోవుటయేయని శ్రీ శాస్త్రిగారి మతము. కాళిదాసు, భవభూతి, షేక్సపియరు, మిల్టను మున్నగు మహాకవులు శ్రీ శాస్త్రిగారిమాటలు వినినచోఁ దలలు వంచుకొని సిగ్గుపడవలసినదే! ఏలయన నీమహాకవులందఱు రసవత్తరమైన కథలనే వెదకి వానిని నాటకములుగాఁ గాని

ప్రబంధములుగాఁ గాని వ్రాసినవారే. వీరిపనివంటిపనిని శ్రీశాస్త్రులుగారు నిరసించుట చాల నాశ్చర్యముగ నున్నది. ప్రపంచములో ధనికులును దరిద్రులును జక్కని పిల్లలను వెదకి వివాహములు చేసికొందురు. శ్రీశాస్త్రిగారు చెప్పినకారణ మేమనఁగా వారు కురూపులగు పిల్లలకు నగలు నాణెములు పెట్టి దృష్టికింపుగాఁ జేయలేరు. గాన సహజసౌందర్యముగల పిల్లలనే వెదకి పెండ్లియాడుచున్నా రని. ఈవాదము గుఱించి యింతకంటె నెక్కువగ వ్రాయనక్కరలేదు. కేవలము జ్ఞానశూన్యుఁడు గాని యేమనుజుఁ డైనను శ్రీశాస్త్రిగారివాదము నంగీకరింపఁ డని నొక్కివక్కాణింపవచ్చును.

ఇఁకఁ బెద్దనార్యుఁడు చేతగానివాఁడై రససముంచితకథలతో నొప్పారు స్వారోచిషమనుసంభవ మనుకథను గ్రహించి ప్రబంధము రచింపఁబూనెను. కాని "మూలమునందున్న కథనైనను సందర్భశుద్ధిగఁ జెప్పలేకపోయినాఁడు." ఇది శాస్త్రిగారి యభిప్రాయము. దీనికి వారిచ్చిన హేతువులు.

కుతపకాలము—మధ్యాహ్నము. ప్రవరునియింటఁ గుతపకాలమున— అనఁగా, పదునొకొండు-పండ్రెండు గంటలమధ్యను- ఒకయోగి సిద్ధుఁడు వచ్చి యాతిథ్యము నొందెనని కాన్పించుచున్నది. భోజనానంతరమునఁ గొంతసేపు ప్రసంగములు జరిపి, సిద్ధునిచేఁ బాదలేపముఁ బొంది ప్రవరుఁడు హిమగిరికిఁ బోయి, యచ్చటఁ జోద్యములు చూచి మధ్యాహ్నమైనట్లు కనిపెట్టినాఁడని గ్రంథమందున్నది. కుతపకాలమునకు మధ్యాహ్నమునకు నడుమ నిన్నిపనులుజరుగునా? కావునఁ బెద్దన్న కాలనిర్ణయములోఁ బొరపడెనని కొందఱును, లేదని కొందఱును, వాదోపవాదములు జరుపుచున్నారు. శ్రీశాస్త్రిగారెదిరి వాదముల నన్నింటిని ఖండించి పెద్దన్న యసందర్భము చేసెనని స్థిరపఱిచిరి. ఈవాదప్రతి

వాదముల బుద్ధిచాతుర్యముతో నాకుఁ బనిలేదు. ఈకుతపకాల విషఁ
ము పెద్దన్న గ్రంథమందొక కళంకముగాఁ జెప్పునంతటి గొప్ప విషఁ
మా ! ఇది యీమహాప్రబంధమునందొక తృణలేశముకన్న నల్పతరమై
యంశము గాదా ? దీనిని గుఱించి మనుచరిత్ర విమర్శకు లందఱు మఱ
బుద్ధిశాలు లెంతెంత ప్రయాసములఁ బొందిరో చూడంజూడఁ జోద్య
ముగ నున్నది. ఇది యొక ప్రమాదము. అంతగాఁ బ్రజ్ఞాలోపము
దెల్పునది గాద"ని చెప్పి శ్రీ శాస్త్రిగారే యౌదార్యముఁ గన
పఱిచిరి.

ii. కలి యను గంధర్వునికథ:— ఈకథను మనుచరిత్రమునఁ
బెద్దన్న సరిగా నతుకలేదని శ్రీశాస్త్రిగారి యభిప్రాయము. "ఏగంధ
ర్వుఁడు తద్విలాసముల ము న్నీక్షించి తానెంతయున్ రాగాంధుండయి"
అని యీగంధర్వునిగూర్చి హఠాత్తుగ నెత్తికొనినాఁడఁట. కాని యతని
పేరు, నాతని పూర్వవృత్తాంతము, వరూథినికిని నతనికిని నదివఱలో జరి
గిన మోహతిరస్కార మిత్యాదివిషయములు కథారూపముగఁ జెప్పఁబ
డలేదఁట ! ఇదియొక యసందర్భమఁట !

వరూథినీ ప్రవర సంవాదము సంపూర్ణముగ వర్ణించి, ప్రవరుఁడు
వరూథినియొక్క కాముక ప్రయత్నముల నన్నింటి నుల్లంఘించి యామె
ను వీడి పోయెనని చెప్పి తదుపరి కథను సాగించుటలో ముఖ్యముగ
మఱియొకఁడు ప్రవరవేషము దాల్చి వచ్చి వరూథినిదృష్టి నాకర్షించెన
నియు, నామె యాతఁడు ప్రవరుఁడే యని భ్రమపడి యాతనితో భోగిం
చెననియుఁ దత్కారణమున స్వరోచిపుట్టె ననియుఁ జెప్పుటయె ముఖ్య
విషయ మగును. కాని యామాయా ప్రవరుని పూర్వవృత్తాంత మంత
యుఁ జెప్పుట యంత ముఖ్యముగాదు. పూర్వోత్తర సందర్భములనుఁ
గథాప్రణాళికకొఱకుఁ గొంచెము సూచించినఁ జాలును, మాయా ప్రవ

డుఁడు కేవలము క్రొత్త పురుషుఁడు కాఁడనియుఁ బూర్వము వరూథినిని వరించిన యొక గంధర్వుఁ డనియుఁ గవి యొకపద్యములోఁ జెప్పవలసిన దంతయుఁ గ్లుప్తముగఁ జెప్పినాఁడు. అంతఃకథను బెంచి ముఖ్యకథ కంతరాయము గలుగఁజేయకుండుట కథాసంవిధానమున నొక గుణవిశేషమై యుండనోపు!

'కలి'యను గంధర్వుని పేరెత్తకపోవుట యేలయని శ్రీ శాస్త్రిగారు ప్రశ్నించిరి. దాని కొకకారణము నాకు స్ఫురించుచున్నది. సహృదయు లరయుదురుగాక! 'కలి' యను పే రంతమనోహరమైనదికాదు. ఈనామము సమస్తదుర్గుణసమూహసూచకము. ఈపేరిటివాఁడు స్వరోచికిఁ దండ్రి యయ్యెనని చెప్పిన నగౌరవముగ నుండనోపునని తలఁచి కవి పేరిడ మానెనేమో! మఱియొక చిన్నసూచన, ప్రారంభములో నీస్వారోచిషమనుసంభవకథను బ్రబంధముగ రచియింపవలయునని శ్రీకృష్ణదేవరాయలు కోరినప్పు డాచక్రవర్తి చెప్పిన ట్లీమాటలు వ్రాయఁబడినవి.

"మనువులలో స్వారోచిషమనుసంభవము...వినవింపుకలిధ్వంసకము—" కలి ధ్వంసక మగుకథలో 'కలి' యను పురుషుఁడు స్వరోచికిఁ దండ్రి యగుట యెట్లు పొసఁగును? ఇది స్వవచనవ్యాఘాతముగ నెంచఁబడవచ్చును. ఈసూక్ష్మాంశమును గుఱించి సహృదయు లాలోచింతురు గాక!

iii. ఈగంధర్వుఁడు ప్రథమమునఁ బలికిన పలుకు లసందర్భముగ నున్నవని శ్రీశాస్త్రిగా రాక్షేపించిరి.

"ఒక్కొకవేళఁ బద్మముఖు లొల్లమిఁజేయుదు రొక్కవేళఁ బె న్మక్కువ గారవింతురు క్షణక్షణముల్ జవరాండ్రచిత్తముల్........ సుఖంపఁగాఁ దగున్"

ఈమాటలు పూర్వపరాజితుఁ డగు గంధర్వుఁడు చెప్పవలసి మాటలుగాని తనరూపమును మార్చుకొని మఱియొకరూపము దాల్చి వాఁడు చెప్పవలసినమాటలు గావని వారి యాక్షేపణము. ఈయాక్షేపణము సమంజసముగానే యున్నది. ఈమాటలు సందర్భమునకుఁ దగ యున్నట్లు కాన్పింపవు.

ఇంక మఱికొన్ని స్వల్పాంశములను గూడ నసందర్భములుగ సూచించిరి. అచ్చరల "అస్వేదత" యొకచోట, "స్వేదత" మఱొకచోట-ప్రవరుఁడు, అప్రతిగ్రహీత యని యొకచోట, కానుకీనములు దొరకకపోవుటచేఁ గలిగిన దారిద్ర్యప్రశంస యొకచోట-ఇయ్యది స్వల్పాంశములను మాత్రము సూచించి కథాసంవిధానమును బెద్దన్న సందర్భశుద్ధిగ వ్రాయలేదనియుఁ గథను బాడుచేసెననియు నిర్దిష్ట నిరసోక్తులఁ దెగనాడిరి. పైనుదహరించిన యంశములన్నియుఁ గొంచెమెచ్చుతగ్గుగాఁ దృణలేశములు నెరసులు ఇవి కథకు నేవిధమైన బాధఁగాని యనౌచిత్య దోషముగాని యంతరాయముగాని కలుగఁజేసినవికావు. ఈస్వల్పస్ఖాలిత్యములవల్లఁ గథయందు సందర్భశుద్ధి యేమితగ్గినది ! ఇటువంటి నలుసులు ప్రతి మహాగ్రంథమందును గొంచెమైన నుండక తప్పవు. "బళిబళి మంచిమాటయె ప్రబంధమునా జలరాశి దానిలోపల నెరసుల్ గణింతురె యపారము లోమణు లెల్లనుండఁగన్" అని కమసాలిరుద్రయ్య చెప్పినటు లీనలుసులను బట్టి యొక యుద్గ్రంథమునంతయుఁ దెగనాడుట విమర్శనౌదార్యమునుగాని పరిమాణపరిజ్ఞానమునుగాని సూచింపవు.

iv. రసము—నీతి, మనుచరిత్రమునందలి రస విమర్శనమందును, నీతివిచారణమందును శ్రీశాస్త్రిగారు చాలవఱకుఁ బొరపడినారు. వారు చేసిన తప్పిదములు బడిపిల్లలు చేయఁదగినవి కాని యనుభవశాలులును విమర్శవిశారదులునగు శ్రీశాస్త్రిగారు చేయఁదగినవిగావు.

వీరు చేసినపొరపాట్లు సామాన్యదృష్టిని రెండువిధములుగా విభజింపవచ్చును.

1. దేశకాలపాత్రముల నాలోచింపకుండుట 2. కథాపాత్రములు వారివారి యవస్థలతోఁ జెప్పిన మాటలను గేవలము కవిహృదయమనియే దురభిప్రాయపడుట.

ఈ రెండు విధములగు పొరపాట్ల మూలకముగ వా రీకావ్యము నీతిబాహ్యమనియుఁ దుచ్ఛశృంగార రసభరితమనియు స్థిరపఱిచిరి. వీరి యభిప్రాయములను బ్రతిఘటించుట కాంధ్రగీర్వాణ వాణీవిషయమై కొంత ప్రస్తావనగాఁ జెప్పవలసియున్నది.

ప్రపంచములో నేవాఙ్మయమును జూచినను శృంగారరసమే ప్రధానరసముగ నున్నది. ఆశృంగారరస మనేకవిధములఁ బ్రదర్శిత మగుచున్నది. దేశభేదమునుబట్టి శృంగార రసవర్ణనాభేదముఁ చూపట్టుచున్నది. పాశ్చాత్యదేశములలో శృంగారరసవర్ణనము ప్రాచ్యదేశములందలి శృంగారరసవర్ణనమును బోలదు. మన హిందూదేశములోఁ బ్రాచీనకాలమునుండియు శృంగారరసవర్ణమునకు నాయికానాయకుల బాహ్యావయవర్ణనము ముఖ్యవిశేషముగా నిర్ణయమైనది. పురుషులలో నవయౌవ సౌందర్యము స్త్రీలలోఁ గచకుచాదివర్ణనములు శృంగారరసమున కుద్దీపనములై యుపాంగములైనవి. ఈయాచారము సంప్రదాయసిద్ధమైనది. మహాకవు లందఱు నెంత నీతిప్రబోధకులైనను గచకుచాదివర్ణన నెంత మాత్రము దుర్నీతిప్రేరకమని యెంచియుండలేదు. ఈ సంప్రదాయము తొలుదొల్త సంస్కృతవాఙ్మయమునందుఁ బుట్టినది. సంస్కృతము మాతృక కాన దేశ్యవాఙ్మయపుత్రికలందుఁ గూడ నీవాడుకయే ప్రవర్తించినది. కావునఁ గచకుచాద్దివర్ణన మీకాలమున వఱకుఁ గవులలో నవిచ్ఛా

ర్యమైన కావ్యరీతిగఁ బరిగణింపఁబడినది. ఇప్పుడిప్పు డాంగ్లేయసంసర్గమునఁ గొంతవఱకీ సంప్రదాయము మాఱుచున్నది. గాని, మనదేశమందలి ప్రాచీన వాఙ్మయముఁ బరిశీలించుచున్నపు డీనాఁటి రసప్రమాణముల నుపయోగపఱుచుట యన్యాయము.

మఱియు వాఙ్మయాభిరుచిప్రమాణములు ప్రతి దేశమందును గాలభేదమునుబట్టి భేదించుచుండును. వాఙ్మయాభిరుచి కాలానుసరణమై యనేక కారణములచే మాఱుచుండును. ఈభేదములఁ గూడ వాఙ్మయవిమర్శకులు గుర్తించుచుండవలెను. మన యాంధ్రదేశములోఁ బండ్రెండవ శతాబ్దమునకును బదునాఱవ శతాబ్దమునకు సారస్వతమున విభిన్నత విస్పష్టముగాఁ గాన్పించుచున్నది. పదునాఱవ శతాబ్దినుండి యీయిరువదవశతాబ్దికి నంతకంటె నెక్కువైన భేదము కాన్పించుచున్నది.

ఈ మనుచరిత్రము పదునాఱవ శతాబ్దినాఁటి గ్రంథము. ఆ కాలమున రాజులు శృంగారరస ప్రియులగుటచేఁ దదాశ్రితు లగు కవీశ్వరులును శృంగారరసలాలసులు కావలసివచ్చినది. శృంగారరసము లేని స్థలములయందు సైతమేదో యొక విధముగా శృంగారరసము చొప్పింపవలసియుండెను. శృంగారరసము వర్ణింపలేనికవి కవిగాఁ డను నభిప్రాయ మతివ్యాప్తమైనట్లు కాన్పించుచున్నది. పెద్దనవలెనే యతని సమకాలీనులగు ముక్కు తిమ్మన్న ధూర్జటి వారివెనుక సమీపకాలములో వెలసిన రామరాజభూషణుఁడు పింగళి సూరన్న యిత్యాది మహాకవు లందఱు శృంగారరసభూయిష్ఠంబులగు గ్రంథములను రచించిరి. కావున, పెద్దన్న శృంగారరసము చిత్రించుటలోఁ దనకాలమునఁ బ్రకటితమగు రుచి ప్రమాణముల నుల్లంఘించెనో లేక వ్యక్తివ్యత్యముల నతిక్రమింపక

మానవజాతికి నిత్యానుభవమగు రీతిని( బెంపొందించెనో నిర్ణయింపవలసి యున్నది.

ఇంక( బాత్రముల గుఱించి కొంత యోజించెదము ప్రతిదేశము నందును గథాపాత్రము లనేకములుగా నుండును. గుణదోషములు కేవలము వ్యక్తిగతములే గాక జాతిలక్షణములుగాను జూపట్టును. ఈపాత్ర గుణనిర్ణయ సంప్రదాయ మన్ని దేశములయందు నన్నివాఙ్మయముల యందు( గాన్పించుచున్నది. ఆయావివరణము లన్నిటిని( జెప్పుట ప్రస్తుత మనవసరము.

మనదేశవాఙ్మయములో గీర్వాణ వాఙ్మయ సంప్రదాయముం బట్టి మనుష్యజాతి నాయికా నాయకులే గాక దివ్యజాతి స్త్రీపురుషులు గూడ( దఱచుగా( గథాపాత్రములుగా( బ్రవేశపెట్ట(బడుచుందురు. దివ్యజాతుల చరిత్రములు పౌరాణిక ప్రసిద్ధములు, దేవతలు గంధర్వులు కిన్నరులు కింపురుషులు రాక్షసులు నిత్యాదులను మన మెవ్వరము మన జీవితములో( జూడకపోయినను( బౌరాణిక సంప్రదాయ ప్రసిద్ధులు గాన వారివారికి నిర్ణీతములైన గుణదోషములను మనము ప్రామాణికముగా నొప్పుకొనవలసియున్నది. ప్రస్తుతము మన మనుచరిత్రలో నప్సరసలు గంధర్వులు నాయికానాయకులుగ నున్నారు. వారివర్తనములు మానవజాతి వర్తనములలో( జేర(దగినవిగావు. ప్రత్యేకముగా మానవజాతికి( జెందినవా( డొక్క ప్రవరు(డుమాత్రమే కా(బట్టి యప్సరో గంధర్వుల విహారవ్యవహారములు మనుష్యులమగు మన కాదర్శములు కావు.

గంధర్వులు నప్సరసలును దమజీవిత ప్రవృత్తులలో ముఖ్యముగ( గాముకక్రీడాపరాయణులు. భూలోకమున భోగమువారెట్టివారో దేవ

లోకములో వీర లట్టివారు బ్రిహ్మయొక్క జఘనమునుండి పుట్టినవారై యెల్లప్పుడును నృత్తగీతాది కళాభ్యాసకులును గామక్రీడా ప్రియులునై నిలింపసభలలో మేళతాళముల మెలఁగుచుందురు. వారిజీవిత వ్యాసంగ ములను గుఱించి పెద్దన్నయే యిట్లుచెప్పినాఁడు.

"చిన్నివెన్నెలకందు వెన్నుదన్ని... వ్యాఁతపసిండివంటివలపుల్ పచరించుకులంబు" కాఁబట్టి దేవలోకసామాన్య యగునంగన నాయిక యగుటచే నామె పలుకులుఁ జేఁతలు మానవజాతికి సంబంధించినవికావు. అట్లే మాయాప్రవరుఁడగు గంధర్వ ప్రవరుఁడును. వీ రిద్దఱపాత్రములు ను మన యనుభవప్రపంచములోఁ జేరవు.

కాని దివ్యపురుషుల విహారవర్తనములను మనము చదివి మనో గతము చేసికొనుచున్నాము. కాన వారియందలి గుణదోషములు మన డెందముల భావోద్రేకము పుట్టింపకపోవునా యని యాక్షేపణ చేయవ చ్చును. కాన దేవతలనైనను మనుష్యజీవితవృత్తులలో నున్నలక్షణము లతోఁ జిత్రించుట చాల మేలేయగును. ఇది నిజమే కాని యట్లుచేయు టచే వారియందు దేవతాగుణములను దప్పించి మానవగుణముల నారో పించినవార మగుదుము. కావున నట్టిపాత్రపోషణము పౌరాణిక సంప్ర దాయమునకుఁ గేవలము విరుద్ధమై విలక్షణమైనదగును. ఇట్లు దేశకాల పాత్రములగుఱించి ముందుగాఁ బరిశీలించి నిర్ణయించుకొనినఁ గాని పెద్ద నార్యుని కవితాశిల్పము గాని మఱి యేప్రాచీనకవియొక్కయుఁ బౌరా ణిక ప్రబంధముల కవనశిల్పము గాని మనము యథార్థముగా నిరూపింప లేము. ఆకాలపు పరిస్థితులు, నానాఁటి కవితాసంప్రదాయములు, నప్ప టి ప్రజలయొక్కయు రాజులయొక్కయు మనోవృత్తులు మున్నగునవి సాకల్యముగ గుర్తించినఁ గాని పెద్దనార్యుని కవితాకన్యయొక్క యాకృ

క్రియాలక్షణములయందలి యుత్కృష్టతానికృష్టతలను నింద్యానింద్య స్థితులను నిర్ణయింప నవకాశ ముండదు.

ఈయుపన్యాసమంతయు శ్రీశాస్త్రిగారికి నవసరము లేదని నాకుఁ దెలియును గాని చదువరులలోఁ గొంతమంది కైనను ముఖ్యముగా గ్రంథవిమర్శనకు నూతనముగాఁ గడంగు పండితకిశోరములకైన నవసరమై యుండవచ్చునని ప్రత్యేకముగ వ్రాసితిని. పైననూచించిన విషయము లన్నియు శ్రీశాస్త్రిగా రెఱింగియున్నను బెద్దనార్యుని దోషములకై వెదకులాడెడు దృష్టితీవ్రతచే సమరసమైన విమర్శవిచారము చేయక దోషములను దోషారోపితముల నన్నింటిని కలగాపులుసుగాఁ గలిపి పెద్దనార్యునితలపై రుద్దిరి.

ఇంక రెండవవిషయము :—

పాత్రోచిత వాక్యములను గవి యభిప్రాయములుగఁ బొరంబడుట నూతనముగా గ్రంథవిమర్శనమునకు నుద్యోగించెడు యువకుఁ డిట్టిపొరపాటు చేసినను గొంతవఱకు క్షమింపవచ్చును గాని యాంధ్రవిమర్శకాగ్రేసరబిరుదము వహించిన శ్రీశాస్త్రిగా రిట్టికించిజ్జ్ఞతాజన్యమైన పొరపాటు గావించుట నాకుఁ జాల నాశ్చర్యకరముగా నున్నది. 'ప్రమాదో ధీమతా మపి' యను న్యాయముచే నిట్లు జరిగిన నిప్పుడైనను వారి యభిప్రాయముల నుపసంహరించుకొని పెద్దనార్యుని యాత్మకు సంతుష్టి గావింతురుగాక.

ఇంతవఱకుఁ గావ్యవిమర్శన క్రమమును నిరూపించితిని. ఈతరువాత శాస్త్రిగారు చూపించిన దోషములగుఱించి క్లుప్తముగ వ్రాసెదను.

ఈగ్రంథమందలి శృంగారరసవర్ణనమును గుఱించి శ్రీశాస్త్రిగారు చాల వఱకు విమర్శించిరి. వారివిమర్శనమును సాంతముగాఁ జూచినయెడల

వారి యభిప్రాయ మిదమిత్థమని చెప్పుట కవకాశము గలుగుట లేదు
ఒకచోట 'కచకుచాదివర్ణనము చేసినంతమాత్రమున దుష్టగ్రంథము
నాకి యందురేని యట్లగుననినేను బలికియుండలేదు. నవనాగరకాగ్రే
ణ్యులు పలికి యాంధ్రసారస్వతముపై దాడివెడలిరి.' 'పెద్దన్న గ్రం
మందు నెచ్చటఁజూచినను మోహోద్రేకముపుట్టించు కుచాదివర్ణనవే
కాన్పించుచున్న దనియు' "స్త్రీల కుచములు వర్ణించుటయేగాక వనాద
లకుఁ గూడఁ గుచములు పెట్టి వర్ణించినాఁ డనియు" నిత్యాది పరస్పర
విరుద్ధవాక్యములను బెక్కులు పలికియున్నారు.

మఱియుఁ గచకుచ సంభోగవర్ణనముల నొక్క పెద్దనార్యుఁడే
చేయలేదు. సంస్కృతమహాకావ్యములలో నీవర్ణనము లమితములుగఁ
గలవు. వాల్మీకి కాళిదాసు మున్నగు మహాకవులు గావించి యుండిరి.
ఇంగ్లీషులో షేక్సుపియరు మున్నగు మహాకవులు నట్లే కావించియుండిరి.
అందులకై యితనినిఁ బ్రత్యేకముగా నిందింపఁ బనిలేదు.—అని వేఱొక
చోటఁ జెప్పిరి. ఈప్రకారము "కుడిచేతితోఁ గూడుపెట్టి యెడమచేతితో
నెగురఁగొట్టినట్లు" స్వవచనవ్యాఘాతములతో నిండిన యభిప్రాయము
లను బహుచమత్కారముగా వాదనసరళియందు నెఱపి పెద్దనార్యుని
కావ్యమున శృంగారరసము తుచ్ఛమనియు నీతిబాహ్య మనియుఁ దుట్ట
తుదకు సిద్ధాంతముచేసిరి.

వీరివాదనయందు నుపపత్తులను నిర్దుష్టముగా నిర్దేశించుటయు
లేదు, నిర్దిష్టము లయిన యుపపత్తులనుబట్టి స్థిరపడుపఁదగిన సిద్ధాంతము
లను న్యాయముగా నెలకొల్పుటలేదు. కాని యెంతవఱకుఁ జూచినను
మిథ్యావాదన యుక్తినైపుణ్యము పచరించుచు బుద్ధిని వ్యామోహపఱు
చునట్లు న్యాయాన్యాయములను సమ్మిశ్రమముచేయుచుఁ, జెప్పినవానినే
పలుమాఱు చెప్పుచు నొకచో నిర్దోషములని విడిచిపెట్టినవానిని మఱి

యొకచోట దోషములుగా నిరూపించుచు నొక్క యన్యాయ విమర్శ నము గావించిరి.

కచకుచాది వర్ణనవిషయములో వీరు పెద్దనార్యుని నిందింపను లేదు, అభినందింపను లేదని పైన వారివాక్యముల సహాయముననే చూపితినిగదా! ఇంక మఱియొకవిషయమును జూడుఁడు! "జారత్వము సర్వవిధముల నుచితమేయని సాధించుటకై పెద్దనార్యుఁడు ప్రయత్నించి నాఁడు. ఇది పెద్దనార్యుని పెద్దతప్పు." అని చెప్పి శ్రీశాస్త్రిగారీ క్రింది పద్యము నుదాహరణముగఁ జూపిరి.

"సీ. వెలివెట్టిరే బాడబులు పరాశరుఁబట్టి, దాశకన్యాకేళితప్పుఁజేసి

.................................బందాలుగారె."

ఇంతకంటె నన్యాయ మగువాద ముండునా? ఇచ్చట శ్రీ శాస్త్రిగారు చేసినతప్పు ప్రమాదవశమునఁ గావించిరో లేక కుటిలబుద్ధి నిఁ గావించిరో మనము నిశ్చయింపలేముగాని శాస్త్రిగారు తమతప్పును తెలిసికొనినతరువాతనైనను బశ్చాత్తప్తు లయ్యెదరుగాక!

ఈపద్యమందలి యభిప్రాయములు పెద్దనార్యునివా? లేక వేశ్య నాయిక యగు వరూథినివా? కథాపాత్రముల ముఖోద్గతము లగునభి ప్రాయము లన్నియుఁ గవియభిప్రాయములే యని శ్రీశాస్త్రిగా రొక విపరీతవాదమును గల్పించి చెప్పినచో నేకఁ బ్రతికవిశ్వరుఁడును దుర్మా ర్గుఁడు, తుంటరి, స్త్రీలంపటుఁడు, దొంగఁబోతు, జూదరి, యింకఁ బ్ర పంచములో నున్న దుర్గుణములన్నిఁటికి నాలవాలమై యుండవలసి వచ్చు ను. శూద్రకుఁడు, శకారునివలెఁ దొంగఁబోతును, జారశిఖామణియు నై శర్విలకునివలెఁ జోరాగ్రేసరుఁడై యుండవలెను. షేక్స్పియరు ఫాల్ స్టాఫ్‌వలె రండలకు మిండఁడై మాక్‌బెత్తుసతివలెఁ దానుగన్న చిన్నకూ

నను గూడఁ దల పగులఁగొట్టెడు క్రూరహంతకుఁడై యుండవలెను. ఇట్టివిపరీతవాదముఁ గావించువా రిడివఱలో నెవ్వరును లేరని ఘంటాపథముగాఁ జెప్పఁగలను. వేశ్యనాయిక తన వలపులలో నేకపత్నీవ్రతుఁడగు నాయమాయిక బ్రాహ్మణుని వేసికొనుటకుఁ జెప్పిన మృషావాదమును పెద్దన్నగారి యభిప్రాయ మనియె చెప్పి శ్రీశాస్త్రిగారు పెద్దన్నయందుఁ బెద్దతప్పు నారోపించిరి. ఇది పెద్దనార్యుని పెద్దతప్పుకాదు గాని శ్రీశాస్త్రిగారి విమర్శనా పాటవమునందుఁ బెద్దకళంకము.

ఇట్లు చెప్పుటచేఁ బెద్దనార్యుని శృంగారరసవర్ణన మంతయుఁ బ్రశంసనీయ మనియు నీత్యుద్బోధక మనియు నాయభిప్రాయము కాదు. ఆకవీశ్వరుని గుణదోషములను దేశకాల పాత్రములను బట్టి న్యాయపరిశీలనము గావించి సప్రమాణముగ నిరూపించి దాక్షిణ్యబుద్ధినిఁ దీర్మానముఁ గావింపవలసినదనియే నావేఁడుకోలు—

మఱియొక విషయము :— వరూథిని విరహావస్థయందుండఁగా సూర్యాస్తమయవర్ణనమునఁ బెద్దనార్యుఁ డాయవస్థ నిట్లుత్ప్రేక్షించెను.

"చ. తరుణి ననన్యకాంత నతిదారుణపుష్పశిలీముఖవ్యథా
భరవివశాంగి........................దీధితిన్."

ఈపద్యమునందలి భావము జారత్వబోధకమని శ్రీశాస్త్రిగారాక్షేపించిరి. ఇది న్యాయమైన యాక్షేపణయే. పెద్దనార్యుఁ డిచట నిక్కముగఁ బెద్దతప్పుఁ జేసినాఁడు. ఇది కవి యభిప్రాయమునే సూచించుచున్నది, గాని, పాత్రోచితవాక్యము కాదు. పెద్దనార్యుని శృంగారరస మిచటఁ బొంగిపొరలినది. శ్రీశాస్త్రిగారి చీవాట్లకుఁ బెద్దన్న యిచ్చటఁ దప్పక యర్హుఁడే. ఇట్లు దోషముల దోషములుగాను గుణముల గుణములుగాను నిర్ణయించుటయే విమర్శకునివిధి గాని గుణములను దో

షములుగాను దోషములను గుణములుగాను దారుమారుచేయుట యతని పనిగాదు.

ఈవిషయ మింతటితో దిగవిడిచి పెట్టిదమగు నింకొక ఘట్టమునకుఁ బోవుదము, అది యేదన మనోరమ వృత్తాంతము. ఈమెనుగుఱించి శ్రీశాస్త్రిగా రిట్లు నుడివిరి.

''మఱియు మనకవిగారికి సురతమే భోగముగాఁ గాన్పించినది గాని తక్కినవేమియు భోగములుగాఁ గన్పింపలేదు. ఇది మనోరమగాథలోఁ దేలినది.

మనోరమకథను మనుచరిత్రకథా సంవిధానమునఁ జక్కఁగా నిముడ్పలేదనియు, మాతృకయం దున్నదానినిఁ గొంతమార్చి నీతిబాహ్యముగఁ బెద్దన చేసినాఁ డనియు శ్రీశాస్త్రిగారియభిప్రాయము.

మాతృకయందు మనోరమ తనచెచ్చెలులను రోగవిముక్తలగఁ జేయుమని స్వరోచిని వివాహమునకు ముందుగానే తండ్రిసమక్షమున నడిగినది. పెద్దనార్యునిగ్రంథమం దామెపాణిగ్రహణానంతరమునఁ బతితో నేకాంతముగా నున్నసమయమునఁ దన నాథుని వేఁడుకొనినట్లున్నది. వివాహమునకుఁ బూర్వమున నున్నదానిని వివాహానంతరమున గర్భాధానపుగదియొద్దకు మార్చుట కేవల మనౌచిత్య మనియు నీతిబాహ్య మనియు నిం కేమేమొ వచింపరానంతదూష్యముగ శ్రీశాస్త్రిగారు భావించినారు. తం. పెరుమాళ్ళయ్యగారీమార్పు సరసముగాను, నుచితముగాను నున్న దని యభిప్రాయపడినారు. కావున విమర్శనవిశారదు లగు నిర్వురుమహాపండితు లీవిషయమున భిన్నాభిప్రాయు లై యున్నారు. ఔచిత్యానౌచిత్యనిర్ణయములలో ముఖ్యముగా "లోకో భిన్నరుచిః" అను న్యాయము ప్రాయశః అంగీకరింపవలసియున్నది. మనోరమ తన వివాహమునకుఁ బూర్వము తండ్రిసమక్షమున నొకమరతుగా నడుగుట

యుచితమా ? లేక వివాహానంతరము పతిపతు లేకశయ్యాగతులయి యున్నప్పు డేకాంతముగా వేఁడుకొనుట యుచితమా ? ఇది దాంపత్యధర్మనర్మమర్మసమస్య. వివాహమునకుఁ బూర్వ మామె కన్య. వివాహానంతర మామె నవోఢ యగును. కన్యాదశలో నుండఁగాఁ గాఁగలభర్తను మరతుగాఁ గాని వేఁడుకోలుగాఁగాని యాచించుట న్యాయమా ? నవోఢాదశయం దుండి యగ్నిసాక్షికముగఁ బాణిగ్రహణము చేసికొనిన భర్తను బతిమాలుట న్యాయమా ? చెలికత్తెల దుర్గశ తొలఁగించుట వివాహమున కొకమరతుగ నిర్ణయించి కన్య వరుని బరిణయము చేసికొనుట యుచితమా ? లేక వివాహ మయినతరువాత నెయ్యమున భర్తను దద్వరముఁ గోరుట యుచితమా ? ఏది ముఖ్యముగా ధీరుత్వమునుఁ గన్యాసౌశీల్యము నెక్కువగఁ బ్రతిపాదించుచున్నది ? ఈప్రణయ సుకుమారవిషయమును శ్రీశాస్త్రిగారు రసికత యెఱుఁగని మానిసివలెఁ గర్కశకమణభాషణముల విమర్శించిరి. నూతనదంపతు లిరువురు నేకాంతశయ్యను సమావిష్టులైనపుడు పత్ని భర్తతో ముచ్చటింపఁగూడ దనియు నట్లుముచ్చటించుట వెలయాలివర్తన మనియు శ్రీశాస్త్రిగారి మతము. గర్భాధానకాలమున మనోరమ తనచెలికత్తెలవిషయమై లోఁ గుందుచున్న దుఃఖమును నాథునికిఁ దెల్పి దుఃఖమును నివారింపనియెడలఁ దనకు సౌఖ్య మెట్లుండు నని స్వరోచికడఁ దలపోసికొనెను. ఇట్లు చెప్పుట అంకులాఁడితనమును సూచించుచున్నదని శ్రీశాస్త్రిగారు నిందించిరి. మనోరమ చెప్పినమాటలలో "నాకెక్కడి సౌఖ్యము" అని యున్నది. ఇక్కడ "సౌఖ్యము" అనుమాటకు "సురతసౌఖ్యము" అని యొకవిపరీతార్థమును జేసికొని శ్రీశాస్త్రిగారు భ్రమపడినా రని తోఁచుచున్నది. మనోరమ స్వరుచిని వివాహముచేసికొనుట కేవలము మదనకేళి సౌఖ్యము కొఱకేనా ? ఇంకేమయిన నితరసౌఖ్యముల కొఱకా ? ప్రపంచములో

స్త్రీలును బురుషులును బరస్పరమ్ము వివాహమాడుట "గూఢేంద్రియసుఖము కొఱకేనా ?" (ఇది శ్రీశాస్త్రిగారివాక్యమే !) శ్రీశాస్త్రిగారి వ్రాతలఁబట్టి వారి యభిప్రాయ మదియే యని నిర్ణయింపవలసివచ్చినది. గృహస్థధర్మములగుఱించి యిట్లశ్లీలముగ నాలోచించుట శ్రీశాస్త్రిగారి కెంతమాత్రముఁ దగినదికాదు.

ఇంతవఱకు శ్రీశాస్త్రిగారిగ్రంథమందలి రసమును గుఱించియు నీతిని గుఱించియు వ్రాసిన విమర్శనమునకు యాథార్థ్యముగను సహేతుకముగను ఖండనమండనరూపముగఁ బ్రత్యుత్తరమొసంగితిని. ఇంక సామాన్యజ్ఞానముగల యస్మదాదులకు మనుచరిత్రమునందలి రసవిశేషముల గుఱించియు, నీతిప్రాభవమును గుఱించియు నెట్టియభిప్రాయము లున్నవో యించిచూతము. సామాన్యముగ నాంధ్రుఁడు యువకుఁడైనను వృద్ధుఁడైనను మనుచరిత్రమును జదువుట కేల యభిలషించును ?

ఆగ్రంథమం దేవిషయ మాతని మనోదృష్టి నాకర్షించును ? నే నెఱిఁగిన యంతవఱకు మనుచరిత్రను జదివినవా రందఱు సామాన్యముగ వరూథినీ ప్రవరాఖ్యుల యుపాఖ్యానమును గుఱించియే యెక్కువ యభిమానముఁ గనఁబఱచుచుండిరి. మొదటిమూఁడాశ్వాసములు ముగిసినతరువాత పైకథనంతను గ్వాచిత్కముగఁ జూచినవారే మెందఱు. ఇట్లేకదేశముగాఁ జదువుటకుఁ గారణమేమి ? నిజమో యబద్ధమో గాని సామాన్యజనుల నమ్మకము, ఈకథయందలి సార మంతయు వరూథినీప్రవరుల యుపాఖ్యానమునందే యున్నదనియుఁ దక్కినభాగ మంతయు, రసోత్సేకము గలుగఁజేయలేని వల్లీబంధ మనియుఁ బెద్దనార్యుఁడు తన లోకోత్తరకావ్యప్రజ్ఞ నంతయు నీయుపాఖ్యానమునందే చూపించెననియు వారినమ్మకము. కావునఁ బెద్దనార్యుని కావ్యప్రతిష్ఠ యీయుపాఖ్యాన

మున నిలిచియున్నది. ఈభాగము రచనమునందును నీతియందును జెడిన యెడలఁ బెద్దనార్యుఁడు తలయెత్తుటకు వేఱ యవకాశముండదు.

ఈయుపాఖ్యానమునందు ముఖ్యముగ శృంగారరసము ప్రకటితము. నీతియుఁ దత్సంబంధికమె ఈకథను రెండుదృశ్యములుగా వేఱుపఱుపవచ్చును; మొదటిది వరూథినీప్రవరుల దృశ్యము; రెండవది వరూథినీమాయాప్రవరుల దృశ్యము. రెండుదృశ్యములు నొకసూత్రముననే యనుస్యూతములై, పైకి భిన్న ప్రకృతుల గోచరించుచున్నను, నిజముగా మొదటిదృశ్యముయొక్క ఫలితమే రెండవది యని నిశ్చయింపవచ్చును.

మొదటిదృశ్యమునఁ బ్రవరుఁడు శ్రోత్రియబ్రాహ్మణుఁడు, కొండొకకారణవశమున వరూథిని యనునప్సరసకంటఁ బడెను. ఆదివ్యవేశ్యాంగన యాయందమైన బ్రాహ్మణకుమారునిఁ జూచి మోహించి తనతోఁ గ్రీడాసక్తుఁడుగానుండుమని పరిపరివిధములఁ బ్రార్థించెను. ఏకపత్నీవ్రతుం డగునాబ్రాహ్మణుఁ డందుల కియ్యకొనక తుదకు నగ్నిదేవుని సాహాయ్యమున నామెనుండి తప్పించుకొని యింటికిఁజేరెను.

రెండవదృశ్యమున నీకామాంధురా లగువరూథినిని నామెచేఁ బూర్వము నిరాకరింపఁబడిన యొకగంధర్వుఁడు ప్రవరవేషమునఁ జేరి యామెకోరికఁ దీర్చి తానును సంతృప్తుఁడయ్యెను.

కాఁబట్టి యీకథయందు శృంగారరసప్రవాహము మునీతిపరితీరము నవినాభావసంబంధమున నన్యోన్యము ననుసంధించియే యున్నవి. ఇచ్చట శృంగారరసము నీత్యుద్బోధకమా లేక దుర్నీతిబోధకమా? అనుప్రశ్నకు నిజప్రవరునికథను మాయాప్రవరునికథను మనము తారతమ్యముగఁ బరీక్షించినఁ దెల్లమగును. నిజప్రవరునికథ నీత్యుద్బోధకమని, రొక్కబ్రహ్మయ్యశాస్త్రిగారు తప్పఁ బ్రపంచ మంతయు నంగీ

కరించియే యున్నది. మాయాప్రవరునిచరిత్ర మెంతవఱకు నీతిబోధక మో నిర్ణయింపవలసియున్నది. మఱియును పెద్దనార్యుఁ డీరెండుదృశ్యములలో దేనియందుఁ దనయభిమానము నెక్కువగఁ జూపించెనో యదియు గుఱితింపఁదగినదే!

వరూథినీనిజప్రవరులకథను సుమారు రెండున్నరయాశ్వాసములకుఁ బెంచి సుమారు నూటయిరువదిగద్యపద్యములకు విస్తరించెను. వరూథినీమాయాప్రవరులచరిత్రను సుమారేఁబదిపద్యములలో సంక్షేపముగ ముగించెను. గ్రంథవిస్తర మొకయభిమానసూచకమైన యెడలఁ బెద్దనార్యుఁడు నిజప్రవరుని వృత్తాంతమందే తనయప్రతిమానవిజృంభణశక్తియుఁ జూపింపఁదలఁచె నని యూహింపవచ్చును.

దివ్యవారాంగన యాసుందరగాత్రుఁ డగుశ్రోత్రియునిఁ జూచిన వెంటనే మదనార్తయై కొంచెము సేపు భావగర్భితముగా భాషించి యాతనివంకఁ బ్రత్యనురక్తిపొడచూపమిఁ దనమనోభావ మంతయు వెడలఁగ్రక్కెను. "నిక్కముదాపనేల......" అయిన నాశిష్టాచారసంపన్నుఁ డనేకవిధముల నామెబుద్ధి మరల్ప బోధించెను గాని యంతకంతకు నామెయందు మదనానల మగ్గలమై కామోద్రేకమున నామె యాతనిం బైకొననుంకించి బలత్కారముగఁ గౌఁగిలించెను. అప్పు డాభూసురుఁ డోరవోమిడి కరాంగుళాగ్రమాత్రమున నామె భుజముల నంటి యామెను ద్రోసివేసెను. అట్లైన నామె యించుకైనను జంకక దీనస్వరమున నేడ్చుచుఁ గారుణ్యముఁ జూపు మని యనేకవిధముల బతిమాలెను. తుదకామెయున్మత్తప్రలాపచేష్టల నహింపనేరక హవ్యవాహుని వేఁడి యాదేవునిసహాయమునఁ బ్రవరుఁ డిల్లుచేరెను. ఈదృశ్య మాయు బహురసవంతముగ వర్ణింపఁబడినది. ప్రవరుఁడు తొలుతఁ జెప్పినమాటలు నిలుపుకొనెను. "బ్రాహ్మణుఁ డింద్రియవశగతి జిహ్మాచరణైకనిపుణచిత్తజ

నిశితాజిహ్మాగములపాలై చెదు, బ్రహ్మానందాదిరాజ్యపదవీచ్యుతుం డై" కావునం బ్రవరుండు తనబ్రహ్మాధిపత్యము నిర్వికల్పవైదికకర్మపరాక్రమమున నిలుపుకొనంగలిగెను.

వరూథినిమాత్రము చెఱకువిలుకానికఱకుటమ్ముల దూలి విరహార్తయై యున్మాదినివోలె దుఃఖాబ్ధిలోం బొరలుచుండెను. బ్రహ్మానందభరితుం డగుప్రవరుండు శాంతచిత్తుండై స్వగృహమున వఱలుచుండెను. ఇంక నాకాముకురాలి యవస్థ యెట్లు పాపవలసియున్నది. ఆమె ప్రవరుని కొఱ కేడ్చుచుం జావవలసినదేనా? ప్రవరుం డామెతోడ సంగతియొనర్చుట యసంభావ్యముగదా! ముల్లోకములు కల్లోలమున మునింగినను నానిర్లోలుం డగుబ్రాహ్మణుం డియ్యకొనండు. కావున నావిరహిణి యగువరూథినికి గత్యంతరముం జూపవలసియున్నది. ఆమెయైంద్రియికభోగయుత కాముకత్వమున కనుగుణసాఫల్యము కలుగంజేయవలెను. అట్టిసాఫల్యము మాయాప్రవరునిమూలమునం జేకూడినది. ఇంద్రియభోగపరాయణురాలికి నింద్రియైకసుఖవ్యాపారపరుండే తగినవాండు. ఇదియే కావ్యన్యాయము (Poetic Justice) కాంబట్టి వరూథినీప్రవరులకథ నీత్యుద్బోధకము, వరూథినీమాయాప్రవరులకథ యవినీతినిరోధకము. నీతిప్రబోధము నవినీతినిరోధము నీరెండును గావ్యేందిరయొక్క ధర్మైకచరణమునందలి యాకృతిద్వయమే!

కథాఫలితము నీతిదాయకము కావచ్చును. గాని యందలిసంభోగాదివర్ణనలు నీతిదాయకములా? యని ప్రశ్నింపవచ్చును. రత్యుపరతివర్ణనలు యువకులమనములలో సురతేచ్ఛను గలుగంజేయవచ్చుననునంశము న్యాయమైనదే. గాని, యీదుర్గతి యొక్క పెద్దనార్యునకే పట్టలేదు. ఆకాలపు పెద్దకవీశ్వరు లందఱు కొద్దిగనో గొప్పగనో యీదుష్టవర్ణనలు చేసినవారే? కృష్ణదేవరాయలు రామరాజభూషణుండు సూర

నార్యుఁడు ధూర్జటి కుమారధూర్జటి మున్నగువారు సంభోగవర్ణనము చేసినవారే. వీరిగ్రంథములను బహిష్కరించినయెడల నాంధ్రవాఙ్మయములోని మేలైనరత్నముల నిరసించి గులకరాళ్లను దాఁచుకొనినట్లగు. ఆనాఁటికవులే కాదు, తత్పూర్వపువారును గూడఁ గొంతమంది సంభోగవర్ణనము చేయుటకు జంకలేదు. పండ్రెండవశతాబ్దపు కవిగ్రామణి యగునన్నెచోడుఁడు తన "కుమారసంభవములో" పార్వతీపరమేశ్వర సంభోగము వర్ణించినాఁడు. ఇంతకంటె నెక్కువ నిదర్శనము కావలెనా ? కాఁబట్టి గీర్వాణకావ్యసంప్రదాయములంబట్టి యీదృగ్విధములగువర్ణనలుకవిసమయములుగాఁ బరిగణింపఁబడినవి. ఇట్టిసందర్భములోఁ బెద్దనార్యు నొక్కనినే దూఱుట న్యాయమా? అతనిగ్రంథము త్యజించుట లాభకరమా ? ఈనాఁటి కావ్యరుచినిబట్టి మఱొకయుపాయము నాలోచింపవలెను. ఆంగ్లేయవాఙ్మయములో షేక్స్పియరువంటి మహాకవియు నీచశృంగారవర్ణనలకుఁ బాలుపడినాఁడు. అతనిసమకాలీనులసంగతి చెప్పనే యవసరము లేదు. వారు బొత్తిగాఁ బచ్చిశృంగారమే వర్ణించిరి. కాని, యానాఁటికవు లందఱు నాంగ్లవాఙ్మయచరిత్రములో సారస్వతకిరీటధారులు. వారిగ్రంథములయందు తప్ప నితరత్ర యాంగ్లేయకవితారసమున కింపైనరుచి లేదు. ఆకారణమున నిటీవల నాంగ్లేయపండితులు నీచశృంగారరసవర్ణనాదికభాగములను విలోపింపఁజేసి మిగిలిన రసభాగములనే సామాన్యజనావళికిఁ బఠనీయగ్రంథములుగా ముద్రింపించుచున్నారు. ఈవిధముగ ముద్రితము లైనగ్రంథములకు (Bowdlerised Editions) "బాడ్లరైజడు సంపాదకీయము" లని పేరు. ఆవిధముగ మనయాంధ్రప్రబంధములనుగూడఁ బరిశోధించి యువతీయువజనపఠనార్హములుగఁ జేయవలసియున్నది. ఈపనిని బ్రహ్మశ్రీ బ్రహ్మయ్య

శాస్త్రిగారు మున్నుగువారు పూనుకొనిన నాంధ్రిలోకమునకు శాశ్వత ముగ మే లొనర్చినవా రగుదురు.

## —• iii పాత్రపోషణము •—

నీతిరసవిచారణమం దెట్టివిమర్శనదోషములు శ్రీశాస్త్రులువారు చేసిరో పాత్రౌచిత్యవిచారణమందు నట్టిదోషములే వారు కావించిరి. అందులకుఁ గారణముకూడ వెనుక సూచించినదే! అసఁగాఁ బాత్రోచితవాక్యములను గవి యభిప్రాయములుగఁ బరిగణించుట. ఈదోషము విమర్శిగారి వ్యాసమునఁ బలుతావులఁ గాన్పించుచున్నది.

ఈకావ్యమందలి ప్రథమనాయకుఁ డగుప్రవరునిఁగూర్చి విమర్శి గారు వ్రాసినవిషయములను గమనింపుఁడు. వరూథినిసఖులమాటలోఁ బెట్టి ప్రవరుండు గోల యని కవి యాకిర్దరీతినిఁ దేల్చినాఁడు. "విప్ర వరుండు గోలయున్ బాలుఁడుఁ గాన నప్పటికిఁ బైఁబడఁ గొంకెను." అని వ్రాసెను. "అధముఁడు బేలయుఁ గావుననే ప్రవరుఁ డనన్యకాంత యుఁ దరుణియు నగువరూథినితో భోగింపక వెడలిపోయినాఁడని పెద్దన తేల్చినాఁడు" ఈవాక్యము లన్నియు శ్రీశాస్త్రిగారి విమర్శనమండి యె త్తి వ్రాయఁబడినవే. ఈమాటలనుబట్టి శ్రీశాస్త్రిగారికిఁ బ్రవరునియొక్క శీలమునుగుఱించియు, జ్ఞానమునుగుఱించియు, వైరాగ్యమును గుఱించి యు, నెట్టివిపరీతాభిప్రాయములు కలిగినవో తెల్లమగుచున్నవి.

వరూథినిచెలికత్తెలు ప్రవరుని గుఱించి యాడినమాటలు ప్రవ రునిగుఱించి కవికిఁ గలిగిన యభిప్రాయము లనియే వీరు నమ్మినారు. వరూథిని విరహానల విషణ్ణయై యున్నప్పు డామెచెలికత్తె లామె నోదా ర్చుటకుఁ జెప్పిన "బాలుఁడు గోల" యనుమాటలనుబట్టి ప్రవరుఁడు బాలుఁ డనియు గోల యనియు శ్రీశాస్త్రిగా రూహించి పెద్దన్న యట్టి

జేలను నాయకునిగఁ జేసె నని యాక్షేపించిరి. ఈమాట లాడినస్త్రీలు భోగస్త్రీలు; ఆభోగస్త్రీలు తమచెలి యగువరూథినిని దిరస్కరించి పోం చె నైనను లక్ష్యముచేయక వెడలిపోయిన బ్రాహ్మణోత్తమునిఁ జూచి యాడినమాటలు, నిరసనపూర్వకములును నిందాగర్భితములును గోప స్ఫూర్తిసూచకములు నయియుండును గదా! అప్పుడు వారు మృదు వుగ బాలుఁడు గోల యని చెప్పియుండిరి గాని లేక మృదుత్వము తప్పి పేడి యనియు నపుంసకుఁడనియు దీవ్రభావమునఁ దెగనాడినచో నామా టలను శ్రీశాస్త్రిగారు పట్టుకొని పెద్దన్న నపుంసకుని నాయకుఁడుగాఁ జేసినాఁ డని ఖండితముగఁ జెప్పఁజూచువారే గాని యామాట లెట్టిసంద ర్భములో నెవరిచేతఁ బలుకఁబడినవో వానిలో నెంతవఱకు నిజ మున్న దో యని పూర్వాపరములు విచారణచేసి యుండరుగదా!

ప్రవరునిశీల మెట్టిదియో మనుచరిత్రయందు స్పష్టముగా నిరూ పింపఁబడినది. ప్రవరుఁడు పిన్నవయస్సువాఁ డగుబ్రాహ్మణోత్తముఁడు, నిత్యవైదికసంపత్తి కలవాఁడు, ఏకపత్నీవ్రతుఁడు, లేఁతవయస్సులోనే సపత్నీకముగా యజ్ఞయాగములను జేసి సోమయాజి యని యనిపించు కొనినాఁడు. నిత్యము నరుణోదయకాలమునఁ దాను శిష్యులతో గం గకుఁ బోయి స్నానము చేసి సంధ్యావందనాదికృత్యములు దీర్చుకొని సూ ర్యనమస్కారములు చేసి సమిత్కుసుమాదులను సేకరించి యగ్నిహో త్రములు ననవరతముఁ జేయుచుండెను. అతనిశీలము కులము, శమము, దమము మొదలగునవి చూచి యానందించి యేరాజైన నేమియా వచ్చినను బుచ్చుకొనెడువాఁడు కాఁడు. తనమాన్యక్షేత్రముల మూల ముగ జీవించుచుండెను. తల్లిదండ్రులు సజీవులై పుత్రునివలన నిత్య సేవాసన్మానమును బొందుచుండిరి. ఇంటి కెంతమంది యతిథ్యభ్యాగ తులు వచ్చినను బ్రవరునిభార్య విసువు విరామములు లేక రేయుంబవళ్లు

వంటలు చేసి మృష్టాన్న బహుభక్ష్యములతో నన్నపూర్ణవలె వారినిఁ దృప్తిపఱుచు చుండెను. ఇట్టిరీతిగా దైనందినజీవితమార్గమును నడుపుచు బంధుమిత్రరాజపోషకులచే మన్ననలను బొందినప్రవరుఁడు బేలయా గోలయా బాలుఁడా లేక లోకవ్యవహారములను యోగ్యతాయోగ్యతలను గుణావగుణములను బుణ్యపాపములను గుర్తెఱింగినవాఁడా ? ఇట్టిమహాపురుషుఁడు తనయూరిలో జీవయాత్రగడపుచుండఁగా నాయూరిజారకామినులతనిచక్కఁదనముఁ జూచి మోహించినను నాతని వైరాగ్యమున నిష్ఫలమనోరథలై మధుకరాంగనలకుఁ బూచినసంపెంగపొలు పెట్లుండునో యట్లే మనోవ్యథ పొందుచుండిరంట. కాఁబట్టి ప్రవరునివృత్తాంతమంతయు మనము సాకల్యముగఁ జూచినయెడల నామహాపురుషుఁడు లేఁతవయస్సువాఁడైనను, మిక్కిలి చక్కనివాఁడైనను, మహాజ్ఞానియనియు ననవరత వైదికకర్మానుష్ఠానపరుఁ డనియు, నేకపత్నీవ్రతుఁ డనియు, సంపన్నగృహస్థనియు శారీరకమానసిక నైతికసుగుణమణి ఖనియనియుఁ దెలియవచ్చుచున్నది. ఇట్టి తేజోవిరాజిని శ్రీశాస్త్రిగారు గోల యనియు బేల యనియు బాలుఁ డనియుఁ గవియే చెప్పిన ట్లెట్లు వ్రాసిరో వారికే తెలియఁదగినది !

ఈప్రవరునిగుఱించియే శ్రీశాస్త్రిగా రాక్షేపించినమఱియొక విషయము నాలోచింతము. " కవి ప్రవరుం విరాగి యని చెప్పెఁ గాని వానివేషవర్ణనమాత్రము మరల శృంగారపురుషునిగా నొనరించె. శ్రోత్రియునకుండు లలాటమందలి మృత్తిక, ధవళధవళము లగుజన్నిదములు, నీర్కావిపింజె కొంచెము చెప్పి యాపై నిట్లు శృంగారవేషమును విరివిగా వర్ణించెఁ గనుఁడు. చెక్కుటద్దములందు మణికుండలములు, అరుణాంశుకోత్తరీయంబు, రాకట్టుజాళువామొలకట్టు, ఆనితంబవిలంబఘనకచగ్రంథి యిత్యాదు లున్నట్లు వర్ణించెను. ఈవేషమంతయు, శాం

తచిత్తుఁడును విరాగియు నగు ప్రవరుని కనవసర మనియు, శృంగారపురుషునికే తగియున్నదనియు శ్రీశాస్త్రిగా రభిప్రాయపడి ప్రవరునివేషము వైష్ణవస్వాముల వేషముగా నభివర్ణింపఁబడిన దని, వాక్రుచ్చిరి. ఇందలి యథార్థము నించుక గమనింతము. ఆకాలమునాఁటి వైదిక బ్రాహ్మణ యువకుల వేష మెట్లుండెనో మఱియొకకవి వర్ణించిన సందర్భమును జూచిన మన కది తెలియఁగలదు. శ్రీనాథుని 'శివరాత్రిమాహాత్మ్యము'లోఁ గథానాయకుఁ డగు బ్రాహ్మణకుమారు నాకారవర్ణనను జూడుఁడు,

“సరిగొన్న వెలిపట్టుజన్నిదమ్ములతోడ రత్నాలతారహారముధరించి”

ఇందలి వేషవర్ణనకుఁ బెద్దన్నయుందలివర్ణనకుఁ గొంచెమైనను భేదము గాన్పింపమ. శ్రీనాథుఁడు వర్ణించిన బ్రాహ్మణకుమారుఁడు స్మార్తమతములోనివాఁడు కాని వైష్ణవమతములోనివాఁడు కాఁడు. అందుచే నాకాలపు వైదికకులాచారవర్తులగుబ్రాహ్మణకుమారు లెవ్వరైన నట్టివేషమునే యనుకరించి రని చెప్పవచ్చును. ఇంతయేల, మొన్న మొన్నఁటి వఱకు సంపన్నగృహస్థులు పొడుగైనజుట్టుంచుకొని మొలకు బంగారపు గోవత్రాడు వేసికొని తిరుగుచుండినవారేకదా! ఇట్టివేషములలో శృంగారప్రియత్వమున్నది గాన నది విరాగి యగుప్రవరుని కెట్లుసరిపోవు నని విమర్శిగారి యాక్షేపణ. విరాగి యనఁగా శ్రీశాస్త్రిగా రిచ్చిన విపరీతార్థ మేమో చూడఁ దగును. విరాగి యనఁగా రాగములేనివాఁడనియు సర్వసమైక్యభావముఁ గలవాఁ డనియు నర్థము. మన ప్రవరుఁ డట్టివిరాగి యగునో కాదో యాలోచింపఁదగును. ఈతఁడు శ్రీశంకరులవలె నాజన్మబ్రహ్మచారి కాఁడు. శ్రీరామానుజులవలె గృహస్థాశ్రమము విడనాడి కాషాయవస్త్రదండకమండలువులు ధరియించినవాఁడు కాఁడు. గృహస్థాశ్రమమందుఁ దల్లిదండ్రులకు సేవసేయు

చుఁ దాను బాణిగ్రహణముచేసికొనిన భార్యయందు నిశ్చలానురాగుఁడై యేకపత్నీవ్రతమును బూని మడిమాన్యములు చూచుకొనుచు సుఖముగా జీవయాత్ర గడుపుచుండినవిరాగి. ఈయన వైరాగ్యము పరస్త్రీ పరధనాపేక్షాదులు లేకుండ నుండుటమాత్రమే తనభార్యతోఁ దాను సుఖభోగము లనుభవించుటలేదా? అట్లు గానిచోఁ దనభార్య తనకొఱకెంత బెంగ పెట్టుకొనుచుండునో యని దురపిల్లుట యేలకలిగెను? తల్లిదండ్రులకు లోఁబడి గృహస్థమార్గము నవలంబించి భార్యతో సుఖజీవనము చేయుచు వైదికమార్గ మనవరతము సాగించుచు నిత్యనైమిత్తికకర్మనిష్ణాతుఁడై మెలఁగినవాఁడు. ఈతని జీవితచరిత్రము భవభూతి యుత్తరరామచరిత్రములో శ్రీరాములవారు తన బాల్యమును గుఱించి చెప్పికొనిన విషయమును జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది. "జీవత్సు తాతపాదేషు నూతనే దారసంగ్రహే। మాతృభి శ్చింత్యమానానాం తేహినో దివసాగతాః" చిన్నతనములో నేకపత్నీవ్రతుఁ డగు శ్రీరాములవా రెట్లుండిరో యట్లే భూసురోత్తముఁ డగుప్రవరుఁడు గూడ నుండెనని మనకుఁ గాన్పించుచున్నది. ఇటువంటి మహాసుందరమూర్తియు, మహాబుద్ధిశాలియు, మహాగుణశీలియు, నగు నీప్రవరుఁ, డాంధ్రవాఙ్మయగగనమందు ధ్రువనక్షత్రమువలె విరాజిల్లుచుండ నాతనిపాత్ర మెంతనీచముగాను, నెంతయధమముగాను, నెంత పరిహాసనీయముగాను శ్రీశాస్త్రిగారు విమర్శించిరో యాంధ్రలోకము చూడఁదగియున్నది. ఇంతటితోఁ బ్రవరుని విషయమును గట్టిపెట్టి స్వారోచిపాత్రము వీరెట్లు విమర్శించిరో చూతము. స్వారోచిపాత్రమును గుఱించి శ్రీశాస్త్రిగా రిట్లువ్రాసిరి. "హంస వచనములు విని యాస్వరోచి భార్యాసహితంబుగ వనంబునకుఁ జని ఘోరతపం బొనరించి నిష్కల్మషత్వంబు నొంది యమరలోకంబున కరిగె. ఈకథనే పెద్దన్న తీసివేసెను. అతనిరుచికిఁ దపస్సు లోన

గునవి పడవు. కవి శృంగార జృంభణము కలుగునను భ్రమచే నీతికి భంగముఁ దెచ్చినాఁడు.'' ఈవిమర్శిగారి కీగ్రంథమం దెక్కడఁ జూచి నను బచ్చిశృంగారరసము, పశుకామమే కాన్పించుచున్నవి. వీరిట్లు తలంచుటకు గ్రంథమందు నిశ్చితమైన యాధారము లున్నవా? లేక వీరు కేవలము భ్రమమూలముగ నిట్లూహించినారా? అను విషయము నిర్ణయింపవలెను. పశుకామము, అనఁగా వావివరుసలు లేనిదియు, శాస్త్రనిషిద్ధ మైనదియు నగు శృంగారరస మని నిర్వచింపవచ్చును. అనఁగా గురుదారాభిగమనమును, మునిపత్నీవాంఛనమును, పరకాంతాసంభోగమును, వేశ్యాంగనాసంక్రీడనము, బలాద్వశీకృతకన్యాదూషణము నిత్యాదులు పశుకామ మనియు, నికృష్టశృంగార మనియుఁ దలంపవచ్చును. అట్టి వేవైనను నీగ్రంథమున నున్న వేమో చూతుము. వరూథినీప్రవర వృత్తాంతములో నుత్కృష్ట మగునేకపత్నీవ్రతమును, దాంపత్యపరిశుద్ధతను గవి లోకాదర్శకముగఁ గనఁబఱిచినాఁడు గదా! వరూథినీమాయాప్రవరులవిషయములో నది మానవలోకమున కతీతమై దేవాన్యయేతివృత్తముగాన మానవప్రమాణములు ప్రయోగసాధ్యములు కావని యిదివఱలో మనవిఁజేసియున్నాఁడను. అయినను నీయితివృత్తముకూడ నవినీతినిరోధకముగ నెంచఁదగిన దని పైనఁ జూపితిని. అటుతరువాత శృంగారకథావృత్తము మనోరమస్వరోచులది గదా? మనోరమ శీలము ననుచితముగా నెట్లు నిందించినారో దానిని సహేతుకముగఁ దెల్పితిని. ఇంక స్వరోచివిషయమును జూతము. స్వరోచి గ్రంథమం దెచ్చటనైనను దన్ను మనఃపూర్వకముగా వరించి వివాహము చేసికొనిన భార్యలతోనే రమించినాఁడు, గాని, పైనుదహరించిన యశాస్త్రీయములైన-యశ్లీలములైన-శృంగారసంబంధముల నెంతమాత్రముఁ గలిగించుకొనలేదు. తాను శాస్త్రోక్తముగా వివాహముచేసికొనిన స్త్రీలతో సుఖలీ

లల భోగించుట యేశాస్త్రమునకు నేమతమునకు విరుద్ధము ? మొట్ట మొదటనే ప్రాచ్యదేశ శృంగారమునకుం బాశ్చాత్యదేశశృంగారమునకు మూలసూత్రములలోనే భేదము కాన్పించుచున్నదని చెప్పితిని. పాశ్చాత్యదేశమందు నాచరణలో నెట్టివిశృంఖలస్వేచ్ఛారతి యున్నను, శాస్త్రీయముగా నేకపత్నీస్వీకరణమే యంగీకృత మైనది. కాంబట్టి క్రైస్తవదేశవాఙ్మయములలో నొకనాయకునకే యిద్దఱు ముగ్గురు నాయికలేక కాలమున నుండుట తటస్థింపదు. ప్రాచ్యదేశములలో నట్లుగాదు. హిందూమతములోం గాని మహామ్మదీయమతములోం గాని యేకకాలమున నొకనాయకున కిద్దఱు ముగ్గురు భార్యలు శాస్త్రోక్తముగా వివాహితలయి భోగయోగ్య లగుచున్నారు. వారితోం బ్రికామముగాం గ్రీడించుట యెంతమాత్రమును శాస్త్రదూష్యముకాదు. సంఘదూష్యము కాదు. ప్రాచ్యశృంగారరసమందలి యీపరిణయవిధానపు మూలసూత్రమును శ్రీశాస్త్రిగారు ముఖ్యముగా గమనింపవలసియున్నది. స్వరోచి యొనరించినదియు ననుభవించినదియు నిట్టిశృంగారమే. అతఁడేకన్యనుగాని స్త్రీనిం గాని బలాత్కరింపలేదు. వారాంగనాలంపటుండై వ్యభిచరింపలేదు. కారణవశముసం దన్నువరించిన కన్యలను మాతాపితల యనుజ్ఞను బొంది వైవాహికకర్మయుక్తముగం బరిణయమాడి వారితో సుఖయించెను. ఇట్టిస్థితిలోం బహుకామ మెచ్చటనున్నదో శ్రీశాస్త్రిగారు నిర్ణయించి చెప్పవలసియున్నది. మార్కండేయపురాణములో స్వరోచిని గుఱించి మార్కండేయు లిట్లు చెప్పిరి. "కింతు ధర్మావిరోధేన కుర్వన్ ధర్మాశ్రితాః క్రియాః భుంక్తే స్వరోచి ర్విషయాన్ సహ తాభి రుదారధీః"

అనఁగా, "ధర్మమునకు విరోధము లేకుండ, ధర్మము నాశ్రయించిన కార్యములను జేయుచుం దనభార్యలతో స్వరోచి విషయసుఖము

లనుభవించెను." "ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ" అని భగవద్గీతలో నున్నదిగదా, అట్లే ధర్మయుక్తమైనకామము నమభవించెను. కాఁబట్టి స్వరోచిశీల మనింద్యము.

స్వరోచి యావజ్జీవము శృంగారప్రియుఁడేగాని యాతను భోగేచ్ఛ వదలి తప స్సొనరించుటకుఁ బోయినట్లు మూలములో నున్నను దానిని పెద్దన్న విడిచిపుచ్చెనని యందుచేఁ బెద్దన్నదృష్టియందుఁ బహుకామమే మానవజీవితాదర్శముగ నున్నదని శ్రీశాస్త్రిగారు తమ విమర్శములో ననేకపర్యాయములు త్రిప్పిత్రిప్పి యీవిషయమును మనచెవులలో గ్రుచ్చిగ్రుచ్చి వాకొచ్చిరి. మూలగ్రంథములో స్వరోచి హంసవచనములు వినినతరువాత భార్యలను విడిచి తపం బొనరించుటకు నరణ్యమునకుఁ బోయెనని యున్న మాట నిజమే. మన గ్రంథములో స్వరోచియొక్క యంత్యనిర్గమన మెంతమాత్రము స్పృశింపఁబడలేదు. పెద్దన్నగారు, ఆవిషయమున స్పృశింపకపోవుటకుఁ దపముచేయుటయే యాయన యయోగ్యమని తలఁచి విడిచిపెట్టి రని శ్రీశాస్త్రిగారి వాదము. తపశ్చరణము, దైవభక్తియు, నైష్ఠికకర్మానురక్తియు మున్నగు సౌశీల్యధర్మములెంతమాత్రము రుచింపనియెడలఁ బ్రవరుని వరూథినితోఁ బొత్తుగలవక పంపివేయుట యెట్లు పొసఁగినది? తుదకు స్వారోచిషమను వుద్భవించి బాల్యముననే శ్రీభగవన్నారాయణభక్తుఁడై మహావిష్ణువును సాక్షాత్కరింపఁ జేసికొనెనని యెట్లు వర్ణింపఁగలిగిరి? ఇవి యన్నియు శ్రీశాస్త్రిగారి వాదమునకుఁ గేవలము విరుద్ధములే. కావున స్వరోచి తపమునకుఁ బోవు విషయమును గ్రంథములో సూచింపకుండుటకు వేఱ కారణ ముండవలయును. అది సహృదయులు జాగ్రత్తగా యోజించుకొనినఁ దెలియఁగలదు. మూలగ్రంథ, మనఁగా మార్కండేయపురాణము పురాణగ్రంథము. ప్రస్తుత విమర్శితగ్రంథము, అనఁగా, మనుచరిత్రము—

ప్రబంధగ్రంథము. పురాణములకుఁ బ్రబంధములకుఁ గావ్యశిల్పములో
జాల భేదము లున్నవి. పురాణములలో ననేకేతివృత్తములు పరస్పరమిశ్రి
తములై వచ్చుచుండును. ఒకకథ సాఁగుచునుండఁగా మధ్యమధ్యన
జిన్నచిన్న యుపాఖ్యానము లెన్నియో వచ్చుచున్నను నవి యన్నియు
సమగ్రముగా నడపింపఁబడి మూలకథ కెంతమాత్రము నిరోధకములుగ
నుండవు. మూలకథ యథావిధిగా సమగ్రత నొందింపఁబడును. కాఁబ
ట్టి పురాణములలో వస్త్వైక్యముకన్న వస్తువిభిన్నతయే కాన్పించును.
బ్రబంధములలో నట్లుగాక వస్త్వైక్యమే ప్రధానముగా నుండును, గావు
న, నొక యితివృత్తము కథారూపమున విస్తరింపఁబడుచున్నప్పుడు మ
ధ్యమధ్యను జిన్నచిన్న యితిహాసములును సంతరకథలును వచ్చుచున్న
ను నవి మూలకథ కెంతవఱ కుపకరించునో యంతమాత్రమే గ్రహింపఁ
బడును. కథాప్రణాళిక కంతరాయములు గలుగఁజేయుభాగము లన్ని
యు విసర్జింపఁబడును. ఇట్లు సంధాననియమమును బాటించుటచేఁ గథ
యందు వస్త్వైక్య మేర్పడుచున్నది. సామాన్యముగ నేప్రబంధముఁ జూ
చినను గథాకథన మీవిధముగనే యుండునుగాని యన్యథా యుండదు
ప్రకృతమున మన మనుచరిత్రయందలి విషయముఁ జూతుఁడు. ఈ
విషయమందుఁ బెద్దన్నగారు చెప్పఁదలఁచుకొనినది స్వారోచిషమనుసం
భవము. అనఁగా స్వారోచికి మనువుపుట్టుట. ఈకథఁ జెప్పఁదలఁచుకొని
యీకథ కనుకూలమైన ప్రణాళికను నిర్ణయించుకొనెను. ప్రప్రథమము
నఁ బ్రవరుఁడు హిమవద్గిరికిఁ బోవుట— అచ్చట వరూథినిని జూచుట—
వా రిరువురకు జరిగిన సంవాదము— తదనంతరము ప్రవరుఁ డింటికేఁగుట
—తదుపరి మాయాప్రవరుఁడు వరూథినితో సంభోగించుట— వరూథిని
గర్భవతియగుట— మాయాప్రవరుఁడు కథనుండి తొలఁగిపోవుట— స్వా
రోచి జననము, వర్ధమానము- స్వారోచి మనోరమను గళావతిని వివా

సిని వివాహముచేసికొనుట- వారికిఁ బుత్రులు గలుగుట- ఆపుత్రులకు రాజ్యము నొసంగుట- అటుపైని వనదేవత మృగరూపమున స్వరోచినిఁ బొందఁగోరుట- స్వరోచి యామెను బరిగ్రహించుట- తత్కారణమున స్వారోచిషమనువు జన్మించుట-స్వారోచిషమనువు బాల్యమునందే భగవద్భక్తి పరాయణుఁడై తపంబొనరించుట- ఇదియే ముఖ్యకథాసూత్రము. ఇందులో నాయాయవసరములకొఱకు వచ్చినకథాపాత్రముల యవసరము తీరినవెంటనే కథారంగమునుండి తొలఁగిపోయిరి. ఇంటి కేఁగిన ప్రవరుఁ డే మయ్యెనో తెలియదు. వరూథినియొద్ద సెలవుఁ గైకొని వెళ్ళి నమాయాప్రవరుని తరువాతివిషయ మేమో తెలియదు. స్వరోచినిఁ గన్నతరువాత వరూథినియొక్క విషయము నట్లే యదృశ్య మైనది. ఈ పాత్రలందఱు వారివారిపనులను నెఱవేర్చి తత్క్షణమే తొలఁగిపోయిరి. అలాగుననే స్వరోచియును, స్వారోచిషమనువు పుట్టినవెంటనే తనపని నెఱవేఱినుగానఁ దొలఁగిపోవలసివచ్చెను. కాఁబట్టి తనజీవితాంతము నెట్లుపొందెనో దానిని మనకవి ప్రసాదింపనవసరము లేకపోయెను. మఱియొకసంగతి—వనదేవత మృగీరూపమున వచ్చి స్వరోచినిఁ దన్నాలింగనముఁ జేసికొమ్మని కోరఁగా నతఁ డట్లుచేసిన తరువాత నామె స్త్రీయై యి ట్లనియె:— "సమస్తదేవతలు వేఁడికొనఁగా నే నిటకు వచ్చితిని. నీవలన నేను మనువును గనవలసియున్నది. అట్లు నాయందుఁ బుత్రునిఁ గనుటవలన నీకుఁ బుణ్యలోకసంప్రాప్తి కలుగును." స్వరోచి పుత్రుఁ డగుమనువును గనినవెంటనే దేవతలవరముచొప్పునఁ బుణ్యలోకమునకుఁ బోయెను, వేఱె తప స్సెందులకు ?

ఈప్రబంధము స్వరోచిచరిత్రము కాదు—స్వారోచిష మనుచరిత్రము కాదు స్వారోచిషమనుసంభవమే. కాఁబట్టి యీయితివృత్తమునకు నిబ్బరముగా నడపించెడు కథాభాగములను, గథాపాత్రములనే

యెత్తికొని కథాప్రణాళికను సాగించి యాయితివృత్తముతోనే ప్రబంధముఁ బూర్తి చేసెను. కనుక స్వారోచి తపంబునకుఁ బోయెనో లేదో తెలిసికొనుట కెడము కలుగుటలేదు. గ్రంథమందు లేదుగానఁ దపంబునకుఁ బంపుటకుఁ గవి కిష్టములేకుండె నని చెప్పుట యన్యాయము, ననమంజసము.

పెద్దన్న స్వారోచిషమనువుయొక్క చరిత్ర మెంతమాత్రముఁ జెప్పలే దనియుఁ గాఁబట్టి యిది మనుచరిత్ర మనిపించుకొన దనియు మన శాస్త్రిగా రాక్షేపించిరి. వా రిట్లాక్షేపించుట కెంతమాత్రము నవకాశము లేదు. ఈప్రబంధమునకు స్వారోచిషమనుసంభవ మని కవి పేరిడినట్లు గ్రంథమందే యున్నది. మనుచరిత్ర మని సంక్షిప్తనామమునఁ బరఁగుట సామాన్యవ్యావహారికసౌలభ్యముకొఱకే. ఈనామము సంజ్ఞామాత్రమే ! ఇట్లు సంక్షిప్తనామములచే గ్రంథములు వాఙ్మయములందు సాధారణముగ వ్యాప్తములగుట పండితులకుఁ దెలిసినవిషయమే. అభిజ్ఞానశాకుంతలమును శాకుంతల మని పిలుచుచున్నాము. ఉపరిచర వసుచరిత్రమును వసుచరిత్ర మనుచున్నాము. వీనికంటె విలక్షణమైన పేర్లెన్ని యున్నవో చూడుఁడు. వేణీసంహార మనఁగా జుట్టుముడివేయుట. ఆపేరువలన నెట్లు ద్రౌపదీమానభంగచరిత్ర తెలుపఁబడుచున్నదో యోజింపుఁడు. మృచ్ఛకటికము—అనఁగాఁ జిన్నమట్టిబండి. ఈమాట వలన నానాటకమందలి కథావిషయ మెట్లు నిరూపింపఁబడుచున్నదో యరయుఁడు ! ఈలాగుననే యనేకగ్రంథములపేళ్ళు కేవలము సంకేతన సౌలభ్యముకొఱకై కవులచే నుంపఁబడిన సంజ్ఞామాత్రము లనియే చెప్పవచ్చును. వీనికి లోకవ్యవహారప్రసిద్ధిచే నేకవస్తుసూచకత్వము స్థిరమయినది. ఈగ్రంథములపేళ్ళవలెనే మనుచరిత్ర మనుపేరుఁగూడ లోకవ్యవహారమున రూఢి పొందినది.

ఈలాగున శ్రీశాస్త్రిగారు తమవిమర్శనమందుఁ జూపించినదో
షము లన్నింటికినిఁ దగుసమాధానములను జెప్పవచ్చును. కాని, గ్రంథ
విస్తరభీతిచే నింతటితో విరమించితిని. వ్రాసినంతవఱకు సహృదయులు
నిష్పక్షపాతముగఁ జూచినయెడల శ్రీశాస్త్రిగారు కనఁబఱిచిన దోషాం
శములలో నొకటిరెండు దక్కఁ దక్కినవన్నియు భ్రాంతిమూలకములే
గాని నిజమయిన దోషములు గావని తెలిసికొనఁగలరు. ఈవిమర్శనవిష
యమంతయు నాకు మిక్కిలి జుగుప్సాకరమైనను—న్యాయమైనదియు,
నిష్పక్షపాతమైనదియు నగు నాంధ్రవాఙ్మయవిమర్శన నిరూపణకొఱకు
శ్రమపడి వ్రాయవలసివచ్చిన దని మనవి చేయుచున్నాను. పండితలో
కము క్షమించుఁగాక!

మనమహాకవులను నుదారహృదయముతోను, ప్రసన్నబుద్ధితోను
విమర్శింపవలసినదే గాని దోషైకదృష్టినిఁ బరీక్షించుటచే వారి కన్యా
యము చేయుటయు, మన మనాదరణ పొందుటయుఁ దటస్థించును.